శ్రీ

# సనత్సుజాతీయము

శ్రీ శంకరాచార్యాది

షడ్భాష్యాంధ్రానువాద సహితము



అనువాదకులు :

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ

శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మ



ప్రకాశకులు :

సాధన గ్రంథ మండలి, తెనాలి.

 : : వెల ; రు. 15–00

తొలి ముద్రణము :

## షడ్భాష్య సంకేతములు

1. శం. భా. శంకరభాష్యము
2. నీ. భా. నీలకంఠభాష్యము
3. స. భా. సర్వజ్ఞనారాయణభాష్యము
4. దు. భా. దుర్ఘటార్థభాష్యము
5. ల. భా. లక్షాభరణభాష్యము
6. అ. భా. అర్జునమిశ్రీయభాష్యము

కల్యాణీ ప్రెస్ : తెనాలి :

1974

# శ్రీ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి శంకరాచార్య
## శ్రీ పుష్పగిరి మహాసంస్థానమ్.

### శ్రీ విద్యాశంకరః ప్రసన్నః

### శ్రీ పుష్పగిరి సంస్థానమ్

విద్యాశంకర భారతీస్వామినః విద్యానృసింహ భారతీస్వామినః

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్య ప్రమాణ పారావారపారీణ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠాగరిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త సాంప్రదాయిక మణ్మత స్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకల వేదార్థప్రకాశక సంఖ్యాత్రయీప్రతి పాలక సకల నిగమాగమసారహృదయ వైదికమార్గప్రవర్తక సర్వ తంత్ర స్వతంత్రాది రాజధాని విద్యానగర మహారాజధాని కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజాధిరాజ మహారాజ గురు భూమండలాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగ గిరిపురవరాధీశ్వర శ్రీ శృంగగిరి శ్రీ విరూపాక్ష శ్రీ పుష్పగిరి, పినాకినీ తీరవాస శ్రీశైల శ్రీ అలంపుర్యాది సమస్త పీఠాధీశ్వర శ్రీ మదభినవోద్దండ విద్యానృసింహభారతి గురుపాద పద్మారాధక శ్రీ మదభినవోద్దండ విద్యాశంకరభారతీ కరకమల

సంజాత శ్రీమదభినవోద్దండ విద్యానృసింహ భారతీ స్వామిభిః.
అస్మ దత్యన్త ప్రియాన్తేవాసినాం,
శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిణాం విషయే కాలత్రియ విరచిత ఆశీః పరంపరా పురస్సరం ప్రేష్యతే నారాయణ స్మరణపూర్వికేయం పత్రికా.

## అనన్తరమ్

శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మభిః విరచితః సనత్సుజాతీయస్య ఆన్ధ్రానువాదః పద్యభాష్యవివరణోపేతః దృష్టః పరిశీలితశ్చ. ప్రసన్నగంభీరాః ఖలు ఉపనిషదః; తదర్థ మననాయైవ హి శ్రీశంకరభగవత్పాదైః బహవః ప్రకరణగ్రన్థా విరచితాః. తేష్వన్యతమ మిదం సనత్సుజాతీయభాష్యమ్. అత్ర సూత్రపాయేణ ప్రతిపాదితా ఏవ అంశాః అన్యేషు భాష్యేషు ప్రాయేణ ప్రపంచితాః. క్వచిత్ సాధకానా ముపయుక్తా అన్యేఽపి విషయాః తత్ర సముల్లసన్తి. ఏతాదృశస్య ఆధ్యాత్మికగ్రన్థస్య అనువాదకానాం శ్రీరాజేశ్వరశర్మణాం, ప్రకటయితౄణాం శ్రీ సూర్యప్రకాశశాస్త్రిణాం చ అయ ముద్యమః ప్రశంసనీయః.

యాత్రాస్థానం – తెనాలి
4—9—1974

ఇతి
నారాయణస్మృతిః

నమామ వేదమాతరమ్

# ప రి చ య ము

వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ
శ్రీ హరి సాంబశివశాస్త్రిగారు, యం. ఏ

భారతీయ వాఙ్మయమున మహాభారత మొక విచిత్ర సృష్టి. జిజ్ఞాసువులై దరిజేరు పాఠకుల కెనలేని రత్నముల ప్రకాశింప జేసెడి యనర్ఘ రత్నాకరము. కవులుగాని, శాస్త్రజ్ఞులుగాని, భక్తులుగాని ఎవ రే దృష్టితో జూచిన నది యా రూపమున సాక్షాత్కరించి తనియింప జేయును. ఇది యిట్టి లక్షణములతో నొప్పుటకు గారణ మేమి?

వేదము అధికారి భేదము ననుసరించి వివిధరూపములతో సాక్షాత్కరించు చుండును. యాజ్ఞికుల దృష్టిలో యజ్ఞాది ధర్మస్వరూపమును వెలయింపజేయు ధర్మశాస్త్రము. నైరుక్తు లనగా ఉపాసకులు. వారిదృష్టిలో దేవతాతత్త్వమును భగవంతుని తత్త్వమును, దర్శింపజేయు పరమపావన భాగవత గ్రంథమై వెలయును. అధియజ్ఞరూపమునను, అధిదైవిక రూపమునను భాసించిన దంతయు ఆత్మస్వరూపము కంటె భిన్నము కాదని ఆత్మవేత్తల దృష్టిలో పొడగట్టును. అనగా బ్రహ్మవేత్తల దృష్టిలో కృత్స్నవేదము ఉపనిషత్స్వరూపము— "సైషా హ్యుపనిషద్బ్రాహ్మీ"— ఇత్యాది భాగవత వచనము లీ విషయమును స్పష్టము జేయుచున్నవి.

మహాభారతము పంచమవేదము. కాన దాని యందు నీ వేదలక్షణములు సుప్రతిష్ఠితములై యున్నవి. కావుననే దానియెడ పంచమవేద మను సమాఖ్య యుపపన్నము. సాక్షాత్తుగగాని పరంపరగగాని పరమేశ్వర తత్త్వమును దర్శింపజేయుటయందే వేదముయొక్క దృష్టి (వేదం బ్రహ్మాణం వేదయతీతి వేదః). మహాభారత లక్ష్యముగూడ నిదియే. భారతమున గల ఇతిహాసములకు ఐతిహ్యమును బోధించుటయందే తాత్పర్యము గాదు. ఐతిహాసికుల దృష్టిలో నది యితిహాసముల బోధించునట్లు గన్పట్టినను ఆత్మవేత్తలదృష్టిలో నవి మంత్రార్థవ్యాఖ్యానపరములు; ఆత్మతత్త్వ ప్రతిపాదన పరములు-ఈ విషయము మహాభారతవ్యాఖ్య-నీలకంఠీయమును బరిశీలించువారికి స్పష్టమే.

మహాభారతమున సాక్షాత్తు ఆత్మతత్త్వ ప్రతిపాదకములు భగవద్గీత అనుగీత ఇత్యాదులు. అందు సనత్సుజాతీయ మొకటి.

ఈ గ్రంథమునకు నీలకంఠీయమే కాక శంకరాది మహనీయుల భాష్యములనేకములు ప్రవర్తిల్లి యీ గ్రంథముయొక్క మహత్త్వమునులోకమునకుచాటినవి. వీనిలో శంకరభాష్యము, నీలకంఠీయము ఎక్కువ ప్రచారములోనున్నవి. ప్రచారములో లేక మఱుగునబడిన భాష్యముల సహితము సులభగ్రాహ్యమగు ఆంధ్ర వివరణముతో వెలికిదెచ్చిన శ్రీ తెలికిచర్ల రాజేశ్వర శర్మగారి కృషి యెంతయు ప్రశంసనీయము.

అర్జునునివలె ధృతరాష్ట్రుడును మనీషి. అయ్యును శోక మోహాభి సంతప్తుడు. శోకమోహములనుండి విడివడు మార్గమును, మృత్యుభయమును వీడి అమృతత్వప్రాప్తికి మార్గమును జూపుమని ధృతరాష్ట్రుడు సనత్సుజాతుని కోరుట గ్రంథారంభమునకు గారణము. ధృతరాష్ట్రుని నిమిత్తముగా జేసికొని శోకమోహాభితప్తులై మృత్యుభయముచే క్రుంగి పోయెడి జీవుల నందఱి నుద్దేశించి చేసిన మహోపదేశమే యీ ప్రకరణ గ్రంథము. గీతాశాస్త్రవిషయమున "పార్థో వత్సః సుధీ ర్భోక్తా"; ఇచట గూడ "ధృతరాష్ట్రో వత్సః సుధీ ర్భోక్తా"

శోకసంతప్తు లగు జీవుల దృష్టిలో మృత్యుస్వరూపము వేఱు. జ్ఞానులదృష్టిలో మృత్యువు వేఱు. మిథ్యాజ్ఞానము వలన రాగాదిదోషములు, దోషములవలన శుభాశుభకర్మల యందు ప్రవృత్తి; దానివలన పుణ్యాపాపములు; పుణ్యాపాప ఫలోపభోగముకొఱకై వివిధ శరీర పరిగ్రహము, తన్మూలమున శోకమోహములు జీవులకు సంభవించు చుండును. కాన శోకమోహములకు ప్రధానకారణము మిథ్యాజ్ఞానము ; ఇదియే ఆత్మస్వరూపమును మఱుగు పఱచి వివిధ విక్షేపములకు జీవుల గురిజేయుచు నిఖిల ప్రమాదములకు కారణమైయున్నది. ఈ యనర్థమునుండి యుద్ధరించుటకయియే శ్రుతి యావిర్భవించినది. కావున నేఱుకగడుగున "ధర్మాన్న ప్రమదితవ్యమ్; కుశలాన్న ప్రమదితవ్యమ్; భూత్యై న ప్రమదితవ్యమ్; స్వాధ్యాయ ప్రవ చనాభ్యాం న ప్రమదితవ్యమ్" అనుచు శ్రుతి ధర్మాదుల విషయమున ఎంతమాత్రము ప్రమాదము కూడ దని హెచ్చరించి

నది. ధర్మాదుల విషయమున అప్రమత్తులై స్వాధ్యాయ ప్రవచనముల నొనర్చువారు సామాన్యముగా ప్రమాదమునకు గురికారని శ్రుతి తాత్పర్యము.

సనత్సుజాతుడుగూడ—

"ప్రమాదా ద్వా అసురాః పరాభవన్
అప్రమాదాత్ బ్రహ్మభూతాః సురాశ్చ"

అనుచు ప్రమాదమువలన ఆసురీ సంపత్తి యేర్పడుననియు, అప్రమాదమువలన దైవీసంపత్తిసిద్ధించుననియు సూచించుట గమనార్హము. కంటికి కనుబడని మృత్యుస్వరూపులగు యమాదులను గూర్చి భయపడుటకంటె ప్రత్యక్ష సిద్ధములైన క్రోధ-ప్రమాద-మోహ-రూపము లగు మృత్యుస్వరూపముల గూర్చి వివేకముతో బరిశీలించుట యుక్తమని సనత్సుజాతుని ఉద్బోధ. ఈర్ష్యా, క్రోధ, ప్రమాద, మోహరూప మృత్యుపాశములచే బద్ధుడై కింకర్తవ్యతా మూఢుడైన ధృతరాష్ట్రునకు మృత్యు స్వరూపమును గూర్చి చేసిన యీ యుపదేశ మెంతయు యుక్తముగాను, శ్రుతితాత్పర్యానుగుణముగాను ఉన్నది.

సనత్సుజాత వచనములు ప్రసన్న గంభీరములు; శ్రుతిసార సముల్లసితములు; వివిధభావ స్ఫోరకములు. ఒక యుదాహరణము జూతము.

'అయం మానస్య విషయో హ్యసౌ మానస్య తద్విదుః' 1-41

అన్నాంగనాది భోగాసక్తియే మానము; బ్రహ్మానంద సుఖప్రాప్తి హేతువు మానము. మానమువలన సంసారప్రాప్తి. మానమువలన బ్రహ్మప్రాప్తి. ఇంతేకాదు.

శ్లో॥ శ్రీర్హి మానార్థసంవాసాత్ సా చాపి పరివంథినీ
బ్రాహ్మీ సుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞా హీనేన క్షత్రియ' (1-42)

మానవంతులై విషయ విషాంధులైన వారి కబ్బిన సిరియు శ్రేయోమార్గ విరోధియే. ప్రజ్ఞా హీనులకు - విషయ వాసనా విష్టులకు-బ్రాహ్మీశ్రీ లభ్యముగాదు.

ఇట సనత్సుజాతునిచే ఉద్దిష్టమైన బ్రాహ్మీశ్రీ యేది? 'నిత్య - నిర్గుణ - చిద్ఘనానందరూపిణి-యని శ్రీశంకర భగవత్పాదులు వివరించిరి. 'ఋగ్యజుస్సామ రూపిణి - యగు వేద వాక్కు' అని నీలకంఠీయమున వివరింప బడినది. ఇం దెవరి వివరణము యుక్తము? రెండును యుక్తములే. చిద్ఘనానంద రూపిణి యగు సిరియు, తత్ప్రతిపాదక ఋగ్యజుస్సామాత్మక మగు సిరియు-రెండును బ్రాహ్మీశ్రీ రూపములే. ఇట్టి బ్రాహ్మీశ్రీ సంపన్నులు బ్రహ్మశ్రీ రూపులు. కావుననే నేటికిని బ్రహ్మణ్యులును, పూజ్యులు నగు వారిని 'బ్రహ్మశ్రీ వేదమూర్తు'లని సంబోధించుట సంప్రదాయముగా వచ్చుచున్నది.

బ్రహ్మణా వేదేన శ్రీయతే, బ్రహ్మ వేదం శ్రయతీతి వా బ్రహ్మశ్రీ రేవ - సా. భా. మ. బ్రా. (1-2-10)

బ్రహ్మ (వేదము) చే నాశ్రయణీయు లగుటచేతను, లేక బ్రహ్మ (వేదము) నాశ్రయించు వారగుటచే గూడను వేద మూర్తు లగు బ్రహ్మణ్యులు బ్రహ్మశ్రీ శబ్దవాచ్యు లని భావము. ఇట్లు వేదమూర్తు లగు బ్రహ్మణ్యులే గాదు. పర మేశ్వరుడును తత్ప్రతిపాదక విద్యారూప మగు వేదవాక్కున కును బ్రహ్మశ్రీ అనునామ మన్వర్థము. ఇట్టి సిరి మానాసక్తు లకు- విషయవాసనాసక్తులకు-దుర్లభము. మానులకు సులభము -అని భావము.

ఇట నొక సందియము కలుగవచ్చును. పైన నుదాహ రించిన నీలకంఠీయము ననుసరించి, ఋగ్యజుః సామాత్మకమైన నిఖిల వేదరాశికి 'బ్రాహ్మీశ్రీ' యని ప్రసిద్ధి యున్నట్లు తెలియును. వేదములో కర్మకాండ యాగాదిరూప ధర్మప్రతి పాదకము; ఉపనిషత్కాండ బ్రహ్మతత్త్వ ప్రతిపాదకము. కాన ఉపనిష త్కాండకు 'బ్రాహ్మీశ్రీ' యను వ్యవహార మన్వర్థము. కర్మకాండకుగాదు-ఇట్టి సందియము కలుగుట సహజమే. కాని అధికారి భేదము ననుసరించి వేదము విభిన్న రూపములతో సాక్షాత్కరించుచుండును; ఆత్మవేత్తల దృష్టిలో వేదము ఉపనిషద్రూపముననే గోచరించు చుండు నని పూర్వము వివరింప బడినది. విషయవాసనావిష్టు లగు వారికి వేదరాశి తత్తత్ఫలప్రద కర్మ ప్రతిపాదకముగనే గోచ రించును. ఆత్మవేత్తలకు వేదమంతయు నిత్య-నిర్గుణ-చిద్ఘనానంద రూపిణియై బ్రాహ్మీశ్రీ సాక్షాత్కరించును. తాదృశ - బ్రాహ్మీశ్రీ స్వరూప ప్రతిపాదక మగుటచే ఋగ్యజుః సామా

త్మకమగు వేదవాణియు 'బ్రాహ్మీశ్రీ' రూపిణియై వెలయును. 'ఋచః సామాని యజూంషి; సా హి శ్రీ రమృతా సతామ్'- అనుచు వేదముగూడ పై విషయము నుద్ఘోషించుచు తన స్వరూపమును తానే వివరించుకొనుట గమనార్హము! సతాం సా అమృతా శ్రీః'-సత్త్వ సంపన్నులైన మహాత్ములకే తాను 'అమృతశ్రీ' రూపిణియై గోచరింప గలనని ఈ శ్రుతి చెప్పు చున్నది. ఈయమృతశ్రీయే బ్రాహ్మీశ్రీ.

'ఏకవేదస్య చాజ్ఞానా ద్వేదా స్తే బహవోఽభవన్'

సనత్సుజాతీయము. 2-37

అద్వితీయ చిదానందాత్మక-వేదస్వరూపము (ప్రత్యక్షాది ప్రమాణములచే) తెలియనందున-ఆ వేదతత్త్వమును దర్శింపజేయుటకే ఋగాది రూపమున పెక్కు వేదము లావిర్భవించినవి. (చూ. శం. భా.) అని భావము. కాన నిఖిల వేద రాశి చిదానందాత్మక బ్రాహ్మీశ్రీ తత్త్వబోధకమే యగుటయు సనత్సుజాతీయాభిమతము.

ఉపనిషచ్ఛబ్దము సామాన్యముగా వేదశిరోరూప మగు ఉపనిష ద్గ్రంథ భాగమును బోధింపవచ్చును. కాని ఉపనిషచ్ఛబ్దమునకు ముఖ్యార్థము బ్రహ్మవిద్య. తత్ప్రతిపాదక మగుటచే గ్రంథజాతమునకును ఉపనిష చ్ఛబ్ద వ్యవహారము వచ్చినది. (తాదర్థ్యాత్ తచ్ఛబ్ద వ్యవహారః) ఇట్లు చెప్పుటయే శంకర భగవత్పాదాది సమ్మతము. ఇట్లు పరిశీలించి చూచుచో - ఆత్మవేత్తల దృష్టిలో నిఖిల వేదరాశి బ్రహ్మవిద్యా ప్రతిపాద

కము గాన నిఖిలవేదరాశికి ఉపనిష ద్వ్యవహార ముపపన్న మగును. శ్రుతియే ఉపనిషద్విద్య వేదమం దంతట వ్యాపించి యున్నట్లు స్వయముగ నిట్లు చెప్పుచున్నది.

'తస్య వా ఏతస్య యజుషః రసఏవోపనిషత్. తస్మా ద్యావ న్మాత్ర ఇవాన్నస్య రసః. సర్వమన్న మవతి. సర్వ మన్న మనువ్యేతి'॥ శతపథబ్రాహ్మణము. 10-3-5-12.

'యథా అన్నస్య యావాన్ రసః తావాన్ స్వాశ్రయ భూతం సర్వ మన్న మవతి; తర్పయతి; భోగయోగ్యం కరోతి; అనువ్యేతి వ్యాప్నోతి చ. అతః ఉపనిషత్ సకలం సాంగం వేదం వ్యాప్నోతి'॥ —సా.భా.

అన్నముయొక్క రసము అన్నము నంతయు వ్యాపించి తృప్తిహేతు వగుచున్నది; అన్నమును భోగయోగ్య మొనర్చు చున్నది. అట్లే వేదసార మగు ఉపనిషత్తుకూడ స్వాశ్రయ రూపము, కాండత్రయాత్మకము నగు సాంగ వేదమునం దంతట నంతర్నిలీనమై వ్యాపించి యున్నది. తద్రసాభిజ్ఞులకు భోగ యోగ్యమై తృప్తిహేతు వగుచున్నది-అని భావము.

అజీర్ణాది దోషగ్రస్తులకు అన్నరసము భోగయోగ్యము గాదు. తృప్తిహేతువును కాదు; అట్లే విషయవాసనానిష్టుల కీ విద్య భోగయోగ్యమై తృప్తిహేతువు కాదు- అని భావము. అట్టివారికి బ్రాహ్మశ్రీ లభ్యముగాదు. కాన 'బ్రాహ్మీసుదుర్లభా శ్రీ ర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ' అనెడి పై సనత్సుజాతీయ వచనము శ్రుతిసార సముల్లసితము: వేదోపనిష తత్త్వదీపనము.

శ్రీశంకరభగవత్పాద- నీలకంఠపండితులు చేసిన బ్రాహ్మీశ్రీ స్వరూప వివరణముగూడ శ్రుతి సంప్రదాయానుగుణము. కాన రెండు వివరణములును గ్రాహ్యములే.

ఇట సనత్సుజాతుడు ధృతరాష్ట్రుని 'క్షత్రియ' యని సంబోధించుటయు సమంజసముగా నున్నది. 'నీవు క్షత్రియుడవు. క్షత్రియ జాతి సాధారణమైన అంతఃకరణ ప్రవృత్తితో - రాజ్యాది విషయభోగ వాసనావిష్టుడవై యుండుట జేసి బ్రాహ్మీశ్రీ దూరుడవై -శోక మోహసంతప్తుడవై పరితపించు చున్నావు' అను భావ మిట ధ్వనించుట గమనార్హము.

ఇట్లు చూపదలచిన గ్రంథ మంతయు నుదాహరణమే యగును.

శ్రీశంకర-నీలకంఠీయ భాష్యములు సనత్సుజాతీయ మునకు సమగ్ర వ్యాఖ్యానరూపములు, మిగిలినవి గచ్ఛద్వ్యా ఖ్యానరూపములు. అయ్యును నవి కొన్ని యెడల శంకర భాష్య మునందు సంగ్రహముగా వివరించి చెప్పిన యంశముల విపులీక రించుచు, కొన్ని యెడల నూతనాంశముల వివరించుచు సనత్సు జాతీయ హృదయమును గ్రహింపగోరు పాఠకుల కెంతయు నుపయుక్తములు. కొన్ని యెడల నా వ్యాఖ్యానములలో మంత్రార్థ వివరణవిషయమై స్వతంత్ర ప్రవృత్తియు గన్పట్టును.

ఉదా॥ 'న ఛందాంసి వృజినా త్తారయంతి
మాయావినం మాయయా వర్తమానమ్' 3-5

అను సనత్సుజాతీయ వచనమునకు శంకరనీలకంఠ భాష్యములు సంగ్రహముగా నున్నవి. కాని సర్వజ్ఞభాష్యమున పై వచనమునకుపష్టంభకముగా (పే. 196లో)

'ఉత త్వం సఖ్యే స్థిరపీత మాహుః
నైనం హిన్వ న్త్యపి వాజసనేషు'—ఋ. 10-71-5.

అనెడి ఋగ్వేదీయ మంత్ర మొకటి యుదాహరింపబడి దాని యర్థవివరణము చేయబడినది. ఈ మంత్రమున కీభాష్యమున జేయబడిన యర్థవివరణము పదకారానుగుణముగా గాని, యాస్క సాయణాది భాష్యానుగుణముగా గాని కన్పట్టదు.

ఉత,త్వమ్-అని పదపాఠము. కాని 'ఉతత్వం' అనునది యొకేపదముగా గ్రహించి, దానికి "త త్త్వజ్ఞానము"-అని యర్థ వివరణము చేయబడినట్లు శ్రీ శర్మగారి తెలుగు వివరణము వలన తెలియును. అట్లు 'ఉత-త్వం' పదముల నొకే పదముగా గ్రహించుటకుగాని, దానికి 'త త్త్వజ్ఞానము'—అను నర్థమును వివరించుటకుగాని ప్రమాణము చూపబడలేదు. చూపి యున్నచో యుక్తముగా నుండెడిది.

మఱియు నీభాష్యము ననుసరించి మంత్రార్థము సుగ్రాహ్యముగా లేదుకూడ. యాస్కుడు 'అప్యేకం వాక్సఖ్యే స్థిరపీత మాహుః' (1-20) అనుచు ఈ మంత్రార్థమును వివరించినాడు.

సాయణాదులును ఉత-త్వం-పదములకు 'అప్యేకం' అనియే వివరించుచు యాస్కు ననుసరించిరి.

యాస్క సాయణాదుల ననుసరించి యీ మంత్రమున 'వాజినేషు' అని గలదు. ఈ భాష్యమున-'వాజసనేషు' - అని గ్రహించినట్లు కన్పట్టును. 'వాజసనేషు' అను పాఠమున ఛందో భంగ దోషము వాటిల్లునుగాన 'వాజినేషు' అను పాఠమే గ్రాహ్య మేమో!

ఎడనెడ నిట్టి స్వతంత్ర ప్రవృత్తు లున్నను మొత్తము మీద నీ భాష్యములు విషయమును సుగ్రాహ్య మొనర్చు ననుటలో విప్రతిపత్తి యుండదు. ఈ భాష్యముల నన్నిటిని సేకరించి వాని యన్నిటిని సులభగ్రాహ్యమైన భాషలో పాఠక లోకమున కందించిన శ్రీ రాజేశ్వరశర్మగారి కృషి యెంతయు ప్రశంసనీయము.

శోధనగృహ - తెనాలి. హరి సాంబశివశాస్త్రి

4—9—74

శ్రీః

# ఆశీస్సులు

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకర భగవత్పాదప్రతిష్ఠిత శ్రీకాఞ్చీ కామకోటి పీఠాధిప జగద్గురు శ్రీమచ్చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ శ్రీపాదాదేశానుసారేణ శ్రీమజ్జయేన్ద్రసరస్వతీశ్రీపాదైః క్రియతే నారాయణ స్మృతిః.

శ్రీమన్మహాభారతే ఉద్యోగపర్వణి ధృతరాష్ట్ర - సనత్కుమార సంవాదరూపేణ ప్రవృత్తే సనత్సుజాతీయే అవిద్యా-కామ-కర్మణాం బంధహేతుత్వం,ఏకస్యైవ పరమాత్మనః అనాది మాయాయోగేన బహురూపత్వమ్, జగత్కారణత్వమ్, వర్జ్యాః క్రోధాదిదోషాఃగ్రాహ్యాః సత్యబ్రహ్మచర్యాది గుణాః,మోక్షస్వరూప మిత్యాదయః అద్వైత సిద్ధాన్త ప్రమేయాః సమ్యక్ నిరూపితాః. ఏతద్గ్రన్థస్య శ్రీ శఙ్కరభగవత్పాదాచార్యాః ప్రతిపదార్థ వివరణపూర్వక ముపనిషద్వచనాది ప్రమాణ ప్రదర్శనఘటితం భాష్యం రచయామాసుః. ఇతరేః అనేకాః వ్యాఖ్యాశ్చ వర్తన్తే.

ఏత దుత్తమగ్రన్థస్యార్థ మాన్ధ్రభాషాజ్ఞానికటే ప్రచారయితుం బద్ధశ్రద్ధైఃసద్గ్రన్థ ప్రకాశనపరాయణైః తెనాలి,

విరాజమాన సాధన గ్రన్థ మణ్డలీనిర్వాహకైః ఏత ద్గ్రన్థస్య వ్యాఖ్యానాం శ్రీశఙ్కరభాష్యమ్, శ్రీనీలకణ్ఠకృత భావదీపః, శ్రీసర్వజ్ఞనారాయణకృత భారతార్థప్రకాశః, శ్రీమదర్జునమిశ్రకృత దీపికా, శ్రీవిమలబోధకృతా దుర్ఘటార్థప్రకాశనీ, శ్రీవాదిరాజవిరచిత లక్షాభరణ మితి ఖ్యాతానాం పణ్డిత శ్రీ తెలికిచర్ల రాజేశ్వర శర్మద్వారా ఆన్ధ్రానువాదం కారయిత్వా, ఏత త్పణ్డితకృత తాత్పర్యవివరణేన చ ప్రకాశయిష్యన్తీతి విదిత్వా మోదామహే.

ఆన్ధ్రభాషాజ్ఞాః ఆస్తికాః ఏత ద్గ్రన్థద్వారా అద్వైత సిద్ధాన్త ప్రమేయాన్ విజ్ఞాయ "పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్ స జ్ఞాయతే జ్ఞానవిదీపితాత్మా" ఇతి సనత్సుజాత వచనానుసార మీశ్వరప్రీత్యర్థం కర్మాణ్యనుతిష్ఠన్తః చిత్తశుద్ధ్యాది పరమ్పరయా శ్రేయః ప్రాప్నుయు రిత్యాశాస్మహే.

యాత్రాస్థానమ్<br>జంషడ్పూర్ (బిహార్)<br>ఆనన శ్రావణ శుద్ధపఞ్చమీ

ఇతి<br>నారాయణస్మృతిః

శ్రీ మాత్రేనమః

# పరిచయము

శ్రీ శ్రియానందనాథ దీక్షానామకుఁడు

శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు

శ్రీకాకుళం

చిరంజీవి, తెలికిచెర్ల రాజేశ్వరశర్మ నాతోఁడ నాధ్యాత్మిక విద్య గఱచినవాఁడు. చిననాఁటఁగోలె భగవద్విషయిక జిజ్ఞాస వీనికి మెండు. సంస్కృతాంధ్రములందుఁ బాండితీ సంపాదనము కేవల భుక్తిప్రదమాత్రముగ నెంచి, చిరకాలము నుండి లోఁతులకుఁ బోలేదు.

వీరి తండ్రిగారు బ్రహ్మశ్రీ తెలికిచర్ల కామేశంశాస్త్రి గారు, వేదాన్త విశారదులు, ధర్మశాస్త్రాది మహాపండితులు, యథార్థశాస్త్రి నామధేయులు. నిర్గర్వ శిఖామణులు. శ్రీకాకుళ మండలమందుఁ బేరెన్నికఁగన్న మహాపండితులు మువ్వురిలో వీ రొకరు. కర్మయోగులు. నివురు గప్పిన నిప్పువంటివారు. అట్టివారి గర్భశుక్తి ముక్తాఫలముగ మా రాజేశ్వరశర్మ జన్మించినాడు. వీరి మామగారు బ్రహ్మశ్రీ మోడేకుర్తి వెంకట సత్యనారాయణ శాస్త్రిగారు, వ్యాకరణశిరోమణులు. వేదాన్తాది శాస్త్రజ్ఞులైన మహాపండితులు. వీరును నిర్గర్వ చూడామణులే. పై యిరువురు మహాపండితుల సదుపదేశముల నంది, మా శర్మ ఎంతో యాధ్యాత్మికానుభూతులతో

నిటీవల "శ్రీసనత్సుజాతీయ" మను నుపనిషదర్థ ప్రతిబోధక మగు మహాగ్రంథమును షడ్భాష్య సహితమును ఆంధ్రమున ననువదించి, తెలుఁగులకుఁ గానుక నిచ్చినాడు. పూర్వకవు లెన్నో యాధ్యాత్మిక గ్రంథములను దెనిగించియు, శ్రీసనత్సుజాతీయమును దెనిఁగింపక విడిచిపెట్టుట వీని సుకృతముగఁ దోఁచుచున్నది.

ఏ బిడ్డనోట నెపు డే పల్కు పల్కించవలెనో ఆపలుకుల తల్లికే తెలియును. ఈతఁడు నాశిష్యుఁడనుటకంటె నా యనుంగు బిడ్డ డనుటయే పాడి. ఏమన? బాల్యాది నాయింటనుండి, నాబిడ్డలతో సావడి విద్య గఱచినవాఁడు. వీనిఁగూర్చి యింక నేనేమి వ్రాసినను స్వప్రశంసగనే పరిచితులకుఁ దోఁపక మానదు. అయినను వీని నాశీర్వదించుట నావిధి యని దోఁచి, రెండుమాటలు వ్రాయకుండ లేకపోతిని.

భగవద్గీత, సనత్సుజాతీయము, రెండును వేదవ్యాస కృతములే. భగవద్గీత కదళీపాకము. సనత్సుజాతీయము నారికేళపాకము. వీని నుపదేశము చేయు నెలవులును వేరు.

గీత క్లైబ్య విషాద నిరాశాది మనోవికార జుష్టుఁడగు నర్జునునకు మనోబలము నిచ్చిన లౌకిక పారలౌకిక విధిప్రబోధ సమ్మిశ్రిత మగు గ్రంథము.

సనత్సుజాతీయము విరాగియగు ధృతరాష్ట్రుఁడు ఆధ్యాత్మిక తత్త్వపు లోఁతుల నెఱుగఁగోరి విదురు నర్థించి, వాని

యోగబలముచే రావింపఁబడిన సనత్సుజాతుని వలనఁ దెలిసి కొనిన బహువిషయ సంగ్రథిత మగు గ్రంథము. ఆతఁడు ఆధ్యాత్మిక తత్త్వ పరిశోధనచేసి, బ్రహ్మత్వము నొందఁ గోరి శ్రీసనత్సుజాతునిచే ఉపదేశము నొందెను.

మృత్యువు, కర్మ, సన్న్యాసము, తపస్సు, బ్రహ్మ చర్యము మొదలగు విషయముల వివృతి, వేదపాఠమాత్రముచేఁ దెలియఁ జాలము. వేదమందివి కేవలము సూచితములు. వివృతములు కావు. కావుననే వీనిని వివరించు నావశ్యకత వ్యాసునకుఁ దోఁచి, "సనత్సుజాతీయ" మను నాధ్యాత్మికోప దేశమును భారతమందు జొనిపినాడు. పై విషయముల వివృతి గీతయందును సంతంత మాత్రమే. అధికారి భేదమును బట్టి రెంటిని రెండుతావుల నాతఁడు గ్రథించినాడు.

మహాభారతము నాంధ్రీకరించిన శ్రీతిక్కన సోమయాజి "సనత్సుజాతీయము నేలఁ దెనిగింపలేద" ను ప్రశ్న ఉదయింప వచ్చును. దీనిని దెనిగింపఁబూనినచో మూలగ్రంథమునకు మూఁడింత లగును. అయినను బహు వివృతాపేక్షము. క్లిష్టవేద వేదాన్తభావ బహుళము. సుబోధము కాని యుప దేశ గ్రంథమును పై కారణములచే బుద్ధిపూర్వకముగనే విడిచి పెట్టియుండ నోపు. వ్రాయఁ బూనిన ఒక శ్లోకమునకు అయిదా రనువాద పద్యము లావశ్యకము లగును.

భగవద్గీతయు సొంత మనువదింపఁబడక, భావసూచనా ప్రాయము లగు కతిపయ పద్యములు మాత్రము గీతాగౌరవ

సూచకముగ గ్రథింపఁబడినవి. దీనికిని గారణ మింతే యయి యుండనోపును.

కవి వాక్యమును, శత్రు బాణమును దలపంకింపఁ జేయఁ గలవి కావలయును. చిరంజీవి రాజేశ్వరశర్మ చేసిన ఆంధ్ర వివృతి వ్యాసహృదయమును జక్కఁగ బయల్పెట్టినదో లేదో తెలియఁగోరి తొంబది యేండ్ల ముదిమిచే మూల్గుచున్న నేను నా పెద్దమనుమడు, చి॥ సీతారామ ధన్వంతరిచేఁ జదివించి వింటిని. సాంతము వినిచినాడు. ఈ యాంధ్రవివృతి తలఁబంకింపఁజేయకమానదు. మూలము స్వయముగఁ జదివి, తత్త్వము నర్థము చేసికొనఁ గల్గు పుణ్యాత్ములు కొందఱే. వివరించి చెప్పఁగల గురువులును అరుదే. అట్టిరిలకు మా రాజేశ్వర శర్మ మహోపకారము చేసినాడు. మూలగ్రంథవిషయ ప్రాశస్త్యమును, దెనుఁగుసేఁత సొబగును, ముచ్చటింపఁ బోవుచో నేండ్లు పూండ్లును, బట్టును. అలమ్.

ఆధ్యాత్మిక ప్రబోధకము లగు నిట్టి గ్రంథరచనములను జేయించి, తనయొడి సిడికొని, సాకుగావుత మని, చి॥ రాజేశ్వరశర్మను నా యుపాస్యదేవత శ్రీ రాజరాజేశ్వరికి ఒప్పగించు చున్నాను.

ఇట్లు
బుధజన విధేయుడు
ఈశ్వర సత్యనారాయణశర్మ.

# అభిప్రాయము

శ్రీ డా. దివాకర్ల వేంకటావధానిగారు
ఎం. ఏ, ఆనర్సు పి. హెచ్ .డి.
ఆంధ్రాచార్యుఁడు
ఉస్మానియా, విశ్వవిద్యాలయము, హైదారాబాదు.

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణేత్యాది బిరుదాంచితులైన శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మగారు సతాత్పర్య భాష్యానువాదముగా రచించిన శ్రీ సనత్సుజాతీయము నాద్యప్రతిమై నాద్యంతము పఠించి, ఆనందము నొందితిని. సనత్సుజాతీయము శ్రీ మద్భగవద్గీతవలెనే ఉపనిషత్సార భూతమును, తత్త్వభావ నిధానమును, సర్వజిజ్ఞాసు పఠనీయము నైన మహనీయగ్రంథ భాగము. సనత్సుజాతుఁ డింత మహత్తర విషయమును జెప్పినను అది ధృతరాష్ట్రుని మనస్సున నెట్టి మార్పును కలిగింపలేదనియో, భీష్మ పర్వమున భగవద్గీత యున్నదిగదా యనియో తిక్కన తన భారతమున దీనిని విడిచివైచెను. అందుచే సంస్కృతానభిజ్ఞులైన ఆంధ్రులు దీనియందలి విషయము గ్రహించుట కవకాశము లేకపోయినది. ఇప్పుడు శ్రీ రాజేశ్వర శర్మగారు షడ్భాష్య సకల ప్రధాన విషయ సంపన్నముగా దాని కాంధ్రవివరణము రచించి, ఆ లోపము లేకుండఁ జేసినారు.

వారు మొదట ప్రతిశ్లోకమునకును దాత్పర్యము వివరించి తరువాత శంకర, నీలకంఠ, సర్వజ్ఞార్జునమిశ్రాదుల

భాష్యములనుండి విశేషాంశములను క్రోడీకరించి, సులభమైన, శైలిలో విశదీకరించి యున్నారు. ఈ ఆంధ్ర వివరణమును బఠించినవారు ఆయా భాష్యము లాటింటఁగల సర్వవిషయము లను గ్రహించి, యానందింతు రనుటలో సందేహము లేదు. వారి వివరణము వ్యాఖ్యాన సాపేక్షములైన భాగముల నన్నింటిని సుస్పష్టము, సుబోధము సరళము నైన శైలిలో విశదీకరించుచు, గూఢమైన వేదాంత విషయమునుగూడ నాత్రముతో చదువవలయు నను నుత్కంఠ రేకెత్తించుచున్నది. దీని నిట్లు సర్వసుగమముగా రచించిన శ్రీ శర్మగారికిని, చక్కఁగా ముద్రించిన సాధన గ్రంథమండలి వారికిని ఆంధ్రు లెల్లరు కృతజ్ఞులై యుందురు.

శ్రీ శర్మగారీవిధముఁగనే నమక, చమకములకుఁగూడ శ్రీ శివ, విష్ణు బీజాక్షర పరముగా నర్థత్రయముతోడను, భాషార్థ వివరణముతోడను గూడిన ఆంధ్రవ్యాఖ్యానము వ్రాయుచున్నా రని విని, అపార సంతోషము నొందితిని. వారి విరాటోద్యోగపర్వ సభాష్యానువాదములతో నిదికూడ త్వరలో ముద్రితమై ఆంధ్రుల కానందము కలిగించుననియు, వారి కృషి నిర్విఘ్నము, సార్థకము, సఫలము నగు ననియు నాశించు చున్నాను.

—దివాకర్ల వేంకటావధాని

# అ భి ప్రా య ము

## శ్రీ భాగవతుల కుటుంబరావుగారు, ఎం. ఏ.,

అద్వైత వేదాంతమునందు సనత్సుజాతీయమున కొక విశిష్ట స్థాన మున్నది. శ్రీ శంకరులు దీనికి భాష్యము వ్రాసినారు. ఇంకను అయిదు భాష్యము లున్నవి. వేదాంతగ్రంథములలో నుండు సామాన్య విషయములేగాక, కొన్ని ప్రత్యేక విషయము లిందున్నవి. అందు మృత్యుస్వరూప వివరణము ముఖ్యము. మిగిలిన అనేక విషయములు సులభముగ బోధింపబడినవి. కొన్ని జటిల ప్రశ్నలకు సమాధానము లున్నవి — శ్రీ రాజేశ్వరశర్మగారి ఆంధ్రభాషానువాదము; తెనుఁగు సాహిత్యమున అనిదంపూర్వము. మూలము, ఆరుభాష్యములు వీనికి తెనుఁగు సేతయున్నది. శ్రీ శర్మగారు స్వయముగ బృహద్వివరణమును వ్రాసినారు. అనేక గ్రంథావలోకన కృషి ఇందు గనుపడును. విషయమును తేట తెల్లము చేయుటలో విరు తీసికొనిన శ్రద్ధ ప్రశంసనీయము. శ్రీ శర్మగా రింకను కొన్ని గ్రంథములను వ్రాయుచున్నారు. నమకముపై నున్న సర్వభాష్యముల యనువాదము అందు ముఖ్యమైనది. అచిరకాలములో ఆ గ్రంథముగూడ సాధన గ్రంథ మండలి లోనే ప్రకటిత మగునని ఆశించుచున్నాను.

| | |
|---|---|
| 1—8—74 | విధేయుడు |
| మచిలీపట్టణం | భాగవతుల కుటుంబరావు |

# స్వాభిప్రాయ నివేదనము

శ్రీ సామవేదం సూర్యనారాయణశాస్త్రిగారు
సాహిత్య విద్యాప్రవీణ - ఉభయభాషాప్రవీణ
రిటైర్డు సంస్కృతపండితులు యం. హెచ్. స్కూలు
శ్రీ కా కు ళ ం

శ్లో॥ "శ్రీవాణీ సముపాసనాప్త వివిధ
ప్రజ్ఞాధురీణేన యః
శ్రీరాజేశ్వర శర్మణా విరచితో
గ్రంథోఽయ మాధ్యాత్మికః
కర్మోపాసన యోగ బ్రహ్మవిషయై
శ్శ్రేష్ఠః పుమర్థావహః
శ్రీకాకూళ మహాత్మభిః ప్రకటితో
భూయా త్పరం శ్రేయసే॥"

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః"
అని గీతాసూక్తి.

దయామయు డగు భగవానుడు తన యంశలగు జీవులు దుస్తర సంసారాంబుధిలో బడి వివశులై యుండగా కరుణించి వారిని దరింపజేయుటకై వేదములను, వేదాంతములను ప్రసాదించెను. కాని చదువరులకు శాసన రూపము లగు వానికంటె స్నేహితుల బోధవలె నుండు పురాణములు మిక్కిలి యుపయోగకరము లని తానే శ్రీకృష్ణద్వైపాయనుడై యవతరించి అష్టాదశ పురాణములను గూడ రచించెను. ఆ పురాణ

ములలో పంచమ వేద మగు మహాభారతము మహో త్కృష్టము. ఈ సనత్సుజాతీయము తదన్తర్గత సుప్రసిద్ధాధ్యాత్మిక గ్రంథరాజము.

"అధ్యాత్మ విద్యా విద్యానామ్" అని శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు విభూతి యోగములో అధ్యాత్మ విద్యను తన విభూతిగాఁ జేర్కొనెను. వేదవేద్య మగు నద్దానిని పంచమవేద మగు మహాభారతమున వ్యాసరూపు డగు మహా విష్ణువు పురాణ పద్ధతిని సవిస్తరముగా నిరూపించెను. ఈ సనత్సుజాతీయ మజ్ఞాను లగు జీవుల నుద్ధరించుట కావశ్యకము లగు ప్రబోధములను సులభపద్ధతిలో తెన్నగా బోధించుటచే దీనికి వేదాంత గ్రంథములలో నగ్రస్థానము లభించెను.

"సాక్షా చ్ఛివ శ్శఙ్కరః" అని ప్రసిద్ధులయిన పరమేశ్వర స్వరూపు లగు శ్రీశంకర భగవత్పాదులు, ప్రజ్ఞానఘను లగు శ్రీ నీలకంఠ దీక్షితాదులు వద్భాష్యముల రచించి మనల ననుగ్రహించిరి. ఇట్లు వద్భాష్యోపేతము, పంచమ వేదాలంకారమును, పారమార్థిక విషయ క్షీరసాగరము నగు నీ వేదాంతగ్రంథము తన గాంభీర్యమును తెలియ జేయుచున్నది. జిజ్ఞాసువులకు కర్మాచరణము, యజ్ఞములు, ధర్మములు, ధ్యానయోగాదులు-సవికల్పక నిర్వికల్పక సమాధులు మొదలగు నవి వివరింప బడుటయేగాక-సృష్టిక్రమము-జీవేశ్వరులు - పరమాత్మ స్వరూపము - జ్ఞానము - జన్మలు-జన్మ రాహిత్యము - పరమాత్మను దర్శించుట కుపాయము లగు

యోగములు - బ్రహ్మానుసంధానము, ఎట్టివారికి సంసారమే గతియో, ఊర్ధ్వాధో లోకము లెవరు పొందుదురో, మృత్యు వేదియో, మృత్యువునకు మృత్యువెవరో, ఎవరు బ్రహ్మ భూతులో మొదలగు విషయములు, రహస్యములు కరతలా మలకములవలె సులభావగాహములు జేయబడెను.

శ్రీకృష్ణభగవానుడు అర్జునుని ప్రశ్నములకు సదుత్త రము లిచ్చినట్లు గీతాశాస్త్రము ప్రవర్తిల్లెను. శ్రీసనత్సు జాతుడు ధృతరాష్ట్రుని సంశయములను దీర్చినట్లీ మహాగ్రంథ మారంభింపబడెను. శ్రుతిమాతయే అవాఙ్మానస గోచర మగు బ్రహ్మతత్త్వమును "ఇది గాదిదిగాద"ని నిషేధ రూపమున బోధించు చున్నది. బ్రహ్మవిద్యా ప్రతిపాదక మగు సనత్సు జాతీయము గూడ బహు ప్రకారముల పరమాత్మను బోధించెను.

"యోగిన స్తం ప్రపద్యంతే భగవంతం సనాతనం" అని షష్ఠాధ్యాయ మంతయు మోక్షపురుషార్థమునొందు విధమును పాఠకుల కందజేసెను. చతుష్పాద బ్రహ్మచర్యము మొదలగు సద్ధర్మములు, సులభముగా నుడువబడినవి. అంత శ్శత్రువులను జయించుట, శోక మోహములను బొందకుండుట, మూఢుడు జ్ఞాని, మృత్యువు, అమృతత్వము, వేదములు, బ్రాహ్మణుడు, పరబ్రహ్మ నిరూపణను గావింప గుశలుడు, సవితృదేవతో పాసనము, త్ర్యంబకమంత్రజపము, వ్రతములు, పరబ్రహ్మ దర్శనము మొదలగు పారమార్థిక విషయములు భాష్యములతో సుబోధముగా విమర్శింప బడినవి.

అయినను సంస్కృత భాషామయ మగు సనత్సు జాతీయము కేవలాంధ్ర భాషాభిజ్ఞులకు దురవగాహ మయ్యెను.

అట్టి లోపమును దీర్చుటకై చి॥ శ్రీ రాజేశ్వరశర్మ బద్ధకంకణులై దేశభాషలో టీకా తాత్పర్యములను, భాష్యము లతో బాటు స్వీయాభిప్రాయ వివరణమును వ్రాసి పాఠకులకు క్లిష్ట రహస్యాంశములను గూడ సులభములు గావించిరి. శ్రుతు లను, స్మృతులను, వేదాంతగ్రంథప్రమాణ శ్లోకములను యుక్తి యుక్తముగా స్వీయానుభవముతో సమన్వయించి తన అసాధారణ ప్రతిభతో పాఠకులచే గూఢార్థములను గూడ గ్రహింపజేసిరి. ఇంతవఱకీ యుద్గ్రంథమున కిట్టి తెనుగుసేత వెలువడలేదు, స్వతంత్రము సుఖావగాహము అనన్యానాతి రిక్తమగు చి॥ శర్మగారి రచన ప్రశంసార్హము. వేదవేత్తలగు వీరికే యీరచన చెల్లుననుట యతిశయోక్తిగాదు. ఇందనేక రహస్యములు సామాన్యులకు గూడ బోధపడు ననుట సత్య దూరము కాదు.

వీరు విద్వత్కుటుంబమునకు జెందినవారు. ధార్మికత్వము సదాచారసంపత్తి, వేదాధ్యయనము మొదలగు సద్గుణములు శ్రోత్రియ వంశజులగు వీరికి సహజములు. శ్రద్ధతో విద్య నభ్య సించుచు సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ అను బిరుదము లందుటయే గాక నేటికిని నిరంతర విద్యాకృషి పరులై విద్యా ధికులయిరి. ముప్పది సంవత్సరములనుండి పురపాలక సంఘో న్నత పాఠశాలలో పండితులుగా నుండుట "సువర్ణస్యాపి పరి

మలః" అను నట్లు వీరి వైదుష్యమునకు వైశిష్ట్యమును సమ కూర్చెను.

ఇందు అద్వైతమే ముక్తిదాయక మని, సవికల్పక నిర్వికల్పక మయిన మనస్సును "అహంబ్రహ్మాస్మి" అని నిశ్చయాత్మక మయిన బుద్ధిలో లీనము జేయుటయే బ్రహ్మవిద్య అని, మోక్షపురుషార్థము జ్ఞానసాధ్యము గాని కర్మసాధ్యము గాదని, సత్యమే బ్రహ్మము: దాని నుండి జారని మనస్సుగల వాడే బ్రాహ్మణు డని, అట్టి గురువువలన శిష్యుడు "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానమును పొంది స్వాభావిక సచ్చిదానందాద్వితీయ పరమాత్మగా తాను జనింపబడితి నని భావన చేయ వలె ననియు, యజ్ఞములు తరణోపాయము లనియు ననేక ముఖ్యాంశములు విపులముగా స్పష్టపరుప బడెను.

శ్రీ సనత్సుజాతులు "ప్రమాదంవై మృత్యు మహం బ్రవీమి తథాऽప్రమాద మమృతత్వం బ్రవీమి" అని అజ్ఞులకు జ్ఞానులకు గూడ నేకైకోపదేశము గావించెను. ప్రమాదము మృత్యువు అప్రమాద మమృతత్వ మని వారి ఉపదేశము. ప్రమాదము కలవారికి పునర్జన్మ, ప్రమాదము లేనివారికి జన్మ రాహిత్య మని యర్థము.

ప్రమాద మనగా అజ్ఞానము, అహంకారము, మోహము, కామము, క్రోధము, లోభము, శోకము, తమస్సు, అవిద్య మొదలగునవి. అట్టి ప్రమాదము గలవారిక సంసారమే. ఇది దేహాత్మ బుద్ధిగల అజ్ఞానులకు గావించిన ప్రబోధము.

తరువాత "ఏవం మృత్యుం జాయమానం విదిత్వా
జ్ఞానే తిష్ఠ న్నబిభే తీహ మృత్యోః"

అని జ్ఞానులు నిరంతర బ్రహ్మాను సంధానమున నుండి మృత్యు వునకు మృత్యువలగుచు దానినుండి భయపడకున్నారని జ్ఞానులకు నిరంతర బ్రహ్మాను సంధానము బోధింప బడెను.

ఈవిషయమునే శ్రీమచ్ఛంకర భగవత్పాదులు తాము రచించిన వివేక చూడామణి యను వేదాంత గ్రంథమందు

శ్లో॥ ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం నకర్తవ్యః కదాచన ।
ప్రమాదో మృత్యురిత్యాహ భగవా న్బ్రహ్మణస్సుతః ॥

అనగా సాధకులు నిరంతరము బ్రహ్మనిష్ఠలో నుండవలెను. తమోగుణ ప్రాబల్యముచే మనస్సు బ్రహ్మనిష్ఠయందు నిశ్చల ముగా నుండకుండుట, లేదా వారు బ్రహ్మధ్యానమును మఱచుట అనునవియే వారికి ప్రమాదములు. ఆ ప్రమాదమే వారికి మృత్యువు. చిత్తములో దృశ్యమునకు చోటీయరాదు. అపుడు మనస్సు విషయాభిముఖ మగును. అందువలన వాటిల్లు అనర్థము లనంతములు. కనుక జ్ఞానులు నిరంతరము బ్రహ్మాను సంధానమే చేయవలెను. గాని, దాని నుండి జారుట అను ప్రమాదమునకు గుఱి కాకూడదు. అదే వారికి మృత్యువని సనత్సుజాతీయములో జ్ఞానులను గూర్చి బ్రహ్మకుమారుడు బోధించెనని యాచార్యులవారు వారి గ్రంథములో జెప్పిరి.

ప్రకృతిగ్రంథమున ఏ పుట జూచినను అందున్న ఏ విషయ మైనను గ్రహింప దగినదే కాదుగదా, నిత్యము మననము చేయదగినదై యుండును. కాని యీ విశాలగ్రంథ మును పరిశీలించు చుండగా గందరగోళమై బుద్ధివిభ్రాంతి నొందు చుండెను. అప్పు డాచార్యులవారి మఱియొక శ్లోకము జ్ఞాపకమువచ్చెను. అదేమనగా

శ్లో॥ "శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణమ్ ।
అతః ప్రయత్నా జ్ఞాతవ్యం తత్వజ్ఞా తత్వ మాత్మనః"

వేదములు. ఉపనిషత్తులు, పురాణములు మొదలగు గ్రంథములు మహారణ్యముల బోలె బుద్ధికి భ్రమలనే కల్గించును. అట్టి గ్రంథరాశిని పరిశీలించి పరిశీలించి సారమును మాత్రమే గ్రహింపవలెను. తత్త్వమును మాత్రము బ్రహ్మవేత్త యగు సద్గురువువలన గ్రహింప వలెనని ఆచార్యుల వారి మతమున కర్థము.

భగవద్గీతలో యోగములు వలె నెన్నియో విషయము లిందు విపరింప బడెను. విడువదగిన దోషములు అభ్యసింపదగిన సద్ధర్మములు వ్రతములు యజ్ఞములు నిరూపింప బడెను. దైవా సుర సంపద్విభాగములోవలె నుండును. దేహాత్మ బుద్ధిని వీడ వలె నని దూరముగా బోధింప బడెను. పరబ్రహ్మ దర్శన మెట్టివారి కగునో షష్ఠాధ్యాయమున విపులముగా జెప్పబడెను. సవికల్పక సమాధి, నిర్వికల్పక సమాధి అంతుబాటులో నున్నట్లు

బాగుగా విమర్శ పూర్వకముగా వ్రాయబడెను. "అసంప్రజ్ఞాత యోగోఽయం దుష్ప్రాప ఇతి మే మతిః" అని విద్యారణ్యుల వారనిరి. ఈ సందర్భమున తపస్సుచే క్షీణ జన్మాంతర పాపులును, పుణ్యాపరిపాకముచే సిద్ధించిన నిర్వికల్పక సమాధిగల ధర్మాత్ములు పరదేవతా పుత్రులు మాగురువుగారగు శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారికి శ్రీశ్రీయానంద నాథులకు అంజలి ఘటించు చున్నాను.

చిత్తశుద్ధి కొఱకు దురితక్షయము కొఱకును నిష్కామ కర్మాచరణము గావింప వలెనని వ్రతములు, యజ్ఞములు వివరింప బడినవి. భగవద్గీతలో "యస్య సర్వే సమారంభాః కామ సంకల్ప వర్జితాః" అని యీవిషయమే కదా చెప్పబడెను. చిత్తైకాగ్రతకై ఉపాసనలు, ధ్యానము చెప్పబడినవి. బ్రహ్మనిష్ఠయు నిరూపింప బడెను. అన్నియు నావశ్యకము లని భగవద్గీతలో వలె నిందును గలదు. కనుక ఒక రహస్యమును జెప్పి విరమించుచున్నాను.

భక్తి-జ్ఞాన - యోగ - నిష్కామ కర్మాచరణములను నాల్గును ముఖ్యములే -

"కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః" అని నిష్కామ కర్మాచరణము వలన జనక మహారాజు మొదలగు వారు ముక్తి నొందిరి. అనన్య భక్తిచే శ్రీ నారదాదులు మోక్షము నొందిరి. వసిష్ఠాదులు జ్ఞానముచేతనే మృత్యువును

దరించిరి (ముక్తినొందిరి). శ్రీ కపిల పతంజలాది యోగీశ్వరులు యోగముచేతనే సిద్ధి నొందినారు. అని తెలిసికొను చున్నాము. కాబట్టి నిష్కామముగా కర్మలను యజ్ఞములను జేసి దురితక్షయము గావించుకొనవలెను. భక్తితో భగవంతుని నిశ్చలముగా ధ్యానింపవలెను. ప్రాణాయామాది యోగములచే చిత్త వ్యాపారముల నరికట్ట వలెను. జ్ఞానమును సద్గురువువలన బోధింప బడి మోక్షము నొందవలెను. మీదను జెప్పినట్లు ఒక్కొక్క దానిచేతనే తరించి రనుట సాహసము. ఈ నాలుగు యోగములలో నిష్కామ కర్మాచరణము ముఖ్యము గాను, మిగిలినవి సామాన్యములు గాను జనకాదుల యెడ గలవనియు, అట్లే నారదాదుల కనన్య భక్తి ప్రధాన మని మిగిలిన మూడును అప్రధానము లని, వసిష్ఠాదులకు జ్ఞానమే సంపూర్ణముగా గల్గెనని మిగిలిన మూడును సహకారు లయ్యెనని, కపిలాది మహర్షులుగూడ నిష్కామ కర్మాచరణముచే దురితక్షయము కాగా భక్తి జ్ఞానములను సంపాదించి యోగముచే మృత్యువును జయించి రని అన్నియు ముఖ్యములుగాన ఉద్గ్రంథములలో వాని స్వరూపము లంతగా వర్ణింప బడెనని నాయాశయము - మఱియు "యథేచ్ఛసి తథాకురు" అని ఏది ముఖ్యమై నీకలవడునో దానిని గ్రహించి తరింపు మని గీతలో గూడ వర్ణింప బడెను. కనుక అన్నియు సంగ్రహింప దగినవే.

ఇట్లు నాశిష్యులు చి॥ శర్మగారు శ్రద్ధతో నీగ్రంథమును రచించి శ్రమించి లోకోపకారమునకై ప్రకటించిరి. భగవంతుడు

దయతో జీవులను కటాక్షించి తరుణోపాయము లగు నిట్టి సద్గ్రంథములను వీరు రచించునట్లు సహాయపడుచు వీరికి వంశాభివృద్ధిని ఆయురారోగ్యైశ్వర్యాదులను ప్రసాదించి సదా సంరక్షించుగాక.

ఇట్లు

సా॥ సూర్యనారాయణశాస్త్రి

---

ఓం నమోభగవతే శ్రీరమణాయ

## ఆనంద నివేదనము

సాహిత్యవిద్య, ఉభయభాషాప్రవీణుఁడు

కవిశేఖర, సాహిత్యాచార్య వేదాంత విమర్శన విశారద,

### పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

(రిటైర్డు హెడ్‌మాష్టరు గవర్నమెంటు యం. ఆర్. కాలేజి)

మహాభారతము నందలి భీష్మపర్వాంతర్గత మగు భగవద్గీతవలె, ఉద్యోగపర్వము నందలి సనత్సుజాతీయముకూడా ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రబోధక మగుట వలన, బ్రహ్మవిద్యాసక్తు లగు ప్రజల కందఱకును ప్రతి దినమునను పారాయణ

యోగ్యమే యగు చున్నది. కనుకనే శ్రీశంకర భగవత్పాదుల వారు భగవద్గీతకు వలె దీనికిని భాష్యమును రచించియున్నారు. ఇందు పరమార్థతత్త్వమును విదురుని యోగబలమువలన రావింపఁబడిన, సనత్సుజాతుని చేత ధృతరాష్ట్రుడు వినెను.

భగవద్గీత యందు శ్రోత అర్జునుడగుటవలనను, పాండవ ధార్తరాష్ట్ర పక్షములు రెండును మహాయుద్ధ సన్నద్ధములై యుండునపుడు అసంగతమగు, నిరుత్సాహస్థితి నతడు పొందుట వలనను, మహావిష్ణుని యవతార మగు శ్రీకృష్ణ భగవానుడు, అర్జునునకు సారథ్యమును చేయువాడు, జ్ఞాన ప్రబోధకు డగుట వలనను తదోద్బోధితమైన భగవద్గీత కత్యధిక మగు ప్రాముఖ్య మేర్పడినది. తన్మూలమయిన భీష్మపర్వము నందలి భగవద్గీత ప్రజాసక్తిని సంఘటించు కొనినట్లు సనత్సుజాతీయము భారత ప్రజాశక్తినిగూడ సంఘటించు కొనలేక పోయినది. దీని కితరము లగు హేతువులు పెక్కులున్నవి.

"ప్రమాదంవై మృత్యు మహం బ్రవీమి"
"నిచాయ్య తం మృత్యు ముఖా త్ప్రముచ్యతే"

ఇత్యాది సూక్తులు భగవద్గీతయందు కంటె దీనియందు మిగుల నాత్మ ప్రబోధహేతువులై యున్నవి.

శ్రీసనత్సుజాతీయమును నేను ఇరువది సంవత్సరముల క్రిందటనే శ్రీశంకరభాష్యము ననుసరించి, కొంతవఱకు ననువదించి కారణాంతరముల వలన విరమించితిని. బ్రహ్మశ్రీ తెలికిచెర్ల రాజేశ్వరశర్మగారు దీనిని శ్రీశంకర భాష్యముతోడను

శ్రీనీలకంఠ విరచిత భావదీప వ్యాఖ్యతోడను, (1) సర్వజ్ఞ నారాయణకృత భారతార్థ ప్రకాశము (2) అర్జున మిశ్రీయ దీపిక, (3) విమలబోధకృత దుర్ఘటార్థ ప్రకాశిని (4) వాదిరాజ తీర్థ విరచిత లక్షాభరణము అను భాష్యముల అనువాదము తోడను సరళమైన శైలిలో ననువదించి యున్నారు. శ్రీరాజేశ్వరశర్మ గారు భాష్యానువాదములతో పాటుగ నొక వివరణమును వెలయించి యున్నారు. ఈ భాష్యాను వాదము లను, వివరణమును శ్రద్ధగల్గి సమీక్షించిన వారికి, బ్రహ్మ మానసపుత్రు డగు శ్రీసనత్సుజాతుని "మృత్యువు లేద"ను మహాప్రబోధము సులభముగ నవగత మగునని తలచు చున్నాను. ఆత్మ విద్యాసక్తులగు భారతీయు లెల్లరును భగవ ద్గీతను వలె శ్రీసనత్సుజాతీయమును గూడ నిత్యమును బఠింప గోరుచున్నాను.

సంస్కృతభాషాజ్ఞానము లేని ఆంధ్రులకు ఆంధ్రభాషాను వాద రూపమున రచించిన శ్రీసనత్సుజాతీయము సులభభావ బోధమై అత్యధిక ప్రయోజన కారి యగు నని దృఢముగ విశ్వసించు చున్నాను. శ్రీరాజేశ్వరశర్మగారు "నమక చమకము" లను అనువదించు చున్నారనియు, మహాభారతము నందలి విరాటోద్యోగ పర్వములను అనువదించు చున్నారనియు విని యుంటిని. ఇట్లే అనుశాసనిక పర్వము నందలి శ్రీవిష్ణుసహస్ర నామ, శివ సహస్రనామ భాష్యములను గూడ అనువదించి ప్రజోపయోగమును సంఘటింతు రని విశ్వసించుచున్నాను.

ఏతత్కాలదేవతయగు శ్రీరాజరాజేశ్వరీదేవికే దీనిని వీ రంకితము గావించి యున్నారు. ఆజగన్మాత వీరిని ఆయు రారోగ్య భాగ్యభక్తిజ్ఞాన యుక్తులుగాను, బహుకృతి రచ యితలుగాను దేశ ప్రఖ్యాతులుగాను అనుగ్రహించు గావుత మని నివేదించుచు నాయానంద నివేదనమును ముగించు చున్నాను.

ఇట్లు

విజయనగరం — సజ్జనవిధేయుడు

14—7—1974 — పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

---

శ్రీ శః శ ర ణ మ్

ప్రీ త్యు న్మీ ల న ము

భా షా ప్ర వీ ణ :

శ్రీ ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు

కార్యదర్శి, ఉపనిషన్మందిరము, శ్రీకాకుళపురపాలక సంఘోన్నత

పాఠశాలాంధ్ర పండితుడు.

"యద్భక్తిం న వినా ముక్తిః యస్సేవ్యః సర్వయోగినామ్
తం వందే పరమానందఘనం శ్రీనందనందనమ్"

మహాభారతాంతస్థ రత్నమాలలో సనత్సుజాతీయ ప్రకరణ మొకజాతిరత్నము.

మానవ జాత్యభ్యుదయము నాశించి, శ్రీకృష్ణద్వైపాయన మహర్షి సర్వవేదసారము-వేదార్థోప బృంహణము నైన శ్రీ మహాభారతేతిహాసమును నిబంధించినాడు.

అది యొక ధర్మరత్నఖని. విశ్వవిజ్ఞాన భాండారము. నాటినుండి నేటిదనుక ఏబుద్ధిమంతు డేరత్నమును ప్రకాశింప జేసినను, అవి యన్నియు నీరత్నఖనియందు లభించినవే. ఇం కెంత ఆన్వాళ్లు తదేక వ్యగ్రులై చూచినను నందు రత్నము లకు కొదువ యనునది యుండదు.

అఖిల ధర్మమూల మగు వేద మొక ధర్మసాగరము. అట్టి సాగరముల నాల్గింటిని తన గర్భమం దిముడ్చు కొన్న మహాసాగరము శ్రీమహాభారతము. అందు, పైపై ఈదులాడు వారికి తరంగముల శోభయే యనుభావ్య మగునుగాని, అందు నిమగ్నులైన వారికి, దాని యగాధత తెలియుటతోబాటు లోతులకు పోగా, పోగా తదంతస్థ రత్నము లెన్నియో లభింప గలవు. ఆ రత్నదీధితులు-అవగాహన మొనర్చిన వానికి పరి తృప్తి నిడుటతో పాటు, భారతులంపటి హృత్తమోపనుద మొనర్చి, వెలుగు బాటలను చూపగలవు.

విజ్ఞానము బహుముఖమైనది - అనంతమైనది. "సర్వతః పాణి పాదం తత్ సర్వతో౽క్షి శిరోముఖం సర్వత శ్శ్రుతిమత్"

అనునట్లు ఆ విజ్ఞాన భాండార మూవృత్త చక్షువులైన వారికి, విస్మృతి వ్యాపము. బద్ధియుక్తుడైన మానవుడు సంస్కారాను రూపమైన సది ప్రేరితుడై ఆ విశ్వవిజ్ఞాన భాండారమున నడుగిడి, విజ్ఞాన తృప్తియుక్తుడై, తృష్ణాగంధము నశింపగ, నిత్య తృప్తుడై అనుగ్రహపాత్రులైన తనవారి తాపోపశమన మొనర్చుటకొని, వారి పిపాసాపరివృత్తి నొనర్పగల విశ్వవిజ్ఞాన భాండాగార మార్గమును వారికి చూపుటగాని చేయును.

ఎట్టి తెలివిడి కినలన నంతయు తెలిసి నట్లగునో ఆ తెలివిడినే వేదాంత మందురు. అనగా విజ్ఞాన దాయకము లగు శాస్త్రము లన్నియు నెందు పర్యవసించునో అట్టి యనుభవ పూర్వకము జ్ఞానమే వేదాంతము. అదియే "చదువులలో మర్మము" అట్టి మర్మజ్ఞుడే జ్ఞాని, ఆతడే భక్తుడు, యోగి, పండితుడు. "జ్ఞానీ త్వాత్మైవ మే మత" మ్మని శ్రీకృష్ణ భగవానుడు పల్కెనుకదా !

తనను గూర్చి, పరుని గూర్చి, గుణాత్మక మగు సర్వ ప్రకృతిని గూర్చి, తాను పరునితో కాక, ప్రకృతితో నుండు టను గూర్చి, తాను పరుని జేరి స్వస్వరూపముతో నుండగల ఉపాయమును గూర్చి, విశద మొనర్చునదియే వేదాంతము, జ్ఞానము.

ఇట్టి ఘట్టములు శ్రీమహాభారతమున నడు గడుగునను గలవు. వానిలో భీష్మపర్వమందలి శ్రీమద్భగవద్గీత, ఆనుశాసనిక

పర్వమందలి శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రము, ఉద్యోగపర్వాంతర్గత మగు శ్రీసనత్సుజాతీయము, భీష్మపర్వాంతర్గత దుర్గాస్తుతి మున్నగు నవి మిగుల సేవ్యములుగ నున్నవి.

ఇందు భగవద్గీత- సనత్సుజాతీయము ఉపదేశగ్రంథములు. తక్కిన రెండును స్తోత్రగ్రంథములు.

వేదాంత గ్రంథములలో ప్రధానములైనవి, ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు. వీనినే ప్రస్థానత్రయ మందురు. భారతీయ తత్త్వవేత్తలలో అగ్రగాములైన శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులను త్రిమతాచార్యులును ప్రస్థానత్రయమునకే ప్రధానముగ భాష్యములను రచించిరి. శ్రీశంకరులు విష్ణుసహస్రనామ, సనత్సుజాతీయ గ్రంథములకును భాష్యములను వెలయించినారు.

శ్రీసనత్సుజాతీయము భగవద్గీతవలె విపుల ప్రచారము నందకుండుటకు హేతువేమి? అని ప్రశ్నించుకొని, సమాధానము చెప్పవలెనన్న, పై రెండు గ్రంథముల తారతమ్యపరీక్ష చేయవలెను.

స్థూలముగ చెప్పవలెనన్న ఉపదేష్ట అందునిందును సనాతనుడే యైనను, ఉపదేశము గొన్న ధృతరాష్ట్రునకు, అర్జునునకుగల అధికార తారతమ్యమే ఈ గ్రంథములందంతరమును సూచించుచున్నది.

బ్రహ్మమానసపుత్రుడైన సనత్సుజాతుడను సనాతన మహర్షి, విదురుని యోగ బలమున సాన్నిధ్యము ననుగ్రహించి, జిజ్ఞాసువగు ధృతరాష్ట్రునకు వేదాంతోపదేశ మొనర్చుట ఇందలి విషయము. ఇట్టి బహువిషయ విస్తృతమైన గ్రంథము ఆరుభాష్యవ్యాఖ్యలతో లభింపగా, శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మగారు తమ జనకుల ఆదేశానుసారము దానిని భాష్యానువాద స్వాభిప్రాయ ప్రకటనముతో ముద్రించి ఆంధ్ర పాఠక లోకమున కత్యంతోపకార మొనర్చినారు.

ఇహపరములను జెరచు ప్రమాదము మృత్యువే యను శ్రీసనత్సుజాతుని వాక్యము, అధర్మమూలుడు, నిత్యప్రమాది యగు ధృతరాష్ట్రునిలో శంకాంకురమును రేచెను. తదున్మూలనమునకై సనత్సుజాత మహర్షి చేయునుపదేశమే ఈ సనత్సుజాతీయము.

శ్రీ రాజేశ్వరశర్మగారు తమ జనకులతో, శ్రీ సామవేదం సూర్యనారాయణ శాస్త్రిగారితో విద్యగరచిన వారగుట యిట్టి బహువిజ్ఞాన విషయవిలసిత మగు సద్గ్రంథము ననువదింప గల్గిరి.

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవు లీ యుర్విం బురాణావళుల్
తెనుగుల్ సేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి, నా
జననంబున్ సఫలంబు చేసెద బునర్జన్మంబు లేకుండగన్ ॥"

అని పోతనగారన్నట్లు ఇది వారి భాగ్యవిశేష మనుటలో సందేహము లేదు.

బహుశాస్త్ర పాండితీసాధ్యమైనది వేదాంత గ్రంథాను వాదము. తెలుగున నాయెఱిగి నంతవట్టు సనత్సుజాతీయాంధ్రానువాదము ప్రకటితము కాలేదు.

అస్మద్గురువర్యులు, శ్రీరమణాంతేవాసి; వేదాంత విమర్శన విశారదులు- ఈశావాస్యాది బహూపనిష దాంధ్రీకర్తలు శ్రీ. వే. బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు సనత్సుజాతీయాంధ్రీకరణమునకు బూనుకొనిరి. కాని నేటివరకది అసంపూర్ణముగనే మిగిలినది.

నాకు సోదరతుల్యులును, పూజ్యులైన శ్రీ రాజేశ్వర శర్మగారు ఈ యాంధ్రీకృతి తత్త్వజిజ్ఞాసువులగు నాంధ్రజనుల యాదరమునకును, తత్త్వవేత్తలు పండితులు నైన వారి ప్రీతికిని బాత్రమై- భారతీయ సనాతన ధర్మద్యోతకము లగు పెక్కు రచనలు చేయుటకై వారిలో నుత్సాహమును రేకెత్తించు గాక యని కోరుచున్నాను.

ధర్మస్వరూపుడగు భగవంతుడు తన శాసనముల నాయాకాలములం దెట్లుద్ధరించెనో, అట్లే శ్రీ శర్మగారిచే తన పలుకుల నాంధ్ర మహాజనుల కందించుటకై సంకల్పించుగాక యని ఆ వాసుదేవుని సర్వదా ప్రార్థించుచుందును.

ఓం శాంతిః

ఇట్లు

ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు.

# అచ్చపు నేస్తుని మెచ్చు

శ్రీ డా. E. S. ధన్వంతరిగారు. L. I. M.

రిజిష్టర్డు మెడికల్ ప్రాక్టీషనర్

ధన్వంతరి క్లినిక్ - శ్రీకాకుళం

నీవ్రాసిన సనత్సుజాతీయము దుదముట్ట చదివితిని. ఇన్నేండ్ల నుండియు నీవు బడిలో తెనుగు, వేల్పు, బాసల గఱపు నొక య్యావార మనుకొంటిని గాని ప్రాఁజదువుల సార మెఱిగి సనత్సుజాతీయ మంత దానిని పసందుగ తెనిగించు పసగలదనుకొన లేదు. అసలు దాని చేవ నెఱుఁగ గష్టమనియె గాబోలు శ్రీశంకరులు మత్తైదుగురు దానికి వివరణము వ్రాసిరి. వానిని తఱచి చూచి నీబుద్ధితో మెఱుగులు దిద్ది ఈ చక్కని తెనుగు సేత నాంధ్రకందిచ్చి మేలు చేసితివి. (సెబాసుగ తెనుగుసేసి తాంధ్ర)

వేల్పుబాస లోతులు తెలియని నాబోంట్ల కదిఁజేజ. తెలివి బాట జూపు దివ్వె. అదేమి నీపున్నెమొ దానిని మును పటి తెలుగు కవులు ముట్టక నీకై విడిచిరి.

మన నేస్తము చిననాటిది. నెయ్యముతో వేల్పుబాస పసలేని నను నీపొత్తము జూడు మంటివి. తొలినుండి చదివితిని. మఱొక తూఱి చదువుద మను పిచ్చ రేగినది. అసలు గ్రంథ మందున్న మెలికలు తెనుగునకు దేవలయునన్న

ఎన్ని శాస్త్రముల లోతులందో మునుగ వలెను. ఒక్కటే మాట. నీపడిన కష్టము తెనిగింపు పసందెఱిగిన కొందఱికి తెలియును. ఇవి నా పైపై మాటలు కావు. ఇంతకన్న హెచ్చు వ్రాయుబని లేదు. నిను గన్న పితరులు శ్రీ కామేశంశాస్త్రి, లక్ష్మీకాంతమ్మ దీన నీస్మరణ మొంది ధన్యులైరి. నీ యప్పును మఱికొంత తీఱినది. నీవు నిచ్చలు బత్తిమెయి కొలుచు శ్రీ రాజరాజేశ్వరీ దేవి నిను నూరుపంటలు నెమ్మితో సాకివిడి నీచే నిట్టివి మఱికొన్ని బయల్పెట్టించు మని వేడు

నీ నేస్తుడు,

డాక్టరు ఈశ్వర సీతారామ ధన్వంతరి.

— o —

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

## నివేదనము

బ్రహ్మసృష్టిలోఁ బశుపక్ష్యాదులకంటె సత్యోత్తమమైన దీమనుష్యజాతి. ఇది సృష్ట్యాదిలో దేవగంధర్వాదులతో సమానముగాఁ బ్రాదుర్భవించినదే కాని భూలోకమునఁ గ్రొత్తగా నేర్పడినది కాదు. అనుటకు,

"తతో దేవమనుష్యాః పితరః
గంధర్వా ప్సరస శ్చోదతిష్ఠన్"

అనెడి యాజుణ మంత్రమే ఆధారము.

ఇట్లేర్పడిన మనుష్యులకే "మనువు సృష్టిలోని వారు కావున మానవులనియు" వ్యవహార మేర్పడినట్లు మనుస్మృతి వలనఁ దెలియు చున్నది. ఈ మానవు లెల్లరును భారతులే అనగా జ్ఞానరతులే. అందులకు అగ్న్యుపాసకులే అను విషయము

"ఉత్తిష్ఠత మా స్వప్త, అగ్నిమిచ్ఛధ్వం భారతాః"

అనెడి యాజుణమంత్రము వలనఁ దెలియు చున్నది. కావున మానవజాతి అత్యుత్తమ మైనది. అటులనే విద్యలలో నెల్ల బ్రహ్మవిద్య అత్యుత్తమ మైనది. అది పూర్వజన్మ పుణ్యా లభ్యమే కాని ప్రయత్న ప్రాప్యము కాదు. అది సామాన్యు లకు దురవగాహము. అందుచేతనే, "ఇది యేమి బ్రహ్మ విద్యయా ?" యను నానుడి యేర్పడినది. ఇది సర్వులకును సువిదితమే కదా! బ్రహ్మవిద్యకును మనుష్యులకునుఁ గల సంబంధము అవిచ్ఛేద్యము' అనుస్యూతము కాని యతుకుల బొంత కాదు.

అట్టి బ్రహ్మవిద్యను బ్రతిపాదించు వాఙ్మయము వేద శాస్త్ర పురాణాదికము. పురాణకోటిలోఁ జేరిన గ్రంథరత్నమే పంచమవేదమైన మహాభారతము. బ్రహ్మవిద్యా ప్రతిపాదకమై

ప్రస్థానత్రయమునఁ జేరిన మహాగ్రంథమగు భగవద్గీత మహాభారతము లోనిదే.

ఈ సనత్సుజాతీయమును మహాభారతమందలి యుద్యోగ పర్వము లోనిదే. నిజముగా సనత్సుజాతీయము "అయఃపిండమే; విద్యాదౌషధమే" యని నేను స్వానుభవమున గ్రహించిన వాఁడను. అజ్ఞాన స్వరూపము, పునర్జన్మ, వేదశబ్ద నిర్వచనము, మౌనము, బ్రహ్మచర్యము, వైయాకరణుఁడు, గురుమహిమ, జీవేశ్వరస్వరూపము, యోగము, పరమాత్మ దర్శనము, మున్నగు ముఖ్యవిషయము లెన్నో తెలిసికొనఁ దగిన విందుఁ గలవు. ఇందుఁగల గుణదోషప్రకరణమును వివరించు సందర్భమున నాకుఁ దెలిసిన కథలను, చారిత్రిక విషయములనుఁ బొందుపఱిచితిని.

అద్వైతము, ద్వైతము, శైవము శాక్తేయము, యోగము మున్నగు మతముల స్వరూపమును భాష్యకర్త లాటిగారును సువ్యక్త మొనర్చిరి. యథాశక్తి యథామతి వాని ననువదించితిని. సాంకేతిక పదములను, న్యాయములను, ఆయా భాష్యవిషయములందే కాక, వివరణమను పేర వేరుగా గూడ యథాబుద్ధి వివరించితిని. విజ్ఞానులును, విద్వాంసులు నగు పాఠకులు "గుణములను మాత్రమే గ్రహించి దోషములను నాకు విడతురు గాక" యని ప్రార్థించుచున్నాను.

ప్రస్థానత్రయ జ్ఞాన మార్జింపఁ దలచిన వారెల్లరకును మార్గదర్శకము సనత్సుజాతీయము. జీవులకు అజ్ఞానాంధకార

మున నొదవు కష్టములను నిర్మూలించు కరదీపము. సనత్సు జాతీయ మందలి యీ విషయములను విజ్ఞాన ఖనులైన పాఠక మహాశయులు గ్రహింపఁగలరు. పై రెండు విషయములను దృష్టిలో నిడుకొనియే మహాభారతకర్త వ్యాసభగవానుఁడు భీష్మపర్వములోని భగవద్గీతకంటె ముందుగా ఉద్యోగపర్వమున దీనిని అనుసంధించినాడు. పై రెండు గ్రంథములను బఠింపనిదే, చక్కని యాధ్యాత్మిక జ్ఞాన మార్జింపనిదే, నిత్యపఠనీయము లైన శివ, విష్ణు సహస్రము లందలి విషయములును, దుర్గా స్తోత్ర మందలి విషయమును సువిదితములు కావను తలంపు తోడనే వ్యాసమునీంద్రుఁడు ఉద్యోగ పర్వమున సనత్సు జాతీయమును, భీష్మపర్వమున భగవద్గీతను, దుదకు ఆనుశాస నిక పర్వమున దుర్గాస్తోత్రమును, శివవిష్ణు, సహస్రములను అనుసంధించి యుండె నని నా తలంపు. ఇంతదనుక మహా భారతము నాంధ్రీకరించిన కవిపండితు లెల్లరును దీని నేల ఆంధ్రీకరించ లేదను విషయము నాకు దురూహాముగా నున్నది. రాష్ట్రభేదము ననుసరించి ఆయా గ్రంథము లందుఁ బాఠ భేదము లుండుట యందఱు నెఱిగిన దే.

షడ్భాష్యములును అనువదింపఁ బడిన కారణమున ఆయా తావులందలి పాఠాంతరముల భావము లన్నియును ఆయా తావులందు అనువదింపఁ బడినవి. నేను బొంబాయిలో ముద్రితమైన భారతప్రతి ననుసరించి యనువదించితిని. కావు ననే సనత్సుజాత ధృతరాష్ట్ర సమాగమముగల ప్రథమా ధ్యాయము నా యనువాద గ్రంథమునఁ గలదు. అందుచే నీ

గ్రంథమున ఆరధ్యాయములుగలవు. శ్రీరంగంవాణీవిలాసప్రెస్సు వారు, ఘోరక్‌పూరు, గీతాప్రెస్సువారును బ్రచురించిన శంకరభాష్యసహితములైన ఐదధ్యాయములే గలవు. బొంబాయిలో ముద్రితమైన సనత్సుజాతీయమున ఆరధ్యాయములు, ఆరు భాష్యములు కలవు.

ఇంతటి మహాగ్రంథమును నావంటి యల్పుడు అనువదించుటకు కారణ మేమన? శ్రీ మా నాయనగారు శ్రీకామేశ్వరశాస్త్రిగారును, నాకుఁ బిల్లనిచ్చిన మామగారు శ్రీమొండేకుర్తి వెంకట సత్యానారాయణ శాస్త్రిగారును, నన్నుఁ జేరఁ బిలిచి, "శ్రీ శ్రీనివాస శిరోమణిగారి రామాయణమును జదువవయ్యా! మహాభారతము నట్లు నీవును వ్రాయువయ్యా! ఇహాపర సాధక జ్ఞాన మార్జించు కొనవయ్యా!" అని పదేపదే పురికొల్పి, మహాభారతాంధ్రానువాద రంగమునఁ బ్రవేశపెట్టిరి. వారిరువురును మహాపండితులే. మజ్జనకులు నాతోఁబాటు పెక్కురకు విద్యాదానము గావించిన ఘనులు. జ్ఞానోపదేష్టలు. మా మామగారు జామిగ్రామ మండలి సంస్కృత పాఠశాలలోఁ బ్రధానాధ్యాపకులై వందలాదిగాఁ బండితశిష్యులను దయారుచేసి, దేశము నలుమూలల కంపినవారు. వారియండ దండలు నాకుండగా భయమేల? యను కొంటిని. 18 సం॥కు బూర్వమే విరాటపర్వమును అష్టభాష్య సహితముగా వచన రూపమున నాంధ్రీకరించితిని. ఉద్యోగపర్వమున సనత్సుజాతీయము వరకును బంచభాష్య సహితముగా వచన రూపమున వ్రాసితిని. ఇంతలో మాతల్లిగారు పరమపదించిరి.

మఱికొన్ని నాళ్ళలో బదునొకండేండ్లు ప్రాయముఁగలపుత్రుని, ఆ దినముననే ఒక సోదరిని గోల్పోయి, కష్టములకు గుఱియై భారతాంధ్రీకరణమును వెనుకకు నెట్టితిని. ఇట్లుండగా ౬ సం॥ క్రిందట మాతోటియల్లుఁడు, నవలారచయిత, శ్రీ కె. సాంబశివరావుగారు శ్రీనమక, చమకములకు అర్థతాత్పర్యముల వ్రాసి యిమ్మనగా మొదటి పదునైదు మంత్రములకు 200 పేజీల భాష్యము నాంధ్రమున వ్రాసితిని. పిమ్మట రుద్రనామములకు శివ, విష్ణు బీజాక్షర సంపుట పరముగా మూఁడేసి యర్థములను వ్రాయఁ జొచ్చితిని. ఆపని జరుగుచున్నది. దానిని గాంచి శ్రీ మా పితృపాదులు భారతమున "సనత్సుజాతీయము" నైనఁ బూర్తిచేయరాదా? యని పట్టుబట్టిరి. తత్కారణమున "ఈ సనత్సుజాతీయమును" అనువదింప మొదలిడితిని. నిజమునకు శ్రీసనత్సుజాతీయాంధ్రానువాదము "ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః" అనెడి కాళిదాసనూక్తిలోఁ జెప్పినట్లు ప్రాంశులభ్యమైన ఫలమే నాకుఁ గల జ్ఞానము. అజ్ఞుఁడు సాగరతరణమున కుపయోగించు తెప్పవలె నత్యల్పమే. "గమిష్యా మ్యుప హాస్యతామ్" అను నూక్తిలోఁ జెప్పినట్లు నగుబాటు పాలగుదునేమో యని సంశయించితిని. "అవమానం పురస్కృత్య మానమేవాభి రక్షతాత్" అవమానము ముందిడుకొని మానమును గాపాడుకొనుము. "నసాహస మనారుహ్యా నరోభద్రాణి పశ్యతి" సాహసింపనిదే మానవునకు భద్రములు కలుఁగవు; అనుచు హెచ్చరించు పితృపాదుల వచనములు తరచుగాఁ జెవిని బడినవి. పితృాజ్ఞ,

గుర్వాజ్ఞ అనుల్లంఘనీయములు కదా ! నాకు మాతండ్రిగారే ప్రధానగురువులు. అందుచే వారి యాజ్ఞననుసరించి శ్రీసనత్సుజాతీయమును పద్యాభ్యా సహితముగా అనువదించితిని. శ్రీనమకభాష్యమును, శ్రీసనత్సుజాతీయాంధ్రాను వాదమును శ్రీమానాయనగారు పూర్తిగాఁ జదివిన పిమ్మట పదునైదు దినములలోనే పరమపదవి నందిరి. వారు భౌతికదేహమునుఁ బరిత్యజించుటకు ముందుగా నొకనాఁడు నన్ను జేరదీసి, ఈరెండు గ్రంథములును దప్పక ముద్రితములై వెలుగులోనికి వచ్చునని యాశీర్వదించిరి. వారి యాశీర్వాద మమోఘము.

"లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే
ఋషీణాం పునరాద్యానాం వాచ మర్థో ఽనుధావతి"

అను భవభూతి మహాకవిగారి సూక్తి నిత్యసత్యము. నిజముగా శ్రీ మాతండ్రిగారు లౌకిక సాధువులే. కావుననే వారి వాక్కు అర్థవంతమైనది. వారి స్మారక చిహ్నముగా నీగ్రంథము వ్రాయబడి ముద్రింపబడినది. ఈ నా డీగ్రంథము ముద్రిత మగుట వారి యాశీర్వచనఫలమే. సందియము లేదు. ఈగ్రంథ మీ రూపము నొందుటకు నాప్రాణమిత్రులు శ్రీ. చి. A.L.N. ఆచార్యులుగారు ప్రధానులు.

ఆచార్యులుగారు చక్కని పండితులు, మాత్సర్యహీనులు, కవిపండిత ప్రోత్సాహకారకులు, వారీగ్రంథమును చదివినది

మొదలు, 'అన్నగారూ! ఇది చాల చక్కగా వ్రాయఁబడినది. ఉత్తమ గ్రంథము. ఇంత దనుక ఇది ఆంధ్రమున వెలువడ లేదు. దీని నొక మూల నిడుకొనుట కాదుసుమండీ' ముంద్రించితీరాలి. యని పట్టుబట్టి గ్రంథము నామూలాగ్రము పరిశీలన దృష్టితోఁ జదివి సంస్కరించిరి. శ్రీ ఉపనిషన్మందిర సభ్యుల కీవిషయ మెఱుక పఱచి, వారి కోరికచే, నాచే 888 దినములు శ్రీ సీతా రామస్వామి వారి సన్నిధిన ఉపన్యసింపఁ జేసిరి. తుది దినమునఁ బై సభ్యులచేతను, గ్రామస్థమహాశయులచేతను నాకు జక్కని సన్మానము జేయించిరి. దానితో ముద్రణకార్యక్రమమునకుఁ గడంగితిని. నా ప్రాచీన విద్యార్థుల కీ విషయము తెలిసి వారును ఈ గ్రంథముద్రణకుఁ దగురీతిని ఆర్థిక సహాయము చేయఁ జొచ్చిరి. నే నెంతయు వారిపట్ల ముదంబందుచు వారి నాశీర్వ దించుచుంటిని. గ్రంథ ముద్రణకు ఆర్థికసహాయము గావించిన వారి నామములను గృతజ్ఞతా సూచకముగా గ్రంథాంతమునఁ బ్రకటించితిని.

ఈ సందర్భమున నాకు విద్యాజ్ఞాన జీవనదాతలైన, శ్రీ శ్రీ యానందనాథదీక్షానాములు బ్రహ్మశ్రీ ఈశ్వరసత్యనారా యణ శర్మగారికిని, నా కుద్యోగ జీవనముల నొసంగిన, శ్రీ ఈశ్వర వెంకటసూర్యనారాయణ శర్మగారికిని నా నిత్యాభి వందనము లర్పించుచున్నాను.

నాకు మాతండ్రిగారితోఁబాటు విద్యనొసఁగిన గురువ రేణ్యులు శ్రీపప్పు సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని, శ్రీసామవేదం సూర్యనారాయణశాస్త్రిగారికిని, వ్యాకరణాలంకార శాస్త్రగురువులైన శ్రీ కట్టి శ్రీరామమూర్తి శాస్త్రిగారికిని, నా వేదాధ్యయన గురువులైన ఘనాపాఠీ శ్రీ గంటి సూర్యనారాయణావధానిగారికిని నా యభివందనములు.

ఈ గ్రంథముద్రణకై ధనార్జనలోఁ దోడ్పడిన మిత్రులు చి॥ కె. విశ్వనాథంగారికి (మేనేజర్, మురళీటాకీస్) ని ముఖ్యముగా నీ గ్రంథ ప్రకటనకు నిదానమైన మిత్రులు, సోదర పండితులు నగు చి॥ ఎ. యల్. యన్. ఆచార్యులగారికిని, మఱియు పెద్దలకును, బిన్నలకును, భగవంతుడు చిరాయు రారోగ్యైశ్వర్యాదుల నొసంగి రక్షించుగాక.

కోరినదే తడవుగా నన్నాశీర్వదించి, ప్రోత్సాహ వచనముల ననుగ్రహించిన జగద్గురువులు శ్రీ శృంగేరి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ మదభినవవిద్యాతీర్థస్వామివారికి, జగద్గురువులు శ్రీశ్రీశ్రీ పుష్పగిరి పీఠాధిపతులు శ్రీ మదభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వామివారికిని, సాష్టాంగ నమస్కారముల నర్పించుచున్నాను.

కోరినదే తడవుగా పీఠికను వ్రాసి యొసగిన మహా పండితులు శ్రీ హరిసాంబశివశాస్త్రిగారికిని, చక్కని యభి

ప్రాయము నొసంగి, నన్నాశీర్వదించిన బ్ర. శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారికిని, గురువరేణ్యులు, బ్ర. శ్రీ సామవేదం సూర్యనారాయణశాస్త్రిగారికిని, గురుతుల్యులు, శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారికిని, ఆచార్య బ్ర. శ్రీ దివాకర్ల వేంకటావధానిగారికిని, బ్ర శ్రీ భాగవతుల కుటుంబరావుగారికిని నా నమస్కారములను సమర్పించుచున్నాను.

మఱియు చక్కని యభిప్రాయముల నొసఁగిన నామిత్రులు చి॥ A. L. N. ఆచార్యులగారికిని, చి॥ డాక్టరు ఈశ్వర సీతారామ ధన్వంతరిగారికిని ఇతోధికాభివృద్ధి కల్గుగాక యని యాశీర్వదించు చున్నాను.

ఈ నా గ్రంథముద్రణకు ప్రధాన కారకులైన, శ్రీ A. శ్రీరంగనాయకులుగారికిని, (కమీషనర్) శ్రీ A. విద్యారణ్యులు గారికిని (మేనేజర్), ముద్రణానుకూలముగా వ్రాఁతప్రతులు వ్రాసిన, నా సోదరుఁడు, చి॥ టి. నారాయణమూర్తికిని (B. A. B. Ed.) ఇతోఽధికాభివృద్ధిని జేకూర్చుగావుత మని భగవంతునిఁ బ్రార్థించుచున్నాను.

సాధన గ్రంథమండలి స్థాపించి, ఆధ్యాత్మిక గ్రంథ ప్రకటన ప్రచారమె ప్రధానాశయముతో సుమారు ముప్పది సంవత్సరములుగా ఉత్తమ గ్రంథముల ప్రచురించుచున్న శ్రీఖులును

సూర్యప్రకాశశాస్త్రిగారితో నాగ్రంథమును వారి మండలి తరఫున ప్రచురించవలసినదిగా కోరగా శ్రీ శాస్త్రిగారు సంతోషముతో నంగీకరించి సర్వాంగసుందరముగా గ్రంథమును ముద్రించి ప్రకటించిన శ్రీ శాస్త్రిగారికి నమస్కారములను సమర్పించుచున్నాను.

నా యనువాదమునను, ముద్రణలోను తొరలిన లోపములను తెలియజేసిన మలి ముద్రణమున సవరించుకొన గలనని పాఠకలోకమును సవినయముగా ప్రార్థించుచున్నాను.

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు
M. H. స్కూలు
శ్రీకాకుళము
1—9—74

ఇట్లు
బుధజనవిధేయుఁడు
తెలికిచెర్ల రాజేశ్వరశర్మ
సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ

# ఆ మో ద ము

కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే,
ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమోనమః.

జన్మలలోకెల్ల మానవజన్మ అత్యుత్తమమైనది. చిట్ట చివరదికూడ. అనేక జన్మలలో చేసిన సుకృతఫలముగా నీ మానవజన్మ లభించును. అట్టి మానవజన్మను చరితార్థమును జేసికొనువాడె చరితార్థుడు.

మానవజన్మ సార్థకమగుటకు ఆచరించతగిన సాధనములు ఆయా వర్ణాశ్రమానుగుణముగా అనేకములుగలవు. వానిని గురుముఖతః తెలిసికొని ఆచరించుట శ్రేయోదాయకము.

కర్మ, భక్తి, జ్ఞాన, యోగాదులగురించి, స్త్రీ పురుష, వర్ణాశ్రమములగురించి వేదములలో పురాణేతిహాసములలో విశేషించి చెప్పబడినవి. ఆ విశేషములన్నియు మహాభారతమున శ్రీవేదవ్యాసునిచే వివరించి చెప్పబడినవి. నాలుగువేదముల సారము గలదిగనుకనే భారతము పంచమవేద మనబడెను. వేదములవలెభారతము పరమపవిత్రము, పఠన శ్రవణములవలన భారతము ప్రత్యక్షఫలము నీయగలదని అనూచానముగావచ్చు జనశ్రుతి.

మానవులు నిత్యము మననముచేయుచు ఆచరించతగిన ధర్మములు, కర్మములు బహుళముగా భారతమునగలవు.

అర్జునునకు శ్రీకృష్ణుడు ఉపదేశము చేసిన భగవద్గీత, ధృతరాష్ట్రునకు సనత్సుజాతుడు ఉపదేశము చేసిన సనత్సుజాతీయము మహాభారతములోనివే. కాని భగవద్గీత, సనత్సుజాతీయముల ఉపదేశసన్నివేశములు పాఠకులను ఆశ్చర్యచకితులను జేయును.

మానవుడు, జన్మ కర్తృత్వ భోక్తృత్వములు, పుణ్యాపాపములు, మొదలగువాని యథార్థమును అజ్ఞానముచే దుఃఖసాగరమున మునిగి తనధర్మమును తాను నిర్వర్తింపలేనని కూర్చున్న సమయమున అర్జునునకు శ్రీకృష్ణుడుచేసిన జ్ఞానబోధయె భగవద్గీత.

మానవుడు మానవునిగా సర్వసుఖముల ననుభవించుచు "తాను అనిత్యమని తెలిసియు సుఖభోగములలో మైమఱచి మృత్యుస్వరూపమును మఱచిన" - ధృతరాష్ట్రునకు మృత్యుస్వరూపమును ప్రధానముగా వివరించి సనత్సుజాతుడు చేసిన బోధయే సనత్సుజాతీయము.

అర్జున ధృతరాష్ట్రుల ప్రశ్నలు, వానికి శ్రీకృష్ణ సనత్సుజాతుల సమాధానములు మిక్కిలి ఆశ్చర్యజనకములుగాను, సత్యస్వరూపప్రదర్శకములుగాను జ్ఞానోదయ సమర్థములుగాను ఉండును. ఎంతవినినను మరల వినవలయునను ఆసక్తిని కలిగించుచుండును, శ్రీకృష్ణ సనత్సుజాతుల ఉపదేశములు.

సనత్సుజాతీయమునకు శ్రీశంకరాచార్య నీలకంఠ మొదలగు మహనీయుల భాష్యములారు కలవు. అందు శంకరా

చార్య నీలకంఠుల భాష్యములు సమగ్రములు. తక్కిన భాష్యములు ప్రధానస్థానములలో తమ యభిప్రాయములను వ్యక్తపఱచుచుండును.

శ్రీ శంకరాచార్యులవారు దశోపనిషత్తులకు భాష్యములు వ్రాసి, వానిసారముగా సాధకులకుపయుక్తముగా అనేక ప్రకరణ గ్రంథములు, లఘుభాష్యములువ్రాసిరి. అటులనే సనత్సుజాతీయమునకును భాష్యమువ్రాసిరి - సనత్సుజాతీయమును చక్కగా గురూపదేశముపొంది మృత్యుస్వరూపము తెలిసికొనినచో దాని భయమునుండి సాధకుడు ముక్తుడగును, సందియము లేదు.

ఒకభాషనుండి - మరియొకభాషకు, గ్రంథమును అనువదించుట సామాన్యసాధ్యముగాదు. మూలగ్రంథభాష, అనువదింపబడుభాష - రెంటను, కడుసామర్థ్యము కలిగియుండవలయును. మరియు వేదాంతగ్రంథముల అనువాదమునకు ఇతరగ్రంథ (శాస్త్ర)ముల పరిచయముకూడనుండినగాని అనువాదము రాణించదు.

శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మగారు పండితవంశమునకు చెందినవారు. సంస్కృతాంధ్రములందు చక్కని పాండిత్యము గలవారు సద్గుణసంపన్నులు. చిననాటి నుండియు వేదాంతమున అభిరుచిగలవారు. నేటికిని విద్యాభ్యాసము, భాష్య శ్రవణము చేయుచుందురు. శ్రీ శర్మగారు తమ పితృపాదుల యాదేశానుసారము సనత్సుజాతీయమును-ఆరుభాష్యములతో

అనువదించిరి. ప్రధానఘట్టములందు శ్రుతి, స్మృతి పురాణ ములనుండి అనేక ఉదాహరణముల జూపుచు తమ యభి ప్రాయమును వివరణరూపమున వివరించుట వీరి యనువాద మునకు ఒక ప్రత్యేకత. వీరి యనువాదము సరళముగానున్నది. ఇట్టి ఈగ్రంథమును మామండలిలో ప్రకటించుట కంగీకరించిన శ్రీశర్మగారికి కృతజ్ఞతాభినందనలు.

ఇంకను ఇట్టి గ్రంథములను రచించుశక్తి సామర్థ్యములను ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి శ్రీ శర్మగారిని రక్షించు గాక యని పరమేశ్వరిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

ఆనంద అధికభాద్రపదము బులుసు సూర్యప్రకాశశాస్త్రి

తెనాలి 1974 వ్యవస్థాపకుడు ; సాధన గ్రంథ మండలి

# విషయసూచిక

శ్రీ మాత్రే నమః

## కృతి సమర్పణము

శ్లో॥ హ్రీంరూపా ప్రణవాధారా శక్తిత్రయ విలాసినీ ।
యా భాతి భారతీ లక్ష్మీః పార్వతీతి పృథక్పృథక్ ॥

శ్లో॥ యస్యా ఉచ్ఛ్వాస నిశ్వాసా వేదాకార మవాప్నువన్ ।
యస్యా నేత్రే ప్రకాశేతే చంద్రసూర్య స్వరూపతః ॥

శ్లో॥ భక్తైర్యా పూజ్యతే సంధ్యా గాయత్రీ నామ భేదతః ।
సైవ రాజేశ్వరీ దేవీ భాతి మత్కులదైవతమ్ ॥

శ్లో॥ సనత్సుజాతీయ మముం గ్రంథ మాంధ్రానువాదితం ।
తస్యై సమర్పయే సాపి లభతా త్కృతి నాథతామ్ ॥

శ్లో॥ రాజరాజేశ్వరీ దేవీ మచ్చిత్తే భాసతే సదా ।
రక్షతా దనిశం సామాం మద్వంశం చ ముదాన్వితా ॥

శ్లో॥ యత్ప్రసాదా దహం లక్ష్మీ కాంతా కామేశ్వరాత్మజః ।
ప్రాప్తవా నాయురారోగ్య విద్యోద్యోగాది సంపదమ్ ॥

—అనువాదకుడు.

శ్రీః

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

# శ్రీ సనత్సుజాతీయము

## శ్రీ శంకరాచార్యాదిషడ్భాష్య

# ఆంధ్రానువాదము

### ప్రార్థన

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ శారదా శారదాంభోజ వదనా వదనాంబుజే।
సర్వదా సర్వదాస్మాకం సన్నిధిః సన్నిధింక్రియాత్॥

శ్లో॥ గురవే సర్వలోకానాం, భిషజే భవరోగిణాం।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః॥

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥

శ్లో॥ శుక్లాం బ్రహ్మవిచార సారపర
మాద్యాం జగద్వ్యాపినీం,
వీణా పుస్తక ధారిణీ మభయదాం
జాడ్యాంధకారాపహాం।
హస్తే స్ఫాటిక మాలికాం విదధతీం
పద్మాసనే సంస్థితాం
తాం వందే పరమేశ్వరీం భగవతీం
బుద్ధిప్రదాం శారదామ్॥

శ్లో॥ వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషం ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥

శ్లో॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

శ్లో॥ సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాః ।
అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్ ॥

శ్లో॥ నమః పుంసే పురాణాయ పూర్ణానందాయ విష్ణవే ।
నిరస్త నిఖిలధ్వాన్త తేజసే విశ్వహేతవే ।
నమ ఆచార్యేభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యః॥

శ్లో॥ ధర్మార్థ కామనిర్వాణ ఫలభార మనోహరం ।
సృజతే వాఙ్మయం వృక్షం కానీన మునయే నమః ॥

# శ్రీ సనత్సుజాతీయము

## ప్రథమాధ్యాయము

### :- సనత్సుజాత సమాగమము :-

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ అనుక్తం యది తే కించిత్ వాచా విదుర విద్యతే ।
తన్మే శుశ్రూషతో బ్రూహి విచిత్రాణి హి భాషసే ॥ ౧

తా॥ ధృతరాష్ట్రుడు బ్రహ్మతత్త్వమును గూర్చి విదురునితో నిట్లనెను. విదురుడా ! సాధన సంపత్తియే బ్రహ్మవిద్యాధికారము నొసగు నని చక్కగా నిరూపించితివి. నీ ప్రసంగమున మధ్యమధ్య సంక్షిప్తముగా బ్రహ్మవిద్య సూచింప బడినది. దానిని విన గోరుచున్నాను. నీ వింకను జెప్పని దేమైన ఉన్నచో నీశుశ్రూష చేయు నా కెఱిగింపుము. నీవు మంచి విచిత్రములను జెప్పుచున్నాడవు. అనగా విని, విదురుడు ఇట్లు చెప్పెను.

విదుర ఉవాచ :-

శ్లో॥ ధృతరాష్ట్ర కుమారోవై యః పురాణ స్సనాతనః ।
సనత్సుజాతః ప్రోవాచ మృత్యుర్నాస్తీతి భారత ॥ ౨

శ్లో॥ స తే గుహ్యాన్ ప్రకాశాంశ్చ సర్వాన్ హృదయసంశ్రయాన్,
ప్రవక్ష్యతి మహారాజ ! సర్వబుద్ధిమతాం వరః ॥ ౩

తా॥ ధృతరాష్ట్ర! సనాతనుడును, పురాణపురుషుడును (అగు విష్ణువునుండి జన్మించిన) సనత్సుజాతుడు ఉత్తముడు జనన మరణాత్మక మగు సంసారము లేదనియు, ఎట్టివారి కది యుండదో ఆ సనత్సుజాతునివలన దెలిసికొనదగి యున్నది. సనత్సుజాతుడు బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు. మహారాజా! ఆతడే నీకు గోప్యములైన యోగకళాదులను, ప్రకాశములైన శకునాదులను, హృదయాశ్రయము లైన ధర్మములను జెప్పగలడు. అనగా విని ధృతరాష్ట్రు డిట్లనెను.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ కిం త్వం న వేద తద్భూయో యన్మే బ్రూయాత్
సనాతనః ।
త్వ మేవ విదురబ్రూహి ప్రజ్ఞాశేషోఽస్తి చే త్తవ॥ ౪

తా॥ విదురుడా! నీవు విశేషమైన ప్రజ్ఞ కలవాడవు నీవు ఎఱుగని దేమున్నది? సనాతనుడు నాకు జెప్పువిషయమును నీవే సవిస్తరముగాఁ జెప్పు మనగా విదురుఁ డిట్లనెను.

విదుర ఉవాచ :-

శ్లో॥ శూద్రయోనావహం జాతో
నాతోఽన్య ద్వక్తు ముత్సహే।
కుమారస్య తు యా బుద్ధి
ర్వేద తాం శాశ్వతీ మహమ్ ॥ ౫

శ్లో॥ బ్రాహ్మీం హి యోని మాపన్న
స్సుగుహ్య మపి యో వదేత్ ।
న తేన గర్హ్యో దేవానాం తస్మా దేత ద్బ్రవీమి తే॥ ౬

తా॥ రాజా నేను శూద్రయోనిలో జన్మించితిని. అందుచే బ్రహ్మవిద్యావిషయమును జెప్పుట కుత్సహింపను. సనత్కుమారుని బుద్ధి శాశ్వతమైనదిగానే నెఱుగుదును. బ్రహ్మయోని సంపన్నుడాతడు. అందుచే నాతడు చాల గోప్యమైన బ్రహ్మవిద్యను జెప్పును. ఆతడు దేవతలకును గర్హ్యుడు కాడు. అందుచే నేను నీ కాసంగతి చెప్పితిని. అనగా ధృతరాష్ట్రు డిట్లనెను.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ బ్రవీహి విదుర త్వం మే పురాణం తం సనాతనం ।
కథ మే తే న దేహేన స్యా దిహైవ సమాగమః॥ ౬

తా॥ విదురుడా! మానవదేహముతో నున్న నాకు, సనాతనుడు పురాణపురుషుడు నగు ఆతనితో సమాగమ మెట్లేర్పడును? చెప్పుమా!

శ్లో॥ చింతయామాస విదుర స్త మృషిం శంసిత వ్రతం ।
న చ తచ్చింతితం జ్ఞాత్వా దర్శయామాస భారత ॥ ౭

శ్లో॥ స చైనం ప్రతి జగ్రాహ విధి దృష్టేన కర్మణా ।
సుఖోపవిష్టం విశ్రాంత మథైనం విదురో బ్రవీత్ ॥ ౮

తా॥ భారతా! పంశితప్రజల పొగడ్తల నందిన వ్రతము లన్నీ సనాతనఋుషిలో కలవు. అని విదురు డాతనిని ధ్యానించెను. విదురుని ధ్యాన మెఱిగి ఆ సనత్సుజాతుడు తోడనే దర్శన మొసగెను. వెంటనే విదురుడు ఆ మహర్షికి మధుపర్కాది

షోడశ పూజలొసంగ స్వీకరించెను. పిమ్మట ఆముని శేఖరుడు విశ్రాంతి నొందినవాడై సుఖముగా గూర్చుండి యుండగా జూచి విదురు డాతనితో నిట్లనెను.

శ్లో॥ భగవన్ సంశయః కశ్చిత్ ధృతరాష్ట్రస్య మానసః ।
యో న శక్యం మయావక్తుం త్వ మస్మై వక్తుమర్హసి॥

శ్లో॥ యం శ్రుత్వా యం మనుష్యేంద్ర స్సర్వ
దుఃఖాతిగో భవేత్ ।
లాభాలాభౌ ప్రియద్వేష్యౌ యథైనం న జరాన్తకౌ॥

శ్లో॥ విషహేంతభయామర్షౌ క్షుత్పిపాసే మదోద్భవౌ।
అరతిం చైవ తంద్రించ కామక్రోధౌ క్షయా దయౌ ॥

తా॥ భగవానుడా! ఈ ధృతరాష్ట్రుని మానసమున, సంశయ మొకటి కల్గెను. ఆ సంశయము తీర్ప నాకు శక్యము కాదు. మీరే యాతని సంశయమును దొలగింప సమర్థులు. మీరు చెప్పిన యా విషయమును ఆలకించి, మహారాజు సర్వ దుఃఖములను దాటగలవాడగును. లాభాలాభములను, మిత్రామిత్రులను, జరామరణములను, భయము, అసహనము, ఆకలి, దప్పిక, మదము, మహైశ్వర్యము, అనాసక్తి, నిద్ర, కామము, క్రోధము, నాశము, అభివృద్ధి, వానికి హేతువులైన పుణ్యాపాపములను, సహింపగల్గును.

అని చెప్పిన పిమ్మట వైశంపాయను డిట్లు చెప్పెను.

వివరణ :-

ఇందు విదురుడు, ధృతరాష్ట్రుడు, సనత్సుజాతుడు అను మువ్వురు వ్యక్తులు కలరు. వారు మువ్వురును భారతులే. భా + రతులు = భారతులు. "భా" అను పదమునకు ప్రకాశము, కనబడుట, ఆనందము, జ్యోతీరూపిణియగు జ్ఞానశక్తి అను నర్థములు కలవు. భాయాం రతాః = భారతాః; అను వ్యుత్పత్తి ననుసరించి పై మువ్వురును జ్ఞానశక్తి రతులే యని చెప్పవచ్చును. అంతేకాదు, వారిలో సనత్సుజాతుడు సనాతనుడు కాన జ్ఞానమూర్తియే యని చెప్పవచ్చును. "ఉత్పత్తిం చ వినాశం చ భూతానా మాగతిం గతిం, వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో భగవానితి ॥" అను శ్లోకము ననుసరించి సనత్సుజాతుడు, జగదుత్పత్తి; వినాశములను, భూతముల ఆగమనమును, గతిని, విద్యావిద్యలను చక్కగా నెఱిగిన భగవంతుడనియు దెలిసికొనవలసియున్నది. అంతేకాదు.

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశస శ్శ్రియః ।
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా ॥"

అనుశ్లోకమునం జెప్పిన, సమగ్రైశ్వర్యము, జ్ఞానము, యశస్సు, శ్రీ, ధర్మము, వైరాగ్యము అను నారును గలవాడు కాన సనత్సుజాతుడు భగవంతుడే, స్వయం ప్రకాశమానుడే అని చెప్పవచ్చును. కావున విదురుడు చెప్పినట్లు సనత్సుజాతుడే బ్రహ్మవిద్య నుపదేశింప సమర్థుడు.

విదురుడు :- సాక్షాత్తు యమధర్మరాజే, మాండవ్యుని శాపకారణమున శూద్రయోనిలో జన్మించి విదురుడాయెను.

అయినను ఆతడు జ్ఞానశక్తి సంపన్నుడు కాన, భారతుడే. అంతేకాదు, మహాజ్ఞాని కూడా. అయినను యుగధర్మము ననుస రించి తనకు బ్రహ్మవిద్యా రహస్యోపదేశార్హత లేదనుకొన్న నిరహంకారి.

ధృతరాష్ట్రుడును, భారతుడే. ఎట్లన? విదురుని హిత బోధచే దాత్కాలికముగా చిత్తశుద్ధి యేర్పడిన కారణమున జ్ఞానార్థి యాయెను. నిజమునకాతడు "ప్రమాద మోహౌ తమసో భవతో జ్ఞాన మేవచ" అను గీతాసూక్తిలో జెప్పిన ప్రమాద మోహాజ్ఞానములకు ఆకరుడైన కారణమున దామస పురుషు డని చెప్పవచ్చును కావుననే సనత్సుజాతునిచే బ్రహ్మవిద్యా రహస్యముల నెఱిగినను దామరాకునకు నీరంటు నట్లే ఆతనికిని జ్ఞానము అంట లేదు.

# శ్రీ సనత్సుజాతీయము

## ద్వితీయాధ్యాయము

### మృత్యువుయొక్క సత్యాసత్యముల నిర్ణయము.

వైశంపాయన ఉవాచ :-

శ్లో॥ తతో రాజా ధృతరాష్ట్రో మనీషీ
సంపూజ్య వాక్యం విదురేరితం తత్ ।
సనత్సుజాతం రహితే మహాత్మా
పప్రచ్ఛ బుద్ధిం పరమాం బుభూషన్ ॥ ౧

తా॥ పిమ్మట రాజైన ధృతరాష్ట్రుడు, విదురుని హితబోధచే విద్వాంసుడై, ఆతడు చెప్పిన వాక్యమును బాగుగా ఆదరించి, అంగీకరించెను. తర్వాత, ఆ మహారాజు విదురునిచే నాహ్వానింపబడిన సనత్సుజాతుని రహస్యస్థలమునకు, గొనిపోయి జ్ఞానము పొందదలచి, ఈ క్రిందివిధముగ ప్రశ్నించెను.

పీఠిక: శంకరభాష్యము :- ఇందు మృత్యువు సత్యము అసత్యము మున్నగు వానినిగూర్చి ప్రశ్నించిన ధృతరాష్ట్రునకు సనత్సుజాతుడు చెప్పిన సమాధానములు గలవు.

ఈ యాత్మ అద్వితీయ బ్రహ్మస్వరూపము. అది సచ్చిదానంద రూపము. దాని నాశ్రయించి అవిద్య యుండును. అది యాభాసతో గూడినది. అది స్వానుభవముచే మాత్రమే

తెలియును. అట్టి యవిద్యాయుతమగు ఆత్మ బ్రహ్మపదార్థము నుండి జారినదై, ఆత్మస్వరూపములు కాని దేహాదులలో జేరి, "నేనే ఆత్మను" అను భావము పొందును. అవిద్యా మహిమచే ప్రతి ప్రాణియును పురుషార్థములను బొందలేక, అనేకమైన అనర్థములను బొందును; అవిద్యా కర్మకల్పితములైన, సాధనములచే నిష్టప్రాప్తి ఎట్లు? అనిష్టపరిహార మెట్లు? అని యాకాంక్ష నొందును. లౌకికములు, వైదికములు కార్యములనుష్ఠించియు, 'పరమపురుషార్థమైన మోక్షమును బొందజాలక మకరాదులను బోలిన రాగద్వేషాదులచే నాకర్షింపబడి, సురనర, తిర్యగాది యోనులలోబడి, ఆయారూపముల జన్మించి మోహము నొందును. ఎట్టకేలకు పుణ్యవశముచే వేదమున జెప్పినట్లు ఈశ్వరవిషయకములైన కర్మల నాచరించును. దానిచే రాగద్వేషాది మలమును బోగొట్టుకొనును. బ్రహ్మవేత్తయగు ఆచార్యు నాశ్రయించి, నిత్యానిత్యవివేకము, ఇహాముత్ర ఫలభోగవిరాగము, వేదాంత విజ్ఞానమును బొంది, శమదమాది సాధనసంపత్తి నొంది, గురూపదేశముచే బ్రహ్మపదార్థమును గనుగొనును. అపుడు "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మము అగుచున్నాను; అనెడి అభేద భావము పొందును. అపుడు దానినుండి, అజ్ఞానము, తత్కార్యములును తొలగును. అపుడు జీవుడు బ్రహ్మత్వము పొందును. ఈ విషయమును సనత్సుజాతుడు క్రమముగా ధృతరాష్ట్రునకు దెలియ జెప్ప దొడగెను, అని వైశంపాయనుడు చెప్పెను.

శం. భా. :- శోక, మోహ తప్తుడైన ధృతరాష్ట్రుడు బ్రహ్మవిద్యచే దప్ప, శోకము తొలగదని గ్రహించి నీ

శుశ్రూషచేయు నాకు బ్రహ్మవిద్యా రహస్యములను ఎఱిగింపు మని, విదురుని వేడెను. సర్వజ్ఞుడైనను విదురుడు శూద్ర యోని సంజాతుడైన కారణమున దనకు బ్రహ్మవిద్యోపదే శాధికారము లేదని గ్రహించి, ఛాందోగ్యోపనిషత్తు నందలి కథను స్మరించి, ధృతరాష్ట్రునకు బరమాత్మ జ్ఞాన ముపదే శింపఁ జేయుటకై, భగవానుడైన సనత్సుజాతుని ధ్యానించి యోగబలముచే ఆహ్వానించెను. వెనువెంటనే ప్రత్యక్షమైన సనత్సుజాతుని బూజించి ధృతరాష్ట్రునకు ఆతని బరిచయ మొనర్చి, ఆ మహారాజునకు బ్రహ్మవిద్య నుపదేశింపు డని ప్రార్థించెను.

క్షత్రియుడైనను ధృతరాష్ట్రుడు విదురుని హితబోధ జేసి నిత్యానిత్య వస్తువివేకముగల మనీషి ఆయెను. శాస్త్ర విషయ శ్రవణముచే నాతని బుద్ధి సంస్కరింప బడి బ్రహ్మోప దేశము పొందుట కర్హుడాయెను. అందుచే మహాత్ము డాయెను. సనాతనుడును, హిరణ్యగర్భుడు నగు బ్రహ్మ యొక్క మానస పుత్రుడు సనత్సుజాతుండు జ్ఞానవైరాగ్య సంపన్నుడు ఆతఁడే బ్రహ్మవిద్యను నీ కుపదేశింప గలడు. అని విదురుడు చెప్పిన వాక్యమును జక్కగా నాదరించిన వాడై, ధృతరాష్ట్రుడు "బ్రహ్మవేత్తయే బ్రహ్మ యగును" అని చక్కగా దెలిసికొనెను. అందుచే సనత్సుజాతుని ఏకాంత స్థలము నకు గొనిపోయి, ఆత్మజ్ఞానమును బొందదలచి ఇట్లు ప్రశ్నించెను.

వివరణ :- యోగబలము కలవాడు ఏ జాతికి చెందిన వాడైనను అణిమా ద్యష్టసిద్ధులు కలవాడగును. ఆతడు చేయ లేని పని యుండదు. అందులకు నిదర్శనమే తారాపురాణము. ఈ కోవకు చెందినవారే రామకృష్ణపరమహంస, అరవింద యోగి, మున్నగువారు. అట్టి యోగశక్తి సముపార్జన మున కిట్టి గ్రంథ ములు ఎంతేని యుపయోగపడును. ఎంతటి మహత్తర విషయ ములు పఠించినను. ఆలకించినను ధృతరాష్ట్రుని వలె లోభ మోహ సంపన్నులై రేని, మానవులు నిర్మల చిత్తులు, నిశ్చల చిత్తులును గాలేరు. తరింప జాలరని తెలిసికొని, లోభ మోహ పరిత్యాగమునకు బద్ధకంకణులు కావలె నని గ్రహించ వలసి యున్నది.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ సనత్సుజాత యదిదం శృణోమి<br>
న మృత్యు ర స్తీతి తవ ప్రవాదం ।<br>
దేవా సురాహ్యాచరన్ బ్రహ్మచర్యం<br>
అమృత్యవే తత్ కతరం ను సత్యమ్ ॥

తా॥ సనత్సుజాత! "మృత్యువు లేదని" తమరు శిష్యుల కెఱిగించిన విషయమును కర్ణపరంపరయా ఆలకించితిని. దేవతలును, రాక్షసులును, మృత్యువు లేకుండ జేసికొనుటకై బ్రహ్మచర్య మాచరించినట్లు వింటిని. మృత్యువు కలదు, లేదు, అను వాదములలో ఏది సత్యమో ? ఎఱిగింపుము, అని ధృతరాష్ట్రు డడిగెను.

శం. భా. :- సనత్సుజాతుడా! ఇంద్రుడు, విరోచనుడు అను దేవాసురులు ఇరువురును, మృత్యువు లేకుండ జేసికొనుటకు, అమృతత్వము పొందుటను, ముప్పదిరెండు సంవత్సరములు బ్రహ్మచర్య మొనర్చిరనియు, ఇంద్రుడు అమృతత్వము పొందుటకు వందసంవత్సరములు, ప్రజాపతి చెంత బ్రహ్మచర్య మాచరించె ననియు, ఛాందోగ్యోపనిషత్తు వలన దెలిసికొంటిని.

నీలకంఠభాష్యము:- "న నిరోధో న చోత్పత్తిః" అను వేదముతో కూడ బ్రహ్మచర్య మాచరించువారికి, నిరోధము, ఉత్పత్తి, బంధము మున్నగునవి ఉండవని చెప్పుట విని, ఇంద్రుడు బ్రహ్మచర్యము చేసెనని చెప్పగా వింటిని.

"మృత్యోః పురస్తా దమృతా భవన్తి, యే బ్రాహ్మణా బ్రహ్మచర్యం చరన్తి" అను వేదమంత్రార్థ మెఱిగిన విప్రులు అమృతత్వప్రాప్తికై బ్రహ్మచర్య మొనర్చి రనియు, వింటిని.

సర్వ - భాష్యము:- "అనభ్యాసేన వేదానా మాచారస్య చ వర్జనాత్" అను భృగువచనముచే, వేదము లభ్యసింపని వారిని, బ్రహ్మచర్యవ్రత మాచరింపనివారిని అలసులు అన్న దోష మందినవారు నగు విప్రులను మృత్యువు హింసించునని తెలిసికొంటిని. దేవాసుర హృదయ మెఱిగినవారు, దేవతలు అమృతత్వమునకై అమృతము గ్రోలిరనియు, రాక్షసులును అమృతత్వప్రాప్తికై రుద్రాదులను గూర్చి ఘోరతప మొనర్చిరనియు జెప్పగా వింటిని. కాన పై విషయములచే దేవతలు, రాక్షసులును మృత్యువును బోగొట్టుకొనుటకే

బ్రహ్మచర్య మొనర్చినట్లు స్పష్టమగుచున్నదికదా! దానివలన మృత్యువు కలదని తెలియును. అది లేకున్నచో దేవాదులు ఏల ప్రయత్నింతురు? తమరు తమ శిష్యులకు మృత్యువు లేదని చెప్పినట్లు విదురుడు చెప్పగా వింటిని. "మృత్యువు కలదు, లేదు" అను రెండువాదములలో ఏది సత్యమో తమరు తెలుపవలెరు. అని ధృతరాష్ట్రు డడుగగా సనత్సుజాతు డిట్లు చెప్పెను.

వివరణ :- "మృజ్ - ప్రాణత్యాగే" అనుధాతువు నుండి "మృత్యువు" అను పద మేర్పడెను. దీనిని బట్టి ప్రాణ త్యాగమునకు హేతువులైన వన్నియును మృత్యువులే అని తెలిసికొన వలసియున్నది. "అహింసా సమతా తుష్టిః" మున్నగు గీతాసూక్తులలో జెప్పి అహింసాది గుణములు కల వారు దేవతలు, దేవాంశసపన్నులు; అనియు "ఆఢ్యోఽభిజనవా నస్మి కోన్యోఽస్తి సదృశో మయా" మున్నగు గీతా సూక్తు లలో జెప్పినట్లు ధనవంతుడనని, ఉత్తమకుల సంభూతుడనని భావించుట, గర్వించుట, అహంకారాది దుర్గుణములుగలవారే రాక్షసులు, రాక్షసాంశసంపన్నులు నని తెలిసికొనవలెను. ఏకార్యమందైనను దేవతలకు విజయము, రాక్షసులకు బరా జయము ప్రాప్తించుట వినుచున్నారముకదా! కావున దైవీ సంపద సంపాదించుటకే ప్రతిమానవుడును ప్రయత్నించుట మంచిది. తద్ద్వారా జనన మరణ రూపమృత్యువు తొలగించు కొనవచ్చు నని తెలియుచున్నది. పరమాత్మను దెలిసికొనుట కును, జేరుటకును జేయు ప్రయత్నమే బ్రహ్మచర్యమనియు,

దీనిని నాల్గు ఆశ్రమములకు జెందినవారును ఆచరించుటయే మంచిదనియు దెలియుచున్నది.

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ అమృత్యుః కర్మణా కేచిత్ మృత్యుర్నాస్తీతి చాపరే।
శ్రుణుమే బ్రువతో రాజన్ యథైత న్మావిశంకిథాః ॥ 3

తా :- రాజా ! బ్రహ్మచర్య మనెడి కర్మచే మృత్యువు తొలగునా ? లేక స్వరూపతః మృత్యువే లేదా ? అనియే కదా, ప్రశ్నించితివి. అందులకై నేను జెప్పెడి సమాధానమును ఆలకించితివేని నీకు సందేహము తొలగును. వినుమని సనత్సుజాతుడు చెప్పదొడగెను.

శం. భా. :- రాజా ! కొందఱవిద్యచే నావరింపబడి, యథార్థముగా మృత్యువు కలదని తలంచు చున్నారు. వారు వేదోక్తమైన పుణ్యకర్మను, బ్రహ్మచర్యము నాచరించి, మృత్యువును దొలగించు కొన బ్రయత్నించు చున్నారు. వారు సంసార బంధము సత్యమనియు, దానిని నశింప జేయుటకు గర్మయే ముఖ్యసాధనమనియు, దలంచి కర్మ లాచరించు చున్నారు.

"అపి బృందావనే శూన్యే సృగాలత్వం స ఇచ్ఛతు, సతు నిర్విషయం మోక్షం కదాచి దపి గౌతమ" అని రాగి గీతమున గలదు. గౌతమపక్ష మనుసరించినవారు, మోక్ష మెప్పుడును నిర్విషయము కాదు; సవిషయకమే అని తలంచి, శూన్యమైనను బృందావనమున సృగాలత్వమును గోరు

చున్నారు. అనగా నీచసౌఖ్యమును వాంఛించు చున్నారు. వారు విషయ విషాంధులు. వారి మతమున మోక్షము నిర్విషయము కాదు. అందుచే వారు దేవతలవలె అమరత్వమును, స్వర్గ వాసమును గోరి కర్మ లాచరించుచున్నారు.

అట్లనే మఱికొందఱు పరమాత్మకంటె మృత్యువు కలదని ఎఱిగినవారై, జ్ఞాన కర్మమార్గముల నాశ్రయించి, అమృతత్వమును బొందదలంచు చున్నారు. మఱికొందఱు అద్వితీయమైన ఆత్మజ్ఞాన మెఱిగినవారై, ఆత్మకంటె వ్యతిరేక ముగా ద్వితీయమైన మృత్యువును జూడక, మృత్యువే లేదను చున్నారు. తమకును మృత్యువు లేదనియేకదా బోధించు చున్నారు. కాన అమృతత్వము కర్మసాధ్యమా ? జ్ఞాన సాధ్యమా ? అనియేకదా, రాజా ! నీ సందేహము రెండు పక్షములును బరస్పర విరుద్ధములనికదా ! నీయూహ నా చెప్పిన విషయమును వినుము. శంకించకుము.

వివరణః- ధృతరాష్ట్రుడు సంశయాత్మ "అజ్ఞశ్చా శ్రద్ధ దానశ్చ సంశయాత్మా వినశ్యతి" అను గీతాసూక్తిలో జెప్పిన లక్షణము లన్నియును వానిలో గలవు. అంతే కాదు. వాడు సకాముడేకాని, నిష్కాముడు కాడు. నిష్కామకర్మ మార్గమే సంసార బంధనివారకమని యెఱుగడు. అందుచే విషయ విషాం ధుడై, మృత్యువుయొక్క సత్యాసత్యత్వములను గూర్చి బలువిధముల ప్రశ్నించెను. మోక్షకాములు ధృతరాష్ట్రునివలె మెలగరాదని తెలిసికొనవలెను.

—: మృత్యుస్వరూప నిరూపణము :—

శ్లో॥ ఉభే సత్యే క్షత్రియాఽస్య విద్ధి యాద్యేప్రవృత్తే
మోహాన్మృత్యుస్సమ్మతో ఽయం కవీనాం।
ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి
తథా ప్రమాద మమృతత్వం బ్రవీమి॥ ౪

తా॥ క్షత్రియోత్తమా! మృత్యువు కలదు, లేదు అను రెండువాదములును సత్యములే. మోహము వలననే మృత్యువు కల్గుచున్నదను వాదము కొందఱు కవులకు సమ్మతమైనది. కాని నేను మాత్రము ప్రమాదమునే మృత్యువుగను, అప్రమాదమునే మోక్షముగను జెప్పుచున్నాను.

శం. భా. :- క్షత్రియశ్రేష్ఠా! మృత్యువుకలదు, లేదు అను రెండును సత్యములే. సృష్ట్యాదినుండియు నున్నవే. కొందఱు కవులమతము మోహమే మృత్యువు, మోహమనగా మిథ్యాజ్ఞానము. అది ఆత్మకాని దేహాదులందు ఆత్మ యను అభిమానము కల్గించును. కాని నామతమున మృత్యువు అది కాదు. నామతమున బ్రమాదమే మృత్యువు. స్వాభావికమగు బ్రహ్మభావము నుండి వేరగుటయే ప్రమాదము. ఆత్మ అన నేమో నిశ్చయించుకొన లేని అజ్ఞానమే మిథ్యాజ్ఞానము. పైన జెప్పిన ప్రమాదముచే మిథ్యాజ్ఞానము కల్గుచున్నది. అదియే జననమరణాద్యనర్థముల కెల్ల మూలకారణము. కావున బ్రమాదమే మృత్యువు. అప్రమాదమే అమృతత్వము. అనగా మోక్షము. స్వాభావికమైన బ్రహ్మస్వరూపముగా

నుండుటయే నామతమున అప్రమాదము. ఈ విషయమునే "పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభి నిష్పద్యతే" అను శ్రుతి సూక్తి చెప్పుచున్నది.

శ్లో॥ "ఏకో యజ్ఞో నాస్తి తతో ద్వితీయో,
యో హృచ్ఛయ స్తమహ మనుబ్రవీమి.
యస్మి న్నిష్ఠ్వా, సర్వమిదం గ్రసిత్వా
స్వరూప సంస్థాశ్చ భవ న్తి మర్త్యాః"

అను గీతాపద్యమునను నీ విషయమే స్పష్టముగా జెప్పబడినది. అదేమన? యజ్ఞమనగా విష్ణువు. ఆతండే సర్వ జీవుల హృదయముననున్నాడు. వానికంటె ద్వితీయ మింకొకటి లేదు. ధ్యానాది మార్గముల వానినే సేవించి, తమకర్మజాత మును బోగొట్టుకొని, మర్త్యు లెల్లరు బ్రహ్మస్వరూపమునే పొందుచున్నారు. కావున స్వరూపావస్థాన రూపమగు మోక్షము చతుర్విధ క్రియాఫల విలక్షణము. అది కర్మసాధ్యముకాదు. జ్ఞానసాధ్యము మాత్రమే:

శ్లో॥ కర్మోదయే కర్మఫలానురాగా
స్తత్రానుయాన్తి న తరంతి మృత్యుం।
జ్ఞానేన విద్వాం స్తేజో భ్యేతి నిత్యం
నవిద్యతే హ్యన్యథా, తస్య పంథాః॥

అనుసూక్తిలోఁ జెప్పినట్లు కర్మల నాచరించినవారు, కర్మ ఫలానురక్తులై జననమరణము లందుదురు. మృత్యువును మీర

లేరు. విద్వాంసుఁడు జ్ఞాన మార్గము నాశ్రయించి, నిత్యమైన బ్రహ్మతేజమును బొందును. కావున రాజా? అమృతత్వసిద్ధికి జ్ఞానమే ముఖ్య సాధనమని యెఱుంగుము.

నీ. భా. :- ప్రతిప్రాణికి అవస్థాభేదము ననుసరించి, మృత్యువు అమృతత్వమును సంభవించుచున్నవి. పైరెండును సత్యములే. అవిద్యావస్థలోఁ బ్రాణికిఁ గర్మబంధము కల్గుట సత్యము. విద్యావంతుఁడైన ప్రాణికి బంధము, "రజ్జువునందు సర్పభ్రాంతి" వలెనే ఉండును. నిజమునకుఁ గాలత్రయమందును అవి ఉండవు. మోహముచే భాసించినను అట్టి బంధము జ్ఞానముచేఁ దొలగును. "మృత్యుర్వై తమః" అను శ్రుతిలోఁ జెప్పినట్లు తమస్సేకదా మృత్యువు. "జ్ఞానం సమ్యగవేక్షణమ్." అను స్మృతిలోఁ జెప్పినట్లుండు జ్ఞానమే కదా మోక్షము, కావున నిర్మోహులకు మృత్యువు లేదని ముమ్మాటికిని ఎఱుగుము.

వివరణము :- అర్జునమిశ్రీయాది భాష్యము ననుసరించి చూచినచో మృత్యువు కలదు; లేదు అను రెండు పక్షము లకును వరుసగా (i) ఉపాధి (ii) నైసర్గికము అను వ్యవస్థలు రెండును గారణములు అని తోఁచును. సచ్చిదానంద స్వరూపము ఆత్మ అనునది జ్ఞానము. "దేహమే ఆత్మ" అనెడి విపరీత జ్ఞానమే మోహము. దేహము ఆత్మ అను మతమున దేహనాశముచేఁ గల్గు ఆత్మనాశము ఔపాధికము. అని ఎఱుగుము. బ్రహ్మపదార్థమే ఆత్మ. దానియందు గల ఏకాగ్రతయే అమృతత్వము. అది నైసర్గికము. కావున మోహము ప్రమాదము.

మోహము లేకుండుటయే అప్రమాదము. అదియే అమృతత్వ మునకు గారణము. కావున రెండును సత్యములే అని తెలిసి కొన వలసియున్నది.

శ్లో॥ ప్రమాదా ద్వై అసురాః పరాభవన్
అప్రమాదాత్ బ్రహ్మభూతా స్సురాశ్చ ।
నవై మృత్యు ర్వ్యాఘ్ర ఇవాత్తి జంతూన్
నహ్యస్య రూప ముపలభ్యతే హి॥ ౫

తా॥ రాక్షసులు ప్రమాదము వలననే పరాభవము పొంది మృతులైరి. దేవతలు ఆ ప్రమాదమువలననే బ్రహ్మ భూతులై ముక్తులైరి. పరికింపగా జంతువులను భక్షించు వ్యాఘ్ర మునకువలె మృత్యువునకు రూపమన్నది ఒకటి లేదుకదా!

శం. భా. :– "అనుపలభ్యాత్మానం ... దేవావా, అసు రా స్తే పరాభవిష్యంతి" అను శ్రుత్యర్థమును బరిశీలించినచో ఆత్మకాని దేహమందు ఆత్మభావమును బొంది, బ్రహ్మపదా ర్థమునకు, దూరమగుటయే ప్రమాదమని తెలియును. అట్టి ప్రమాదము పొందియే అసురులైన విరోచనాదులు మృతు లైరి. "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" అను శ్రుతి విషయమును చక్కగా నెఱిగి, ఇంద్రాదులైన సురలు బ్రహ్మజ్ఞానము పొంది, ప్రమాదహీనులై బ్రహ్మస్వరూపులైరి. బహ్వృచ బ్రాహ్మణో పనిషత్తు నందలి" తస్మా న్నప్రమాద్యే త్తన్నాతీయా న్నహ్యా త్యాయ న్పూర్వే యేఽత్యాయం సే పరా బభూవుః ... యూవై తా ఇమాః ప్రజా స్తిస్రోఽ త్యాయ మాయం స్తా

నీమాని వయాంసి నంగావగథా శ్చైరపాదాః" అను మంత్రార్థమును బరిశీలించినచో అసువులందు అనగా ప్రాణములు, ఇంద్రియములు, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అను వానియందు ఆసక్తులై రమించువారే, అసు+ర+లు=అసురులు అని తెలియుచున్నది. వారు అనాత్మవిదులై దేహమునే ఆత్మగా భావించి, పశుపక్ష్యాదుల యోనులను బొందుచుందు రని తెలియుచున్నది. "తం వా ఏతం దేవా ఆత్మాన ముపాసతే, తస్మా చ్చ తేషాం సర్వే చ కామాః" అను శ్రుతిని బరిశీలించినచో, సచ్చిదానంద స్వరూపమగు ఆత్మ నుపాసించి, ఇంద్రాదిసురలు సర్వలోకములను, సర్వకామములను బొంది, విజ్ఞానవంతులై, బ్రహ్మీభూతులై నట్లు తెలియుచున్నది. అంతేకాదు.

శ్లో॥ ఆత్మన్యేవ రతి ర్యేషాం స్వస్మిన్ బ్రహ్మణి చాచవే।
తే సురా ఇతి విఖ్యాతా స్సూరయ శ్చ సురామతాః॥

అను సూక్తిని బరిశీలించినచో "సు" అనగా ఆత్మయందు, బ్రహ్మయందు రతులై రమించుటచే సురలై రనియు, అటులనే విజ్ఞానులైన పండితులును సురలేనని తెలియుచున్నది. వారు బ్రహ్మజ్ఞానముచే శమదమాదులచే విధ్యాజ్ఞానమును దొలగించుకొని బ్రహ్మీభూతులై రనుట స్పష్టము. అజ్ఞాన స్వరూపమైన మృత్యువు జీవులకు, సంసార సంకటమున బడద్రోసి నశింపజేయుచున్నదే కాని, నిజముగ నదు దానికి, జంతువులను భక్షించు వ్యాఘ్రమునకువలె రూపము లేదు రజ్జుసర్ప

భ్రాంతివలె మృత్యువు కలదను భ్రాంతియే కాని, నిజముగా మృత్యువు లేదు. ప్రమాదమునే మృత్యువుగా భావించవలసి యున్నది.

వివరణము :-

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః ।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్ ॥

అనెడి గవా సూక్తిని నిరతము ప్రతిమానవుఁడు మననము చేసికొనుచు నరక ద్వారములును ఆత్మనాశనకరములు నగు కామక్రోధలోభములను దప్పక విడువవలెను. ఆ మూడును జీవులచేఁ దప్పక పనులు చేయించుచుఁ బ్రమాదమునకు గుఱి చేయుచున్నది. ప్రమాదమే మృత్యువు అని పై శ్లోకమునలన దెలియుచున్నదికదా ! కావున ప్రమాద కరములైన పనులను జేయరాదు. ప్రమాదమే నీకుగలతావును బాకువలెను, వస్తువును నీడవలెను, బ్రతిప్రాణిని పీడక యున్నదని తెలిసికొనవలసి యున్నది. ప్రమాదము యొక్క రూపాంతరమే తొందరపాటు. అదియే అవివేకము. అది పరమాపదలకు నిలయము. దాని వలననే మానవుఁడు నశించును. అదియే మానవుల పాలిటి మృత్యువు అవివేకముచేతనే గంగాదేవి గర్వించి ఉన్నతపదము నుండి పాతాళమును జేరినట్లు "ఆకాశంబున నుండి శంభుని శిరం బందుండి శీతాద్రి ... ... పవనాంధోలోకము న్ జేరె, గంగా కూలంకష పెక్కుభంగులు వివేక భ్రష్ట సంపాతముల్" అను సుభాషితపద్యమువలన దెలియు చున్నది. భారవికథయుఁ

బై విషయమునకే కారణము అని గ్రహింపవలెను. "సహసా విదధీత న క్రియా అవివేకః పరమాపదాం పదమ్" అను భారవి సూక్తి తోఁడబాటు, అవివేకము ప్రమాదకరము లని తెల్పుచున్నది. కావున ప్రతిమానవుఁడు ప్రమాదరూప మృత్యువును దొలగించుకొనుటకు జ్ఞానమును దప్పక సంపాదించుకొనవలెను. "మోక్షే ధీ ర్జ్ఞానమ్" అను సూక్తిచే మోక్షము పొందఁ బ్రయత్నించుటకే జ్ఞానమని తెలియుచున్నది. జ్ఞానము చేతనే మానవుఁడు పరమాత్మను జేరును. అని తెలిసికొనవలెను.

—: మృత్యువు వేరు - యముఁడు వేరు :—

శ్లో॥ యమం త్వేకే మృత్యుమతోఽన్యమాహుః
ఆత్మా వా సమమంతం బ్రహ్మచర్యం ।
పితృలోకే రాజ్య మనుశాస్తి దేవః
శివశ్శివా నామ శివోఽశివానామ్॥ ౬

తా॥ సత్యవంతుని కథను ఎఱిగిన కారణమున, కొందరు అజ్ఞానులు యమునే మృత్యువుగాఁ జెప్పుచున్నారు. అది పొఱపాటు. యమునికంటె వేఱుగా మృత్యువుకలదు. అదియే ప్రమాదము. బ్రహ్మజ్ఞానసంపన్నుఁడై యుండుటయే అమృతత్వము. అనగా మోక్షము. అదియే బ్రహ్మచర్యము. పితృలోకమున రాజ్యమేలు దేవుఁడు యముఁడు అతఁడు పుణ్యాత్ములకు శివుఁడుగాను, పాపాత్ములకు అశివుఁడుగాను ఉండును.

శం. భా. :- అయ్యా! మృత్యువు యమరూపమున వచ్చి,

అంగుష్ఠమాత్ర పురుషుని సత్యవంతుని శరీరమునుండి గైకొని పోయెనని, సావిత్రీదేవి చరిత్రవలన దెలియుచున్నదికదా ! మృత్యువునకు రూపమే లేదనుట యెట్లు ? అని యడిగితివేని వినుము. యముడు సాక్షాత్తుగా మృత్యువు కాడు. రూపము లేని మృత్యువునకే ప్రమాదమనియు, అజ్ఞానమనియు నామములు కలవు. "అజ్ఞానమే వినాశహేతువు" అను విషయము తెలియనిచో గొప్ప నష్టము కల్గునని, "న చే దిహా వేదీన్మహతీ వినష్టిః" అను మంత్రము వలన దెలియుచున్నది. "మృత్యోర్మా తమసో జ్యోతి రమృతమ్" అను బృహదారణ్యక మంత్రమున మృత్యువును తమస్సుగాను, అమృతమును అనగా మోక్షమును జ్యోతిస్సుగాను జెప్పెను. తమస్సు అనగా అజ్ఞానము. అదియే మృత్యువు. అదియే సర్వానర్థములకును మూలము. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః" అను గీతాసూక్తిచే అజ్ఞానము జ్ఞానమును ఆవరించి ఆ పైంచి జంతువులను మోహబద్ధులను జేయుచున్నదని తెలియుచున్నది. కావున అజ్ఞానము బంధహేతువు విజ్ఞానము మోక్షహేతువు అని తెలిసికొనవలెను.

"ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా వర్ధతే నో కనీయాన్ తస్యైవ స్యాత్పదవిత్తం విదిత్వా నలిప్యతే కర్మణా పాపకేన" అను శ్రుతిచే ప్రమాదమే మృత్యువు. అప్రమాదమే మోక్షము. ఆ మోక్షము కర్మసాధ్యము, కర్మప్రాప్యముకు గాదని తెలియుచున్నది. జ్ఞానమే మోక్షసాధనమని తెలిసికొనవలసి యున్నది పై విషయమునే "తమేవ

విదిత్వాతిమృత్యుమేతి, నాన్యః పంథా విద్యతే ఽయనాయ" "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" అను మంత్రములు సైతము తెలియఁ జేయుచున్నవి.

"న చక్షుషా గృహ్యతే, నాపి వాచా, నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః" అను మంత్రార్థము నెఱిగితిమేని మోక్షము కన్నులకుఁ గానరాదు. వాక్కులచే వాకొన శక్యము కాదు. జ్ఞానముచే మాత్రమే దానిని విశుద్ధ సత్త్వుఁడు పొందగలఁడు; అని స్పష్టమగును.

:- కర్మలు అవసరమా ? లేదా ? :-

వ్యాసభగవానుఁడును "అంతవన్తః క్షత్రియుతే జయన్తి లోకాన్ జనాః కర్మణా నిర్మితేన" "ఏవం మృత్యుం జాయమానం విదిత్వా జ్ఞానేన తిష్ఠ న్నబిభేతి మృత్యోః" అని పలుచోట్ల జ్ఞానమే మోక్షసాధనమని వివరించి చూపెను. పారదర్శులగు యతులు కర్మను బంధకమనియు, విద్యను విముక్తి సాధన మనియు నెఱిఁగి కర్మ నాచరింపరు. యజ్ఞాది కర్మల కంటె జ్ఞానమునే గొప్పదని యెఱిఁగిరి. అను నీ విషయము మోక్ష ధర్మమునందు గల "కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా న విముచ్యతే తస్మా త్కర్మ నకుర్వన్తి యతయః పారదర్శినః" "జ్ఞానం విశిష్టం న తథా హి యజ్ఞాః, జ్ఞానేన దుర్గం తరతే న యజ్ఞైః" అను సూక్తులచే వెల్లడి యగుచున్నది. వేదాచార్యుడు

డైన మనువు తాను జెప్పిన "యథోక్తాన్యపి కర్మాణి పరిహాప్య ద్విజోత్తమః ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్" అను శ్లోకమున జ్ఞానమే మోక్షసాధనము కాన సర్వకర్మపరిత్యాగము మంచిదని పేర్కొనెను.

శ్లో॥ "జ్ఞానం తు కేవలం సమ్యగపవర్గ ఫలప్రదం ।
తస్మాద్భవద్భిర్విమలం జ్ఞానం కైవల్య సాధనమ్ ॥
విజ్ఞాతవ్యం ప్రయత్నేన శ్రోతవ్యం దృశ్య మేవచ ।
ఏక స్సర్వత్రగో హ్యాత్మా కేవల శ్చితిమాత్రకః ॥
ఆనందో నిర్మలో నిత్య స్స్యా దేత త్సాంఖ్యదర్శనం ॥
ఏతదేవ పరం జ్ఞాన మేతన్మోక్షో ఽనుగాయతే ।
ఏతత్కైవల్య మమలం బ్రహ్మభావశ్చ వర్ణితః ॥
ఆశ్రిత్య తత్ పరం తత్త్వం తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛన్తి మాం మహాత్మానో యతయో వీతమత్సరాః"

అను శ్లోకములందుఁ బరమేశ్వరుఁడు చక్కగా మోక్షతత్త్వమును వివరించెను. కావున ఆర్యా! జ్ఞాన మొక్కటియే మోక్షప్రదము. బాగుగాఁ బ్రయత్నించియైన జ్ఞానమార్గమును స్వయమే తెలిసికొనుట, వినుట, చూచుట మంచిది. ఆత్మ ఏకము. సర్వవ్యాపకము, ఆనందస్వరూపము, నిర్మలము, నిత్యము అని తెలిపెను. జ్ఞానమునే బ్రహ్మభావముగాఁ జెప్పెను. కావున వీతమత్సరులైన యతులు నిష్ఠతోఁ బ్రయత్నించినచోఁ నన్ను దప్పక చేరుదురని పరమేశ్వరుఁడు జెప్పెను. కావున ఈ విషయమును జక్కగా ఎఱుఁగుము.

అనగా విని, అయ్యా! "కర్మలను ఏల అనుష్ఠించవలెను. జ్ఞానులు కర్మలను ఆచరింప నక్కఱలేదుకదా ?"

శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్యకార్యం నవిద్యతే॥

అను గీతానూక్తిలో వాసుదేవుఁడు కూడ ఆత్మరతికల్గి ఆత్మతృప్తుఁడైనవాఁడు కర్మల నాచరింప నక్కరలేదనియే కదా చెప్పెను. బ్రహ్మాండ పురాణమందలి శ్లోకమును,

"కి మధ్య నశ్చాధ్యయనేన కార్యం
కి మర్థవంతశ్చ మఖై ర్యజామః।
ప్రాణం హి వాప్యన లే జోహవీమః
ప్రాణానవే జుహవీమతి వాచమ్"

అను దానిని బఠించినచోఁ బ్రాణమును అనలమందు హోమము చేసిన వారికిఁ అనగాఁ దేజస్స్వరూపుసందే నిమగ్నుఁడైన వానికి అధ్యయనము యజ్ఞము మున్నగునవి ఆచరింప నవసరములేదని చెప్పినట్లు తెలియుచున్నదే ? ఏమందును ? బహ్వృచ బ్రాహ్మణోపనిషత్తుకూడ నీవిషయమునే చెప్పినట్లు "కిమర్థం వయమధ్యేష్యామహే" అని సూక్తిచేఁ దెలియుచున్నదికదా !

"ఏత ద్ధస్మవై తత్పూర్వే విద్వాంసః ప్రజాం న కామయన్తే కిం ప్రజయా కరిష్యామో యేషాంనో ఽయమాత్మాయం లోకఇతితేహాస్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ

లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యంచరన్తి” అను బృహదారణ్యక మంత్రము వలన విద్వాంసులకు కర్మసన్న్యాసము విధించినట్లు తెలియుచున్నది.

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః ।
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్నసతత్త్వవిత్ ॥

అను లింగపురాణ శ్లోకమును, “నైతద్విద్వాన్ ఋషిణా విధేయేన మన్యతే విధినా శబ్దకారః” అను అథర్వణ మంత్రమును బరిశీలించినచో జ్ఞానికి కర్మాచరణము యొక్క అవసరము లేనట్లే తెలియుచున్నది.

శ్లో॥ లోకే ఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్
ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥

అను గీతాసూక్తులు సైతము ఆరురుక్షువైన అజ్ఞానికే కర్మాచరణము ముఖ్యము జ్ఞానికిఁ గర్మాచరణ మనవసరమనియే చెప్పుచున్నవికదా ?

శ్లో॥ ద్వా విమా వథపంథానౌ యత్ర వేదాః ప్రతిష్ఠితాః ।
ప్రవృత్తి లక్షణో ధర్మో నివృత్తౌ చ వ్యవస్థితః॥

అను వేదవ్యాస సూక్తియు నివృత్తి ధర్మనిరూపణ సందర్భమునఁ బై విషయమునే నిరూపించెను. అయ్యా ! అంతే కాదు. “కర్మణా బధ్యతే జంతుర్విద్యయా చ విముచ్యతే” అను

సూక్తిచే ఆరురుక్షువుకూడ బంధహేతువులైన కారణమున గర్మలను ఆచరింప నవసరము లేనట్లు తెలియుచున్నదే? ఏమందురు? సత్యమే. కాని నిష్కాముఁడై ఈశ్వరార్పణముగాఁ గర్మల నాచరింప వచ్చును. అవి సంసారబంధ హేతువులు కావు అను విషయము.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణో ఽన్యత్ర లోకో ఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ ముక్త సంగ స్సమాచర॥

అను గీతా సూక్తిచే వ్యక్తమగుచున్నది. కావున గర్మలను బూర్ణముగా విడువరాదు. ఆత్మశుద్ధికై యోగులు కర్మలను ఆచరించుచున్నారు. అది, విజ్ఞానులను బవిత్రము చేయును; అను విషయము.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి।
యోగినః కర్మకుర్వన్తి సంగం త్యక్త్వాత్మశుద్ధయే॥
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్"
"గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః।
యజ్ఞాయా చరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥
కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమాగతిః
కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే॥

అనెడి గీతా సూక్తులు మున్నగు వాని వలన దెలియుచున్నది. ఫలాపేక్షవిడిచి, ఈశ్వరార్పణముగాఁ గర్మల నాచ

రించుట మంచిది. అంతేకాదు. "కర్మలు మోక్షహేతువులు" అను విషయము కూడ -

"విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయం సహ కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః" అను సూక్తుల వలన దెలియుచున్నది. ఆ విషయమునే మనువు "తపో విద్యాచ విప్రస్య నిశ్శ్రేయస కరేఉభే" అను సూక్తిచే స్పష్టపఱచినాఁడు. కావున మోక్షార్థి తపస్సు మున్నగు కర్మలను ఆచరింపవలెననియే కదా తెలియుచున్నది.

అయ్యా! నిజమే కాని ఈ విషయమున బూర్వాపరములను జక్కఁగా అనుసంధించుకోలేక, భ్రమపడుచున్నారు. కావున ఇది పూర్తిగా సరిపడదు. కారణమేమన? కర్మ జ్ఞానములు రెండును భిన్నవిషయములు. సముచ్చయముగా విధింపబడినవి కావు అను ఈవిషయము "విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయంసహ" అని చెప్పిన పిమ్మట చేర్కొనిన "అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా మృతమశ్నుతే" అను శ్రుతిచేఁ దేటతెల్లమగుచున్నది. అనగా నవిద్యచే మృత్యువును విద్యచే అమృతత్వమును బ్రాప్తించుచున్నవని దెలిసికొనవలసియున్నది. ఈ విషయమునే "తపసా కల్మషం హన్తి విద్యయామృతమశ్నుతే" అను సూక్తిచే మనువు స్పష్టపఱచెను. కావున తపస్సు అనఁగా కర్మ, నిత్యము, నైమిత్తికము అని ద్వివిధమై అన్తఃకరణ శుద్ధికి వినియోగపడునని, యెఱుగవలెను. ఈ విషయమే ఈశావాస్యోపనిషత్తులో స్పష్టముగా నిరూపింపఁబడెను. ఎట్లన? "ఈశావాస్య మిదంసర్వం" అని తొలుత

సామాన్యముగాఁ జెప్పి, "తేన త్యక్తేన భుంజీథాః" అని మఱల ప్రత్యేకముగాఁ ద్యాగబుద్ధితోఁ, గర్మల నాచరించి తరించవలె నని చెప్పెను. ఇది ఆత్మవాదులకే జ్ఞానులకే చెల్లును. అతదాత్మ వేదులకెట్లు ? అని శంకించి వారు తరించు నుపాయమును, "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః" అను మంత్రమున స్పష్టముగాఁ జేర్కొనెను. అయ్యా ! మీవంటి వారు అతదాత్మవిదులు పరమాత్రాభిమానముగల అజ్ఞులు. అట్టివారు అవిద్యచే నాచరించిన ఉత్తరపూర్వ పాపములు, ఒక్కసారిగా నశింపవు. కర్మనాశము కానిదే జ్ఞాన ముదయిం పదు. అందుచే వారు ముక్తిఁబొంద జాలరు. అట్టివారు సైతము శుద్ధులై తరించుటకు యావజ్జీవము కర్మలనాచరించి తీరవలెను. అని ఈశావాస్యమున స్పష్టముగాఁ జేర్కొనెను.

-: కర్మలు మనఃపరిశుద్ధి కారణములు :-

పై విషయమును బరిశీలించినచో గర్మలు మనఃపరిశుద్ధిచే కూర్చుటకు సాధనములు కాని, మోక్షసాధనములు కావని తెలియుచున్నదే ? ఎట్లందురేని ? వినుఁడు. శ్రుతి విసియో గము ననుసరించి, "బ్రహ్మవేత్త పుణ్యకర్త తైజసుఁడు" అను భేదములు కనబడుచున్నను గర్మలు మనఃపరిశుద్ధిని జేయుట ద్వారా మోక్షసాధనములగునని తెలిసి కొనవలెను. ఈ విష యము "అనుగీతాసూక్తుల" చే స్పష్టమగు చున్నది. ఎట్లన ?

శ్లో॥ "నిత్యనైమిత్తికైః శుద్ధైః ఫలసంగ వివర్జితైః।
సత్త్వశుద్ధి మవాప్యాథ యోగారూఢో భవిష్యతి॥
యోగారూఢ స్తతో యాతి తద్విష్ణోః పరమం పదం।
గురుభక్త్యాచ ధృత్యాచ ధర్మభక్త్యా శ్రుతేనచ।
విష్ణుభక్త్యా చ సతతం జ్ఞాన ముత్పద్యతే మలం।
తస్మా ద్ధర్మ పరో భూత్వా వేదా స్తిక్య సమన్వితః॥
కుర్వన్ త్తైనిత్యకర్మాణి యథాశక్తి సబుద్ధిమాన్।
ఫలాని పరతస్సాప్య వాసుదేవే పరాత్మని।
శుద్ధసత్త్వో భవత్యేవ యోగారూఢ శ్చ జాయతే॥

కర్మలు నిత్యములు, నైమిత్తికములని రెండు విధములు. ఆ రెండింటిని ఫలాపేక్ష లేకుండ ఆచరించినచో సత్త్వశుద్ధి యేర్పడును. సత్త్వమనగా జీవితము. సత్త్వమనగా మతి. (చిత్తమన్నమాట), అందుచేఁ జిత్తశుద్ధిగల యోగారూఢునకే విష్ణుపదము ప్రాప్తించును. గురుభక్తిచేగాని, ధైర్యముచేగాని, ధర్మభక్తిచేగాని, వేదాభ్యాసముచేగాని, విష్ణు భక్తిచేగాని, నిర్మలజ్ఞానము కల్గును. కావున వేదాస్తిక్య బుద్ధితో ధర్మపరుఁడై యథాశక్తి నిత్యకర్మల నాచరించినవాఁడే బుద్ధిమంతుఁడు. అతఁడే వాసుదేవునిపై నిష్ఠనిల్పి, సత్త్వశుద్ధుఁడు, యోగారూఢుఁడును అగును. సనత్సుజాతుఁడును గర్మలకు జిత్తశుద్ధి ద్వారా మోక్షసాధనత్వమును.

"తదర్థ ముక్తం తపసైన కర్మణా
తాభ్యా మనో పుణ్యా ముపైతి విద్వాన్।

పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్
స జాయతే జ్ఞానవిదీపితాత్మా
జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వాన్॥

అను శ్లోకరూపమున వివరించెను. అదేమన ? తపః కర్మచేఁ బుణ్యమును బొందును. పుణ్యముచేఁ బాపమును బోఁగొట్టుకొని, తర్వాత జ్ఞానవంతుఁ డగును. పిమ్మట జ్ఞానము ద్వారా, ముక్తిని బొందును. ఆ౧. అయ్యా ! సూటిగా జ్ఞానముచేతనే మోక్షము కల్గుచుండగా, జ్ఞానమునకు సత్త్వశుద్ధిని ద్వారముగా జెప్పనేల ? అని శంకింపఁ బనిలేదు. కారణ మేమన ? సత్త్వశుద్ధిలేనిదే జ్ఞానమెవ్వరికిని గలుగదుగదా ?

శ్లో॥ "జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః ।
నాక్షీణే జాయతే పుంసాం గోవిందాభిముఖీ మతిః ॥
జన్మాంతర సహస్రేషు తపో ధ్యాన సమాధిభిః ।
నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే ॥

అను సూక్తులు కూడ, సహస్రముల కొలది జన్మలలో లభించిన పాపము, తపోధ్యాన సమాధులచే నశించినపిమ్మటనే నరులకుఁ కృష్ణభక్తి గల్గును. పిమ్మట మోక్షము లభించును; అని చెప్పుచున్నవి. ఈ విషయమే గీతలో సైతము —

శ్లో॥ "అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాంగతిం ।
తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః ॥
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ।

స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ॥
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ।
యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతం ।
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥

అను శ్లోకములలో వివరింపబడెను. ఎట్లన ? లోకమున తపస్వులకంటెను, జ్ఞానులకంటెను, కర్మిష్ఠులకంటెను యోగి గొప్పవాడు. కావున అర్జునా ! యోగివి కమ్ము. స్వకర్మ నిరతుఁడైన మానవుడు సిద్ధిని బొందును. అనేక జన్మలలో సిద్ధిపొందినవాడే ఉత్తమ గతిని బొందును. అట్టి సిద్ధి నరునకుఁ గర్మాచరణముచేతనే కల్గును. సర్వభూతములకును ప్రవృత్తి కల్గించిన పరబ్రహ్మయే అంతటను వ్యాపించియున్నాఁడు. అట్టి పరమపురుషుని, దమకర్మమార్గముద్వారా పూజించి, నరుఁడు సిద్ధిని బొందును. అట్టి సంసిద్ధునకే ఉత్తమగతి ప్రాప్తించును. కానఁ బ్రతిమానవుఁడు తమతమ కర్మలను వీడరాదు. అని భగవంతుఁడు కర్మలకుఁ గల ప్రాధాన్యమును గీతలోఁ జక్కఁగా నిరూపించెను.

ఈ విషయమునే యాజ్ఞవల్క్యుఁడును, "తథావిపక్వ కరణ ఆత్మజ్ఞానస్య నక్షమః" అను సూక్తిమూలమునఁ గర్మల నాచరించి, చిత్తము పరిపక్వదశ పొందనిదే ఆత్మజ్ఞానము కల్గదు, అని వివరించెను. అందువలన మోక్షసాధనమైన జ్ఞానము పొందుటకు, నిత్యానిత్య వివేకము ద్వారము. అది యును అనగా మోక్షము, విశుద్ధసత్త్వునకే కాని ఇతరులకు

లభింపదు. కావున సత్త్వశుద్ధి కొఱకు సర్వేశ్వరు నుద్దేశించి, వాఙ్మనః కాయములతో శ్రౌతస్మార్త కర్మల నన్నిటిని, ఆచరించవలెను. ఇహాముత్రఫలభోగ విరాగుఁడైన యోగారూఢుఁడే విశుద్ధసత్త్వుఁ = డగును. ఈ విషయమునే భగవంతుఁడు గీతలో

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
సన్న్యాస స్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః॥

అను సూక్తులలో నిరూపించెను. అనగా మోక్షకాముఁడైన ముని తొలుత కర్మయోగియై సన్న్యాసము పొంది, పిమ్మట ముక్తుఁ డగును అని. ఇంద్రియార్థములందుఁగాని, కర్మలందుఁగాని, అనురాగము చూపరాదు. సర్వసంకల్పములను వీడవలెను. అట్టివాఁడే యోగారూఢుఁడగును. ఇది యోగారూఢుని లక్షణము.

శ్లో॥ యదా హి నేంద్రియార్థేషు నకర్మ స్వనుషజ్జతే ।
సర్వసంకల్ప సన్న్యాస యోగారూఢ స్తథోచ్యతే॥ -గీత.

యజ్ఞదానాది కర్మలచే విశుద్ధసత్త్వుఁడైనను, ఇహాముత్ర ఫలభోగ విరాగుఁడైనను, యోగారూఢునకు, శమమే కారణముకాని, కర్మమాత్రము కారణము కాదు. అను విషయము పైతము, గీతలో "యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే" అను శ్లోకమునఁ జెప్పఁబడెను. కావున యోగారూఢుఁడు, శమదమాది సంపన్నుఁడై, శ్రవణ మననా

గుంతోఁ గూడినవాఁడై, రహస్య ప్రదేశమున నున్నవాఁడై, సతతము ఆత్మానుసంధానము చేసికొనవలెను. అట్టి వాఁడు నిరాశియై, యతచిత్తుఁడై, యతాత్ముఁడై, పరిగ్రహముల నెల్ల విడిచినవాఁడై, యుండవలెను. పై విషయము గీతలో నిట్లు చెప్పబడెను.

"యోగీ యుంజీత సతత మాత్మానం రహసిస్థితః ।
నిరాశీ ర్యత చిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః ॥"

## —: యోగానుష్ఠాన విధానము :—

కావున యోగారూఢునకుఁ జెందిన యోగానుష్ఠానమును గూర్చి చెప్పుచున్నాను వినుము. యోగాభ్యాసమునకు వలయు దేశము, నిమ్నోన్నతముకాక, సమముగా శుచిగా నుండవలెను. అందు శిలలు, అగ్ని, ఇసుక, సరస్సు, ధ్వనులు, మున్నగునవి యుండరాదు. అట్టి నేలపై స్థిరమైన ఆసనము నమర్చవలెను. ఆ యాసనము ఎత్తుగా గాని, లోతుగా గాని ఉండరాదు. తొలుత దర్భాసనము, దానిపైఁ జర్మాసనము, దానిపై వస్త్రాసనమును ఉండవలెను. అట్టి యాసనముపై యోగి స్వస్తికాసనమునో, పద్మాసనమునో దాల్చవలెను. శరీరము, గ్రీవము, శిరస్సు సమముగా (తిన్నగా) నుంచుకొనవలెను. పూర్ణాత్ముఁడైన భగవంతుఁడు కార్యకారణ వినిర్ముక్తుఁడు. వానియందు దివిశ్వాదులుగలవని భావించి, తానును సింహాసనంబున నుండి, దైవమును ధ్యానించవలెను. దైవమనఁ బరమాత్మ. ఆతఁడే నవద్వారమో (లేక) ఏకాదశద్వారమో

యగు దేహమున ఆత్మస్వరూపుఁడై కలఁడు. ఆతఁడు నిరంజనుఁడు పూర్ణానందస్వరూపుఁడు. పూర్వాపరములు లేనిది బ్రహ్మ పదార్థము. అశనాయాపిపాసాదులు దానికి లేవు. ఉదయాస్త మయములతో దానికి సంబంధము లేదు. అది కేవలము జ్ఞాన స్వరూపము. నేతి, నేతి, లక్షణము, అనగాఁ కరచరణాదులలో ఒక్కొక్కటియు నేను గాదు, నేను గాదు, అని తర్కించుకొని తెలిసికొనదగినది. అట్టి బ్రహ్మపదార్థమే "ఓం"కార మని గ్రహింపవలెను.

## —: బ్రహ్మజ్ఞాన ప్రయోజనములు :—

బ్రహ్మాండ పురాణమందలి కానవేయగీతలోఁ గల-

శ్లో॥ "తస్మాద్విమోక్షాయ కురు ప్రయత్నం
దుఃఖాద్విముక్తో భవితాసి యేన।
ఓం బ్రహ్మ, శూన్యం పరమం ప్రధాన
మానంద మాత్రం ప్రణవం తమస్య" ॥

ఈ శ్లోకమున స్పష్టముగా బ్రహ్మస్వరూపము పేర్కొనఁ బడెను. ఏమన! ఓంకారమే (ప్రణవమే) బ్రహ్మపదార్థము. అది శూన్యము పరమప్రధానము. ఆనందస్వరూపము. దానిని జక్కగాఁ దెలిసికొనినచో మోక్షము కల్గును దుఃఖనాశము జరుగును.

ఈ ప్రకారముగ నిరంతరము తనను (ఆత్మను) పర మాత్మగ భావించు మానవుఁడు, అజ్ఞానమును, అజ్ఞానకార్య

జాతమును, భోగ్యాఁకాని, వీతశోకుఁ డగును. కృతకృత్యుఁ డగును. బృహదారణ్యకమునగూడ-

శ్లో॥ ఆత్మానం చే ద్విజానీయా దయమస్మీతి పూరుషః।
కి మిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్ ॥

అను మంత్రమునఁ జెప్పఁబడెను. "అయమస్మి" ఈ పరబ్రహ్మయే నేను, అని పురుషుఁ డాత్మవస్తువు నెఱిగెనేని, వానికి శరీరమును స్వీకరించు కష్టమే యుండదు. అని మఱియు ఈశావాస్యములోగూడ-

శ్లో॥ "యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూ ద్విజానతః।
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః ॥

ఈ మంత్రమున సర్వభూతములును ఆత్మయే యని ఎఱిగినవానికి, భిన్నత్వమున ఏకత్వమును గ్రహించిన వానికి, శోక, మోహము లుండవని జెప్పఁబడెను. అటులనే కఠోపనిషత్తులోగూడ-

శ్లో॥ తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠంపురాణం।
అధ్యాత్మ యోగాధిగమేన దేవం
మత్వాధీరో హర్ష శోకౌ జహాతి।
నిచాయ్యతం మృత్యుముఖాత్ ప్రముచ్యతే ॥"

ఈ మంత్రములందు దేవుఁడు చూడ శక్యముకానివాఁడు. గూఢముగా లో నిమిడియున్నాఁడు. గుహాలందును, గహ్వరము

లందు నున్నవాఁడు. పురాణపురుషుఁడు. అని యోగశక్తితో ఆత్మతో ధ్యానించి, తెలిసికొన్న ధీరుఁడు హర్ష శోకములను విడుచును. అపుడు ఆత్మస్వరూపమును, ఎఱిగి మృత్యుముఖము నుండి విముక్తుఁ డగును. అని చెప్పఁబడెను.

"ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కుతశ్చన" అని ఉపనిష న్మంత్రమున, బ్రహ్మయొక్క ఆనందస్వరూపమును గుర్తించినవాఁడు దేనివలనను భయపడఁడని చెప్పఁబడెను.

శ్లో॥ "భిద్యతే హృదయగ్రంధి శ్ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

ఈ మంత్రమునఁ బరావరుఁడైన పరమాత్మ నెఱిగి నచో ఆతని హృదయగ్రంథి, భేదింపఁబడు ననియు, ఆతని సంశయము లెల్ల ఛేదింపఁబడు ననియు, ఆతని కర్మలన్నియును క్షీణించుననియుఁ జెప్పఁబడెను.

"అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽ యముచ్యతే।
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥
ఏతద్బుధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్య శ్చ భారత"

అని గీతలో సైతము, బ్రహ్మస్వరూపము, అవ్యక్తము అచింత్యము దానికి సద్భావ వికారము లుండవు అట్టి తత్వము నెఱిగిన వాఁడు దుఃఖింపఁడు. భారత దాని నెఱిగినవాఁడే, బుద్ధి మంతుఁడై కృతకృత్యుఁ డగును; అని చెప్పఁబడెను.

శ్లో॥ "ఆత్మన శ్శోక సంతీర్ణో నబిభేతి కుతశ్చన ।
మృత్యో స్సకాశాన్మరణా దథవాన్యైః కృతాద్భయాత్ ॥
న జాయతే న మ్రియతే న వధ్యో న చ ఘాతకః ।
న బద్ధో బద్ధకారీవా న ముక్తో న చ మోక్షదః ॥
పురుషః పరమాత్మాయం యత్తతోఽన్య దసచ్చతత్ ।
అజ్ఞాన పాశే నిర్భిన్నే ఛిన్నే మహతి సంశయే ॥
శుభాశుభేచ సంక్షీణే దగ్ధే బీజే చ జన్మనాం ।
ప్రయాతి పరమానందం తద్విష్ణోః పరమం పదమ్ ॥

అను శావపేయ సూక్తులను బరిశీలించినచో ఆత్మజ్ఞాన సంపన్నుఁడు శోకసంతీర్ణుఁడై దేనివలనను భయపడఁడు. మృత్యువుచెంత నున్నను జ్ఞానియైన కారణమున మరణమువలన భీతి చెందఁడు, అన్యకృతమైన భయ మాతని కసలే లేదన్న మాట.

జ్ఞానికి జననమరణములు లేవు. జ్ఞాని యెన్నఁడును ఘాతకుఁడు కాఁడు. అందుచే నాతఁ డెవ్వఁడును వధ్యుఁడును కాఁడు. జ్ఞాని తాను బద్ధుఁడు కానందున లోకులను బద్ధులనుగాఁ జేయఁడు. అందుచే నెట్లు బంధవిముక్తుఁడగు నను ప్రశ్నయే వానిపట్ల యుదయింపదు. బ్రహ్మతో లీనుఁడైన కారణమున మఱల విముక్తుఁ డగుట, పరులకు మోక్ష మొసఁగుట అనునవి, వానికి లేనే లేవు. పరమపురుషుఁడే పరమాత్మ ఆతనికంటె భిన్నమైన దంతయు, అసత్తు (అశాశ్వతము), అనఁబడును. మానవునకుఁ గల యజ్ఞాన పాశము పూర్ణముగా భిన్నమైనచో (నశించినచో) వానికిఁ గల మహాసంశయము, ఛేదింపఁ బడినచో

శుభాశుభములు, సంకీర్ణములై నశించినచో, వానిజన్మములకుఁ గల కర్మఫలము (మూలము) పూర్ణముగా దగ్ధమగును. అపుడు మానవుఁడు మహాజ్ఞానియై పరమానందమును బొంది తీరును. విష్ణువుయొక్క పరమపదమును దప్పక పొందును. అని కావషేయ గీతలలో జక్కఁగాఁ జెప్పఁబడెను.

శ్లో॥ "సర్వేషా మపిచై తే షా మాత్మజ్ఞానం పరంస్మృతం ।
తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతే హ్యమృతం తతః ॥
ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః ।
ప్రాప్యైతత్ కృతకృత్యోహి ద్విజో భవతి నాన్యథా ॥

అని భగవంతుఁడైన మనువు చెప్పిన సూక్తులను బరిశీలించినచో ఈ జీవులందఱకును ఆత్మజ్ఞానమే గొప్పది. ముఖ్యమైనది విద్యలన్నిటిలో బ్రహ్మవిద్యయే గొప్పది. ఈ విషయ మెఱిగినచోఁ దప్పక అమృతము (మోక్షము) ప్రాప్తించును. బ్రహ్మజ్ఞానముగల బ్రాహ్మణుని జన్మ విశేషించి అప్పుడే సఫలమగును. ఇట్టి బ్రహ్మజ్ఞానము పొందినప్పుడే ద్విజుఁడు కృతకృత్యుఁ డగును. ఇంకొక విధముగాఁ గాఁ జేరఁడని దెలియు చున్నది.

విజ్ఞానమువలననే పరమపురుషార్థము ప్రాప్తించును. అందువలన ఆ పరమాత్మను బూర్ణానందస్వరూపునిగా ఆత్మగాఁ దెలిసికొనవలెను. "అహమస్మి" నే నున్నాను. అని అహంకార బుద్ధితో నేనాత్మను ఇతరమును జింతింపరాదు. పై విషయము నే—

"తమేవధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః ।
నానుధ్యాయేత్ బహూన్ శబ్దాన్ వాచోవిగ్లాపనంహితత్ ।
త మేవైకం జానథాత్మాన మన్యావాచో విముంచథ ।
ఏత జ్జ్ఞేయం నిత్యమేవాత్మ సంస్థం నాతః పరవేదితవ్యం హి
కించిత్ ॥

అని కొన్ని మంత్రములు తెలియఁ జెప్పుచున్నవి. ధీరుఁడైన బ్రాహ్మణుఁడు ఆ బ్రహ్మతత్వమునే, తెలిసికొని, దానిని గూర్చియే తన ప్రజ్ఞను, వినియోగించవలెను. ఇతర శబ్దములను. ధ్యానించినను, అది మాటలపేర్పే అగును. ఆ బ్రహ్మవస్తువునే ముఖ్యమైనదిగాఁ దెలిసికొనుము. ఇతర వాక్కులను విడనాడుము. అందఱి యాత్మలలో నున్నది ఈ పరబ్రహ్మతత్వమే. దానినే నిత్యవస్తువుగా ఎఱుంగుము. అంతకంటె తెలిసికొనఁదగు వస్తువే లేదని యెఱుగుము. ఇదియే పై మంత్రములందలి విషయము.

శ్లో॥ "సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వా న శేషతః ।
మనసైవేంద్రియ గ్రామం వినియమ్య సమం తతః ।
శనై శ్శనై రుపరమే ద్బుధ్యా ధృతి గృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్ ॥"

అను గీతా సూక్తులను బరిశీలించినచో గోరికలున్నా, సంకల్పముల వలననే కల్గును. వానినెల్ల సంపూర్ణముగా విడువవలెను. ఇంద్రియముల నన్నింటిని వశీకృతమైన మనస్సుతో నరికట్టి, మెలమెల్లగా ధైర్యము నొందిన బుద్ధితోఁ గోరికల

నుండి వానిని దొలగింపవలెను. పిమ్మట యింద్రియములను, మనస్సును ఆత్మయందే నిల్పవలెను. ఇతరములను ఏ మాత్రము చింతింపరాదు. అని తెలియుచున్నది. ఈ విధముగా మృత్యువు, జ్ఞానము, కర్మ, బ్రహ్మవస్తువు మున్నగు విషయములను, ఆయా మంత్రముల ద్వారా, చక్కగా దెలిసికొని మఱల ప్రకృతమును, మృత్యువును గూర్చి, సవివరముగా దెలిసికొనుము. ఎట్లన ?

—: మృత్యుస్వరూప ప్రకటనము :—

సర్వానర్థములకు బీజమైన ప్రమాదమే నామతమున మృత్యువు. కాని యముడు మృత్యువు కాడు. విషయ విషాంధులును, అవిద్యారూఢులు నగు కొందఱు యముని మృత్యువుగా చెప్పుచున్నారు. యముడు దెచ్చుటనో లేడు. మన ఆత్మలోనే, మన బుద్ధియందే గలడు.

శ్లో॥ "యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః ।
తేన చేదవివాదస్తే మా గంగాం మా కురూన్ గమః ॥"

అను మను వచనము కూడ వైవస్వతుడైన యముడు మానవ హృదయమందే కలడని చెప్పుచున్నది. అమృతమనగా బ్రహ్మచర్యము. అనగా బ్రహ్మజ్ఞాన సంపన్నుడై యుండుట అమృత మన్నమాట.

"కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతు మర్హతి"
అను కఠవల్లీ సూక్తి పై విషయమునే దృఢపఱచు

చున్నది. దేవుఁడైన యముఁడు పితృలోకమం దుండి, పుణ్య కర్మ లాచరించువారికి సుఖప్రదుఁడైన శివుఁడుగా నుండి, పాప కర్ములకు అసుఖప్రదుఁడైన అశివుఁడుగా నుండి శాసించు చున్నాఁడు.

సీ. భా.:- చీఁకటిలో రజ్జువును జూచి సర్పమని భ్రమపడి నట్లే అంగుష్ఠమాత్ర పురుషుని సత్యావంతుని శరీరమునుండి గైకొనెను. అను కథ ననుసరించి, యమధర్మరాజును మృత్యు వుగా ఆత్మలో గల్పించుకొని, కొందఱు మూఢులు భ్రమ ప్రమాద పతితులై అజ్ఞానమును మృత్యువుగా గ్రహించ లేక అజ్ఞులై పల్కిరి. యమప్రశమోపాయమైన జ్ఞానమే అమృతము. అనగా యమ నియమాదులకును, శమాదుల కును ఉపాయమైన జ్ఞానమన్నమాట. అదియే బ్రహ్మచర్యము. అనగా ఆత్మానుసంధానము. దానివలననే అఖిల కల్పనా జాలమును దొలగిపోవును. అదియే మోక్షహేతువు. "న తస్య రోగో నజరా నమృత్యుః," అను శ్రుతిని బరిశీలించినచో ఆత్మానుసంధానముగల యోగులకు రోగము, జర, (ముసలి తనము) మృత్యువు అనునవి లేవని స్పష్టమగుచున్నది. మృగజల మునకు (ఎండమావికి) దాహార్ధ నివారణ క్రియాకారిత్వమును జెప్పినట్లు, యమునకు మృత్యుక్రియా కారిత్వమును జెప్పు చున్నారు. ఎండమావిలోని నీరు జంతువుల దాహమును దీర్చలేదు. అటులనే యముఁడు జీవులకు మృత్యువును జేకూర్చ లేఁడు. పరికింపగా యముని మృత్యువుగా భావించుట కల్పితమే కాని సత్యముకాదు. "యాదృశో యక్ష స్తాదృశో బలిః" అను

న్యాయమునకు యముఁ డెంతటి వాఁడైన వాని కొసంగు బలి యును అంతమాత్రమే ! అని యర్థము. పై న్యాయమునసను రించి ఆత్మలో గల్పింపఁబడిన, గరుఁడునకు విషనివారకత్వమును జెప్పినట్లు, ఆత్మలోఁ గల్పితుఁడైన యమునకును జీవుల శివా శివముల ననుసరించి, వారికి శుభాశుభములను గూర్చుట చెప్పఁ బడినది. కాని పరిశీలింపగా ఒకే జలమున శీతోష్ణ భావములు కలవు. అట్లే ఒకే యమునిలో, సత్యములును; విరుద్ధధర్మము లు నగు, శివాశివములు కలవని చెప్పుట అసంభవము. చీకటిలోని రజ్జువునందు సర్ప దండాదులువలె, ఒకే యమునిలో శివత్వా శివత్వములు కల్పితములే కాని యథార్థముగాఁ గలవి కావని తోచు చున్నవి.

వివరణము :-

పై శ్లోకమున సామాన్యముగా సర్వులు భావించు నట్లు యముఁడే మృత్యువు కాఁడు. యముఁడు వేరు, మృత్యువు వేరు అను విషయము భాష్యములలో వివరింపఁబడినది. మృత్యు వనగాఁ బ్రమాదము, అజ్ఞానము అని పై శ్లోకము వలన దెలియు చున్నది. యముని మృత్యువుగాఁ దలఁచుట చీకఁటిలో గాం చిన త్రాటిని సర్పముగా దండముగా భావించుటవలె భ్రమ కల్పితమే కాని యథార్థము కాదని తెలియుచున్నది. యథా ర్థముగా మృత్యువననేమో ? యముఁడననేమో తెలిసి కొనుటకు జ్ఞాన మవసరము. జ్ఞానము చేతనే సూటిగా మృత్యు వును దొలగించుకొని. అమృతత్వమును బొంద వచ్చును. కాని కర్మలచేఁ గాదు. కర్మలమృతత్వము పొందుటకుఁ బరంపరయా

సాధనములు. కర్మలు మనఃపరిశుద్ధికిఁ గారణములై చిత్తశుద్ధి ద్వారా జ్ఞానము జేకూర్చి జ్ఞానముద్వారా జీవులకు ముక్తిని జేకూర్చుచున్నవి. కర్మ లీశ్వరార్పణ బుద్ధితోఁ జేసినపుడే ముక్తి సంధాయకములు. అని భాష్యకర్తలు చక్కగా వివరించి చెప్పిరి.

కర్మ అవసరమా ? అనవసరమా ? అని చర్చించి "యజ్ఞ దాన తపః కర్మ నత్యాజ్యం కార్య మేవ తత్" అని గీతలో జెప్పినట్లు యజ్ఞదాన తపోరూపములైన కర్మలు చేసి తీరవలెనని, చక్కగా వివరించిరి. కర్మలు చిత్తశుద్ధి నెట్లు చేకూర్చునో సైతము చక్కగా వివరించి భాష్యకర్తలు చెప్పిరి. యోగాభ్యాస రూపమైన కర్మ చేయువిధానము శంకరభాష్యమునఁ జక్కగాఁ దెలియఁ జెప్పఁ బడినది. కర్మాచరణముద్వారా జీవులకుఁ బ్రాప్తించు బ్రహ్మజ్ఞానముయొక్క ప్రయోజనములను శంకరులవారు సప్రమాణముగాఁ జక్కగాఁ దెలియఁజెప్పిరి. శంకరమార్గగాములైన నీలకంఠులవారును, మృత్యువు, యముఁడు, అను వానికి జెందిన విషయములను జక్కగా వివరించి చెప్పిరి. పైభాష్యమందలి విషయమును వివరించు సందర్భమునఁ బేర్కొనఁ బడిన కొన్ని పారిభాషిక విషయములను ఇంచుకంత సులభముగా దెలిసికొనుటకు నాబుద్ధికిఁ దోచినరీతిని వివరించు చున్నాను.

(1) యముడు :- "యమయతీతి యమః" అను వ్యుత్పత్తి ననుసరించి, జీవులను నియమించువాఁడు, శిక్షించు వాఁడు యముఁడని తెలియుచున్నది. ప్రతిప్రాణికిని 1. ఆగామి

2. సంచితము 3. ప్రారబ్ధము, అను మువ్విధములఁ బుణ్యాపాప కర్మలు కలవని తెలియుచున్నది. "బుద్ధిః కర్మానుసారిణీ" అను, సూక్తి ననుసరించి, జీవులబుద్ధి కర్మానుసారముగా ప్రవర్తిల్లు నని తెలియుచున్నది. బుద్ధి ఆదిత్యరూపము; మనస్సు చంద్రరూపము. ఆదిత్యునకువలె, ఆదిత్యపుత్రుడైన యమునకు బుద్ధిపైని ఆధిపత్యము కలదు. కావున యముఁడు జీవులకర్మల కనుకూలముగా బుద్ధిని నియమించి, బుద్ధి ప్రేరితములైన కర్మల నాచరించు నట్లు జీవుల నియమించి, వారికర్మ ఫలముల ననుభవింపఁ జేయునని దెలియు చున్నది.

(1) ఆగామి :- కర్మ యనగా కర్మాచరణ సమయము మొదలు భావికాలమున జేయు పుణ్యాపాపకర్మ సముదాయము.

(2) సంచితము :- అనగా గడచిన జన్మలందు ఆచరించిన పుణ్యాపాపకర్మల సముదాయము.

(3) ప్రారబ్ధము:- అనగా జీవుఁడు తానున్న జన్మలోఁ అనుభవించు, అత్యుత్కట పుణ్యాపాప సముదాయము. అది అనుభవించనిదే తీరదు. కావున జీవుని, వర్తమాన జీవనమునకుఁ జెందిన దన్నమాట. అది సంచిత కర్మనుండి విభజింపఁ బడి, వర్తమాన కాలమున జీవుని యనుభవమునకు దైవముచే నిర్ణయింపఁ బడిన దన్నమాట, "నాభుక్తం క్షీయతే కర్మ" అనుభవింపఁ బడనిదే కర్మ క్షీణింపదు. "అత్యుత్కటైః పుణ్యాపాపై రిహైవ ఫల మశ్నుతే" అనగా ఘోరములైన పుణ్యా

పాపముల ఫలమును ఈ జన్మయందే ఈ లోకముననే జీవులనుభవింతురు. అని పై సూక్తుల భావము.

(2) అంగుష్ఠమాత్ర పురుషుఁడు:- పుర మనగా శరీరము. దాని నాశ్రయించి యుండు నాతఁడే పురుషుఁడు. ఆ పురుషుఁడే సనాతనుఁడు. ఆతఁ డంగుష్ఠమాత్రుఁడు. బొటన వ్రేలు పరిమాణమున నున్నవాఁడు. ఆతఁడే జీవుఁ డన్నమాట. ఆతని హృత్పుండరీకమున, నీవార శూకమువలె (ధాన్యము చివరఁ గల ముల్లువలె) సూక్ష్మమై వెలుగు తేజస్సే పరమాత్మ. "నీవార శూకవృత్తన్వీ పీతాభా స్వ్యస్త్యణూపమా" అను శ్రుతియే పై విషయమునకుఁ బ్రమాణము. పరమాత్మయే జీవుఁడై ప్రకృతిలోఁ గలఁడు. అట్టి జీవేశ్వరులకు భేదము లేదని తలంచుటయే భిన్నత్వమున ఏకత్వమును గాంచుట. అట్టి జీవరూప పరమాత్మయే అంగుష్ఠమాత్ర పురుషుఁడు. ఆతఁడే సదా జనుల హృదయమున నున్న వాఁడు. జ్యోతీ రూపుఁడు. అను విషయమే. "అంగుష్ఠమాత్రః పురుషోఽన్త రాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః" "అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః" అను శ్రుతుల వలనఁ దెలియుచున్నది.

3) "ప్రాణానలే జుహోమీతి వాచమ్" ప్రాణము నను అనలమందు (అగ్నిలో) హోమము చేయుట. అనగా ప్రాణాయామ ప్రక్రియలో అపానయుక్తమైన ప్రాణవాయువును, చంద్రరూపమైన మనసుతో జోడించి, సూర్యరూపముగు బుద్ధిలో లీనము గావించి, "సోఽహం భావముతో" అనల

రూప పరమాత్మతో ఏకాకారమై సమాధిస్థితిలో నుండుట యని తెలిసి కొనవలెను.

4) ఈషణాత్రయము :- దారేషణ, ధనేషణ, పుత్రేషణ అని ఈషణ ముత్త్రివిధము. ఈషణ యనగాఁ గోరిక. దారేషణ = భార్యావిషయకమైన కోరిక. ధనేషణ = ధన వాంఛ. పుత్రేషణ = పుత్రవాంఛ.

5) కర్మసన్న్యాసము :- సత్ అనగా శాశ్వతుఁడైన పరమాత్మయందే న్యాసముంచుటయే సన్న్యాసము. కర్మల యొక్క సన్న్యాసము. అనగాఁ గర్మల నన్నింటిని ఈశ్వరార్పణ బుద్ధితో నిష్కామముగా నొనర్చుట యని యర్థము. అంతే కాదు. కర్మల నన్నిటిని ఒక్కచోట నుంచుట (అనగాఁ విడుచుట) యనియు గలదు. అనగా గర్మలను బూర్ణముగా విడిచి పెట్టవలె ననికాదు. కర్మలుచేసి తీరవలసినదే. "కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః" అను గీతా సూక్తిలోఁ గామ్యకర్మ పరిత్యాగమే సన్న్యాసమని చెప్పఁ బడినది. కావున మానవుఁడు నిష్కాముఁడై కర్మలు చేయుట, (లేక) ఈశ్వరార్పణ బుద్ధితోఁ గర్మలు చేయుట ముఖ్యము. అదియే కర్మసన్న్యాస మని తెలిసికొనవలసి యున్నది. కర్మలు చేయనిచోఁ జిత్తశుద్ధి యేర్పడదు. చిత్తశుద్ధిలేనిదే జ్ఞానము కల్గదు, జ్ఞానము కల్గనిదే ముక్తియు లభించదు. కావునఁ గర్మలను దైవార్పణబుద్ధితోఁ జేసి తీరవలెను. కర్మలు చేయకున్నచో మానవుఁడు తరించుట సున్న. ఈ విష

యమే "ఆశా సంహరణంబు నోర్మియు మద త్యాగంబు దుర్దోష వాంఛా శూన్యత్వము" అని సుభాషితములలోఁ గలదు.

కర్మలన నేమి? :- (1) కర్మలు శ్రౌతములు వేదోక్తములు. (2) స్మార్తములు (స్మృతులలోఁ జెప్పబడినవి). (3) నిత్యములు (సంధ్యావందన దైవప్రార్థనాదులు). (4) నైమిత్తికములు (జాతకానుసారముగా దైవప్రీతికై చేయునవి) మున్నగునవి. (1) కర్మ, (2) అకర్మ, (3) వికర్మ అని మువ్విధములు గలవు.

మరియు కర్మ- వీనిలో అకర్మ, వికర్మలు మంచివికావు. కర్మగతి యతి గహనమైనది.

శ్లో॥ "కర్మణోహ్యపి బోద్ధవ్యం, బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః" ॥

అని గీతసూక్తిలోఁ బై విషయము చెప్పఁబడినది. కర్మలను గూర్చి వ్రాయఁదలచినచో ప్రత్యేక గ్రంథమగును.

6) యోగారూఢుఁడు :- అనగా ఇంద్రియ వాంఛలందును, గర్మలందును ఆసక్తి లేనివాఁడు. నిష్కామ కర్మచేఁ జిత్తశుద్ధి కలవాఁ డని యర్థము.

7) విశుద్ధసత్త్వుఁడు :- అనగాఁ బవిత్రమైన చిత్తము గలవాఁడు.

8) నవద్వారము (లేక) ఏకాదశ ద్వారము.

"నవద్వారే పురే దేహీ, పురమేకాదశ ద్వారమ్" అను శ్రుతిసూక్తులను బరిశీలించినచోఁ బురమునకు (దేహమునకు) నవద్వారములు, పదునొకండు ద్వారములు కలవని తెలియు చున్నది. అవేవన ? శ్రవణరంధ్రములు (2) నేత్రరంధ్రములు (2) నాసారంధ్రములు (2) నోరు (1) మలమూత్ర ద్వార ములు (2) నాభీరంధ్రము (1) కపాలరంధ్రము (1) మొత్తము పదునొకండు రంధ్రములు. దేహమున ద్వారములుగా నున్న వని తెలియుచున్నది. నవద్వారపక్షమున, నాభి, కపాలరంధ్ర ములు లెక్కింపబడుట లేదు.

9) షడ్భావ వికారములు :- అనగా జీవునిలోఁ గల్గు మార్పు లారని తెలియుచున్నది. 1. అస్తి, 2. జాయతే, 3. వర్ధతే, 4. విపరిణమతి, 5. క్షీయతే, 6. నశ్యతి అనునవే వికారములు.

1. అస్తి = జీవుడు మాతృగర్భమునఁ బిండరూపమున నుండుట.

2. జాయతే = మాతృగర్భమునుండి వెలువడుట.

3. వర్ధతే = పెఱుగుచుండుట.

4. విపరిణమతి = బాల్య, యౌవన, కౌమార, వార్ధక దశలుగ మార్పుచెందుట.

5. క్షీయతే = క్షీణించుచుండుట.

6. నశ్యతి = నశించుట.

—: అహంకార ప్రభావము :—

శ్లో॥ అస్యా దేష నిస్సరతే నరాణాం
క్రోధః ప్రమాదో లోభరూపశ్చ మృత్యుః ।
అహంగతే నైవచరన్ విమార్గాన్
నచాత్మనో యోగముపైతి కశ్చిత్ ॥ 8

తా॥ యముని యాజ్ఞవలన నరుల హృదయములలో మృత్యువు, క్రోధప్రమాద లోభరూపముల, ఉద్భవించుచున్నవి. వానివలన అహంకారము కల్గుచున్నది. అహంకార సంపన్నులైన మానవులు, శ్రౌతస్మార్త విపరీతములైన, అనగా, వేద శాస్త్ర విరుద్ధములైన మార్గములలో సంచరించు చున్నారు. అందుచే ఎవఁడును బరమాత్మకుఁ జెందిన యోగమార్గమును జెందకున్నాఁడు.

శం. భా. :- ప్రమాదమే మృత్యువు. అది అజ్ఞాన స్వరూపము. దానినే అజ్ఞానులు యమునిగా అభివర్ణించు చున్నారు. అట్టి అజ్ఞాన మనెడి మృత్యువుయొక్క ముఖము నుండి అభిమానాత్మకమైన అహంకారము జనించు చున్నది. ఆ యహంకారము మృత్యువున కాస్యము. అందు సకలానర్థములు, సకలాక్షేపములును గలిసి యున్నవి. ఆ యహంకారము అతి ఘోరమైనది. అది యన్నిటిని మ్రింగివేయును. అందు చేతనే దానిని మృత్యువున కాస్యముగాఁ జెప్పిరి.

శ్లో॥ సర్వార్థాక్షేప సంయోగా దసుధాతు సమన్వయాత్ ।
ఆస్య ఇత్యుచ్యతే ఘోరో హ్యహంకారో గుణోమహాన్ ॥

అను నారోక్తియును పై విషయమునే స్పష్టపఱచు చున్నది. కావున లోకమున ప్రమాదరూపమైన మృత్యువు అహంకార స్వరూపమున నుండి, నరులలోఁ గామ క్రోధ లోభ రూపములను, బొందుచున్నది. అహంకారముచేతనే మానవుఁడు, నేను బ్రాహ్మణుఁడను, నేను క్షత్రియుఁడను, నేను గృశించితిని, నేను వీని పుత్రుఁడను, అను కొనుచు, రాగద్వేషాదులతోఁ గూడి శ్రౌతస్మార్త విపరీతములైన, కుమార్గముల ననుసరించుచున్నాఁడే కాని, పరమాత్మను జేరుటకు, యోగ్యమైన సమాధి రూపముగా నున్న యోగమార్గమును జెందకున్నాఁడు. ఆధ్యాత్మికముగాఁ జూచినచో అజ్ఞానమే మృత్యువు. ఆధిదైవికముగా జూచినచో అహంకారమే మృత్యువు. అధి భౌతికముగా జూచినచోఁ బ్రమాదమే మృత్యువు. ఈ యవిద్యాత్మకమైన మృత్యువు, కామక్రోధ లోభ మోహ రూపములతో జీవుల నాశ్రయించి, సంసారమునఁ బడఁద్రోయుచు, బాధించు చున్నది.

శ్లో॥ "కామ ఏవ క్రోధ ఏవ రజోగుణ సముద్భవః ।
కామాత్ క్రోధోఽభిజాయతే క్రోధాద్భవతి
సంమోహః" ॥

ఈ గీతా వచనములు పై విషయముననే ప్రకటించు చున్నవి.

నీ. భా. :- యముని యాజ్ఞవలన మృత్యువు నరుల హృదయములలో, వారి మరణమునకు హేతువుగాఁ, గ్రోధ

రూపమునను, ప్రమాద రూపమునను, లోభ రూపమునను, ఉద్భవించు చున్నది. అజ్ఞానాభిమానియైన దేవతయే మృత్యువు. దాని దాసులే క్రోధము, ప్రమాదము, లోభము ననునవి. అవియే మానవుని బీడించును. ఇది యాధిదైవికముగా జెప్పఁబడిన విషయము. ఆధ్యాత్మికముగాఁ బరిశీలించినచో అజ్ఞానము వలననే మానవునిలోఁ గ్రోధ ప్రమాద లోభములు ఉద్భవించు చున్నవి. వానివలననే మానవుఁడు, మృతిచెందు చున్నాఁడని తెలియు చున్నది. అజ్ఞానమున కహంకారము నిదానము. అజ్ఞానమున కాత్మయే నివాసమైనచో ఆత్మకంటె భిన్నముగా అవి సంభవించునా ? (లేక) అభిన్నముగా సంభవించునా ? దానికి ఆత్మతో సంబంధమున్నచో ముక్తులకు సైతము మరల సంసారబంధమును సమకూర్చునే ? సాంఖ్యములోఁ బ్రకృతికి వలె దానికిని, వినాశ మేర్పడునే ? ఎట్లు ? అని సందేహింప నక్కఱలేదు. మృత్యువు నరులలో అహంకార రూపమున నుండి, వారిని ఆత్మకుఁ జెందని తప్పుమార్గములకుఁ దరలించి, వారిచే విషయముల ననుభవింపఁ జేయుచున్నది. ఆ యహంకారము, చిదాభాసము. అజ్ఞానము నాశ్రయించి యున్నది. అది ముక్తిలో నశించును. అందుచే ఆ యజ్ఞానము శుద్ధాత్మనుండి మఱల యుదయింపదు. దానికంటె భిన్నముగా నుండుటనే యుండదు. సుషుప్తిలో సైత మహంకారము నశింపదు. అప్పు డది సూక్ష్మరూపమున నుండును. అందుచే నెట్టి మానవుఁడైనను, జ్ఞానముఁ గలుగనిదే ఆత్మయోగమును బొందనేరఁడు. అందుచే నహంకార నాశముకంటె ముందు ఆత్మనుండి క్రోధాది

రూపమైన మృత్యువు తప్పక ఉదయించును. అందుచేఁ బ్రమాదరూపమైన మృత్యువునకుఁ గ్రోధ మోహములు రెండును సహకారు లని తెలిసికొనవలసి యున్నది.

వివరణము :-

శ్రీలక్ష్మాభరణ భాష్యములోఁ జెప్పిన బుజ్ఞానావిష్టుఁడైన మానవుఁడు, నేనే, సర్వము చేసితి నను కొనును. అట్లను కొనుట పొరపాటు. కారణమేమన ?

శ్లో॥ "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" ॥

ఈ గీతాసూక్తిని బరిశీలించినచో లోకమున సమస్త కార్యజాతమును బ్రకృతిచే జరుగు చుండగా అహంకార విమూఢుఁడు, తానే కర్త ననుకొనుచున్నట్లు దెలియు చున్నది. అహం + కారః = నేనే చేయువాఁడ ననుకొనుటయే అహం కారము. దీని ప్రభావముచేతనే ప్రతిమానవుఁడును "ఆఢ్యోఽ భిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా" అని గీతలోఁ జెప్పినట్లు నేనే ప్రభువను, నేనే ఉత్తమకుల సంభూతుఁడను, నావంటివాఁ డన్యుఁడు లేఁడు అనుకొనును. ఆది నారాయణుని ఆజ్ఞాశక్తిచేఁ, బ్రమాదాహంకారరూప మగు మృత్యువు క్రోధ లోభ రూపముల నందుచు, మానవుల నోటినుండి పరుష వచనాది రూపమున బహిర్గత మగును. దానిచేఁ దప్పు మార్గ ములం జరించు మానవుఁడు మృత్యువునుండి తరించవలెనవిన

నహంకార విహీనుఁడై, వివేకియై గురు దేవతాదులను నిందింపక, రాజసభలకో విద్వత్సభలకో వెడలి, కర్మ-జ్ఞాన భక్తియోగ తత్త్వములను దెలిసికొని మెలఁగవలెను. అహంకారమును వీడనిచోఁ బై మూఁడు యోగములనే యొక్క-దానినైనను, మానవుఁడు పొందఁజాలఁడు.

—: జీవుల జనన, మరణ వివరణము :—

శ్లో॥ తే మోహితా స్తద్వశే వర్తమానా
ఇతః ప్రేతా స్తత్ర పునః పతంతి ।
తత స్తాన్ దేవా అనువిప్లవన్తే
అతో మృత్యు ర్మరణాఖ్యా ముపైతి ॥ ౮

తా॥ మానవు లహంకార రూపమృత్యువుచే, మోహితులై మృత్యువశమున మెలఁగు చున్నారు. పిమ్మట వారు ప్రేతలై ధూమాది మార్గముఁనఁ బోయి, స్వర్గమునఁ గొంత కాల ముండి, మఱల భూమిపై మాతృగర్భమునఁ బడు చున్నారు. నేలపై దేహము నొందిన అవస్థలో నున్నపుడు, దేవులు, అనగా ఇంద్రియములు జీవుల నాశ్రయించి, కర్మలలోఁ దేలియాడించు చున్నవి. అందువలన అహంకార రూపమైన మృత్యువు మరణమను పేరు పొందుచున్నది.

శం. భా. :- ఆత్మయోగము లేని మానవుఁడు, మృతుఁడైన విధమును, మఱల జనన మందిన రీతిని వివరించుచున్నాఁడు. ఎట్లన ? ఆత్మయోగము లేని మానవు లహంకారాది రూపముఁ బరిణతి నొందిన అజ్ఞానముచే మోహితు లగుదురు.

వారు దేహాదులనే ఆత్మగా భావించి, అహంకార రూపమున మార్పుచెంది నట్టివారు, ప్రమాద మను పేరుగల మృత్యువునకు వశులై మెలఁగు చున్నారు. పిమ్మటఁ బ్రేతలై ధూమాది మార్గమునఁ బోయి, పరలోకమునఁ గొంతకాలము నివసించు చున్నారు. తర్వాత వారు పరలోకమునుండి, ఆకాశమును, దానినుండి వాయువును, దానినుండి వృష్టిని, వర్షము ద్వారా సస్యములను బ్రవేశించు చున్నారు. పిమ్మట వారు సస్యముల నుండి అన్నమును, దానినుండి శుక్రధాతువును, దానినుండి శోణితమును, జేరు చున్నారు. క్రమముగా దేహమును బొంది, భూమిపై అవతరించు చున్నారు.

"తస్మిన్ యావ త్సంపాత ముషిత్వా
థైతమేవా ధ్వానం పున ర్నివర్తన్తే"

అను శ్రుతియుఁ బై విషయమునే ప్రబోధించు చున్నది. దేహము నొందిన అవస్థలో, దేవులనగా నింద్రియములు జీవుల నాశ్రయించి, వారిని గర్మలలోఁ దేలియాడించు చున్నవి. మఱల ఆ జీవులే చక్రభ్రమణము రీతిని మరణాఖ్యమైన మృత్యువును, జన్మాంతరమును బొందు చున్నారు. పై విధమున మానవులు, జనన, మరణ, ప్రబంధమును అధిరోహించి ఎన్నటికిని, విముక్తులు కాఁజాలకున్నారు. తమ యజ్ఞానము కారణమునఁ బ్రతిప్రాణికిని సంసారము ప్రాప్తించును. సంసార పతితుఁడైన ప్రాణి, పరమాత్మనే ఆత్మగాఁ దెలిసికొన నంత కాలము తాపత్రయముచేఁ బరాభూతుఁడై, మకరాదులవంటి

రాగద్వేషాదులచే నాకర్షింపఁబడి, మోహితుఁడై సంసారము నందూ మునిగి, తేలు చుండును.

నీ. భా. :- మానవు లాత్మయోగము లేని కారణమునఁ గ్రోధాదులచే మోహితులగు చున్నారు. మృత్యువు క్రోధాది రూపము. అట్టి మృత్యువు వశమున నున్న మానవులు, ఈ లోకమునుండి నరక లోకమునఁ బడుచున్నారు. నరకలోకము నుండి పతితులైన, మానవులను ఇంద్రియములు చేరుచున్నవి.

"త ముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి, ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామన్తి"

అను శ్రుతి ప్రకారము, మఱల యింద్రియ బద్ధులైన జీవులను బ్రాణము నాశ్రయించును. ప్రాణవంతులైన వారు, మఱలఁ గొంతకాలమునకు మరణగతు లగుదురు. "మృఙ్ = ప్రాణత్యాగే" అను ధాతువునుండి మృత్యువు అనుపద మేర్పడును. దానిని బరిశీలించినచో మృత్యు వనగాఁ బ్రాణ త్యాగము చేయించు అజ్ఞాన మని తెలియును. అజ్ఞానము చేతనే మానవు లన్నింటిని, విస్మరించుటయేకాక, ప్రత్యగా నందమైన ఆత్మను సైతము, విస్మరించి, దేహమునే ఆత్మగా భావించి, పతితు లగుచున్నారు. "మృత్యు రత్యంత విస్మృతిః" అను స్మృతియు, దీనినే స్పష్టపఱచు చున్నది. మానవుని బ్రత్యజ్మార్గమును, అనగాఁ దప్పుత్రోవను బట్టించు నదియును మృత్యువే. దానినే యమునిగా అభివర్ణింతురు. అజ్ఞాన రూప మగు మృత్యువు ముఖ్యము. యమరూప మగు మృత్యువు

గౌణము. అనగా అప్రధానము; అని తెలిసికొనవలెను.

దుర్ఘటార్థ భాష్యము:-జంతు వనగాఁ బ్రాణి. మోక్షము నెట్లు పొందుచున్నది ? మోక్షప్రాప్తికి, "జ్ఞానము, కర్మ, స్వాధ్యాయము" అనునవి ప్రత్యేకముగాఁ గారణములా ? లేక మూఁడును సమిష్టిగా గారణములా ? మోక్షస్థాన మెట్టిది ? ఆత్మ యేలక్షణములతో నొప్పుచున్నది? దానిని తెలిసికొనుట ఎట్లు? ఆ మోక్షస్థానము నెవరు చూచు చున్నారు? జ్ఞానికి ఆత్మదర్శనమునఁ గారణము లేవి ? జంతువునకు బంధ మోక్షము లెట్లు కల్గుచున్నవి ? అను విషయముల నెఱుఁగ గోరిన ధృతరాష్ట్రునకు, సనత్సుజాతుఁడు క్రమముగా సమస్తము నెఱిగించుచు, మృత్యు స్వరూపమును వివరించి చెప్పఁదొడగెను.

అయ్యా! ప్రమాదమే మృత్యువు. కామక్రోధములచే మోహితులైన మానవులు దానిని గుర్తింపలేక, మృత్యువశమున మెలఁగుచున్నారు. అదియే మానవుల కాత్మదర్శన విషయమున, అడ్డుగా నుండి జ్ఞానహీనుల గావించి జనన, మరణములను జేకూర్చు చున్నది. ఒక దేహము నుండి వేరొక దేహమును అంటగట్టు చున్నది. శరీర భేదము వాటిల్లు టంచు మానవులు మరణించు చున్నారు. మృతులైన పిమ్మట దేహాంతర ప్రాప్తిసమయమున, మానవులను దేవు లనగా ఇంద్రియములు చేరుచున్నవి. కాని స్వవిషయములను గ్రహింపలేకున్నవి. ఈ శరీర భేదమే ప్రమాదము. అదియే మృత్యు వను సంజ్ఞను బొందుచున్నది.

శ్లో॥ "ప్రకాశో వివరాకారో దేవద్వారో న వాక్యచిత్ ।
ప్రబోధవ్యక్తి హేతుత్వాత్ దోషో మృత్యుర్మతిర్మమ" ॥

అను స్యాంఖ్యసూక్తిని బరిశీలించినచో శరీరమున విషయిరూపములై తొమ్మిదియో, పదునోకండో ద్వారములు గలవని తెలియును. అవియే దేవు లనగా ఇంద్రియము లనియును, ప్రబోధవ్యక్తి హేతువైన దోషమే మృత్యు వనియును విదితమగును. ప్రాణులు కామ్యకర్మలను జేసి వానిఫలమైన స్వర్గమును జేరి, ఫలమనుభవింతురు. కర్మఫలానుభవము పూర్తియైన పిమ్మట మఱల మఱల సంసారమునఁ బడు చుండు దురు. ఆత్మదర్శనము లేకుండుట యను ప్రమాదముచే వారు మృత్యువును దాటలేరు అని యెఱుగవలెను.

లక్షాభరణ భాష్యము:- మృత్యువశమున నున్న వారికి సంసార చక్రభ్రమణము తక్క వేఱుగతి లేదు. మృత్యువునకు రూపాంతరమైన మోహమునకు వశులై ప్రవర్తించు మానవులు, భౌతిక దేహమును వీడి, యమలోకమున కేగి, అట నుండి మఱలి, భూలోకమునఁ బడుచున్నారు. పృథివ్యాది తత్త్వములం దభిమానముగల దేవులు (ఇంద్రియములు) పర మాత్మ ననుసరించియే జీవుని జేరును. పిమ్మట ఆ జీవులను, మాతృగర్భమునఁ బడవైచి, వారి నాక్రమించి, తెప్పవలెఁ దేలుచుండును. పై శ్లోకమందలి "విప్లవంతే" అనుపద మందలి "ప్లవ" పదము జీవులకు సంభవించు పాదఘాతములను, కర తాడనములను, అనారోగ్య జీవనమును సూచించును. ఇంద్రియ

ములు జీవులచేఁ బాపము చేయించుటకే వారిని జేరును. కాని వారి కుపకారము చేయించుటకు జేరలేదను విషయమును, "ప్లవన్తే" అను బదమందలి ఆత్మనే పదప్రత్యయము సూచించును. కావున మారక దేవతయైన మృత్యువు జీవుల శిఖా స్థానమున నుండఁగాఁ బ్రమాద మోహాదులు ఇతర స్థానములందుఁ బ్రవేశించి యుండును. కావున జ్ఞానహీనులైన ప్రాణులకు, మృత్యువు, మఱల జన్మలును దప్పవు; అని తెలిసికొనవలసి యున్నది.

వివరణము :-

పరికింపఁగా నరులకు మృత్యువునకు అవినాభావ సంబంధము కలదు. "నరుడు, మృత్యువు" అను పదముల యర్థమును గమనించిన అది తేటతెల్ల మగును. ఎట్లన ? నృణన్తి = నయన్తి సర్వం స్వవశ మితి నరాః = అను వ్యుత్పత్తి ననుసరించి చూచినచో నరుఁడు కామ, క్రోధ, లోభ, మోహ, ప్రమాదములకు స్థానముకాన అహంకార పూర్ణుఁడై సమస్తమును దమవశము చేసికొనుటకే ప్రయత్నించును. కామ, క్రోధాదులు ఆకును మృత్యువు రూపాంతరములే. వాని వశమున మెలఁగు మానవుఁడు నిత్యము మృత్యువు నోట నున్నట్లే కదా? మృత్యువు పని యేమి? తన వశమున నున్న వారి ప్రాణములను దోలగించుట, మఱల జన్మమెత్తించుటయే కదా! జ్ఞానులు, యోగులు, తపోనిధులు తప్ప ఇతరులు మృత్యువును దప్పించుకొన లేరు.

పై మువ్వురు కొంతకాలమునకైనను మృత్యువును దొలగించు కొనఁగలరు. అందులకు ముఖ్యకారణము వారికిఁ గల జ్ఞానమే. వారు తమ జ్ఞానముచేఁ దమకర్మలను, అజ్ఞానమును బోఁగొట్టుకొనఁ గలరు. పరికింపగా బతనాది రూపము గల దుఃఖమునకు నిలయమగు స్వర్గము కూడ నరక తుల్యమే. కాన స్వర్గవాసులైన దేవతలు నిత్యము అమృతులగుచున్నారనుట కవకాశము లేదు. కారణ మేమన? దేవతలు కూడఁ గర్మఫలాను సారముగాఁ బ్రమాదాది వశులై, యముని అనుసరించి పోవుచు, దేవైశ్వర్యములను బొందలేకున్నారు. దేవతలందును జ్ఞానులు మాత్రమే అమృతులగుచున్నారు. యముఁడు విదురుఁడై అష్టవసువు భీష్ముఁడై జన్మించి మృతి చెందలేదా? జ్ఞానముచేతనే కదా వారు తరించిరి. అవిచ్ఛేదముగా దుఃఖము వాటిల్లుటయే మరణము. అట్టి మరణము దేవతలకును గలదు. కావున వారు కర్మవిశేషముచే దేవైశ్వర్యము పొందినను, మానుషలోకము జేరుట యను దుఃఖము కొంతకాలమునకు వారికిని గలదని దెలిసికొనవలసి యున్నది. ఈ విషయమే అర్జునమిశ్రీయ, సర్వజ్ఞ నారాయణీయ భాష్యములందును గలదు.

## —: కర్మ బంధహేతువు :—

శ్లో॥ కర్మోదయే కర్మఫలాను రాగా
స్తత్రాను యాన్తి న తరంతి మృత్యుం।

సదర్థయోగానవగమాత్సమంతాత్
ప్రవర్తతే భోగయోగీన దేహః ॥ ౯

తా॥ కర్మల నాచరించిన మానవులు కర్మఫలాసక్తులై స్వర్గాదుల కేగుచున్నారు. స్వర్గసుఖ మనుభవించిన పిమ్మట మఱల భూమిపై జన్మించుచున్నారు. అందుచే మానవులు జనన మరణ రూపమైన మృత్యువును మీఱలేక పోవుచున్నారని తెలియుచున్నది. అట్టి దేహులు సదర్థమైన పరమాత్మను బొందలేక భోగాభిలాషచే నానాయోనులలో జన్మించుచున్నారు.

శం. భా. :- అవిద్యాకామములు బంధహేతువు లని తెల్పి, వానివలెఁ గర్మయు బంధహేతువే యను విషయము తెలియఁ జెప్పుచున్నాఁడు. "అమృత్యోః కర్మణా కేచిత్" అను సూక్తి ననుసరించి, కేవలము కర్మమార్గముచేతనే అమృతత్వమును బొందవచ్చు ననుకొనుట పొఱపాటు. యజ్ఞాది కర్మల నాచరించిన తోడనే మానవులు కర్మ ఫలాసక్తులై, తదనుకూల మగు జన్మలను అందుచున్నారే కాని, మృత్యువును బోఁగొట్టు కొనఁజాలకున్నారు. మఱల మఱల జననమరణాత్మకమైన సంసారమందే ప్రవర్తించు చున్నారు. పరికింపగాఁ జిదానందాద్వితీయ మగు బ్రహ్మపదార్థమే సదర్థము. అదియే పరమాత్మ. అని తెలిసికొనలేక దానితో యోగమును బొందఁ జాలకున్నారు. అంధులు నిమ్నోన్నతము లగు కంటక స్థలాదులందే సంచరించు చున్నట్లు, దేహమందిన ప్రాణులు

కూడ, వివేకహీనులై, విషయ సుఖ మపేక్షించు వారై సంసార మనెడి ముండ్లకంచె లందే సర్వదా సంచరించు చున్నారు.

నీ. భా. :- కర్మలు భోగప్రదములు. అందుచేఁ గర్మ లాచరించిన మానవులు, కర్మఫలమైన భోగమునం దాసక్తులై భోగము లొసఁగుఁ స్వర్గాదులకుఁ బూర్వదేహమును వీడి పోవుచున్నారు. భోగము లనుభవించిన పిమ్మట మఱల భూమిపై జన్మించు చున్నారు. ఇట్లు యాతాయాతులై మృత్యువును దాట లేకున్నారు.

"యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే
నాయమస్తీతి చైకే"

"యోని మన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః।
స్థాణు మన్యేఽనుసంయన్తి యథా కర్మ యథా శ్రుతం।
అస్తీత్యేహోపలబ్ధవ్యం" ॥

అను కఠశ్రుతులలోఁ జెప్పినట్లు, దేహులు కొందఱు మృత్యువు కలదు: లేదు; అను తర్కవితర్కములను బొందు చున్నారు. అందుచే గొందఱు, వారి వారి కర్మల ననుసరించి నానాయోనులం దుద్భవించు చున్నారు. స్థాణురూపమును బొందు చున్నారు. దేహాంతరములను బొందుచున్నారు. అంతే కాని బ్రహ్మప్రాప్తి సాధనములైన, యమదమాద్యష్టాంగము లను, అలవఱచు కొన లేకున్నారు. భోగేచ్ఛచేఁ బరిభ్రమించుచు

ఊర్ధ్వయోనులనో, అధోయోనులనో, తిర్యగ్యోనులనో పొందు చున్నారే కాని మృత్యువును మీఱలేకున్నారు.

వివరణము :

"సద్ల = గతౌ" అను ధాతువునుండి పుట్టిన 'సత్' అనెడి పదమునకు సర్వగతుఁడును, శాశ్వతుఁడు నగు పరమాత్మ యని యర్థము. "సతం ధీరః ప్రత్యగాత్మాన మైచ్ఛత్ ఆవృత్తచక్షు రమృతత్త్వ మిచ్ఛన్" అను శ్రుతిలో బరమాత్మ ప్రత్యగాత్మ యని పేర్కొనఁబడెను. అప్పరమాత్మను "యమాదులచే" "ఆవృత్త చక్షువులైన ధీరులే తెలిసి కొనుచున్నారు; చేరుచున్నారు. నిష్కామముగా గర్మమార్గమనుసరించువారే" ధీరులు. సకాములై కర్మలాచరించువారు ధీరులుకారు. వారు సకామ కర్మాచరణ శీలురు. వారు స్రక్చందన వనితాది గ్రామ్య విషయ భోగానురాగులై జన్మపరంపరల నందుచున్నారు కాని, ముక్తి నంద లేకున్నారు. అని తెలిసికొన వలసియున్నది. అర్జున మిశ్రాదులు పైవిషయమునే తమ భాష్యములందుఁ బేర్కొనిరి.

శ్లో॥ తి ర్త్వా మహామోహాన మింద్రియాణాం
మిథ్యార్థ యోగస్య గతి ర్హి నిత్యా।
మిథ్యార్థయోగాభి హతాంత రాత్మా
స్మర న్నుపాస్తే విషయాన్ సమంతాత్॥　　౧౦

తా॥ కరచరణాదులు నేత్రాదులు నగు ఇంద్రియముల యొక్క వాంఛలకు వశులై మెలఁగుటయే మహామోహనము.

అట్లు మోహమందిన వానికి మిథ్యావిషయములైన శబ్దాదుల తోడనే, సంబంధ ముండుటచే సంసారపతనమే నిత్యమై వాటి ల్లును. అట్లు సంసారబంధ మొందుటయే మిథ్యార్థ యోగము. అట్టి యోగముచే మానవుఁడు తన మనంబున నిత్యము వని శాది విషయములనే, స్మరించు చుండునుగాని, మోక్షమును గూర్చి చింతింపడు.

శం. భా. :- ఇంద్రియములనే విషయులు, అందురు. వాటికి జెందిన కోరికలే విషయవాంఛలు. ఎవ్వనికి, విషయ వాంఛల నుండి బుద్ధి తొలంగునో వాని మనస్సు ఎల్లప్పుడును బ్రత్యగాత్మయైన బ్రహ్మయందే ప్రవర్తిల్లును. వానికి మోహమే యుండదు. మాటిమాటికిని, ఇంద్రియ వాంఛలందు బ్రవర్తి ల్లుటయే మహామోహనము. మహామోహనము పొందినవాడు స్త్రీ సంపర్కముచే, కలుషీకృత చిత్తుఁడై బ్రహ్మపదార్థమును ఎఱుగఁ జాలఁడు. హవిస్సుచే (హోమముచేయు వస్తువుచే,) అగ్ని బాగుగా వృద్ధిచెందును. కాని చల్లారదు. అట్లే కామోప భోగముచేఁ గామ మెక్కువగునే కాని తక్కువగాదు. అట్టి వానికి బ్రహ్మజ్ఞానము కలుగ నేరదు.

శ్లో॥ "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥

అను మనువచనము నై విషయమునే ప్రకటించెను. మహామోహము పొందినవాఁడు అవిద్యచేఁ గల్పింపఁ బడిన ట్టియు, మిథ్యావిషయములైన శబ్దాదులతోడనే యోగమును

పొందును. అట్టి దేహికి సంసారగతియే నిత్యము. అందుచే వానికి తిర్యగాది యోనులందుఁ పశుపక్ష్యాదుల యోనులందుఁ జనన మరణాదులు తప్పవు. మోక్షము లభించదు.

శ్లో॥ యా వై తా ఇమాః ప్రజా స్తిస్రో ఉత్యాయ మాయం।
స్తా నీమాని పయాంసి వంగావగధా శ్చేర పాదాః ॥
"కామా ను సారీ పురుషః కామా ననువినశ్యతి ॥

అను బహ్వృచ బ్రాహ్మణోపనిషత్తు నందలి వచనములు పై విషయమునే ప్రకటించు చున్నవి. విషయ వాంఛా లంపటుఁడై యుండుటయే మిథ్యార్థ యోగము. అట్టి వాని అంతరాత్మ, నిత్యము ను వనితాది విషయములనే స్మరించుచు, అంతటను దిరుగు చుండును. అందుచే నట్టి అంతరాత్మలో బ్రహ్మజ్ఞానము ఎన్నడును అంకురింపదు.

వివరణము:- కన్ను, ముక్కు, చెవి, మున్నగు జ్ఞానేంద్రియములకుఁ జక్కని వస్తువు చూడవలెను. చక్కని వాసన పీల్చవలెను; చక్కని ధ్వని వినవలెను. మున్నగు కోరికలు కల్గును. కాలు, చేతులు మున్నగు కర్మేంద్రియములకు, జక్కని చోటున కేగవలెను. చక్కని వస్తువును దాకవలెను. మున్నగు కోరికలు కల్గును. పై కోరికలందు మనోబుద్ధులు గాఢముగాఁ బ్రవర్తిల్లుటయే మహామోహనము. అట్లు మహామోహము పొందుటయే మిథ్యార్థ యోగము. మహామోహము కలవాఁడు సంసార మనెడి మురికి గుంటలో మునిగి యుండునే కాని బ్రహ్మజ్ఞానము పొందలేఁడు. తరింపఁ జాలఁడు. అని తెలిసికొన వలసి యున్నది.

శ్లో॥ అభిధ్యా వై ప్రథమం హన్తి చైనం
కామ క్రోధా వనుగృహ్య శుపశ్చాత్ ।
ఏతే బాలాన్ మృత్యవే ప్రాపయంతి
ధీరా స్తు ధైర్యేణ తరన్తి మృత్యుమ్ ॥ ౧౧

తా॥ ఇంద్రియ వాంఛల కనుకూలముగాఁ గామ క్రోధాలు గలుగుటయే అభిధ్య, అనఁ బడును. అది లోకులను మొదట హతమార్చును. అనగా అది వారిని దనవశమున నుంచుకొనును. కామక్రోధాదులకు వశులై మెలగు వారు, విద్యావంతులైనను, వివేక హీనులైనను బాలురుగా నుందురు. అందుచే వారు క్రమముగా మృత్యువునే పొందుదురు. ఇంద్రియ నిగ్రహముగల ధీరులు మాత్రము ధైర్యముచే మృత్యువును మీరుచున్నారు.

శం. భా. జ్ఞాన హీనులైన బాలురు, ఇంద్రియములనే ఆత్మగా భావించి వానినే నిత్యము స్మరింతురు. దాని ననుస రించి, వారిలోఁ గామము జనించును. కామమునకు భంగము కల్గినచో వారిలోఁ గ్రోధము జనించును. తదనన్తరమే వారిలో లోభము ప్రవేశించును. ఇట్లు విషయములను స్మరించుట, తదనుకూలముగాఁ గామక్రోధములు కల్గుటయును, అభిధ్య, అనఁబడును. ఈ యభిధ్యలే ఆత్మజ్ఞానము కలుగ నీయక, మానవ హృదయములలో అడ్డు గోడలుగా నుండును. అవి లోకులను, వివేకహీనులను గావించి, బాలురుగా మార్చును.

అందుచే వారు బాలురవలె అజిత చిత్తులై, కామ క్రోధాది వశులై మెలఁగుదురు. అందుచే మానవులు, అభిధ్యా

మూలముగా మృత్యువును బొందుదురు. నిష్కాములైన ధీరులు శాస్త్రజ్ఞానముచే బంధితులై, మోక్షప్రాప్తికిని, ఆత్మజ్ఞానమునకును, ధర్మమునే సాధనముగా గ్రహింతురు. ధైర్యమును వహింతురు. ధైర్యముతో నింద్రియములను జయింతురు. జ్ఞానము పొందుదురు. అందుచే ధీరులే మృత్యువును దాటగలుగుచుందురు.

శ్లో॥ "పరాచః కామా ననుయన్తి బాలా స్తే
మృత్యో ర్యాన్తి వితత స్యపాశం।
అథధీరా అమృతత్వం విదిత్వా ధ్రువ
మధ్రువే ష్విహ నప్రార్థయన్తే"

"నిచాయ్యతం మృత్యుముఖాత్ ప్రముచ్యతే"

అను కఠోపనిషన్మంత్రములలో బాలురనగా అజ్ఞానులు వివేకహీనులై కామ, క్రోధ, లోభముల ననుసరించుచున్నారు. అందుచే వారు సర్వవ్యాప్తమయిన మృత్యువుయొక్క పాశమును జేరుచున్నారు. అనగా దానిచే బాధింపబడుచున్నారు. ధీరులు జితచిత్తులై నిష్కాములై శాస్త్రపఠనముచే బంధితులై పరమాత్మ తత్త్వమును చింతించువారై అమృతత్త్వమునే ధ్రువమైనదిగా నెఱింగి, అధ్రువములైన విషయములను ప్రార్థింపరు. పరమాత్మనే ధ్రువమైనదిగా నిశ్చయించి మృత్యుముఖము నుండి విముక్తులగుచున్నారు.

వివరణము :- పై విషయము పరిశీలింపగా సామాన్యముగా మానవులు 1 ధీరులు, 2 బాలురు, అని రెండువిధములుగా

నున్నట్లు తెలియు చున్నది. ధీరు లనగా జ్ఞానులు, బాలు రనగా అజ్ఞానులు.

"వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి తఏవ ధీరాః ।" అని మల్లినాథసూరి పేర్కొనిన సూక్తి ననుస రించి, చూచినచో అందకత్తెలు, రుచిగలవస్తువు మున్నగునవి, కానవచ్చినను ఎవరి మనస్సులు చలింపవో వారే ధీరులు అని తెలియును. త్రిలోకసుందరి పార్వతి కానవచ్చినను చెక్కు చెదరని చిత్తము కల్గుటచేతనే మహాశివుడు ధీరుడైనాడు. మార్కండేయుడు, ధ్రువుడు, హరిశ్చంద్రుడు మున్నగువారు ధీరులకోటిలో జేరుదురు కదా ! అట్టివారి నాదర్శముగా నిడు కొని చిత్తమును జలింపజేయు అభిధ్యలకు (కామ క్రోధ లోభములకు) వశులుకాక, ఇంద్రియ నిగ్రహము కల్గియున్న వారే ధీరులు. వారే స్థిరచిత్తముతో బరమాత్మను జింతించుచు ముక్తిని బొందగలరు. రావణుడు, కర్ణుడు, దుర్యోధనుడు మున్నగువారు రెండవతెగకు జెందినవా రనగా బాలురు అజ్ఞా నులు అట్టివారు వివేకహీనులై ఆశకు దాసులై సర్వలోకము నకును దాసు లగుచున్నారు. ఆశను దాసురాలుగా జేసికొనిన శంకరుడు రమణమహర్షి వంటివారికి లోకమంతయు దాసోఽహ మ్మనును.

శ్లో॥ ఆశాయై దాసా యేతే దాసా స్సర్వలోకస్య ।
ఆశా దాస యేషాం తేషాం దాసాయతే లోకః ॥

అను సూక్తి పైవిషయమునే వెల్లడి చేయుచున్నది. కావున ధీరులు మృత్యువును మీరి ముక్తులగు చున్నారు.

బాలురు మితిమీఱిన కోరికలు పొంది, మృత్యుముఖముననే పడుచు జన్మపరంపరలు పొందుచున్నారు. అని తెలిసికొనవలసి యున్నది.

—: ధీరుల మహిమ :—

శ్లో॥ సోఽభిధ్యాయన్నుత్పతితాన్నిహన్యా
దనాదరేణా ప్రతిబుధ్యమానః ।
నైనం మృత్యుర్మృత్యురివాత్తి భూత్వా
ఏనం విద్వాన్ యో వినిహన్తి కామాన్ ॥ ౧౨

పాఠాంతరము.

శ్లో॥ యోఽభిధ్యాయన్నుత్పతిష్ణూన్నిహన్యా
దనాచారేణా ప్రతిబుధ్యమానః ।
సవై మృత్యుం మృత్యురివాత్తి భూత్వా
హ్యేవం విద్వాన్యోభిహంతీహ కామాన్ ॥ ౧౨

తా॥ ధీరుఁడు పరబ్రహ్మస్వరూపమునే చక్కఁగా ధ్యానించుచు, కామక్రోధాదులకుఁ గారణములై తనపైఁబడు ఇంద్రియములను జయించును. కామక్రోధాదులకు ఆశ్రయములైన వనితాదులను, అనాదరముగాఁ జూచును. వనితాదుల వలని లాభములను ఏ మాత్రమును దలంపఁడు.

అందుచే వానిని మృత్యువు పీడింపఁజాలదు. అతఁడే మృత్యువునకు మృత్యువుగా నుండును. ఇట్లు మృత్యుంజయుఁడై కామాదుల నడంచినవాఁడే విద్వాంసుఁ డగును.

శం. భా. :- ధీరులు ధైర్యముతో ఇంద్రియములను జయించి, మృత్యువు నెట్లు దాటుచున్నారో వివరించి చూపు చున్నాఁడు. ఎట్లన ? మృత్యువును దొలఁగించుకొనఁ గోరిన మానవుఁడు; యోగియైనను, గాకున్నను, సంసార సుఖము ననిత్యముగా, అశుచిగా, దుఃఖపూర్ణముగాఁ దలంచును. ఎల్లప్పుడు నాత్మనే ధ్యానించును. అతఁడు పైఁబడుచున్న ఇంద్రియములను, ఇంద్రియవాంఛలను, కామము కల్గించు వని తాదులను అమేధ్యము వలె అనాదరముగాఁ జూచును. మార్గమునఁ బడిన తృణాదులవలె, వనితాదులను, తుచ్ఛము లుగాఁ దలంచును. అట్టి మానవుఁడు విద్వాంసుఁడు కాన ఇంద్రియాదులను జయించుటయే కాక నాశనము చేయును.

శ్లో॥ విషయ ప్రతిసంహారం యః కరోతి వివేకతః ।
మృత్యో ర్మృత్యురితి ఖ్యాతః సవిద్వా నాత్మ విత్కవిః ॥

అను నార్యోక్తిలోఁ జెప్పినట్లు వివేకముతో విషయము లను సంహరించినవాడు, మృత్యువునకు మృత్యువుగా నుండి, ఆత్మజ్ఞానము కల విద్వాంసుఁడుగా, కవిగా విఖ్యాతుఁ డగును. అట్టి మానవుని అజ్ఞానరూపమైన మృత్యువు క్రమింగ లేదు. అందుచే నిష్కాముకు మృత్యుభయమే లేదన్నమాట.

అర్జున భాష్యము :- ఉత్తమ మానవుఁడు గురువు నాశ్ర యించి, ఆతని దయచే నాత్మస్వరూపమును జక్కఁగాఁ దెలిసి కొనును. ఆత్మస్వరూపమునే చక్కగా ధ్యానించుచు, విషయ ములైన స్రక్చందన వనితాదులలోఁ గల దోషము నెఱిఁగి, వానిని అనాదరముగాఁ జూచును.

"నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః" అను న్యాయము ననుసరించి, వనితాదులను అనాదరముగాఁ జూచి, విడుచుటచేఁ గారణములైన వనితాదులు తొలఁగుటచే, వాని కార్యమైన అనురాగము వానితో నశించును. అందుచే రాగ హీనుఁడైన మానవుఁడు మృత్యువునకే మృత్యువుగా నుండును. విద్వాంసుఁడు కానఁ గామాదులను ఖండించి, మృత్యువును మీఱఁ గలుగును.

వివరణము :- ఇంద్రియములను జయించి, సంసార సుఖమును, వనితాదులను నీచముగాఁ జూచువాఁడే వివేకి. ఆతఁడే ధీరుఁడు. ఆతఁడెల్లప్పుడు పరమాత్మ ధ్యానముతో నుండుటచే వాని చెంతకు మృత్యువు చేరనొల్లదు. సరేకదా ? వానిని జూచి మృత్యువు భయపడును. ఆతఁడు మోక్షముకోరువాఁడై, యోగమార్గమునఁ బరబ్రహ్మనే సతతము ధ్యానించును. దైవ ధ్యానము కామక్రోధాదులకు విరోధి యగుటచే వానిలోఁ గామక్రోధాదులు జనింపవు. ఆత్మాతిరిక్తమైన వస్తువును అనగా వనితాదులను దలంచువానిలోఁ దప్పక కామక్రోధాదులు సంభవించును. అట్టివాఁ డజ్ఞాని కావున మృత్యువు కామాది రూపమున వానిపైఁ బడి అణంచును. "ప్రీత్యా బాధ న్తితే చ తాన్" అను వచనములోఁ జెప్పినట్లు కామ, క్రోధ, లోభ, ప్రమాద రూపములతో నున్న మృత్యువు భూతములనువలెఁ (సామాన్య ప్రాణులనువలె) అజ్ఞానిని భక్షించును. ధీరుఁడు జ్ఞాని యగుటచే గామాదులనే తాను భక్షించును. అనగా నణఁగఁ ద్రొక్కును. అందుచేఁ బ్రతిమానవుఁడును ధీరుఁడై,

ఆత్మజ్ఞాన మార్జించుకొని, ఆ పరమాత్మనే నిత్యము ధ్యానించుట మంచిది. సర్వజ్ఞ నారాయణవాదీ, రాజతీర్థులును బైవిషయమునే ప్రకటించిరి.

శ్లో॥ కామానుసారీ పురుషః కామా నను వినశ్యతి ।
కామాన్ వ్యుదస్య ధునుతే యత్కించిత్ పురుషోరజః ॥

తా॥ కామాదుల ననుసరించి అపేక్షించు మానవుఁడు, కామాదుల చేతనే నశించును. కామాదులను విడనాడిన మానవుఁడు, వివేకవంతుఁడై, పుణ్యాపాపకర్మ ఫలమైన, రజస్సును ధ్వంసము చేయును. అనగా మృత్యువును దాఁటఁగల డన్నమాట.

నీలకంఠ భాష్యము :- కామాదుల ననాదరముగాఁ జూడక, దుఃఖహేతువులైన కామక్రోధ ప్రమాదముల ననుసరించువాఁడు, కామాదులచేతనే నశించును.

శ్లో॥ "కురంగ మాతంగ పతంగభృంగ
మీనాహతాః పంచభి రేవ పంచ"

అను సూక్తిని బరిశీలించినచో కురంగము (లేడి) మాతంగము (ఏనుగు) పతంగము (పక్షి) భృంగము (తుమ్మెద) మీనము (చేప) అను నైదును శబ్దము, స్పర్శము, రూపము, రసము. గంధము అను నైదింటిచే నాకర్షింపఁబడి, వరుసగా వానిచేతనే నశించునని తెలియుచున్నదికదా! కావున వివేకముతో గామాదులను విడిచిన పురుషుఁడే జన్మాంతరమున

గూడబెట్టఁబడిన పుణ్య పాపరూపకర్మలను ధ్వంస మొన ర్చును. పుణ్యపాప రూపమైన, కర్మయే రజస్సు, అనఁబడును. అదియే దుఃఖమును, దుఃఖహేతువు నగు మృత్యువని వివేకి, తెలిసికొనఁగలఁడు రజోరూపమైన పుణ్యపాపకర్మల ఫలమనుభ వించుటకే ప్రతిప్రాణియును జనన మరణములను బొందు చున్నాఁడు.

శ్లో॥ తమో ఽప్రకాశో భూతానాం నరకో ఽయం ప్రదృశ్యతే,
ముహ్యన్త ఇవ ధావన్తి గచ్ఛన్తః శ్వభ్రవ త్సుఖమ్॥ ౧౪

తా॥ ప్రాణులకు గ్రామమును, గ్రామాశ్రయమైన దేహ మును, జీకటివలె నుండి వారికిఁ గల వివేకమును బోఁగొట్టును. అది నరకమువలె దుఃఖమునే కల్గించును. కామమునకు వశు లైనవారు, మత్తెక్కిన వారివలె దుచ్ఛ సుఖములకై పఱువు లిడెదరు. అంధులవలె సంసారకూపమునఁ బడుదురు.

శం. భా. :– శరీరము ఎముకల స్తంభము. అది స్నాయు వులచే బద్ధమై యున్నది మాంస శోణితములు దానిని, బెన వేసికొని యున్నవి. పై భాగము చర్మకవచముచే గప్పఁబడి యున్నది. మూత్రపురీషముల దుర్గంధము దానిలోఁ బూర్ణ ముగాఁ గలదు. అందుచే శరీరము జరాశోకముల కాశ్ర యము. రోగములకు బుట్టినిల్లు. మలినభూయిష్ఠము. అనిత్యము అఖిలభూతములకు నివాసము. కావున మానవుఁడు దేహబంధ ము వీడవలెను అను విషయము నే.

శ్లో॥ "అస్థి స్థూణం స్నాయు బద్ధం మాంస శోణిత వేష్టితం ।
చర్మావనద్ధం దుర్గంధి పూర్ణం మూత్రపురీషయోః ।
జరా శోక సమావిష్టం రోగాయతన మాతురం ।
రజస్వల మనిత్యంచ భూతావాస మిమం త్యజేత్ ॥

పై శ్లోకమున మనువు చక్కగా వివరించి చెప్పెను. అందుచే రాజా! కామము కానిమ్ము, కామనిలయమైన దేహము కానిమ్ము. అది సకలభూతములచే నజ్ఞాన కార్యములను ఆచరింపఁ జేయును. కావున దానిని అవిద్యా స్వరూపమైన తమస్సుగాఁ దెలిసికొనవలసియున్నది. అది యనిత్యమును, అశుచియును, దుఃఖకరమునై యుండియు, మానవులకు, నిత్యమును, శుచియు నగు సుఖముగా స్ఫురించును. అది యప్రకాశ మగుటచేఁ (చీకటివంటి దగుటచే) మానవులకు విషయ వివేకమును, తత్త్వజ్ఞానమును గలుగనీయదు. కామావృతమైన ఈ దేహము "శ్లేష్మము, రక్తము, క్రిములు, మలమూత్రములు" అను వానితో నిండియుండుటచే నరకమై, స్థావర జంగమ ప్రపంచమునకు దుఃఖమునే ఒసగును. నరుల కిదియే నరకము. ఈ కామప్రభావముచే జీవులు మదిరముచే మత్తెక్కినట్లు పఱుపు లిడెదరు. శత్రువులచేఁ దఱుమఁబడినట్లును, గ్రహములచే గ్రహింపఁబడినట్లును, అంధులవలె బోవుచు, మహారంధ్రమును బోలిన సంసారకూపమునఁ బడుచున్నారు. సంసారము శ్వభ్రము వంటిది. అనగా మహారంధ్రము వంటిది.

వివరణము :- పై రెండు శ్లోకముల భావమును బరిశీలించినచోఁ బ్రతిమానవుడు కామక్రోధాదులను వీడి, వివేకియై

జ్ఞానముచే బూర్వజన్మకృత పుణ్యాపాప కర్మఫలములను నశింపఁ జేసికొని ముక్తుఁడగుటకుఁ బ్రయత్నించ వలెనని దెలియు చున్నది. లేకున్నచోఁ బాములను బట్టువాఁడు పాములచేతనే మరణించు నట్లు, కామాదుల నాశ్రయించువాఁడు కామాదుల చేతనే నశించును. కామము, కామాద్యావృత దేహమును, జీకటివంటివి. చీకటిలో నున్న వానికి, మంచిచెడ్డలు వస్తువుల జాడలును దెలియనట్లే, కామాదులు కలవానికి మంచిచెడ్డలు తెలియవు. అందుచే దప్పుపనులు చేసి వాఁడు దుఃఖరూప మృత్యువునే పొందును. కాముకునకు, మత్తెక్కిన వానికి, అంధునకును భేదము లేదు. అట్టి వానికి సంసారకూపమునఁ బడుట తక్క, వేరొక్క గతిలేదు. కామమునకు వశుఁడై రావణుఁడు నశించెను. క్రోధమునకు లొంగి దుర్యోధనుఁడు నశించెను. లోభమునకు గుఱియైన చిత్రగ్రీవాదులగు పావురములు చిక్కులలోఁ బడెను. మోహ పరవశుఁడగుటచేతనే దశరథుఁడు మరణించెను. అందుచేఁ బ్రతిమానవుఁడును గామ క్రోధాదులను విడి ధీరుఁడై జ్ఞానియై తరించవలెనని తెలిసి కొనవలసియున్నది.

:— మూఢ ప్రవృత్తి :—

శ్లో॥ అమూఢవృత్తేః పురుషస్యేహ కుర్యాత్
కిం వై మృత్యు స్తార్ణ ఇవాస్య వ్యాఘ్రః ।
అమన్యమానః క్షత్రియ కించి దన్యం
నాధీయత నిర్ణుద న్నివాస్య చాయుః ॥ ౧౫

తా॥ సకాముఁడై యుండుట మూఢవృత్తి, నిష్కా-
ముఁడై యుండుట అమూఢవృత్తి. నిష్కాముఁడైన అమూఢ
వృత్తిని, మృత్యువు గడ్డిపులివలెనుండి యేమియును బీడింపఁ
జాలదు. క్షత్రియుఁడా ! మూఢుఁడు దేహముకంటె భిన్న
మైనదియును, ఉత్కృష్టమైన బ్రహ్మవస్తువు కలదని యెఱుగఁడు.
అందుచే ఆధ్యాత్మిక విద్యను అభ్యసింపఁడు. కావున వానికిని
వాని దేహమే నిరర్థకమై మృత్యువై పీడించు నని యెఱుఁగుము.

శం భా. :- కామానృత మనస్కుఁడు మూఢవృత్తి
యగును. నిష్కాము డమూఢ వృత్తియగును. అమూఢవృత్తి
యైన పురుషుని, మృత్యువు, తృణముతో నిర్మింపఁబడిన
వ్యాఘ్రమువంటిదై, సర్పమువంటిదై, ఏమియును బాధింపలేదు.
మూఢవృత్తినే మృత్యువు పీడించును. వనితాదులను గాంక్షించు
మానవుఁడు విషయ విషాంధుఁడు. వానికి దేహముకంటె
ఆత్మ భిన్నమైనదని, ఉన్నతమైనదని, తెలియదు. అందుచే
వాఁడాత్మవస్తువు నెఱుఁగ యత్నింపడు. ఆధ్యాత్మిక శాస్త్రము
నభ్యసింపడు. వాఁడు వేదవేదాంగ విదుఁడైనను వానికి
దేహము, తృణనిర్మితమైన, వ్యాఘ్రమువలె నిరర్థకమే యగును.
అట్టి వాఁడు వేదవిద్వాంసుఁడైనను, వేదార్థమును బ్రహ్మ
జ్ఞానమును ఎఱుగని కారణమున, బ్రాహ్మణ గర్దభుఁడగును.
అనగా భారము మోయు గాడిదవలెనుండు నన్న మాట.
శ్లో॥ "చతుర్వేద్యపి యోవిప్రః సూక్ష్మం బ్రహ్మ నవిందతి,
వేదభారం భరాక్రాంతః సవై బ్రాహ్మణ గర్దభః" అను
సూక్తిలో జ్ఞానవాసిష్ఠమున వసిష్ఠుఁ డీవిషయమునే వివరించెను.

సీ. భా. కావున మూఢవృత్తిని దేహామే మృత్యువై పీడించును. అజ్ఞాని, మూలచ్ఛేదము గావించు కామమును, నీచముగా భావింపక, జగమున జన్మించి, భ్రమించును ఆకాశమును ఆవరించు రంగులవలె నుండు దేహమును, గామమును క్షణికములని యెఱుగడు. కావున మూఢుఁ డేనాటికైనను, గామాదులను విస్మరింపనిదే వానికి స్వాస్థ్యము కలుగదు.

శ్లో॥ "భ్రమస్య జాగ్రతస్యాస్య జాతస్యా కాశ వర్ణవత్ ।
అపున స్స్మరణం మన్యే సాధో విస్మరణం వరం ।
తథా పి తవ న స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే ॥

అను సూక్తిలో వసిష్ఠుఁ డీ విషయమునే వివరించి చెప్పెను. అల్పచేతనుఁడైన బాలుఁడు జాతిపులివలె అచేతనుఁడై యుండును. కాముకుఁడును వానితో సమానుఁడుగనే స్మరింపఁబడును. అందుచేతనే వాఁడు బ్రహ్మజ్ఞానమును బడయఁజాలడు.

ఇట్లు జ్ఞాన స్వరూపమును జెప్పినపిమ్మట, రాజా నీకును ఈ మృత్యువు కలదు సుమా! అని చెప్పఁదొడగెను

శిం. భా. :- అయ్యా! దేహము కేవలము నిరర్థకము కాదుసుమా! అదియే అజ్ఞానులపాలిటి మృత్యువని యెఱుఁగుము. క్రోధ లోభముల మూలమున మోహ సమన్వితమై ఆత్మయే జీవులపాలిటి మృత్యువు. జితేంద్రియులు కానివారి కిదియే ముమ్మాటికిని, వినాశ హేతువైన మృత్యువుగా నుండును. ఆత్మయే ఆత్మకు బంధువు. ఆత్మయే, ఆత్మకు శత్రువు అను

భావమును, "ఆత్మైవహ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః" అను గీతావచనము తెలుపుచున్నది.

నీ. భా. :- "అహం" అనుపదముచే దెలియఁదగినది. అంతరాత్మయైన బ్రహ్మతత్త్వము. అది యన్నివస్తువులందును గలదు. బాహ్యముగా గానవచ్చు శరీర మా యా వస్తువులకు మాత్రమే చెందియుండును. "తత్" అనుపదముచే దెలియ దగినది బ్రహ్మపదార్థము. బ్రహ్మపదార్థము కానిదానిని అజ్ఞానముచే బ్రహ్మపదార్థ మనుకొను బుద్ధియే మోహము. మోహవంతుఁడైన అజ్ఞాని ఆత్మకాని దేహాదులను ఆత్మగా భావించును. అందుచే వానిలో క్రోధలోభములు జనించును. అవియే అజ్ఞానికి మృత్యువులు "శుక నలికా న్యాయమును" అనుసరించి, మోహవంతుఁడైన మానవుఁడు స్వయముగా బంధహీనుఁ డైనను, అజ్ఞానముచేఁ దన నేదియో బంధించి నట్లు భావించి, బంధవిముక్తిని గోరును. అందుచే వాఁడు కామాది వశుఁడై జననమరణాదులను బొందును. రథ గజా దుల నధిష్ఠించు యోధుఁడు, శుకనలిక మను అస్త్రస్పర్శచే, మోహితుఁడై, భయము లేకున్నను, భీతుఁడై, తనవాహనముల నంటుకొనియుండి, శత్రువుల నెదుర్కొన లేక, మృతుఁడగును. అట్టిగతియే, శుకనలికా న్యాయముచే మోహవంతునకుఁ బ్రాప్తించును. శుకనలికము, మోహోత్పాదక మగు నస్త్రము. కావునఁ బ్రతిశరీరమందును మోహరూపమైన మృత్యువు కల దని యెఱుఁగుము. ప్రతి జీవినిఁ గామ క్రోధ లోభ మోహము లావరించి యుండును. అందుచే వానికిఁ బ్రమాదము తప్పదు.

అట్టి "ప్రమాదమే మృత్యువు" అని తెలిసికొనవలెను.

-: మృత్యు స్వరూపము - మృత్యు వినాశము :-

శ్లో॥ (1) సక్రోధ లోభా మోహవాన్ అంతరాత్మా
సవై మృత్యుః త్వచ్ఛరీరేయ ఏషః॥
(2) ఏవం మృత్యుం జాయమానం విదిత్వా
జ్ఞానే తిష్ఠన్ న బిభేతీహ మృత్యోః॥
వినశ్యతే విషయే తస్య మృత్యుః
మృత్యో ర్యథా విషయం ప్రాప్యమర్త్యః॥　౧౮

తా॥ (1) అయ్యా! మృత్యువన నెచ్చటనో లేదు. క్రోధ లోభ మోహముల రూపమునను, వానిచే జనించిన అహంకారముతోఁ గూడి యున్న అంతరాత్మ రూపమునను మృత్యువు నీలోనే కలదు. అది నీ శరీరమునే ఆశ్రయించి యున్నదని యెఱుఁగుము.

(2) పై విషయములను బట్టి, కామము, క్రోధము, లోభము, మోహము, అహంకారము, ప్రమాదము అను నవియే మృత్యు స్వరూపములని యెఱుఁగుము. జ్ఞానమార్గమున నుండి, ఆత్మపదార్థము నెఱిగిన మానవుఁడు మృత్యువునుండి భయపడడు. మృత్యువిషయమైన సంసారమును బొందిన మర్త్యుఁడు మృత్యువువలన, నశించినట్లే, జ్ఞాని చెంతకు వచ్చిన మృత్యువుకూడ, జ్ఞానముచేతనే నశించును.

శం. భా. :- ప్రమాదాఖ్యమైన మృత్యువు, క్రోధాది

రూపమున జన్మించి, జననమరణాది సర్వానర్థములకు మూల మగుచున్నది. కావున మానవుఁడు, క్రోధాదులను వీడి, జ్ఞానము నొంది, తానే సచ్చిదానందాద్వితీయమైన బ్రహ్మ వస్తువు అని భావించు కొనవలెను. అట్టి యాత్మజ్ఞానము కల వాఁడు మృత్యువునుండి భయపడఁడు.

"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుత శ్చ న" అను శ్రుతియు పై విషయమునే ప్రకటించు చున్నది. మృత్యు వెట్లు కల్గుచున్నదో తెలిసికొని జ్ఞానమార్గమున నున్నవాఁ డెన్నడును మృత్యువునుండి భయపడఁడు. మృత్యువిషయక మైన సంసారమును బొందిన మర్త్యుఁడు, తప్పక అజ్ఞానమనెడి మృత్యువునుండి, నష్టము పొందును. అట్లే బ్రహ్మసాక్షా త్కారము పొందిన జ్ఞానివిషయమై వచ్చిన మృత్యువుకూడ జ్ఞానమువలన నశించి తీరును. జ్ఞానమువలననే మానవుఁడు సద్భావమును బొందును. అందుచే జ్ఞానాగ్నియై, జ్ఞానవజ్రము చేతఁదాల్చి, వీతమత్సరుఁడై ధర్మవీరుఁడై మృత్యువును దప్పక నశింపఁ జేయునను విషయము.

శ్లో॥ "జ్ఞానసంస్థాన సద్భావో జ్ఞానాగ్ని ర్జ్ఞాన వజ్రభృత్ ।
మృత్యు హా న్తేతి విఖ్యాతః సవీరో వీతమత్సరః" ॥

జ్ఞానమహోదధి యందలి యీ శ్లోకముచే విదిత మగుచున్నది.

వివరణము :- పై శ్లోకము లందు మూఢుఁడు, అమూఢుఁడు, మృత్యుస్వరూపము, మృత్యువినాశము అను వానిని గూర్చి చక్కగా వివరింపఁబడినది. ఎట్లన ! కామసహి

తుఁడు మూఢుఁడు. నిష్కాముఁడు, అమూఢుఁడు. మూఢులకు మొండిపట్టుదల యెక్కువ. ఈనాడు మూఢు లధికమగుట చేతనే భారతదేశము ఈతిబాధలకుఁ బెక్కింటికి గురియగుచున్నది. మూఢులను మృత్యువు నిజమైన పులివలె, సర్పమువలె బట్టి పీడించుచున్నది. అందుచేతనే ఈనా డకాల మరణము, హాతాన్మరణ మనెడి అపమృత్యువు బాధ అధికమైనది. మన పెద్దలు అపమృత్యు భయము తొలగించుటకు, మూఢులను జ్ఞానులుగా మార్చుటకునై -

"త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ।
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యో ర్ముక్షీయ
మామృతాత్" ॥

"అపమృత్యు మపక్షుధం అపేత శ్శపథం జహి"
"యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు"

అనెడి మంత్రములను జపింపఁ జేసెడివారు. అపమృత్యు పరిహారమునకు జప హోమౌషధాదులు కారణములు కాగా, ఈనాఁడు జపహోమములను వీడి, కేవలము ఔషధములనే పట్టుకొని వ్రేలాడుచున్నారు. అందుచే భగవంతుని దయ జీవులపట్ల దిగజారుచున్నట్లున్నది.

మూఢులు నిజముగా జ్ఞానులుగా మారినచో వారిచెంత మృత్యువు గడ్డిపులివలె, గడ్డిపామువలెనే యుండును. ఏమియును జేయలేదు. సావిత్రీదేవి, సుమతీదేవియు అపమృత్యువు

నుండి తమ భర్తలను తప్పించుకొనలేదా! మార్కండేయుఁడును, నచికేతుఁడును మృత్యుబాధను మీఱలేదా ? మనమును నిష్కాములమై అట్లేల ప్రయత్నింపరాదు ?

జ్ఞాని నైతి నని కేవలము వేదమంత్రములను వల్లెవేసి నను లాభము లేదు. వేదమంత్రార్థ మెఱిగి, బ్రహ్మజ్ఞాన మార్జించిన వాఁడే వేదమంత్ర పఠనము సార్థక మగును. మూఢులు, కాముకులు, జ్ఞానులుగా మాఱలేక దేహ మోహ మును వీడ లేకున్నారు. నిజమాఱయ యీ దేహ మాకాశ మందలి రంగులవలె అశాశ్వతమే. క్షణభంగురమే. ఆ విషయ మెఱిఁగినచోఁ బ్రతిప్రాణికిని దేహ మోహము తగ్గును. అప్పుడు మృత్యువును వానికి దూరముగనే యుండును. మృత్యుస్వరూ పము వారికిఁ దెలియును. మృత్యువనగానే లోకులు భయ పడుదురేకాని, మృత్యుస్వరూపము తెలిసికొన యత్నింపరు. జ్ఞానాగ్నిచే దానిని నశింపజేసికొనలేరు. మృత్యువన నేమో తెలిపి, మృత్యు భీతిని దొలగించుటకే, వ్యాసభగవానుఁడు భగవద్గీతకంటె ముందుగా సనత్సుజాతీయము వ్రాసినాఁడు. ధర్మరాజు ధర్మవిదుఁడు. మాత్సర్య హీనుఁడు. జ్ఞానవజ్రము చేతఁ దాల్చినవాఁడు. కావుననే మృత్యువును మీఱి స్వశరీర ముతో స్వర్గమున కేగ గల్గినాఁడు. కావునఁ బ్రతిమానవుఁడును జ్ఞానమార్గమున మృత్యువును మీఱుటకు యత్నించుట మంచిది.

## —: కర్మమార్గ ప్రశంస :—

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ యానే వాహు రిజ్యయా సాధు లోకాన్
ద్విజాతీనాం పుణ్యకృతమాన్ సనాతనాన్ ।
తేషాం పరార్థం కథయంతీహ వేదాః
ఏత ద్విద్వాన్ నోపైతి కథంను కర్మ ॥ ౧౭

తా॥ శం. భా. :- మోక్ష సాధనములలో జ్ఞానమే కర్మలకంటె గొప్పదని యెఱిఁగియు, ధృతరాష్ట్రుఁడు, మరల కర్మమార్గమును గూర్చి ప్రశ్నింపఁ దొడగెను. అయ్యా! విప్రులు జ్యోతిష్టోమము, అశ్వమేధము మున్నగు యజ్ఞకర్మల నాచరించి, ఆచరింపఁజేయుచు, స్వర్గము మొదలు బ్రహ్మ లోకము వరకును గల ఉత్తమ లోకములను బొందుచుఁ బొందింపఁ జేయుచున్నారు. అవియే అన్నిటికంటెను బవిత్రములు; నిత్యములును. ఆ యుత్తమ లోకములే మోక్షప్రాప్తికి సాధనము లని వేదములు చెప్పుచున్నవి. వేదవేత్తలును జెప్పుచున్నారు, పరమపురుషార్థప్రాప్తికిఁ, గర్మలే సాధనములని యెఱిగిన విద్వాంసుఁడు కర్మమార్గము నెట్లు పొందక యుండ గలఁడు? అని మఱల మఱలఁ బ్రశ్నింపగా సనత్సుజాతుఁ డిట్లు చెప్పెను.

శ్లో॥ ఏవం హ్యవిద్వా నుపయాతి తత్ర
తత్రార్థ జాతంచ వదన్తి వేదాః ।

స నేహాయాతి పరం పరాత్మా
ప్రయాతి మార్గేణ నిహంత్య మార్గాన్ ॥ ౧౮

తా॥ అయ్యా! విద్వాంసుఁడు కానివాఁడు జ్ఞానహీనుఁడు బ్రహ్మలోకాది సాధనభూతమైన కర్మమార్గమునఁ బ్రవేశించును. ఆనందాది లోకము లందలి ప్రయోజనములు, కేవలము, అజ్ఞానికి, అనగా సకాములకుఁ జెందినవిగా వేదములు చెప్పుచున్నవి. విద్వాంసులు పరమాత్మ స్వరూపులు, కాన వారు నిష్కాములై పరమాత్మనే పొందుచున్నారు. జ్ఞానులు సంసారబంధ హేతువులైన మార్గములను విడనాడి జ్ఞానమార్గమునఁ బరమాత్మనే పొందుదురు.

శం. భా. :- విషయ విషాంధుఁడు విద్వాంసుఁడు కాడు. ఆతఁడు బ్రహ్మలోకాదుల సుఖము సాధ్య మని తలంచును. అందుచే వాఁ డవిద్యా దోషముచే బ్రహ్మలోకాదులు చెందుటకు సాధనము కర్మమార్గమే, అని తలంచి కర్మమార్గమునఁ బ్రవర్తించును. కాని విద్వాంసుఁడు మాత్రము, అట్టి మార్గమునఁ బ్రవర్తింపఁడు. వివేకహీనుఁ డజ్ఞానముచే నావరింపఁబడిన "అనందము"లని ప్రసిద్ధిఁ జెందిన లోకములనే చేరి, మఱల మానవలోకమునకు వచ్చుచున్నాడు. ఈ విషయమే-

శ్లో॥ అనందానామ తే లోకా అంధేన తమసా వృతాః ।
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛ న్త్యవిద్వాం సోఽబుధాజనాః ॥

అని బృహదారణ్యక మంత్రమునఁ జెప్పఁబడినది. అనందాది లోకములందుఁ గల ప్రయోజనములు కేవలము

వివేకహీనునకుఁ జెందినవే యని వేదములు చెప్పుచున్నవి. విద్వాంసుఁడు మాత్రము, బ్రహ్మలోకా ద్యనిత్య సుఖమునకు సాధనమైన కర్మమార్గమునఁ బ్రవర్తింపడు బ్రహ్మవేత్త బ్రహ్మయే యగును. ఆతఁడే నిష్కాముఁడు. వానినే అనీహుఁ డందురు. అతఁ డాత్మజ్ఞానముచేఁ బరాత్మయై, పరమునే పొందును. ఆతఁడు ధర్మాధర్మోపాసనా రూపములైన మార్గములను, సంసారబంధ హేతువులుగా గ్రహించి, విడనాడి, ఉత్తమ మార్గమున బరబ్రహ్మనే చేరును.

కొందఱు విద్వాంసులు సగుణ బ్రహ్మను ఉపాసనా మార్గమున ఆరాధించి, బ్రహ్మలోకాదులలో ఉపాసనా ఫలమునే పొందుదురు. వారికిఁ జెందిన ప్రయోజనములను గూర్చి వేదములు చెప్పుచున్న మాట నిజమే. అట్టివారీ లోకమునఁ గర్మల నాచరించువారుగా జన్మింపరు. వారు సంసార హేతువులైన విరుద్ధమార్గములను విడనాడి పరమాత్మ రూపులై కాలాంతరమునఁ బరబ్రహ్మను బొందుదురు.

నీ. భా. :- అజ్ఞాని కర్మమార్గముద్వారా, చిత్తశుద్ధిని బొందును. చిత్తశుద్ధి యేర్పడిన పిమ్మట జ్ఞానము పొంది, తద్ద్వారా మోక్షము పొందును. ఇదియే క్రమముక్తి యనఁ బడును. కర్మ మార్గము నాశ్రయించు వానికిఁ జెందిన భోగ మోక్ష రూపసామాన్య ప్రయోజనములను గూర్చియు వేదములు చెప్పుచున్నవి. ఆత్మకాని దేహాదులను, అవిద్యచేఁ నాత్మగా గ్రహించువాఁడు జీవుఁడు. వాఁడే "పరాత్మ" అన బడును. అట్టి జీవుఁడు నిష్కాముఁడై పరమైన నిర్గుణాత్మనే

ముఖ్యముగాఁ బొందును. అనగా నిష్కామునిను, ఆయా యుపాధుల యాకారమును వీడి, నిష్కలమైన రూపముతోడనే యుండుననన్న మాట. ఇంకొక రీతిగాఁ జెప్పవలె నన్నచో ఆ జీవుఁడే సుషుమ్నా నాడీ మార్గమునఁ బరమాత్మను ధ్యానించి, ఆయా యధోలోకములను జేర్చు మార్గములను దొలగించుకొని, బ్రహ్మలోకముద్వారా, పరమును, అనగా మోక్షమును అమృతత్వమును బొందుచున్నాడని తెలిసికొనవలసి యున్నది. ఈ విషయమే "తయోర్ధ్వ మాయ న్నమృతత్వమేతి" అను శ్రుతిచే వ్యక్త మగుచున్నది. స్వర్ణకారుని పేశస్కారి యందురు. బంగారు పనివాఁడు బంగారు ముక్కను గైకొని కల్యాణకరమైన క్రొత్త వస్తువు గావించి, దానికిఁ జక్కని రూపమును జేకూర్చును. భ్రమరము ఒక కీటకమును దన గూటిలోఁ జేర్చి, దానికి గ్రొత్తరూపమును గూర్చును. అటులనే పరబ్రహ్మ పై న్యాయములలో జెప్పినట్లు జీవునకుఁ గల పూర్వశరీరమును దొలగించి, జ్ఞానము నొసఁగి, కల్యాణాకరమైన క్రొత్తరూపమును గూర్చును. ఆ క్రొత్తరూపము, పిత్ర్యమో, గాంధర్వమో, దైవమో, ప్రాజాపత్యమో, బ్రాహ్మమో కావచ్చును. అట్టి రూపము ఏ లోకమునకుఁ జెందినదైన నేమి? ఆజీవి సకాముఁడైననుఁ నిష్కాముఁడైనను, ఆప్తకాముఁడైనను గావచ్చును. ఎవఁడైనను వాని బొందినుండి ప్రాణము తొలగుట, క్రొత్తబొందిలో దూరుట తప్పదు. వాఁడు సంపూర్ణ బ్రహ్మభావము పొంది నిష్కాముఁ

డైనచో బ్రాణోత్క్రాంతి కల్గినను, వాని ప్రాణములకీలోక ప్రాప్తి యుండదు.

వివరణము :- "నాన్యఃపంథా విద్యతే ఽయనాయ" ఉత్తమలోక ప్రాప్తికి గర్మమార్గము కంటె వేరు మార్గము లేదు. "నాస్త్యకృతః కృతేన" కర్మల నాచరించినచో అకృత మన్నదే యుండదు. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" పుణ్యము క్షీణింపగనే జీవులు మర్త్యలోకమును బ్రవేశించు చున్నారు. అని యిట్లు వేదమంత్రము లెన్నియో కామ్యకర్మ లకు ఫలము, ఉత్తమలోకములు పొందుటయే యని తెలియఁ జేయుచున్నవి. కావున అందఱును సామాన్యముగాఁ గామ్య కర్మలనే ఆచరింతు రని తెలియుచున్నది. కామ్యకర్మములకుఁ జెందిన లోకము లపార్థములు. అనగా మోక్షప్రయోజన శూన్యములు. అని యెఱిఁగిన విద్వాంసుఁడు నిష్కామ కర్మ లందే ప్రవర్తించును. నిష్కామముగా యజ్ఞాది కర్మల నాచ రించువారు సోమరసము ద్రాగి అమృతు లగుదురు. వారు కర్మమార్గముచే చిత్తశుద్ధిని, తద్ద్వారా జ్ఞానమును బొందు దురు. పిమ్మట వారు ముక్తి బొందుదురు.

"అపామ సోమ మమృతా అభూమ" "కర్మణా జ్ఞాన మాతనోతి" మున్నగు వేదమంత్రములు పై విషయమునే వివరించి చెప్పుచున్నవి. నిష్కాముఁడు జ్ఞానియైనచోఁ గామ్య కర్మల చెంత చేరడు. స్వర్గాది మార్గములు, మఱల మరణ మును జేకూర్చునని తెలిసికొని, ప్రవృత్తి మార్గములను విడ నాడును. అతఁడు పరమాత్మయందే మనసు నిల్పి, అర్చిరాది

మార్గముల ద్వారా పరమపురుషునే చేరును. సగుణోపాసకు లకు, అనగా దమతమ యిష్టదేవతల నారాధించు వారికి జిత్త శుద్ధిద్వారా క్రమముక్తి లభించును. ఉపాసనా విధానము కర్మమార్గమే యైనను, ఆ మార్గము నాశ్రయించువారు షట్చక్రారాధనమున సుషుమ్నామార్గమునఁ బరమాత్మ నారాధింతురు. అప్పుడు వారు సోహం భావరూప సమాధిలో బ్రహ్మభావము పొంది ముక్తులగుదురు. కావునఁ కర్మమార్గము కూడ ఉత్తమమైనదే యని తెలిసికొన వలెను. ప్రతిమానవుఁడు నిష్కామముగాఁ గర్మల నాచరించుట ఉత్తమ పద్ధతి.

—: బ్రహ్మ జీవ వాద పక్షము - సమాధానము :—

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ కోఽసౌ నియుంక్తే తమజం పురాణం
సచే దిదం సర్వ మనుక్రమేణ ।
కిం వాస్య కార్య మథవా సుఖం చ
తం మే విద్వన్ బ్రూహి సర్వం యథావత్ ॥ ౧౫

తా॥ అయ్యా! పరమాత్మ జననమరణాది రహితుఁడు, పురాణపురుషుఁడు. ఆతడే క్రమముగాఁ బాంచ భౌతికమైన జగత్తును సృష్టించి, అందుఁ బ్రవేశించు చున్నాడు అని చెప్పితి రేని? పరమాత్మను సంసారమునఁ బ్రవేశింపుమని, నియోగించు వాఁ డెవఁడు? లేదా స్వయముగాఁ బరమాత్మయే లోకమునఁ బ్రవేశించె నంటిరేని, ఆతనికిఁ గల్గు లాభమేమి?

అందుచే నాతనికిఁ గల్గు సుఖమేమి ? విద్వాంసుఁడా ! సమస్త మును యథార్థముగా నెఱిగింపుమని ధృతరాష్ట్రుఁ డడిగెను.

శం. భా. :- సనత్సుజాతుఁడు ప్రమాదరూపమైన యజ్ఞానమే మృత్యువు. అప్రమాదమే అమృతత్త్వము, అను విషయమును "ప్రమాదం వై మృత్యు మహం బ్రవీమి" అను శ్లోకమున వివరించెను. కార్యాత్మగాఁ బరిణతి చెందిన, మృత్యువు మోహమై, సర్వానర్థములకు హేతువగును, అను విషయమును "అస్యా దేశా న్నిస్సరతి" "స వై మృత్యు స్త్వచ్ఛరీరే య ఏషః" అను శ్లోకములలో వివరించి చెప్పెను. ఆత్మజ్ఞానముచే మృత్యు వినాశము జరుగును. అను విషయమును- "ఏవం, మృత్యుం జాయ మానం విదిత్వా, జ్ఞానేన తిష్ఠన్ న బిభేతీహ మృత్యోః" అను శ్లోకమున వివరించెను. "యా నేవాహు రిజ్యయా" మున్నగు శ్లోకములలో బ్రహ్మలోకాదులకుఁ బురు షార్థత్వము శంకించియు, "ఏవం హ్యవిద్వాన్" అను సూక్తిలో ఉత్తమ లోకాదులు, అవిద్యావంతులకు విషయములు కానఁ బురుషార్థహీనములే యని చెప్పెను. "పరం పరాత్మా ప్రయాతి మార్గేణా" అను దానిలో జ్ఞానమార్గమే మోక్ష ప్రద మని వివరించి చెప్పెను. జీవ పరబ్రహ్మలు రెండును ఒకటే యను విషయమును "పరం పరాత్మ ప్రయాతి" అను సూక్తిలో వివరించెను. అవన్నియు విని, సహింపఁ జాలక, ధృతరాష్ట్రుఁడు మఱలఁ బ్రశ్నించెను.

అయ్యా ! సత్యాది లక్షణములు గల పరమాత్మ, క్రమముగా, ఆకాశాది పంచభూతములతో నిండిన జగత్తును

సృష్టించి, అందుఁ బ్రవేశించి, అన్నమయాది కోశరూపమున నున్నచో, అంతటను వ్యాపించుచో, జన్మరహితుఁడైన పురాణ పురుషుని, సంసారమునఁ బ్రవర్తింపఁ జేయువాఁ డెవఁడు ? తానే స్వయముగా సంసారమునఁ బ్రవేశించు చున్నాఁ డంటి వేని, నానాయోనులలో జన్మించుటవలన నాతని కేమి ప్రయో జనము కలదు ? నానాయోనులలో జన్మించియుఁ దూష్ణీం భూతుఁడై, తనమహిమతో మెలఁగు వానికిఁ సంసారమునఁ బ్రవేశింప నున్నఁ గల్గు అనర్థమేమి ? విద్వాంసుఁడా ! తమకు సర్వము తెలియును. గావునఁ నాకు యథార్థ మెఱిగింపుఁడు. బ్రహ్మవేత్తలకు హృత్పుండరీకమున నుండు బ్రహ్మవస్తువు ఒక్కటే ప్రధానము. అయినను భగవంతుఁడైన యాజ్ఞ వల్క్యుఁడు, ఆ బ్రహ్మవస్తువు నుండే సృష్టి జరిగినట్లు చెప్పి, వానికే జీవత్వమును ఆరోపించి,

శ్లో॥ యద్యేవం సకథం బ్రహ్మన్ పాపయోనిషు జాయతే ।
స ఈశ్వరః కథం భావై రనిష్టై స్సంప్రయుజ్యతే ॥

అని వాఁ బ్రుచ్ఛను.

దీని భావమేమన ? బ్రహ్మణ్యుఁడా ! ఆ బ్రహ్మ వస్తువే ఈ విధముగా సృష్టి గావించినపుడు ఆ పరమాత్మ పాపయోనులలో నెట్లు జన్మించు చున్నాడు ? అందఱకును ఈశ్వరుఁడైన ఆతఁ డనిష్టమైన భావముతో నెట్లు మేళవింపఁ బడుచున్నాడు ? అని "కో౽సౌ నియుంక్తే" అను శ్లోకము నాధారముగాఁ జేసికొనియే కదా యాజ్ఞవల్క్యుఁడు మహా

వక్తలనుఁ బోధ్యమగు నట్లు బ్రహ్మజీవవాద పక్షమును స్పష్ట ముగాఁ జెప్పెను.

సీ. భా. :- పరమాత్మ సర్వనియోజకుఁడు, కాన జీవత్వమును బొందినఁ బొందవచ్చును. సామాన్యులలో నొకఁడు ఇంకొకని రూపము పొందుట పొసగదు. కాన జీవుఁడు పరబ్రహ్మరూపము పొందు చున్నాడనుట యుక్తము కాదుకదా ! జన్మరహితుఁడును, బురాణ పురుషుఁడు నగు పరమాత్మ జీవుఁడుగా బరిణమించు చున్నాడనుట ఎన్నడును బొసఁగదు. కానఁ బరమాత్మ యెవని నియోగముచే దుఃఖ భాగుఁ డగుచున్నాడు. పరమాత్మకు నియోజకుఁ డున్నచో ఆ నియోజకునకు వేరొక నియోజకుఁ డుండవలసి వచ్చును. అట్లు నియోజకుల కానన్త్యము ప్రాప్తించును. నియోజకులు పెక్కు రుండుట తటస్థించును. అది లోకవిరుద్ధము. "తత్సృష్ట్వా త దేవాను ప్రావిశత్" అను శ్రుతిలో దత్పదార్థమైన బ్రహ్మయే సృష్టికావించి, ఆ సృష్టిలోఁ దాను బ్రవేశించు చున్నాడు, అని చెప్పఁబడినది. దాని నాధారముగాఁ గొని, వేరొక నియో జకుఁ డక్కఱలేకయే, పరబ్రహ్మయే, చేతనా చేతనరూపమగు విశ్వముగాఁ గ్రమముగా మారు చున్నాడనుటయుఁ బొసఁగదు. కారణమేమన ? ఆప్తకాముఁ డగుటచే నిష్కాముఁడైన పర బ్రహ్మకుఁ బ్రకృతిలోఁ గర్తవ్య మేమున్నది ? ఏమియును లేదు. ఐనచో "ప్రయోజన మనుద్దిశ్య న మందో ఽపి ప్రవ ర్తతే" అనగాఁ బ్రయోజన ముద్దేశింపక, మందుఁడైనను బ్రవర్తింపడు అను న్యాయమునఁ జెప్పినట్లు ప్రయోజనమే

లేనపుడు పరమాత్మకు ఈ లోక ప్రవృత్తి యేల ఉండవలె ?

"లోకవత్తు లీలాకైవల్యమ్" అను న్యాయము ననుస రించి, లోకమున నిష్ప్రయోజన మైనను, చతురంగాది క్రీడ జరుగుచున్నట్లే పరబ్రహ్మకును, జగత్సృష్టి అందుః ప్రవే శించుట మున్నగు నవి విలాసార్థమే జరుగు చున్నవని చెప్పు టయును గుదరదు. కారణ మేమన ? చతురంగాది క్రీడ సుఖము కొఱకు విలాసమునకు జరుగుచున్నది. పరబ్రహ్మకు అట్లు సుఖము పొందవలె నను కాంక్ష లేదుగదా ! తనను దానే సంకటమునఁ బడఁద్రోచు కొన్నచో అట్టి వానికి సుఖ ముండదు గదా ! పరాత్పరునకు సహజముగా సృష్టిలోఁ బ్రవృత్తి సంభవింపదు. పరమాత్మతో జీవున కభేదమును సంభ వింపదు. జీవ పరబ్రహ్మలకు భేద మున్నపుడు జీవునకుఁ గల అదృష్టానురోధముచేఁ బరబ్రహ్మ రాజువలె జీవ భోగము కొఱకు స్వకృత మర్యాదను బరిపాలించుటకు సృష్ట్యాదిలోఁ బ్రవర్తించుచున్నా డనుట పొసఁగు చున్నది. అందువలన జీవ పరమాత్మల కభేదము సంభవింపదు. కాన యథార్థ మెఱిఁ గింపు డనిన ధృతరాష్ట్రునకు సనత్సుజాతుఁ డిట్లు చెప్పెను.

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ దోషో మహా నత్ర విభేదయోగే
వ్యానాదియోగే న భవన్తి నిత్యాః ।
తథా స్య నాధిక్య మపైతి కించి
దనాదియోగేన భవన్తి పుంసః ॥ ౨౦

తా॥ జీవబ్రహ్మవాదమును గూర్చి సనత్సుజాతుఁ డిట్లు చెప్పఁదొడఁగెను. రాజా! జీవపరబ్రహ్మలు వేరు, అనెడి విభేదయోగమున గొప్ప దోషము కలదు. అట్లు వాదించు వారికి గొప్ప భయమును, నష్టమును గలవు. అనాదియైన ప్రకృతియొక్క సంబంధముచే జీవుఁడు నిత్యుఁ డగుచున్నాడు. ప్రకృతి కార్యము, పురుషుఁడు కారణము. కార్యకారణ స్వరూపుఁడు, పరమాత్మయే. కావున జీవబ్రహ్మ లొకటే యని చెప్పిన మాత్రాన బ్రహ్మపదార్థమునకుఁ గల యాధిక్యము లేశమంతైనను దొలఁగదు. అనాదియైన ప్రకృతియొక్క యోగముచేతనే జీవరూప పురుషులు పెక్కు రేర్పడు చున్నారు.

శం. భా. :- రాజా! నీవు నియోజకుఁడు వేరు; నియోజ్యుఁడు వేరు అను భేదమును జూపుచున్నావు. అట్టి భేదము కూటస్థుఁడును, నిత్యుఁడు నగు పరమాత్మకు సంభవింపదు. ఒకప్పుడు నీవు, పరబ్రహ్మకే నానాత్వమును, అనగా నానా రూపధారిత్వమును, అంగీకరించి చెప్పితివేని, నీవు చెప్పిన విభేద యోగమున, అనగా బ్రహ్మకు నానాత్వము కలదు. అనుటలోఁ జాల గొప్ప దోషము సంభవించును. నీవు చెప్పిన పక్షము నంగీకరించినచో అద్వైతులు, అయథార్థవాదులు, అవైదికులును నగుదురు. పరమార్థమగు అద్వైతమును, వేదప్రామాణ్యమును బాధ్యములగును. అది పొసఁగదు. పరమాత్మకు నానాత్వమును జెప్పినచోఁ బరమాత్మ కనిత్యత్వము మున్నగునవి సంభవించును. పరమాత్మ స్థూలరూపుఁడు కాఁడు, అని

చెప్పిన మహావాక్యములతో విరోధము సంభవించును. పర బ్రహ్మకు నానాత్వమును మే మంగీకరింపము. అంతే కాదు, జీవబ్రహ్మలకు భేదము కలదు, అని నీవు చెప్పిన మతమున దోషమును, నష్టమును గలవు.

"యదా హ్యేవైష ఏతస్మి న్నుదర మంతరం కురుతే, అథ తస్య భయం భవతి" పండితుఁడైనను, బరబ్రహ్మ యందు ఇంచుకంత భేదబుద్ధిని గాంచినచో వానికి భయము కల్గును.

"మృత్యోః స్సమృత్యు మాప్నోతి। య ఇహ నానేవ పశ్యతి". ఈ పరబ్రహ్మకు నానాత్వమును జూచువాఁడు కల్పించువాఁడు మృత్యువువలన మృత్యువు పొందును.

"అథ యోఽన్యాం దేవతా ముపాస్తే అన్యోఽసా వన్యోఽహమస్మీతి న సవేద యథా పశుః॥ ఎవఁడు బ్రహ్మ కంటె భిన్నదేవత నుపాసించునో, "బ్రహ్మవేరు, నేనువేరు" అని యెవఁడు భావించునో, వాఁడు పశువువలె బ్రహ్మను దెలిసి కొనలేక బాధపడును.

"అథ యేఽన్యథాతో విదు రన్యరాజా న స్తే క్షయ్యా లోకాభవన్తి" ఎవరు బ్రహ్మకంటె వేరు వస్తువును దెలిసి కొందురో, భిన్నప్రభువులు కల్గియుందురో వారు క్షీణింప దగు లోకములను జేరుదురు.

"సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వంవేద" పరాత్మకంటె ఆద్యుఁడు కలఁడను వాఁడు బ్రహ్మలోకమును జేరక, వేరొక లోకమును జేరి, ప్రమాదము పొందును. అని

యెన్నియో మంత్రములు భేదబుద్ధిగలవారికి నష్టము కల్గునని
చెప్పుచున్నవి.

“తత్త్వమసి” నీవు తత్పదార్థ మగు బ్రహ్మవగు
చున్నావు “అహం బ్రహ్మాస్మి” అహం శబ్దవాచ్యుఁడ నగు
నేను బ్రహ్మ యగు చున్నాను. “అయ మాత్మాబ్రహ్మ”
బ్రహ్మయే ఈయాత్మ. “యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ”
సాక్షాత్తుగానో, అపరోక్షముగానో అంతయును బ్రహ్మస్వరూ
పమే. “య ఆత్మా సర్వాంతరః” ఆత్మవస్తు నంతట నున్నది.
“ఏషత ఆత్మాంతర్యా మ్యమృతః” నీలో నున్నది అమృత
మగు ఈ యంతరాత్మయే. “త్వం వా అహమస్మిభగవో
దేవతే, అహం వై త్వ మసి” ఓతల్లీ! నీవు నేనే, నేను నీవే,
మనమిరువురము దేవుని తేజస్సులమే; “అయ మేవ సయోఽ
య మాత్మేద మమృతమ్” ఇదం శబ్దవాచ్యుఁ డగు వీఁడు, ఈ
యాత్మ ఇదంతయును ఆ యమృత స్వరూపమే. “ఇదం బ్రహ్మే
దం సర్వమ్” ఇదియే బ్రహ్మము. ఇదియే సకలమును, “ఇదం
సర్వం యదయ మాత్మా” ఈ సమస్తమును, ఈ యాత్మయే,
“ఏషత ఆత్మా సర్వాంతరః” ఈ నీ ఆత్మ యంతటను గలదు;
“సవా ఏష మహానజ ఆత్మా జరోఽమృతోఽభయో బ్రహ్మ
భయం వై బ్రహ్మ భయం హి వై బ్రహ్మేతి” బ్రహ్మ పదా
ర్థము భయహీనము; ఆబ్రహ్మయే తచ్ఛబ్దవాచ్యుఁడు, ఇదం
శబ్దవాచ్యుఁడు, మహాచ్ఛబ్దవాచ్యుఁడు, అదియే జన్మరహితము;
జరారహితము, అమృతము నై యున్నది; అనెడి పై మంత్ర
ములను స్మృతేతిహాస పురాణవచనములను బరిశీలించినచో,

జీవపరబ్రహ్మలకు భేదము కలదనువాదము విరుద్ధము, అద్వైదికము, మహాదోషభూయిష్ఠము అని చక్కగాఁ దెలియును.

అయ్యా! నీపక్షమున ద్వైతము లోకమునఁ గల జీవేశ్వరాది వ్యవహార మెట్లు పొసగుచున్నది? జీవేశ్వరాదులకు నిత్యత్వ మెట్లు ఘటిల్లుచున్నది, యన చెప్పెద వినుము. "అనాదియోగేన భవన్తి నిత్యాః" అని చెప్పితిని. అనాది యనగా అవిద్యాఖ్యయైన మాయ. ప్రకృతిపురుషు లిద్దరును అనాదులు, అను విషయము - "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి" అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది.

శ్లో॥ ఇయం హి సాక్షా జ్జగతో యోనిరేకా
సర్వాత్మికా సర్వనియామికా చ।
మాహేశ్వరీశక్తి రనాదిసిద్ధా
వ్యోమాభిధానాది విరాజతీవ॥"

అనుసూక్తిని బరిశీలించినచో మాహేశ్వరియైన శక్తి, అనాది సిద్ధయై యున్నది. అది వ్యోమాఖ్యయై దివిలో (అంతరిక్షమున) విరాజిల్లుచున్నది. ఈ శక్తియే జగత్తునకు సాక్షాత్తుగా యోని యగుచున్నది. అదియే ముఖ్యమైనది. సర్వాత్మికయై, సర్వ నియామిక యగుచున్నది. కావున అనాదియైన, ఈ మాయయొక్క యోగముచేతనే జీవాదులు నిత్యు లగుచున్నారు. అద్వితీయుమైన పరమాత్మకు, ఈ మాయా యోగముచేతనే బహురూపత్వము సంభవించు చున్నది.

"రూపంరూపం ప్రతిరూపో బభూవ" నిత్యమైన పర

బ్రహ్మ అనేక రూపములను దాల్చుచున్నది. "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" ఇంద్రుడు మాయాశక్తి చేతనే పురురూపము పొందెను. "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః" ఒకే దేవుఁడు సకలభూతములందును గూఢముగ నుండెను "ఏకం సద్విప్రా బహుధా వదన్తి" సద్రూపమైన ఏకవస్తువునే విప్రు లనేక విధములు కలదిగాఁ జెప్పుచున్నారు. "ఏకం సంతం బహుధా కల్పయంతి" ఒకే సద్వస్తువునకే, అనేక రూపములను గల్పించుచున్నారు.

"ఏకోదేవో బహుధా నివిష్టః" స్వయం ప్రకాశుఁడై ముఖ్యుఁడైన పరబ్రహ్మ అనేకరూపములను బొంది యుండెను. "ఏకస్సన్ బహుధా విచారః" ఒకే సద్రూపమైన బ్రహ్మ అనేక విధముల సంచరించెను "త్వమేకో ఽసి బహూ ననుప్రవిష్టః" దేవా! నీ వొక్కఁడవే అయియున్నను అనేక వస్తువులలోఁ బ్రవేశించి యున్నావు. "అజాయమానో బహుధా విజాయతే" జన్మరహితుఁడై యుండియు ననేక విధముల జన్మించుచున్నాడు. అని పైనఁ జెప్పిన మంత్రము లన్నియును నిత్యమైన పరబ్రహ్మకు అనేక రూపము లున్నట్లు చెప్పుచున్నవి.

శ్లో॥ ఏక ఏవ హి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః ।
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ॥

చంద్రుఁ డొక్కఁడే యైనను ఆయాజలములం దనేక చంద్రులుగాఁ గనఁబడు చున్నట్లే భూతాత్మ (పరమాత్మ) ఒక్కఁడే యైనను, అనేక భూతములందుండి అనేక రూపములఁ జూడఁబడుచున్నాడు, అని మోక్షధర్మమునఁ జెప్పఁబడినది.

శ్లో॥ "ఆకాశ ఏకోఽపి యథా ఘటాదిషు పృథగ్భవేత్ ।
తథాత్మైకో ఽప్యనేక శ్చ జలధారేష్వివాంశుమాన్ ॥

ఒకే యాకాశము, ఘటపటా ద్యాధార భేదముచే నానాత్వమును బొందుచున్నది. సూర్యుఁ డొక్కఁడే యైనను, జలధారలలో అనేక రూపముల గోచరించు చున్నాడు. అటులనే ఒకే యాత్మ ఆధారభేదముచే ననేక రూపములను బొందు చున్నదని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

శ్లో॥ ఏక శ్చ సూర్యో బహుధా జలధారేషు దృశ్యతే ।
ఆభాతి పరమాత్మా పి సర్వోపాధిషు సంస్థితః ॥
బ్రహ్మ సర్వశరీరేషు బాహ్యే చాభ్యన్తరే స్థితం ।
ఆకాశ ఇవ కుంభేషు బుద్ధిగమ్యం నచాన్యథా ॥

ఒకే సూర్యుఁడు జలధారలలో ననేక విధములఁ గనఁబడును. అటులనే ఒకే పరమాత్మయు, సర్వోపాధులలో నుండి, సకలవిధముల గనఁబడును. సర్వశరీరము లందును, బాహ్య ప్రపంచమునను, అభ్యన్తర ప్రపంచమునను, ఒకే బ్రహ్మకలఁడు. అది యనేక కుంభములలో గల ఆకాశమువలె, అనేక విధముల బుద్ధికి గోచరించును. అంత మాత్రాన అన్యథా భావించరాదు. అని కావషేయ గీతలలో జెప్పఁబడెను.

శ్లో॥ నిత్య స్సర్వగతో హ్యాత్మా కూటస్థో దోషవర్జితః ।
ఏకస్సన్ భిద్యతే శక్త్యా మాయయా సర్వభావతః ॥

కూటస్థుఁడును, దోషవర్జితుఁడును, అగు ఆత్మ సర్వగతుఁడైనను నిత్యుఁడే. ఒకే రూపమున నున్న పరమాత్మ

మాయాశక్తిచే ననేక భావములతోఁ గానవచ్చును. అని పరమేశ్వరుఁడు చెప్పెను.

ఒకే పరమాత్మకు మాయాశక్తిచే బహురూపత్వము సంభవించును. అందువలనఁ గారణాత్మయైన ఆ పరమేశ్వరుఁడే, మాయచే ననేక ప్రయత్నములను గావించి, కార్యాత్మయైన జీవాత్మను, అనేక రూపములలో నుండునట్లు నియోగించుచున్నాడు. యథార్థముగాఁ బరమాత్మ, తానై మాయా సంపర్కము లేక, అంతటను సంచరించ లేదు. జీవాత్మను సంచరింపఁ జేయలేదు.

శ్లో॥ న జాయతే న మ్రియతే న వధ్యో న చ ఘాతకః ।
న బద్ధో బంధకారీవా న ముక్తో న చ మోక్షదః ॥
పురుషః పరమాత్మా తు యత్తతో ఽన్యదసచ్చతత్ ॥

అను కావషేయ గీతలలోఁ బై విషయమే వివరింపఁ బడినది. అభేమన పరమపురుషుఁడైన పరమాత్మ జన్మించ లేదు. మరణించ లేదు. అతఁడు వధ్యుఁడు కాడు, ఘాతకుఁడును గాడు; బద్ధుఁడు కాడు. బంధకారియును గాడు. ముక్తుఁడు కాడు. మోక్ష మొసఁగు వాఁడును గాడు. అట్టి పరమాత్మకంటె, అన్యమైన దంతయు, అసత్తనఁబడుచున్నది. పరమాత్మ ఒక్కఁడే సత్తు అనఁబడును. ఈ విషయమునే భగవంతుఁడైన పరమేశ్వరుఁడు—

శ్లో॥ "అహం ప్రశాస్తా సర్వస్య మాయాతీత స్వభావతః ।
నచాప్యయం సంసరతి నచ సంసారయే త్ప్రభుః ॥

అను సూక్తిలో వివరించి చెప్పెను. అదేమన? మాయా తీత స్వభావమువలన (నేనే) పరమాత్మయే సర్వమును శాసించు చున్నాడు. ఆ యాతఁడు ప్రభువైనను స్వయముగా సంచరించలేదు. దేనిని సంచరింపఁ జేయలేదు కూడ అని చెప్పెను. అంతేకాదు. మాయానిమిత్తముచేఁ గల్గు భేదము గోచరించినను గార్యకారణాత్మగా నున్నప్పటికిని, ఈ పరమాత్మ కాధిక్యముకాని, స్వరూపాధిక్యము కాని లేశమంతైనను దొలఁగలేదు. సంసారము మాయాత్మక మగుటవలన, పర మాత్మ పూర్వమువలె గూటస్థుఁడే యగుచున్నాడు. ఆదిరహిత మైన అవిద్యయొక్క సంబంధముచేతనే పురుషులును, జీవులును, అనేకు లగుచున్నారు. పూర్ణపురుషుఁడైన పరమాత్మకుఁ జెందిన మాయ, అనాది సిద్ధమైనది. దానియోగము చేతనే పరమ పురుషుఁడు బహురూపుఁ డగుచున్నాడు. దీనికిఁ జెందిన విషయ మంతయు, అనుగీతలలోఁ జక్కగాఁ జెప్పఁబడినది. అదెట్లన ?

శ్లో॥ అజ్ఞాను గుణరూపేణ తత్త్వరూపేణ చ స్థితః ।
మమత్వే యది సంసారో నోచ్ఛిద్యేత కథంచ న ॥
అవిద్యాశక్తి సంపన్న స్సర్వయోనిషు వర్తతే ।
తత్త్యాజ్యం సర్వవిదుషాం మోహనం సర్వదేహినాం ॥
తన్నాశేన మహానాత్మా రాజతే నాత్ర సంశయః ।
అహంకారస్య విజయే హ్యాత్మా సిద్ధో భవిష్యతి ॥
సిద్ధే చాత్మని నిర్దుఃఖీ పూర్ణబోధో భవిష్యతి ॥"

అనగా అవిద్య మానవులలో మోహరూపముగాను అహంకార రూపముగను గలదు. అది పరమాత్మ యాజ్ఞకనుగుణమగు రూపముతోను, తత్త్వరూపముతోను, సకల మానవులందును, బండితులందు నున్నది. అవిద్యాధీనులై, మమకారముతో నున్నంతకాలము, మానవుల సంసారబంధ మేవిధముగను ఛేదింపఁబడదు. పరమాత్మ యవిద్యాశక్తి సంపన్నుఁడై సర్వయోనులందును బ్రవర్తించు చున్నాడు. సకలదేహులందును, మోహరూపముతో నున్న యవిద్య, పండితు లెల్లరకును బరిత్యాజ్యమే. అహంకారము నశించినచో మహత్స్వరూపమైన ఆత్మ, అంతటను, అందఱిలోను, విరాజిల్లు ననుటలో సంశయము లేదు. అహంకారమును జయించినచో ఆత్మ సాక్షాత్కారము, తప్పక సిద్ధము కాఁగలదు. ఆత్మ సాక్షాత్కారము సిద్ధించినచో మానవుఁడు దుఃఖహీనుఁడును, బూర్ణజ్ఞానియును గాఁగలడు.

శ్లో॥ "పూర్ణబోధం పరానంద మనన్తం లోకభావనం
భజత్యవ్యభిచారేణ పరమాత్మాన మచ్యుతం
తద్భక్త స్తత్ప్రసాదేన జ్ఞానానల సమన్వితః ॥"

పరమాత్మ పూర్ణజ్ఞానియు, పరానందుఁడు, అనన్తుఁడు లోకులచే భావింపబడువాఁడు, నాశరహితుఁడు. అట్టి పరమాత్మను జ్ఞానాగ్ని సహితుఁడైన భగవద్భక్తుఁడు, ఆ భగవంతుని కరుణచే, ఇతర దృష్టి లేని మార్గమునఁ దప్పక పొందును.

శ్లో॥ అఖిలం కర్మదగ్ధ్వాన్యై ర్విష్ణ్వాఖ్య మమృతం శుభం
ప్రాప్నోతి సర్వసిద్ధార్థ మితి వేదాను శాసనమ్ ॥"

పరమాత్మ విష్ణువు. అమృతుఁడు, శుభుఁడు, సకలార్థములును ఆతనికి సర్వదా సిద్ధములే. అట్టి పరమాత్మను జేరుటకు జ్ఞానమార్గమే ఉత్కృష్టమైనది. అయినను అన్యములైన యోగ, తపో మార్గములచే మానవుఁడు తమ కర్మలను దగ్ధమొనర్చుకొన్నచోఁ దప్పక యీ పరమాత్మను బొందును. ఇది వేదాను శాసన మని తెలిసికొనవలెను. భగవంతుఁడును బరమ గురువు నగు పరాశరుఁడు పై విషయమును స్పష్టపరచుచు ఆత్మకంటె భిన్నమైన దంతయు మిథ్యయే యని ప్రదర్శించెను.

శ్లో॥ జ్ఞానస్వరూప మత్యంత నిర్మలం పరమార్థతః ।
తమేవార్థ స్వరూపేణ భ్రాంతి దర్శన తస్స్థితం ।
జ్ఞానస్వరూప మఖిలం జగ దేత దబుద్ధయః ।
అర్థస్వరూపం పశ్యంతో భ్రామ్య న్తే మోహసంప్లవే ॥

పరమార్థదృష్టితోఁ జూచినచో జ్ఞానస్వరూప మంతయు, అత్యంతము నిర్మలమైనదే. భ్రాంతిజ్ఞానముచేఁ గొందఱు అట్టి జ్ఞానస్వరూపమునే అర్థస్వరూపముతోఁ (ప్రకృతితో) నున్నదిగాఁ జెప్పుచున్నారు. వారు అబుద్ధులు. అనగా జ్ఞానహీనులు. కావుననే వారు జ్ఞానస్వరూపమైన సకల జగంబును, మోహ సంప్లవమున నుండి అర్థస్వరూప మగు ప్రకృతిని జూచి, అదియే ఆత్మస్వరూప మని భ్రమించు చున్నారు.

శ్లో॥ "యేతు జ్ఞానవిద శ్శుద్ధచేతస స్తేఽఖిలం జగత్ ।
జ్ఞానాత్మకం ప్రపశ్యంతి త్వద్రూపం పరమేశ్వర ॥

పరమేశ్వరుఁడా! జ్ఞానవేత్తలు శుద్ధచేతస్కులు అగుదురు. వారు ఈ జగత్తునంతటిని జ్ఞానాత్మకమైన నీరూపముగా జక్కఁగాఁ జూచుచున్నారు.

శ్లో॥ జ్ఞానస్వరూపో భగవాన్ యతోఽసా
వశేషమూర్తి ర్నతు వస్తుభూతః ।
తతో హి శైలాబ్ధి ధరాది భేదాన్
జానీహి విజ్ఞాన విజృంభితాని ॥

భగవంతుఁడు జ్ఞానస్వరూపుఁడు. చరాచర ప్రపంచమంతయు నాతని మూర్తియే కాన ఆతఁ డేదో యొక వస్తువుగా మాత్రమే యున్నవాఁడు కాడు. ఆతనినుండియే శైలములు, అబ్ధులు, భూమి, మున్నగున వన్నియును వెలసినవి. ఈ శైలాది భేదము లన్నియును; విజ్ఞానమునుండి విజృంభించినవిగాఁ దెలిసికొనుము.

శ్లో॥ యదాతుశుద్ధం, నిజరూపి, సర్వ
కర్మక్షయే జ్ఞాన మపాస్త దోషం ।
తదా హి సంకల్పతరోః ఫలాని
భవన్తి నో వస్తుషు వస్తుభేదాః ॥

దోషరహితమైన జ్ఞానమే పరిశుద్ధమైనట్టి నిజమైన బ్రహ్మస్వరూపము. అట్టి శుద్ధజ్ఞానము సర్వకర్మక్షయమైన

నాఁడే మానవునకుఁ గల్గును. అప్పుడే జ్ఞానస్వరూపమైన బ్రహ్మవస్తువుయొక్క సంకల్పమనెడి తరువునుండి, సకలఫలములును సంభవించుచున్నవి. సామాన్య వస్తువులందు వస్తుభేదము లెన్నడును సంభవింపవు.

శ్లో॥ "వస్త్వస్తి కిం ? కుత్ర చిదాది మధ్య
పర్యన్తహీనం సతతైకరూపం ।
యచ్చాన్యథా త్వం ద్విజ ! యాతి భూయో
న తత్తథా తస్య కుతోహి తత్త్వమ్" ॥

బ్రహ్మకంటె భిన్నమైన వస్తు వేదైన, ఆదిమధ్యాన్తరహితమైనది ఎచ్చటనైనఁ గలదా ? కాన బ్రహ్మవస్తువు ఒక్కటే శాశ్వతమైనది, నిత్యమైనది, ముఖ్యమైనది. అందుచే విప్రుఁడా ! అన్యథాత్వమును, అనగా ఆదిమధ్యాన్తములను బొందిన దేదో, అది బ్రహ్మవస్తువువలె ఉండదు. అందుచే సామాన్య వస్తువునకుఁ దత్త్వము, అనగా బ్రహ్మత్వ మెట్లు లభించును ?

శ్లో॥ మహీఘటత్వం, ఘటతః కపాలికా
కపాలికా చూర్ణ రజ స్తతోఽణుః ।
జనై స్స్వకర్మ స్తిమితాత్మ నిశ్చయై
రాలక్ష్యతే బ్రూహి కిమత్ర వస్తు ?

భూమియే ఘటరూపము పొందును. ఘటములను విడఁగొట్టినచోఁ గపాలము లభించును. కపాలమును విడఁగొట్టినఁ బిండి యగును. పిండిని బిండిచేసినచోఁ జూర్ణము లభించును.

ఆ చూర్ణమునుండి అణువు లభించును. అట్టి యణువునందును బ్రహ్మవస్తువు కలదు. అట్టి బ్రహ్మవస్తువు కర్మరహితమైన శుద్ధాత్మ జ్ఞానము కలవారికి మాత్రమే గోచరించును. కాని ప్రారబ్ధాది కర్మపిహితమైన ఆత్మనిశ్చయముగల జనులచే అట్టి యణువులోఁ గల బ్రహ్మవస్తువు చూడఁబడునా యేమి ? చెప్పుము ?

శ్లో॥ "తస్మాన్న విజ్ఞానమృతేఽ స్తి కించిత్
క్వచిత్ కథాచిత్ ద్విజవస్తు జాతం ।
విజ్ఞాన మేకం నిజకర్మ భేద
విభిన్న చిత్తై ర్బహుధాభ్యుపేతమ్ ॥

లోకమందలి వస్తుజాత మంతయు, విజ్ఞాన విలసితమే. అట్టి ముఖ్యమైన విజ్ఞానము కూడ, తనుతమ కర్మభేదములచే, విభిన్న చిత్తులగు జనులచే అనేక విధములుగా స్వీకరింపఁ బడుచున్నది. అందువలన విప్రుఁడా ! అట్టి విజ్ఞానము లేనిదే, ఎప్పుడును. ఎచ్చటను, గొంచెమైనను వస్తుజాత ముండదని తెలిసికొనుము.

శ్లో జ్ఞానం విశుద్ధం విమలం విశోక
మశేష దోషాది నిరస్తసంగం ।
ఏకం సదైకం పరమః పరేశః
సవాసుదేవో నయతో ఽన్యదస్తి ॥

జ్ఞానము విశుద్ధమైనది. నిర్మలమైనది. అట్టి జ్ఞాన స్వరూపమే బ్రహ్మవస్తువు. దానికి శోక మన్నది లేదు. సకల

దోషశూన్యమైనది. లోకముతోడి సంగము (సంబంధము) దాని కేమాత్రమును లేదు. ఆ బ్రహ్మవస్తువు ఏకము. సదా ముఖ్యము అట్టి జ్ఞానస్వరూపుఁడే వాసుదేవుఁడు. ఆతఁడే పరముఁడు. పరేశుఁడు. అంతయును వాసుదేవ మయమే. వాసుదేవుని కంటె భిన్నమైన నేదియును లేదు.

శ్లో॥ సద్భావ ఏవ భవతో మయోక్తో
జ్ఞానం యథా సత్య మసత్య మన్యత్ ।
ఏతత్తు య త్సంవ్యవహార భూత
మత్రాపి చోక్తం భువనాశ్రయంతే ॥

ఈ సత్పదార్థము యొక్క యునికి నాచే నీకుఁ జెప్పఁబడినది. జ్ఞాన మెట్లు సత్యమో, జ్ఞానేతరమంతయు నట్లసత్యమని తెలిసికొనుము. కారణము బ్రహ్మవస్తువు. కానవచ్చు ప్రకృతియంతయు దానికార్యమే. సంవ్యవహార మనగాఁ గార్యమైన ఈ ప్రపంచము. ఈ ప్రకృతి విలాసము అందుచేతనే కార్యమైన వస్తుజాతము, భువనాశ్రయ మని చెప్పఁబడినది.

శ్లో॥ "పరమార్థస్తు భూపాల సంక్షేపా చ్ఛ్రూయతాం మమ ।
ఏకో వ్యాపీ సమశ్శుద్ధో నిర్గుణః ప్రకృతేః పరః ॥

"మమ" అనగా నాకు, అనగా ఆత్మవస్తువునకుఁ జెందిన పరమార్థమును సంక్షేపముగాఁ జెప్పుచున్నాను. వినుము. ఏకమైన బ్రహ్మవస్తువే అంతటను వ్యాపించియున్నది. అది సమము. శుద్ధము. నిర్గుణము నై యున్నది. అది ప్రకృతి కంటెఁ బరమైనది. అని తెలిసికొనుము.

శ్లో॥ జన్మ వృద్ధ్యాది రహితో హ్యాత్మా సర్వగతో ఽవ్యయః।
పరజ్ఞాన మయోఽసద్భి ర్నామజాత్యాదిభి ర్విభుః ॥

ఆత్మ జన్మవృద్ధ్యాది రహితము. సర్వగతము. అవ్యయము. అనగా నాశరహితము. ఉత్కృష్టమైన జ్ఞానస్వరూపము. అసత్తులైన, నామజాత్యాదులచే అది విభువై యున్నది.

శ్లో॥ న యోగవాన్ న యుక్తోఽభూ న్నైవ పార్థివ యోక్ష్యతి।
తస్యాత్మ పరదేహేషు సతో ప్యేక మయం హితత్ ॥

పార్థివ! ఆత్మవస్తువు యోగవంతము కాదు. అన్య వస్తువుతో యుక్తమై యుండలేదు. ఇంకొక దానితోఁ గూర్చఁబడునదియును గాదు. ఆత్మ జీవరూపమునఁ బర దేహము లందున్నప్పటికిని, బూర్ణమేకదా!

శ్లో॥ విజ్ఞానం పరమార్థో ఽసౌ ద్వైతినో ఽతథ్య దర్శినః।
తదేత దుపదిష్టం తే సంక్షేపణ మహామతే ॥

ఇదియే పరమార్థమైన విజ్ఞానము. ద్వైతభావము కల వారు తత్త్వమును దర్శింపలేరు. మహామతివి కావున నీకీ పరమావధి రూపమైన అద్వైత విజ్ఞానము సంగ్రహముగా నుపదేశింపబడినది.

శ్లో॥ "పరమార్థ సారభూతం యదద్వైత మశేషతః।
సితనీలాది భేదేన యథైకం దృశ్యతే నభః।
భ్రాంతి దృష్టిభి రాత్మాపి తథైక స్సన్ పృథక్కృతః॥

సారభూతమైన పరమార్థము సంపూర్ణముగా, అద్వైతమే కాని, ద్వైతము కాదు. ఆకాశము సిత, నీలాది భేదములచే భిన్నముగాఁ గానవచ్చినను, ఒక్కటియే ౘదా! ఆత్మ ఒక్కటియే యైనను, భ్రాంతి దృష్టిగలవారిచే భిన్నముగాఁ జూడఁ బడుచున్నది.

శ్లో॥ ఏక స్సమ స్తం యదిహా స్తి కించిత్
తదచ్యుతో నా స్తి పరం తతో ఽన్యత్ ।
సోహాం స చ త్వం స చ సర్వమేత
దాత్మస్వరూపం త్యజభేద మోహామ్ ॥

బ్రహ్మపదార్థము సమస్తమును ఏకమే కాని విభిన్నము కాదు. ఇట గించిత్తుగాఁ గానవచ్చునదియు, బ్రహ్మపదార్థమే. ఆ బ్రహ్మపదార్థము అచ్యుతము. నాశరహితము. దానికంటెఁ పరమైనది కాని భిన్నమైనది కాని ఇంకొకటి లేదు. అహాం అనగా నేనుఁ త్వం అనగా నీవు. అనఁ బడునదియును, ఆ బ్రహ్మ వస్తువే. దానినే "తత్వమసి" "అహ మస్మి" అందురు. ఇదంత యును, ఆ యాత్మ స్వరూపమే. కాన దానిని గూర్చి భేద భావమును, మోహామును వీడుము.

శ్లో॥ "ఇతీరిత స్తేన, సరాజవర్య
స్తత్యాజభేదం పరమార్థ దృష్టిః ।
స చాపి జాతిస్మరణా ప్త బోధ
స్తత్రైవ జన్మ న్యపవర్గమాప" ॥

ఈ విధముగాఁ బరాశరునిచేఁ జెప్పబడిన వాఁడై ఆ రాజవర్యుఁడు మైత్రేయుఁడు పరమార్థ దృష్టి కలవాఁడై భేద బుద్ధిని విడనాడెను. ఆ మహారాజు జాతిస్మరణ మాత్రాన జ్ఞానము పొందినవాఁడై ఆ జన్మలోనే మోక్షమును పొందెను.

శ్లో॥ జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణు
ర్వనాని విష్ణు ర్గిరయోదిశశ్చ।
నద్య స్సముద్రా శ్చ స ఏవ సర్వం
యద స్తి యన్నా స్తి చ విప్రవర్య ॥

విప్రవర్యా! విష్ణు వనగా అంతటను వ్యాపించిన వాఁడని కదా యర్థము. ఈ కానవచ్చు నక్షత్రములు, భువనములు, వనములు, గిరులు, దిశలు, నదులు, సముద్రములు అన్నియును విష్ణువే. అన్నిటియందును విష్ణువు కలఁడు. ఏదికలదో, ఏదిలేదో అదంతయును ఆ విష్ణు స్వరూపమే.

శ్లో॥ "విస్తార స్సర్వ భూతస్య విష్ణో ర్విశ్వమిదం జగత్ ।
ద్రష్టవ్య మాత్మన స్తస్మా దభేదేన విచక్షణైః" ॥

సర్వభూత ప్రపంచమును ఆ విష్ణు సంబంధమైనదే. విశ్వము, ఈ జగత్తు కూడ ఆ విష్ణు సంబంధమే. కాన విచక్షణులచే ఆ యాత్మకంటె అభేదముగనే అంతయును జూడఁ దగియున్నది.

శ్లో॥ "విభేద జనకే జ్ఞానే నాశ మాత్యంతికం గతే ।
ఆత్మనో బ్రహ్మణో భేద మసంతః కః కరిష్యతి" ॥

విభేద జనకమైన అజ్ఞానము అత్యంతము నాశమును బొందగా, ఆత్మకును బ్రహ్మకును, భేదము గలదను అసత్తును ఎవఁడు ఆచరింపఁ గలఁడు.

శ్లో॥ "తద్భావ భావ మాపన్న స్తదాసౌ పరమాత్మనా।
భవత్య భేదీ భేదశ్చ, తస్యా జ్ఞాన కృతో భవేత్" ॥

అప్పుడు ఆ బ్రహ్మ సత్తును బొందిన మానవుఁడు పరమాత్మతో భేదము లేనివాఁడే యగును. అందుచే భేదభావము వానియొక్క అజ్ఞానకృతమే యగును.

శ్లో॥ జ్ఞానమేవ పరం బ్రహ్మ జ్ఞానం బంధాయ చేష్యతే।
జ్ఞానాత్మక మిదం సర్వం నజ్ఞానా ద్విద్యతే పరం।
విద్యావిద్యే చ మైత్రేయ! జ్ఞాన మేవోపధారయః ॥ ఇతి

జ్ఞానమే పరబ్రహ్మ. జ్ఞానమే బంధకరము ఇదంతయును జ్ఞానాత్మకమే. జ్ఞానముకంటెఁ బర మింకొకటి లేదు. కావున మైత్రేయ! విద్యావిద్యలు రెండును జ్ఞానమే యని నిశ్చయించు కొనుము, అని పరాశరుఁడు చెప్పెను. అటులనే భగవంతుఁడైన సనత్సుజాతుఁడును బ్రహ్మాండపురాణమందలి కావషేయ గీతాప్రసంగమున ఈ సమస్త విషయమును స్పష్టముగాఁ జెప్పెను. అదెట్లన!

శ్లో॥ "వేదాన్ పఠధ్వం విధివ ద్వ్రతాని
కృత్వా వివాహంచ మఖై ర్యజధ్వం।
ఉత్పాద్య పుత్రాన్ వయసో విరామే
దేహం త్యజధ్వం నియతా స్తపోభిః ॥

మహాజనులారా! వేదములను బఠింపుడు. యథావిధిగా వివాహమును, వ్రతములను, గావించుకొని, యజ్ఞములచే దేవతలను బూజింపుడు పుత్రులనుగని, వయస్సు క్షీణించు సమయమున నియతులై తపంబు లొరిన్చి, దేహమును విడిచెదరుగాక.

శ్లో॥ "కి మద్య న శ్చాధ్యయనేన కార్యం
కి మర్ధవంతశ్చ మఖై ర్వ్యవామః ।
ప్రాణం హి వాప్యనలే జోహావీయః
ప్రాణానలే జోహవీమీతి వాచమ్ ॥

ఇపుడు అధ్యయనముచేఁ జేయఁదగినదేమి? పురుషార్థాపేక్షతో మనము యజ్ఞములు చేసి, దేవతలను బూజింతుమా? ప్రాణమును, అగ్నికి, ఇంధనముగా (సమిధగా) నొసర్చుదుమా? ప్రాణాగ్నిలో నైనఁ బ్రాణములను హోమ మొనర్చెద నని చెప్పెను. ఇట్లు సార్థకముగా యజ్ఞాదులను అనుష్ఠించినను, ఆత్మకుఁ బ్రయోజనము లేదని చూపెను.

—: సన్న్యాసాశ్రమ ప్రశంస :—

శ్లో॥ స్వర్గాత్తు వేశ్యాగృహ సన్నివేశా
త్పుణ్యక్షయా న్తే పతనం స్యా దవశ్యం ।
మనుష్యలోకేవిజరావిదుఃఖమ్ ॥

యజ్ఞాదుల ఫలముగా లభించినట్టియు, వేశ్యాగృహ సదృశమైన స్వర్గమునుండి యైనను, బుణ్యక్షయము కాగానే

అవశ్యము పతనము జరుగును. పరికింపగా ఈ మనుష్య లోక మున ఎవ్వని కైనను విశేషముగా, జరాబాధయు, దుఃఖమును గలుగక మానవు. అని యీవిధముగా, యజ్ఞాది సాధ్యమైన స్వర్లోక సౌఖ్యముకూడ, అనిత్యత్వము మున్నగు దోషములచే దుష్టమైన కారణమున, హేయమైనదే, అని చూపి, యజు ర్వేదోపనిషత్తగు తైత్తిరీయమున "సత్యంపరంపరమ్" అను నది మొదలగు మంత్రములలో సత్యాదుల మహాత్వమును జూపెను. పిమ్మట "న్యాసః" అనునది మొదలు "తానివా ఏతా న్యవరాణి, తపాంసి, న్యాస ఏవాత్యరేచ యత్" అను వరకును గల మంత్రములలో, నిత్యసిద్ధ, నిరతిశయానంద బ్రహ్మ ప్రాప్తికి, సాధనమైన సన్న్యాసమే, ముఖ్యమనియు, అనిత్యఫల సాధనము నగు యజ్ఞాదులకంటె ఉత్కృష్టమైనదనియు చెప్పెను.

శ్లో॥ న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగే నైకే అమృతత్వ మానశుః।
పరేణ నాకం నిహితం గుహాయాం
విభ్రాజతే యద్యతయో విశన్తి ॥

అను మంత్రమునఁ గర్మచే గాని, సంతానముచేఁ గాని ధనముచేఁ గాని, మోక్షము లభింపదు. కొందఱు జ్ఞానులు కామ్యకర్మ త్యాగముచేతనే మోక్షమును బొందుచున్నారు. యతీశ్వరులు పొందు, అమృతత్వము అనగా మోక్షము స్వర్గముకంటె శ్రేష్ఠమైనది. అది బుద్ధిగుహలో నున్నదై ప్రకాశించుచున్నది.

శ్లో॥ వేదాన్తవిజ్ఞాన సునిశ్చితార్థా
స్సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః ।
తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే
పరామృతా త్పరిముచ్యన్తి సర్వే ॥ ఇతి.

నియమ శీలురగు మానవులు, వేదాన్తములైన ఉపనిషత్తు లందలి విజ్ఞానముచే నిశ్చితమైనట్టియు జీవబ్రహ్మైక్య లక్షణముగల విషయమును బక్కగాఁ దెలిసికొనుచున్నారు. వారు సన్న్యాసమువలనను, యోగము వలనను, విషయ పరాఙ్ముఖులై శుద్ధసత్త్వులగుచున్నారు. అపుడు వారు, బ్రహ్మసాక్షాత్కారము చేసికొనఁ గల్గుచున్నారు. వారు అజ్ఞాననాశముచేఁ గల్గిన పరాంతకాలమునందుఁ బరామృతమైన కారణశరీరము నుండి విముక్తు లగుచున్నారు. పై మంత్రములందు సన్న్యాసముయొక్క ఘనత ప్రకటింపఁ బడినది.

అటులనే బృహదారణ్యకమునందును సర్వకర్మ సన్న్యాసమును గూర్చి వివరింపఁ బడినది. అదెట్లన ?

శ్లో॥ ఏవం వై తమాత్మానం విదిత్వా
బ్రాహ్మణాః పుత్రైషణా యాశ్చ.
విత్తైషణాయాశ్చ, లోకైషణాయాశ్చ
వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి ॥ ఇతి.

బ్రాహ్మణులు ఈ పరమాత్మను దెలిసికొని, పుత్రైషణ, ధనైషణ, లోకైషణ, అను మూఁడింటినుండి విముఖులై

పిమ్మట భిక్షాచర్యమును గూర్చి, సంచరించుచున్నారు. అనగా
సన్న్యాసమును స్వీకరించుచున్నారు. అని చెప్పఁబడెను అటు
లనే భగవంతుఁడైన వాసుదేవుఁడు గీతలో సర్వకర్మ సన్న్యా
సమును గూర్చి వివరించి చెప్పెను. ఎట్లన ?

శ్లో॥ "నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥"

తన చిత్తమును, దేహమును, నియమబద్ధ మొనర్చు
కొని, సర్వ పరిగ్రహములను త్యజించి, కేవల శారీరకములగు
కర్మల నాచరించువాఁడైనను, నిరాశియగు మానవుఁడు, కిల్బి
షమును బొందడు.

శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥

అపేక్షలేనివాఁడును, శుచియును, దక్షుఁడును, ఉదా
సీనుఁడును, వ్యథతొలఁగినవాఁడు నెవ్వఁడో ఎవ్వఁడు నాయందు
భక్తికలవాఁడో, అతఁడే నాకుఁ బ్రియుఁడు.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమా న్యస్స మే ప్రియః॥

ఎవఁడు సంతోషింపడో, ద్వేషింపడో, దుఃఖింపడో
కాంక్షింపడో, ఎవఁడు శుభాశుభములను రెంటినిఁ బరిత్యజిం
చునో, ఎవఁడు భక్తికలవాఁడో, అతఁడే నాకుఁ బ్రియుఁడు.

శ్లో॥ మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥

ఎవఁడు మానావమానములను, సమముగాఁ దలంచునో, మిత్ర శత్రుపక్షములందు సమముగాఁ బ్రవర్తించునో, సర్వ కార్యారంభములను ఎవఁడు పరిత్యజించునో, ఆతఁడే త్రిగుణాతీతుఁడుగాఁ జెప్పఁబడు చున్నాఁడు.

శ్లో॥ అసక్త బుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః ।
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి ॥

సర్వత్ర ఎవ్వనిబుద్ధి ఆసక్తి లేక యుండునో, ఎవఁడు జితాత్ముఁడో, ఎవఁడు స్పృహను విడనాడునో ఆతఁడు సన్న్యాసముచేతనే నైష్కర్మ్య సిద్ధిని బొందును.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

సర్వధర్మములను బరిత్యజించి, నన్ను ఒక్కనినే శరణు పొందుము. అట్లైనచో నేను నిన్ను సర్వపాపముల నుండి విడిపించఁగలను. కావున దుఃఖింపకుము. అని పైరీతిని వాసుదేవుఁడు, సర్వకర్మసన్న్యాసముయొక్క ఘనతను బేర్కొనెను.

అటులనే భగవంతుఁడు, అనుగీతలలోఁ గర్మయందలి ప్రయోజనాభావమును బ్రవర్ణించెను. ఎట్లన ?

శ్లో॥ "నైవం ధర్మీ న చాధర్మీ నచైవహి శుభాశుభీ ।
యస్స్యా దేకాసనే లీన స్తూష్ణీం కించి దచింతయన్" ॥ ఇతి

ముఖ్యమైన యాసనమున లీనుఁడై, కొంచెమైనను జింతింపనివాఁడై, ఊరకనే యెవఁడుండునో, వాఁడు ధర్మియును గాఁడు, అధర్మియును గాఁడు. శుభాశుభములు కలవాఁడును గాఁడు. అనగాఁ గేవలము యోగనిష్ఠలో నుండి, లేశమంతైనఁ జింతలేక, ప్రయోజనాభావముచే, ధర్మాధర్మకార్యములతో సంబంధము లేక యుండును. ఆతఁడు శుభాశుభముల జోలికిఁ బోవఁడు.

శ్లో॥ "ప్రవృత్తి లక్షణో యోగో జ్ఞానం సన్న్యాస లక్షణం ।
తస్మాత్ జ్ఞానం పురస్కృత్య సన్యసే దిహ బుద్ధిమాన్" ॥

లోకప్రవృత్తియే, లక్షణముగాఁ గలది యోగము. సన్న్యాసమే లక్షణముగాఁ గలది జ్ఞానము. అందువలన బుద్ధిమంతుఁడు, జ్ఞానమును బురస్కరించుకొని, ఇహలోకమున సన్న్యసించును అని చెప్పెను.

భగవంతుఁడైన వ్యాసుఁడు శాంతిపర్వమున, శుకుని గూర్చి, ఈ విషయమునే ఉపదేశించెను. ఎట్లన ?

శ్లో॥ "కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా చ విముచ్యతే ।
తస్మా త్కర్మ నకుర్వన్తి యతయః పారదర్శినః" ॥

ప్రతిప్రాణియును గర్మచే బంధింపఁ బడుచున్నది. విద్యచే (జ్ఞానముచే) బంధవిముక్త మగుచున్నది. అందువలననే పారదర్శులైన యతులు, కర్మను ఆచరింపరు.

శ్లో॥ "ఏషావై విహితా వృత్తిః పురస్తాద్బ్రహ్మణా స్వయం।
ఏషా పూర్వతరై స్సద్భి రాచీర్ణా పరమర్షిభిః" ॥

పూర్వము బ్రహ్మ స్వయముగా ఈ వృత్తినే విధించెను. ప్రాచీనులును సన్మార్గులు నగు పరమఋషులు, ఈ వృత్తినే ఈ పద్ధతినే పరిశీలించి, ఆచరించిరి.

శ్లో॥ "ప్రవ్రజే చ్చ పరం స్థానం పారివ్రాజ్య మనుత్తమం।
తద్భవా నేవ మభ్యస్య వర్తతాం శ్రూయతాం తథా" ॥

సకలమును వీడి, పరమపదవిని దప్పక చేరవలెను. సన్న్యాసమే చాల యుత్తమమైనది. కావున ఓశుకుడా! నీవు ఈ పద్ధతిని గూర్చి, చక్కగా వినుము. ఇట్లు అభ్యసించి, చక్కగా బ్రవర్తింపుము. అని చెప్పెను.

అటులనే భగవంతుడైన నారదుడును, సర్వకర్మ సన్న్యాసమును శ్రేష్ఠమైనదిగా జెప్పెను.

శ్లో॥ సన్న్యస్య సర్వకర్మాణి సన్న్యస్య విపులం తపః।
సన్న్యస్య వివిధావిద్యాః సర్వం సన్న్యస్య చైవహి ॥
శక్యం త్వేకేన ముక్తేన కృతకృత్యేన సర్వశః।
పిండమాత్ర ముపాశ్రిత్య చరతుం సర్వతో దిశమ్ ॥

సర్వకర్మలను, విపులమైన తపస్సును, వివిధ విద్యలను సన్న్యసించి, ఇటులనే సర్వమును సన్న్యసించి సర్వవిధములc గృతకృత్యుడైన కేవల ముక్తునకు మాత్రమే పిండాండమును

మాత్రమే ఆశ్రయించి, సర్వదిశలందును సంచరించుటకు శక్యమగును.

శ్లో॥ హిత్వాగుణమయం పాశం కర్మహిత్వా శుభాశుభం।
ఉభే సత్యానృతే త్యక్త్వా ఏవం భవతి నిర్గుణః ॥
పరిగ్రహం పరిత్యజ్య భవ తాత ! జితేంద్రియః ।
అశోక స్థాన మాతిష్ఠ ఇహచాముత్ర చాభయమ్ ॥

త్రిగుణాత్మకమైన పాశమును, శుభాశుభకర్మలను, సత్యానృతములను రెంటిని విడిచి పెట్టిన పిమ్మటనే, మానవుఁడు నిర్గుణుఁడగుచున్నాడు. తాత! పరిగ్రహమును బరిత్యజించి, జితేంద్రియుడ వగుము. దుఃఖరహితమైన స్థానమును బొందుము. అప్పుడే నీవు ఇహపరలోకములలో భయవిముక్తుఁడ వగుదువు.

సర్వకర్మ సన్న్యాసము గావించిన వానికే జ్ఞానమం దధికారము లభించునుగాని, ఇతరునకు లభింపదని, భగవంతుఁడైన బృహస్పతి చెప్పెను. ఎట్లన ?

శ్లో॥ ప్రసృతై రింద్రియై ర్దుఃఖీ తై రేవ నియతై స్సుఖీ ।
రాగవాన్ ప్రకృతి హ్యేతి విరక్తో జ్ఞాన మాప్నుయాత్ ॥

అంతటను వ్యాపించిన ఇంద్రియములు గల మానవుఁడు దుఃఖవంతుఁ డగును. ఇంద్రియ నిగ్రహము కలవాఁడే సుఖము కలవాఁ డగును. రాగవంతుఁడు ప్రకృతిని బొందును విరక్తుఁడు జ్ఞానమును బొందును.

శ్లో॥ గృహస్థో బ్రహ్మచారీవా వానప్రస్థోఽథవా పునః ।
యఇచ్ఛేన్మోక్ష మాస్థాతు ముత్తమాం వృత్తి
మాశ్రయేత్ ॥

బ్రహ్మచారియైనను, గృహస్థుఁడైనను, వానప్రస్థుడైనను మోక్షమును బొందఁ గోరినచోఁ దప్పక యుత్తమమైన సన్న్యాసవృత్తిని ఆశ్రయించవలెను.

శ్లో॥ ఏతత్తు బ్రాహ్మణం వృత్త మాహు రేకపదం సుఖం ।
ఏషా గతి ర్విరక్తానా మేషధర్మ స్సనాతనః ॥

ఇదియే మోక్షసుఖమునకు ముఖ్యస్థానము. ఇదియే బ్రాహ్మణవృత్తము. ఇదియే విరక్తుల గతి. ఇదియే సనాతనధర్మము. అని సకలాశ్రమముల వారికిని సర్వకర్మ సన్న్యాసమున అధికారము కలదనియు, అశ్వమేధ ఘట్టమున, బ్రహ్మ, మునులకుఁ జక్కఁగా బోధించెను. బ్రహ్మజ్ఞాన మార్జింపఁ గోరువారికిని, ముముక్షువులకును, సర్వకర్మ సన్న్యాసమునందే అధికారము కలదని దీనివలనఁ దెలియుచున్నది.

సీ. భా. :- అయ్యా! జీవాత్మ పరమాత్మలకు విశేష భేదము కలదు. అట్లు విభేదము గలవారికి భేదము లేదని, ఐక్యమును జెప్పితివేని మహాదోషము వాటిల్లును. ఒకఁడు ఇంకొకఁడగుట అసంభవముకదా? అందువలన జీవపరబ్రహ్మలకుఁ దాత్త్వికమైన అభేదము యుక్తము కాదు. భోగ్యవర్గమునకు భక్షణశీలము లేదు కావున స్థూలసూక్ష్మ దేహావ్యయాత్మక

ములైన క్షేత్రములు అనాదు లగుచున్నవి. అట్టి యనాదుల యోగముచే జీవులు ఘటాకాశ, జలచంద్రాది న్యాయము ననిత్యములగు చున్నవి.

శ్లో॥ ఏక ఏవతు భూతాత్మా భూతేభూతే ప్రకాశతే।
ఏకథా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్ ॥

భూతాత్మ ఒక్కఁడే యైనను జలచంద్రునివలె ఆ యా భూతములందుఁ బ్రకాశించు చున్నాడు. ఒక్కఁడుగా, అనేకులుగాఁ జూడఁబడు చున్నాడు.

శ్లో॥ యథా హ్యయం జ్యోతిరాత్మా
వివస్వా నపోభిన్నా బహుధైకో ఽనుగచ్ఛన్ ।
ఉపాధినా క్రియతే భేదరూపో
దేవః క్షేత్రే ష్వేవమజో ఽయమాత్మా ॥

జ్యోతిస్స్వరూపుఁడైన ఒకే సూర్యుఁడు విభిన్నస్థలములందలి జలముల ననుసరించి, అనేక సూర్యులుగా గనఁబడు చున్నాడు. అటులనే స్వయంప్రకాశ మానుఁడును, అజుఁడు నగు పరమాత్మ ఆ యా క్షేత్రములందు ఉపాధిభేదము ననుసరించి, భేదరూపుఁ డగుచున్నాడు.

శ్లో॥ "ఘటసంవృత ఆకాశో నీయమానే యథా ఘటే ।
ఘటో నీయేత నాకాశః తద్వజ్జీవో నభోపమః" ॥

ఘటమం దాకాశము సంవృతమై యున్నది. ఆ ఘటమును వేరొక తావునకుఁ జేర్చినచో ఘటము తొలఁగునే

కాని, ఆకాశము తోలఁగదు. అటులనే జీవాత్మయు ఆకాశము ఉపముగాఁ గలద్దై ఉపాధులు తొలఁగినను అది మాత్రము తొలఁగకయే యుండును. అందుచే జీవపరములకు గల ఆధిక్యము ఔపాధిక భేదముచే లేశమంతైనను దొలఁగదు (నశింపదు.) జలచంద్రుఁడు కదలుచున్నను ముఖ్యచంద్రుఁడు కదలుచున్నాడా? లేదే. ఘటాకాశము చలించినను, ముఖ్యాకాశము చలింపలేదే. పై విషయమును బరిశీలించినచో శుద్ధుఁడైన ఆత్మ ఈశ్వర రూపమున ఒక్క విధముగనే యున్నను, జలాశయ తరంగచంద్ర న్యాయము ననుసరించి, జీవరూపమున బహుధా ప్రకాశించు చున్నాఁడు. కావున జీవుఁడు వేరు, ఈశ్వరుఁడు వేరు. అను సమస్త వ్యవహారమును స్థిరమగు చున్నది. అందుచే క్షేత్రసంబంధము అనాది యోగాఖ్యము. అనాదియైన అజ్ఞానము కారణముగఁ బురుషులు జననమరణాదులను బొందుచున్నారు.

వివరణము :

1. "బహుస్యాం ప్రజాయే యేతి" అను శ్రుతి ననుసరించి, చూచినచో సృష్టి కార్యము నిర్వహించు బ్రహ్మపదార్థమునందే జీవత్వము ఆరోపింపఁబడెను. అట్టి యారోపవాదముచే జీవబ్రహ్మలు ఒకటియే యను తలంపు ఏర్పడినదని తెలియును.

2. "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అను శ్రుతిలోఁ బరబ్రహ్మయే జగమును సృష్టించి, అందుఁ దాను బ్రవేశించినట్లు చెప్పెను. అనగా బ్రహ్మపదార్థమే జీవుఁడుగా మారి

నట్లు చెప్పెను. దీనినే పరిణామ వాద మందురు. ఈ వాదము
నను సరించి చూచినచో నిష్క్రియుడైన పరమాత్మకు
జీవుడుగా మారుటచే గల్గు లాభమేమి ? యను శంక
కల్గును. పై కారణములచే జీవబ్రహ్మలు ఒకటియా ? లేక
వేర్వేరుగా నున్నవా ? అని శంకించిన ధృతరాష్ట్రునకు సనత్సు
జాతుడొసగిన సమాధానములను శంకర నీలకంఠులు ఎట్లు
పరిశీలించి చెప్పిరో తెలిసికొందము. భూమ్యాకాశాది రూప
మున నున్న సామాన్య ప్రకృతియు, బ్రహ్మయోని యైన
మూల ప్రకృతియు కార్యములు. పురుషుడగు పరబ్రహ్మ
కారణము. కార్యకారణములు రెండును బరమాత్మ స్వరూ
పములే. అందుచే గార్యమైన జీవుడును, గారణమైన పర
బ్రహ్మము నొక్కటియె. వానికి భేదములేదు. ప్రకృతి సంబం
ధముచే పరబ్రహ్మకు నానాత్వము కలదన్నవానికి మృత్యు
భయము వాటిల్లును. ప్రకృతిపురుషులు ఇరువురును అనాదులే
యని గీతలో వివరింపబడినది. జలచంద్ర న్యాయమున ఘటా
కాశ న్యాయమున, జెప్పినట్లు ప్రకృతి సంబంధముచే బురుషు
డైన పరమాత్మకు నానాత్వము ఏర్పడుచున్నది, కాని కేవల
పురుషునకు నానాత్వము లేదు. అట్టి నానాత్వము ఔపాధికము.
కావున బరమాత్మకు నానాత్వముచే గల్గు అనిత్యత్వమును
వాటిల్లదు ఉపాధియనగా ఆధారము. జలమునకు ఘటము
ఆధారము కాన ఆ ఘటము (కుండ) జలమునకు ఉపాధి
యన్నమాట. అట్టి యుపాధి అనేకవిధములుగా నుండుటచే
వానియుందలి జలమునకును, జలములందు గానవచ్చు చంద్రు

వకును నానాత్వముఁ గలుగుచున్నది. కాని యథార్థమైన చంద్రునకు మాత్రము నానాత్వము లేదు. అటులనే ఉపాధులైన జీవులచే వానియందుండు బ్రహ్మకు మాత్రము నానాత్వము కల్గుచున్నది. కాని మూలమైన పరబ్రహ్మకు మాత్రము నానాత్వము లేదు.

పరమాత్మ సత్తు, అనగా శాశ్వతము. పరమాత్మకంటె వేరుగా నున్నదంతయును అసత్తే. అనగా అశాశ్వతమే. పరమాత్మకుఁ గల రామకృష్ణాది భేదము ప్రకృతియైన మాయ యొక్క సంబంధముచేఁ గల్గినది, కాని సహజముగాఁ గల్గలేదు. అందుచే ఆత్మకుఁ (బ్రహ్మకు) గల ఆధిక్యము నశింపదు. లోకమునఁ గానవచ్చు సంసారము ప్రకృతికిఁ జెందినదే, కాని ఆత్మకుఁ జెందినది కాదు. ఆత్మయొక్కటియే సత్యము (శాశ్వతము) ఆత్మేతర మంతయు మిథ్యయే (అశాశ్వతమే). ప్రకృతితోఁ గూడిన పరమాత్మయొక్క ప్రభావముచేతనే మనకుఁ గానవచ్చు కొండలు, నదులు మున్నగు నవన్నియును సృష్టింపఁబడినవి. ఈ నాఁడు వ్యోమనౌకలయందు, ఆయుధము లందు, రోగ నివారకములగు ఔషధములందు, శారీరపరిశ్రమ లరిదు, విద్యుత్పరికరములందు ఉపయోగింపఁబడుచున్న అణువు పరమాత్మయొక్క స్వరూపమే. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అను శ్రుతియుఁ బైవిషయమునే వ్యక్తము సేయుచున్నది.

సర్వాంతర్యామియు, సృష్టికి గారణమునగు పరబ్రహ్మ జీవరూపమునఁ వివిధ దేహములం దున్నప్పటికిని బూర్ణమే.

అద్వైతమే. భ్రాంతిదృష్టి గలవారికి జీవుఁడు వేరు, బ్రహ్మ వేరు అను ద్వైతభావము ఏర్పడినను భ్రాంతి తొలగిన తోడనే అట్టి ద్వైతభావము, భేదభావము తొలఁగిపోవును. ఆకాశము ఒకచోట నల్లగా, మరొకచోటఁ దెల్లగా, ఇంకొకచోట ఎఱ్ఱగాఁ గనబడుటచే ఆకాశమున భిన్నత్వము గోచరించినను, అట్టి భేదభావము రంగులచేత ఏర్పడినదే కాని యథార్థము కాదు. ఆకాశము ఒక్కటియే యని అందఱికిని దెలిసిన విషయమేకదా! ఆకాశము వలెనే పరబ్రహ్మయును ఒక్కటియే యని తెలిసికొనవలసి యున్నది. అజ్ఞానులు ప్రకృతి వేరు, పురుషుఁడు వేరు అని భావింతురు. జ్ఞానిమాత్రము అట్లు తలంపడు. అందుచే నందఱును జ్ఞానము సంపాదించుకొని "తత్త్వమసి" మున్నగు మహావాక్యముల యర్థము చక్కగా నెఱిఁగిరేని, వారికిఁ గల యజ్ఞానమును, భ్రాంతి దృష్టియు, మోహాహంకారములును బూర్ణముగా నశించును. అపుడు తప్పక వారికి ముక్తి కల్గును. అందుచేఁ బ్రతిజీవియును, యోగ, తపో, జ్ఞాన మార్గములలో, నేదేని యొకదానిని అలవఱచుకొని, తనకుఁ గల ప్రారబ్ధాది కర్మలను దగ్ధము చేసికొనవలెను. ఆత్మ సాక్షాత్కారము పొందవలెను. ఆత్మ సాక్షాత్కారము చేసికొనఁ గల్గినవారికి శైల, వనాదులలో అంతటను విష్ణుస్వరూపుఁడైన పరమాత్మయే గోచరించును శుద్ధచేతస్కు లగునట్టి వారికిఁ జక్కని జ్ఞానము కల్గును. జ్ఞానముచే జీవులు కామ్య కర్మలను బరిత్యజించి సన్న్యాసు లగుదురు. ముక్తు లగుదురు. జ్ఞానహీనులైన వారికి మాత్రము జనన మరణాధులు తప్పవు.

వారెన్నడును ముక్తులు కాలేరు. పరికింపగాఁ గర్మమార్గము కంటె యోగమార్గము, జ్ఞానమార్గమును గొప్పవని తోచు చున్నది. జ్ఞానులగుటచేతనే ధర్మవ్యాధుఁడు మున్నగువారు శాశ్వత ప్రతిష్ఠ నందఁగల్గిరనియు తరించిరనియుఁ దెలియు చున్నది.

-: ఈశ్వరుఁడే జగత్కారణుఁడు :-

శ్లో॥ య ఏత ద్వా భగవాన్ సనిత్యో
వికారయోగేన కరోతి విశ్వం ।
తథా చ తచ్ఛక్తి రితి స్మ మన్యతే
తదార్థయోగే చ భవన్తి వేదాః ॥ ౨౧

తా॥ ఈ జగత్తులను సృష్టించు చున్నట్లు కానవచ్చు భగవంతుఁడు నిత్యుఁడు. ఆతఁడు వికారమైన మాయయొక్క యోగముచే, విశ్వమును గావించు చున్నాడు. ఆ పరమాత్మ శక్తి, పరమాత్మభిన్నమై కానవచ్చు చున్నదని వేదములు చెప్పుచున్నవి. జగత్తునకు ఉపాదాన కారణమైన భగవంతునికి, ఆతని శక్తియైన మాయకును భేదము లేదు; అనుటలో వేదములే ప్రమాణములు.

శం. భా. :- ఒకే పరమాత్మ అనాది మాయాయోగముచే బహురూపములను ఎట్లు పొందుచున్నాడో, అట్లే ఈశ్వరుఁడు మాయోపాధిచే జగత్కారణుఁ డగుచున్నాడు. ఎట్లన! పరమార్థ భూతుఁడైన భగవంతుఁడు ఐశ్వర్యాది సమన్వితుఁడై నను, నిత్యుఁడే. ఆతఁడు తన యధీనమందున్న మాయయొక్క

యోగముచే, సాక్షియై విశ్వమును నిర్మించుచున్నాడు. పరమాత్మ శక్తియైన మాయయే జగత్సృష్టికిఁ గారణము. కాని పరమాత్మ కాదు. పరమాత్మయొక్క మాయార్ధ యోగమే జగత్సృష్టికి ఉపాదానకారణమనుటలో వేదములే ప్రమాణము. ఎట్లన ?

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" ఆత్మయైన ఇంద్రుఁడు మాయా బలముచేతనే పురురూపము దాల్చెను. "అస్మా న్మాయీ సృజతే విశ్వ మేతత్" మాయా సంబంధముగల ఆత్మయే ఈ విశ్వములను సృజించుచున్నది.

"మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్" ప్రకృతిని మాయగను, మహేశ్వరుని మాయగలవానిగా నెఱుఁగుము. "దేవాత్మ శక్తిం స్వగుణై ర్నిగూఢమ్" దేవునిలో గల ఆత్మశక్తి సత్త్వాది గుణములచే నిగూఢముగా నున్నది. అని పైనఁ బేర్కొన్న మంత్రము లన్నియు, "జగ దుత్పత్తికిఁ బరమాత్మ మాయాశక్తియే ఉపాదాన కారణ"మని ప్రకటించుచున్నవి.

శ్లో॥ "దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా।
అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్॥
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయయా।
మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్॥"

ఈ నా మాయ దేవసంబంధమైనది. సత్త్వరజస్తమోగుణాత్మకము. దాని నెవరును అతిక్రమింపఁజాలరు. పరబ్రహ్మ

నగు నేను జననమరణ రహితుఁడ నైనను, సకల భూతేశ్వరుఁడ నైనను, నాప్రకృతి నధిష్ఠించి, నామాయచేతనే రామకృష్ణాది రూపములతో సంభవించు చున్నాను. అధ్యక్షుఁడ నగు నాపర్యవేక్షణలోఁ బ్రకృతి చరాచరములను సృష్టించు చున్నది." అని గీతలో సైతము చెప్పఁబడినది.

శ్లో॥ "మాయాంతవేయ మజ్ఞాత పదార్థా నతిమోహినీ।
అనాత్మన్యాత్మ విజ్ఞానం యయా మూఢో ఽధిరోహతి॥
ఇయ మస్య జగద్ధాతు ర్మాయాకృష్ణస్య గహ్వరీ।
ధార్య ధారక భావేన యయా సంపీడితం జగత్॥
అహోస్మ దుస్తరా విష్ణో ర్మాయేయ మతి గహ్వరీ।
యయా మోహిత చిత్తస్తు న వేత్తి పరమేశ్వరమ్"॥ ఇతి.

అత్యంతము మోహింపఁ జేయు ఈ నీమాయ అజ్ఞాత పదార్థములను సృష్టించు చున్నది. ఈ మాయాప్రభావము చేతనే మూఢుఁడు, ఆత్మకాని దానియందు ఆత్మనారోపించి, దానికిఁ జెందిన విజ్ఞానము నధిరోహించు చున్నాఁడు. జగద్ధాతయైన ఈ కృష్ణునియొక్క మాయ, గహ్వరమైనది. ధార్య ధారక భావముతో ఈ మాయ జగత్తును బాగుగాఁ బీడించు చున్నది. ఏమి యాశ్చర్యము! అతి గహ్వరమైన ఈ విష్ణుమాయ, ఎట్టివారికిని దుస్తరమైనదే. ఈ మాయచేతనే మోహితచిత్తుఁడై మానవుఁడు పరమేశ్వరుని దెలిసి కొనలే కున్నాఁడు. పై ప్రమాణములచేఁ బరమాత్మ యధీనమున మాయ కలదనుట స్పష్టపడుచున్నది.

నీ. భా. :- పరిదృశ్యమానమైన ఈ జగత్తంతయు, జగత్తువలె భాసించు ఆ పరమాత్మయే. అది నిత్యము, అవికారి, సర్వైశ్వర్య సంపన్నము నగు పరమాత్మ యొక్క మాయా స్వరూపమే. అందుచే నది స్వప్నమున గాంచు గజమువలె మిథ్యయైనను, ప్రకృతిబలముచే నిత్యముగా గోచరించును.

"ఇదం సర్వం యదయ మాత్మా, బ్రహ్మైవేదం విశ్వమ్; సర్వం ఖల్విదం బ్రహ్మ" మున్నగు శ్రుతులు బ్రహ్మకంటెఁ బ్రపంచము అన్యము కాదను విషయమును చెప్పుచున్నవి. అంత మాత్రమున బ్రహ్మకు ద్వైతభావము కలదనుటకు వీలులేదు. "అట్టి ద్వైతభావన మిథ్యయే" అను విషయమును స్ఫురింపఁ జేయుటకే, పై శ్రుతివాక్యమున "వా" శబ్దము ప్రయోగింపఁ బడినది. ఆ "వా" శబ్దము ఉపమార్థమునే తెలియఁ జేయును. "జగమే బ్రహ్మ" అని చెప్పినచో బ్రహ్మ కనిత్యము ప్రాప్తించును. అందుచే జగద్బ్రహ్మలకు బరమార్థతః వికార వికారి భావమే లేదు. వికార మనగా అనృతమైన మాయ. పరబ్రహ్మ, అట్టి వికార యోగముచేతనే స్వప్నేంద్ర జాలమువలె విశ్వమును నిర్మించుచున్నాఁడు. కావున జగద్బ్రహ్మలు కనకకుండలములవలె వికార, వికారి భావము కలవి కావు. విశ్వవిలాసమునకుఁ దచ్ఛక్తియే కారణము.

"దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం
పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే"

ముణ్ణగు శ్రుతులు తదర్ధయోగమును, అనగా బ్రహ్మశక్తియగు ప్రకృతియొక్క యోగమును దెలియఁ జేయుచున్నవి ఆత్మ భోక్త, శక్తి భోగ్యము. అని భావించి. శక్తి బ్రహ్మకంటె భిన్నమైనదని చెప్ప నలవికాదు. వహ్నియును (అగ్నియును) దానియందుఁ గల దహన ప్రకాశన శక్తియును బృథక్కుగా లేవుకదా! అటులనే శక్తియును శక్తిమంతుఁడైన బ్రహ్మయుఁ బృథక్కుగా లేవు. (అనగా వేరుగా లేవు.)

"బహుస్యాం ప్రజాయేయేతి; సచ్చ త్యచ్చా భవత్" అను శ్రుతులవలన శక్తిమంతుఁడైన బ్రహ్మయే బహురూపములను దాల్చినట్లును, సత్తైన బ్రహ్మయే, సత్తులైన పృథివీ సలిల తేజస్సులుగాను, త్యత్తులైన వాయ్వాకాశములుగాను విలసిల్లు చున్నట్లును దెలియుచున్నది. పై మంత్రములు శక్తి శక్తిమంతులకు అభిన్నత్వమును ఋజువు సేయుచున్నవి.

వివరణము :- ఇట మాయ, అవిద్య, పరమాత్మ, వికారము, పరమాత్మశక్తి అనునవి ప్రకృతికిఁ బర్యాయపదములుగాఁ గానవచ్చుచున్నవి. ప్రకృతి, 1. సామాన్యప్రకృతి, 2. మూలప్రకృతి అనఁగా బరాప్రకృతి అని రెండు విధములుగాఁ గలదు.

శ్లో॥ భూమిరాపో ఒనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥

అనుగీతానూక్తిలో సామాన్యప్రకృతి 1. భూమి; 2. నీరు; 3. అగ్ని; 4. వాయువు; 5. ఆకాశము; 6. మనస్సు;

7. బుద్ధి; 8. అహంకారము, అని యెనిమిది విధములుగా నున్నట్లుగా చెప్పఁబడినది.

శ్లో॥ అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥

అను గీతాసూక్తిలోఁ బరాప్రకృతి పరబ్రహ్మకు నాటిగాఁ జెందినదిగా, జీవరూపమును దాల్చునదిగాఁ, జగత్తును ధరించునదిగా) జెప్పఁబడినది. "మమయోని ర్మహద్బ్రహ్మ" అను గీతాసూక్తిలో మూలప్రకృతియే పరమాత్మ యోనిగాఁ బేర్కొనఁ బడినది. పరమాత్మ అట్టి మూల ప్రకృతితోఁ గూడియుండుటనే అనాది మాయాయోగమనియు, వికారమనియుఁ దెలిసికొనవలసి యున్నది. అట్టి మాయతోఁ గూడిన సృష్టికి హేతువైన పరమాత్మనే ఈశ్వరుఁ డని శంకరాచార్యులవారు చెప్పియున్నారు. ఆ యీశ్వరుఁడే మాయా సంబంధముచే జగత్కారణుఁడై బహురూపములను జెందుచున్నాడు. ఇట్లు బహురూపములు చెందుట జౌపాధికము. కావున అంతమాత్రాన బరమాత్మ కనిత్యత్వము వాటిల్లదు. మాయయే శక్తి. మాయగల ఆత్మయే శక్తిమంతుఁడు. అగ్నికిని, దానియందుఁ గల దహనశక్తికిని భేదము లేనట్లే శక్తి శక్తిమంతులకును భేదము లేదు. శక్తిశక్తిమంతులైన ప్రకృతి పురుషులు ఇరువురును అనాదులే యని ఇంతకు మున్నె చెప్పఁబడెనుగదా ! ప్రకృతి జగత్తును ధరించి యుండును. కావున జగత్తు ధార్యము. ప్రకృతి ధారకము, అందుచే వీనికి ధార్య ధారక భావరూప సంబంధము కలదు. మాయా ప్రభావముచే

మోహితుఁడైన మూఢుఁడు, పరమాత్మ స్వరూపమును గాంచలేడు. కావునఁ బ్రతిమానవుఁడును మూఢుఁడు గాక, ప్రహ్లాదునివలె జ్ఞానిగా నుండుటకుఁ బ్రయత్నించవలసియున్నది.

## —: పుణ్య పాపకర్మలు - పునర్జన్మ :—

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ యే ఽస్మిన్ధర్మా న్నాచరంతీహ కేచి
త్తథా ధర్మాన్ కేచి దిహా చరంతి।
ధర్మః పాపేన ప్రతిహన్యతేస్వి
దుతాహో ధర్మః ప్రతిహన్తి పాపమ్ ॥ ౧౧

తా॥ ఈ లోకమున అగ్నిహోత్రాది ధర్మములను కొందఱాచరించుచున్నారు. కొందఱు అధర్మముల నాచరించుచున్నారు. ధర్మము పాపముచేఁ బ్రతిహాత మగుచున్నదా? అనగా నశింపఁ జేయఁబడుచున్నదా? లేక ధర్మమే పాపమును నశింపఁ జేయుచున్నదా? అని ధృతరాష్ట్రుఁడు అడిగెను.

నీ. భా. :- జీవేశ్వరులకు భేదము లేదు. జగత్తు మిథ్య అయినను జగత్సృష్టికి నిమిత్తమైన ప్రకృతి బ్రహ్మకంటె అన్యము కాదు. అను విషయములచే, బ్రహ్మాద్వైతము సిద్ధమనియు, అందుచే మృత్యువు లేదను పక్షము స్థిరమనియు, ధృతరాష్ట్రుఁడు తెలిసికొనెను. అయినను వానికిఁ గొన్ని సందేహములు కల్గెను. అవేవన ?

ధర్మమును అధికముగా నాచరింపనివారు కొందఱు

కలరు కదా! వారి ధర్మము పాపముచే నశించునా? పాపమును అధికముగా నాచరింపనివారు కొందరుందురు. వారి పాపము ధర్మముచే నశించునా? ఇహలోకమునఁ గొందఱు మాత్రమే అగ్నిహోత్రాది ధర్మముల నాచరింతురు. కొందర అధర్మములనే ఆచరింతురు. వారి గతియేమి? అని ధృతరాష్ట్రుఁడు, కర్మ స్వరూప విజ్ఞానమునకై పెక్కువిధములఁ బ్రశ్నించెను. యజ్ఞాది కర్మలచేఁ గొందఱు మృత్యువును బోగొట్టుకొని, క్రమముక్తిని బొందుచున్నారుకదా! ఆ పక్షమునఁ గర్మ మోక్షహేతువు కదా? అయినను ఆపక్షమునకుఁ జెందిన కొందఱు, మోక్షము నిమిత్తము, అగ్నిహోత్రాది ధర్మకర్మల నాచరింపకున్నారు. మోక్షమునకై సన్న్యాసమునే స్వీకరించు చున్నారు. కొందఱు క్రమముక్తికై ఉపాసనా సహితములైన కర్మలనే ఆచరించు చున్నారు. వారందఱియొక్క ధర్మము రాగద్వేషాది పాపముచే నశించునా? లేక ధర్మమే పాపమును నశింపఁజేయునా? అని పరిపరివిధములఁ బ్రశ్నింపగా సనత్సుజాతుఁడిట్లు చెప్పెను.

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ ఉభయ మేవ తత్రోపయుజ్యతే ఫలం।
ధర్మస్య వై కర్మణశ్చేతరస్య చ॥ — ౨౩

తా॥ సన్న్యాసము, ఉపాసన అను రెండును మోక్ష విషయమై ఉపయోగ పడుచున్నవి. స్వర్గము ధర్మమునకు ఫలము. ఇతరమైన అధర్మమునకు నరకము ఫలము.

శం. భా. :- సన్న్యాసము, ఉపాసనతోఁ గూడిన కర్మ

అను రెండును మోక్ష విషయమై ఉపయోగపడుచున్నవి. స్వర్గము, చిత్తశుద్ధి అనునవి ధర్మకర్మకు ఫలముగా నున్నవి. ఇతరమైన అధర్మమునకుఁ గాని, నిత్యకర్మత్యాగమునకుఁగాని, నరకమే ఫలముగా నున్నది.

లక్ష్మాభరణ భాష్యము :- అజ్ఞానికి ధర్మము, పాపము అను రెండింటియొక్క అనుభవమే తప్ప, మఱేమియును దెలియదు. ధర్మముచేఁ బాపమునకుఁ గాని, పాపముచే ధర్మమునకుఁ గాని, నాశ మెన్నడును లేదు. విద్వాంసుఁడు మాత్రము తన జ్ఞానాగ్నిచే ధర్మపాపములను రెండింటిని నశింపఁజేయఁగలడు. అని చెప్పుచు సందేహ నివృత్తి చేయుచున్నాడు.

శ్లో॥ తస్మిన్ స్థితౌ వా ప్యుభయం హి నిత్యం
జ్ఞానేన విద్వాన్ ప్రతిహన్తి సిద్ధం ।
తథా న్యథా పుణ్య ముపైతి దేహీ
తథాగతం పాప ముపైతి సిద్ధమ్ ॥ ౨౪

తా॥ పుణ్యపాప రూపకర్మల నిర్వాహణమున నున్నను, జ్ఞాని, ధర్మాధర్మములను బుణ్యపాపములను దనజ్ఞానముచే నశింపఁ జేయును. ఆ విషయము వేదాదులలో సిద్ధమైయున్నది. ఆతఁడు జ్ఞానహీనుఁడైనచో, బుణ్యపాపముల ననుభవించుటకై దేహియగును. అనగా మఱలమఱల జన్మించును. అది నిశ్చయము.

శం. భా. :- పుణ్యపాపకర్మలను ఆచరించుచున్నను, విద్వాంసుఁడు ఆ యుభయమును నిత్యము తన జ్ఞానాగ్నిచే

నశింపఁ జేయుచునే యున్నాఁడు. శ్రుతి స్మృతీతిహాసపురాణములందు ఈ విషయము ప్రసిద్ధమై యున్నది. ఎట్లన ?

"భిద్యతే హృదయగ్రంథిః" అను శ్రుతిలో హృదయగ్రంథి భేదింపఁ బడుచున్నదని కలదు. అనగా జ్ఞాని, తనజ్ఞానముచే అన్నమయాది కోశముల గ్రంథులను భేదించుకొని, పుణ్యపాపములకు దూరుఁడై ముక్తుఁ డగుచున్నాఁడని పై శ్రుతివలన దెలియుచున్నది.

"యథా పుష్కరపలాశ ఆపో నశ్లిష్యన్తే।
ఏవమేవ విదిత్వా పాపం కర్మ నశ్లిష్యతే ॥"

అను సూక్తిచే దామరాకు నీటిలో నున్నను దానికి నీరు, అంటనట్లే జ్ఞానికిఁ బుణ్యపాప కర్మలఫలము అంటదు. అని తెలియుచున్నది.

"తద్యథేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం
హాస్యసర్వే పాప్మానః ప్రదూయన్తే"

అను సూక్తిలో రెల్లుగడ్డి చివరను గలదూది, అగ్నిలో బడి, నామరూప విహీనమైనట్లే జ్ఞానియొక్క పుణ్యపాపము లన్నియును జ్ఞానాగ్నిచే నశించునని వివరింపఁబడెను.

"తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ ।
నిరంజనః పరమం సామ్య ముపైతి".

అను సూక్తిలో విద్వాంసుఁడు పుణ్యపాపములను

బోఁగొట్టుకొని, నిరంజనుఁడై పరమాత్మను బొందును, అని చెప్పఁబడెను.

"అశ్వ ఇవ రోమాణి విధూయ పాపమ్" అను సూక్తిలో అశ్వము తన రోమములను వలె, జ్ఞాని పాపమును బోఁగొట్టుకొనును అని చెప్పఁబడెను.

"యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున"

అను సూక్తిలో రగులొన్న అగ్ని, సమిధలను భస్మము చేయునట్లు, జ్ఞానాగ్ని సర్వకర్మలను భస్మముచు జేయునని, చెప్పఁబడెను. పై సూక్తులచే జ్ఞాని పుణ్యా పాపములను రెండింటిని నశింపఁ జేయునని రూఢ మగుచున్నది.

జ్ఞాన విహీనుఁడైనచోఁ బ్రాణి తప్పక పుణ్యాపాపకర్మ ఫలములను బొందియు, ఇహలోకమును దప్పక చేరును. ఈ విషయముకూడ శ్రుత్యాదులలోఁ బ్రసిద్ధమై యున్నది. ఎట్లన ?

శ్లో॥ ఇష్టాపూర్తం మన్యమానా వరిష్టం
నాన్య చ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః ।
నాకస్య పృష్ఠే సుకృతేన
భూత్వే మంలోకం పునరేవా విశన్తి" ఇతి.

యజ్ఞయాగాదులను ఇష్టములందురు. తటాకాదులు త్రవ్వించుటను బూర్తము అందురు. ఈ యిష్టాపూర్తములనే శ్రేష్ఠములైనవిగా మూఢులు తలంచుచున్నారు. వారు వీని కంటే గొప్ప శ్రేయస్సు లేదనియే చెప్పుదురు. సుకృతముచేత

నాకమును (స్వర్గమును) బొందినను, బుణ్యక్షయము కాగానే మఱల యీలోకముసే ప్రవేశించు చున్నారు. అని పై శ్రుతి వలనఁ దెలియుచున్నది.

శ్లో॥ "అనందా నామ తే లోకా అంధేన తమసాఽఽవృతాః।
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః"॥

అను శ్రుతివలన ఆత్మజ్ఞానహీనులైన జనులు అంధతమసముచే (గాఢాంధకారముచే) ఆవరింపఁబడిన లోకములను బొందుదురు. అవియే అనందలోకము లని ప్రసిద్ధములై యున్నవి. అట్టి లోకముల నందినను మఱల వారు వెనుకకు వచ్చుచున్నారు. అనఁగా బునర్జన్మకై ఇహలోకమును బొందుచున్నారు అని తెలియుచున్నది.

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూత పాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే।
తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి॥

ఋగ్యజుస్సామవేదములను "త్రైవిద్య" అందురు. అందుఁ జెప్పఁబడిన రీతిని యజ్ఞము లాచరించి, సోమపాన మొనర్చి, పవిత్రులై స్వర్గమును బొందు చున్నారు. అట దివ్య భోగములను అనుభవించు చున్నారు. అట్టివారు కూడ పుణ్యము క్షీణించినతోడనే మర్త్యలోకమునకు, మఱల మఱలు చున్నారు. అని గీతాసూక్తిలో వాసుదేవుఁడు చక్కఁగాఁ జెప్పెను.

కావున జ్ఞానహీనుఁడు, పుణ్యపాప ఫలానుభవమునకై మఱల జన్మలను పొంది తీరునని పై సూక్తులవలన దెలియుచున్నది.

నీ. భా. :- ధర్మాధర్మములను రెండును సన్న్యాసో పాసనా కర్మస్వరూపములై, మానవుని, నిత్యము అనుసరించియే యుండును. సన్న్యాసపూర్వకమైన జ్ఞానమే ధర్మము. దానిచే మానవుఁడు విద్వాంసుఁడై సిద్ధముగానున్న బ్రహ్మపదార్థమును జేరును. ముక్తుఁ డగును. ఈ విషయము గత్యర్థకమైన "ప్రతి హాన్తి" అను పదముచేఁ దెలియుచున్నది. జ్ఞానహీనుఁడై స్వర్గకాంక్షియైన నరుఁడు, ఆ యా దేవతలకుఁ జెందిన ఉపా సనాకర్మల నాచరించి, బ్రహ్మస్థానమునకు భిన్నమైనట్టియు, ప్రశస్తము నైన దేవతాభావమును బొందును. ఆ నరుఁడే దేవాభిమాని యైనచో సిద్ధమైన పాపమును, దత్ఫలమైన నరక మును బొంది, పిమ్మట మానవలోకమున జన్మించును. కేవల కర్మాసక్తులకు జన్మము తప్పదు. జయవిజయులు దేవతలైనను అహంకారముచే భ్రష్టులైరి. కావున జ్ఞానమే శ్రేష్ఠమైన దని ప్రతిమానవుఁడు తప్పక తెలిసికొనవలెను.

వివరణము :-

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే ॥

అను గీతావచనమును బరిశీలించినచో ప్రకృతి బల ముచే జన్మించిన ప్రతిప్రాణియునుఁ ప్రకృతికిఁ జెందిన సత్త్వ రజస్తమో గుణముల స్పర్శచేతనే, పుణ్యపాపరూప కర్మలను

ఆచరించును. అహంకారముచే ఆవరింపఁ బడిన కారణమున ఆ విషయమును విస్మరించి, ప్రతిప్రాణియును మూఢుఁడై తానే కర్మలను ఆచరించితి ననుకొనును. సత్య హరిశ్చంద్రుఁడు, శ్రీరామచంద్రుఁడు, ధర్మరాజు మున్నగు మహానుభావులు తప్ప సామాన్యముగా నెవ్వఁడైనను ధర్మాధర్మ స్వరూపము లైన పుణ్యపాపముల రెంటింటిని ఎక్కువతక్కువ పాళ్ళలో జేయుచుండునన్న విషయము సర్వవిదితమే. అట్టి పుణ్యపాప ములలో బుణ్యముచేఁ బాపముకాని, పాపముచేఁ బుణ్యము కాని ఎచ్చటను నశింపవు. విద్వాంసుఁడు మాత్రము తన జ్ఞానాగ్నిచే, బుణ్యపాపకర్మలను రెంటింటిని నశింపఁ జేసికొనఁ గలఁడు.

"తథా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి" మున్నగు సూక్తు లెన్నియో, పై విషయ మును ప్రకటించు చున్నవి. ఇట్టి ప్రమాణము లెన్నియో భాష్యములందుఁ బేర్కొనఁబడినవి.

జ్ఞానహీనుల పుణ్యపాపకర్మలఫలము అనుభవింపనిదే నశింపదు. అజ్ఞానుల పుణ్యపాపములు మాత్రము ఒకదానిచే నొకటి నశింపవు. అట్టివారికిఁ బునర్జన్మయుఁ దప్పదు. నిష్కామ ముగా, దైవార్పణబుద్ధితోఁ గర్మ లాచరించినవారికిఁ గర్మ ఫలము లేశమంతైనను అంటదు, సరేకదా, వారు తప్పక ముక్తులగుదురు. నిత్యము పరమాత్మయందే స్థిరచిత్తుఁడైన వాఁడు పుణ్యపాపఫలములైన స్వర్గనరకములను బక్కాగా గుర్తించఁగలఁడు. అపరోక్ష జ్ఞానియైన కారణమున విద్వాం

సుఁడు తన పుణ్యాపాపములను రెంటిని బోఁగొట్టుకొనును. దేహాభిమానియైన జీవుఁడు మాత్రము అజ్ఞాని యగుటచే బుణ్యాపాపముల ఫలములను బొందితీరును, అని తెలిసికొనవలసి యున్నది.

శ్లో॥ గత్వోభయం కర్మణా యుజ్యతేఽస్థిరం
శుభస్య పాపస్య సచాపి కర్మణా।
ధర్మేణ పాపం ప్రణుదతీహ విద్వాన్
ధర్మో బలీయానితి తస్య సిద్ధిః॥ ౨౫

తా॥ మానవులు పుణ్యకర్మ లాచరించి, పరలోకమును జేరి, కర్మానుసారముగాఁ బుణ్యాపాపఫలములను బొందును. ఆ ఫలము లస్థిరములని యెఱిగి, విద్వాంసుఁడు ఈశ్వరప్రీతిగాఁ జేయు ధర్మకార్యముచేఁ బాపమును బోఁగొట్టుకొనును. పరికింపగా ధర్మాధర్మములలో ధర్మమే బలీయమైనదని తెలియుచున్నది.

శం. భా. :- అజ్ఞానికిఁ బుణ్యాపాపకర్మల యనుభవము తప్పదా ? లేక వాఁడు పుణ్యముచేఁ బాపమును, బాపముచేఁ బుణ్యమును నశింపఁ జేసికొనునా ? అను సందేహమును దొలగించుట కీక్రింది విషయమును జెప్పుచున్నాఁడు. అదేమన ? అజ్ఞాని పరలోకమును జేరి, కర్మానుసారముగా అచ్చట అస్థిరమైన పుణ్యాపాపఫలములను అనుభవించును.

యో వా ఏతదక్షరం గార్గ్య! విదిత్వాఽస్మిన్ లోకే
జుహోతి.

గార్గ్యుఁడా! అక్షరమైన బ్రహ్మవస్తువు నెఱింగియు ఇహలోకమున యజ్ఞాదుల నాచరించు వాఁడు అస్థిరమైన పుణ్యము పొందును. అని బృహదారణ్యక సూక్తిలోఁ జెప్పఁబడెను.

"అథ యేఽన్యథాతో విదురన్య రాజాన స్తేక్షయ్య
లోకాభవన్తి"

పరబ్రహ్మకంటె భిన్నమైన క్షరవస్తువు నెఱిగినవాఁడు, అన్యరాజు నాశ్రయించిన వానివలెఁ బరాధీనుఁడుకాఁ దన పుణ్యలోకములను క్షీణింపఁ జేసికొనును. అని చెప్పు ఛాందోగ్య సూక్తియు పై విషయమునే బలపఱచుచున్నది. జ్ఞానియైనవాడు నిష్కాముఁడై ఈశ్వరప్రీతికై, కర్మలను ఆచరించును. అందుచే వాఁడు తన ధర్మకర్మచే అనగా సన్న్యాస పూర్వకమైన జ్ఞానముచేఁ బుణ్యపాపఫలములను బోఁగొట్టుకొనుటతోఁబాటు పాపమును సైతము నశింపఁ జేసికొనును.

శ్లో॥ తదర్థ ముక్తం తపఏత దిజ్యా
తాభ్యా మసౌ పుణ్యముపైతి విద్వాన్
పుణ్యేన పాపం వినిహత్య పశ్చా
స్సజాయతే జ్ఞాన విదీపితాత్మా
జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వా
నథాన్య థా స్వర్గఫలాను కాంక్షీ ।
అస్మిన్ కృతం తత్పరి గృహ్యా సర్వ
మముత్ర భుంక్తే పునరేతి మార్గమ్ ॥

ఈశ్వరప్రీతికై తపస్సును యాగమును జేయుట ఉత్తమము. అట్టి తపోయాగములచే విద్వాంసుడు పుణ్యమును బొందును. అట్టి పుణ్యముచేఁ బాపమును నశింపఁ జేసికొని, పిమ్మట జ్ఞానమున సేమో యెఱుఁగును. అపుడే ఆతఁడు ఆత్మ వస్తువును బడయఁ గోరును, జ్ఞానముచేతనే విద్వాంసుడు బ్రహ్మపదార్థమును బొందును. జ్ఞానహీనుఁడై తపోయాగముల నాచరించువాఁడు స్వర్గఫల కాంక్షియగుటచే స్వర్గమును బడయును. పుణ్యము నశించినతోడనే ఇహలోకమార్గమును జేరి, జన్మలను బడయును.

శ్లో॥ యేషాం ధర్మే చ విస్పర్థా నతద్విజ్ఞాన సాధనం ।
యేషాం ధర్మే న చ స్పర్థా తేషాం తత్ జ్ఞాన సాధనమ్ ॥

ధర్మము విషయమై యెవరికి విశేషముగా విరోధము, అసూయ యుండునో అట్టి ధర్మము విజ్ఞానమునకు సాధనము కాదు. ఎవరికి ధర్మముపై స్పర్ధయుండదో, అనగా విరోధము అసూయయు నుండదో, వారికి ఆ ధర్మము జ్ఞానసాధనమగును. కావున ఎవ్వరైనను జ్ఞానసాధనమైన ధర్మమును గూర్చియే పాటుపడవలెను. అంతియే కాని ధర్మముపై ఎవఁడును విరోధమును అసూయను వహించరాదు. వినియోగమెఱిఁగినవాఁడై ఈశ్వరార్థము ఎవఁడు కర్మల ననుష్ఠించునో అట్టి విద్వాంసుని యొక్క ధర్మము పాపముకంటె బలీయమైనదై, వాని పాపమును నశింపఁజేయునని ఎఱుగవలెను. అతఁడు కేవలము కర్మిష్ఠియైనచో వాని ధర్మము బలీయమైనది కాదు. అట్టివాఁడు పుణ్యపాప ఫలముల ననుభవమునకు

మాత్రమే పాత్రుఁ డగును. కాన వాని పుణ్యపాపములు ఒక దాని నొకటి నశింపఁ జేయఁ జాలవు.

వివరణము :- జ్ఞానిమాత్రమే జ్ఞానసహితములైన తపోయాగ కర్మలచే ధర్మాధర్మములను రెండింటిని క్షీణింపఁ జేసి కొనఁగలఁడు. మిగిలిన సామాన్యుల కది సాధ్యము కాదు. ధర్మద్వేషము కలవాఁడు ఆధ్యాత్మిక విషయము తెలిసిన మాత్రానఁ దన పుణ్యపాపములను ఏ మాత్రమును బోగొట్టు కొనఁజాలడు. పుణ్యకర్మఫలము స్వర్గము. పాపకర్మఫలము నరకము, ఆ రెండును అస్థిరములే. కావునఁ బుణ్యపాపకర్మల నాచరించువాఁడు ఈ లోకమునఁ బూర్వకర్మల కనుగుణమైన యోనిలో జన్మించును. జరాసంధుఁడు, కర్ణుఁడు, కార్తవీర్యార్జునుఁడు మున్నగు వారి తెగకుఁ జెందినవారే. కర్మలను ఆచరించువాఁడు కర్మఫలములను అనుభవించి, మఱల మఱలఁ గర్మలనే ఆచరించును. వాఁడు కర్మపాశమునుండి విడివడఁడు. అట్టి కర్మయోగి కూడ, విద్వాంసుఁడైనచో ధర్మకార్యముచేఁ బాపమును బోగొట్టుకొనును. మూఢుఁడు మాత్రము పాపమును బోఁగొట్టుకొనఁ జాలక కర్మఫలమైన స్వర్గాదికమునే కోరుచుండును. అందుచే ధర్మమే బలీయమైనదని యెఱుఁగుము. ధర్మకర్మల నాచరించువాఁడు కాలవశముచే రాగద్వేషాది దోషములను నశింపఁ జేసికొని, క్రమముగా మోక్షమును బొందును.

అజ్ఞాని మాత్రము కర్మమార్గముననే స్థిరుఁడై పుణ్యపాపకర్మఫలములను అనుభవించుచు, దేవదూతలచేతను యమ

దూతలచేతను ఆ యా లోకములకుఁ గొనిపోఁబడుచుండును. గుణనిధి మున్నగువారు ఈ తెగకుఁ జెందినవారు. విద్వాంసుఁడు మాత్రము కర్మకౌశల మెఱిగినవాఁడై అత్యుత్కృష్టమైన ధర్మముచే బాపమును నశింపఁ జేసికొనును. కావున బాలురైనను, యువకులైనను, వృద్ధులైనను మార్కండేయుఁడు ధ్రువుఁడు మున్నగు వారికథలచే చక్కని జ్ఞాన మార్జించి, తరించుట ఉత్తమపద్ధతి.

-: ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ యా నీహాహుః స్వస్య ధర్మస్య లోకాన్
ద్విజాతీనాం పుణ్యకృతాం సనాతనాన్ ।
తేషాం క్రమాన్ కథయ తతో ఒపిచాన్యాన్
నైతద్విద్వన్ వేత్తుమిచ్ఛామి కర్మ ॥ ౨౬

తా॥ పుణ్యమాచరించు బ్రాహ్మణులకుఁ దమధర్మముల కనుకూలములైన లోకములు ప్రాప్తించును. అవి నిత్యములని పెద్దలు చెప్పుచున్నారు. ఆ లోకములలో ఏవి ఉత్తమములో? ఏవి నీచములో వానిక్రమమును నా కెఱిగింపుము. అంతియేకాని కామ్యకర్మలకుఁ జెందిన లోకములను గూర్చి నాకుఁ దెలిసికొనవలె నను తలంపు లేదుసుమా! అని ధృతరాష్ట్రుఁ డడుగగా సనత్సుజాతుఁ డిట్లు చెప్పెను.

నీ. భా. :- పైవిషయముల నాలకించి, కామ్యధర్మమును, బాపమును, సంసారబంధమునకు హేతువులు. నిత్య

ధర్మముచేఁ గల్గిన పుణ్యము మాత్రము, మోక్షహేతు వగు నని తలంచి, ధృతరాష్ట్రుఁడు ప్రశ్నింపఁ దొడఁగెను.

అయ్యా! "అపామసోమ మమృతా బభూమ" సోమపానముచేసి, అమృతుల మగుచున్నాము. "అక్షయ్యగ్ం హవై చాతుర్మాస్య యాజిన స్సుకృతం భవతి" చాతుర్మాస్య యాగము కావించువానికి అక్షయ సుఖము కలుగుచున్నది.

"యస్యైతే ఒష్టాచత్వారింశ త్సంస్కారాః సబ్రహ్మణః సాయుజ్యం సలోకతాం గచ్ఛతి" నలుబది యెనిమిది సంస్కారములను ఆచరించువాఁడు బ్రహ్మకుఁ జెందిన సాయుజ్య మోక్షమును, సాలోక్య మోక్షమును బొందుచున్నాఁడు. అని శ్రుతులు, స్మృతులు చెప్పుచున్నవి. వానిని బరిశీలించినచోఁ బుణ్య మాచరించు బ్రాహ్మణులు ధర్మఫలముగాఁ బొందు లోకములు, నిత్యములని తెలియుచున్నదే. ఆలోకము లుత్తమములా? లేక నీచములా? తెలియఁ జెప్పుఁడు' అవి ప్రత్యగానందరూపము లేనా? మోక్షసుఖము నిచ్చునా? ఎఱిఁగింపుడు. అంతేకాని నిషిద్ధకర్మలను గామ్యకర్మలను దెలిసికొను తలంపు నాకు లేదు. అట్టివానిని గూర్చి నేనెన్నడును దెలిసికొనఁ గోరను. అని ధృతరాష్ట్రుఁడు తన వైరాగ్యము ప్రదర్శించెను.

వివరణము: ధ్రువుఁడు గావించిన తపస్సు అలౌకికమైన ముక్తికిఁ జెందినది. విశ్వామిత్రుని తపస్సు లౌకిక ధర్మమునకుఁ జెందినది. హిరణ్యాక్షాది రాక్షసులు గావించిన తపస్సు కేవలము లౌకికమే. లౌకిక ధర్మమునకుఁ జెందిన తపస్సు భోగములను చేకూర్చునదే కాని శాశ్వత మోక్ష

సుఖమును జేకూర్చునది కాదు. ఆత్మజ్ఞానముచే దుఃఖము నశించును గాని లౌకిక తపోరూపమైన ధర్మముచే సంసార దుఃఖము నశింపదు.

—: కర్మఫలము - జ్ఞానఫలము :—

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ యేషాం ప్రతే ఒధ విస్పర్థా బలే బలవతామివ।
తే బ్రాహ్మణా ఇతః ప్రేత్య బ్రహ్మలోక ప్రకాశకాః॥ 22

తా॥ రాజులలో బలవంతుఁడు బలహీనుని జయించి, సుఖమనుభవింపఁ గోరినట్లు కొందఱు బ్రాహ్మణులు ఫల కాంక్షులై, జ్యోతిష్టోమాది ధర్మములను గూర్చి సంఘర్షణ చేయుదురు. వారు ధర్మాచరణముచే బ్రహ్మలోక ప్రకాశకులై స్వర్గము చేరినను ధర్మఫలానుభవము క్షీణించిన తోడనే మఱల యీలోకమునే చేరుచున్నారు.

శం. భా. :- స్వర్గవాసులకు ఊర్వశి మున్నగు వారి భోగము లభించును. స్వర్గము జ్యోతిష్టోమాదులచే లభించును. అని విషయాసక్తులాలకించి బలవంతుఁడైన రాజును బలవంతుఁడగు వేరొక రాజు జయించి, సుఖ మనుభవింపఁ గోరినట్లు తాము ను జ్యోతిష్టోమాది ధర్మముల విషయమై అహమహమికతో విస్పర్థ అనగా సంఘర్షణ గావింతురు. ఇట్లు ఫలకాంక్షులును, యజ్ఞాధికారులు నగు బ్రాహ్మణులు ధర్మాచరణముచే ధూమాదిమార్గమునఁ బోయి, స్వర్గమున నక్షత్రాది రూపమున ప్రకాశించుచు, బ్రహ్మలోక ప్రకాశకు లగుచున్నారు.

కొంతకాలమైన పిమ్మట, ఆ ధూమాది మార్గముననే ఇహ
లోకమునకు మఱలుచున్నారు.

“అథ య ఇమే ఇష్టా పూర్తే దత్త మిత్యుపాసతే ।
తే ధూమ మభిసంభవంతి” అనునది మొదలు, “ఏష సోమో
రాజా తద్దేవానా మన్నం, తం దేవా భక్షయంతి, యావత్సం
పాత ముషిత్వా థైత మేవాధ్వానం, పున ర్నివర్తన్తే” అను
వరకుఁ గల మంత్రములు, పై విషయముననే స్పష్టపఱచుచున్నవి.
ఎట్లన ? కొందఱు బ్రాహ్మణులు ఆయాదేవతల నుపాసించి,
ఇష్టాపూర్తము లాచరించి, ధూమమార్గమున స్వర్గము చేరు
చున్నారు. అట వారు దేవరూపులై దేవతల కాహారమగు
సోముని భక్షించి, పుణ్యకర్మఫలము పూర్తియైన తోడనే, ఆ
ధూమమార్గము ననుసరించియే, ఇహలోకమునకు మఱలు
చున్నారు.

సీ. భా. :- యమనియమా ద్యభ్యాసము యోగులకు
చెందిన వ్రతము. అట్టి వ్రతమును దపోఽభినివేశముతో, విశ్వా
మిత్రుఁడు ఆచరించెను. అటులనే సగుణబ్రహ్మోపాసకులును,
యోగులు నగు కొందఱు బ్రాహ్మణులు, బలప్రదర్శనమున
మల్లులవలె యోగవ్రతమున విస్పర్ధను అనగా సంఘర్షణను
గావించుచున్నారు. వారు భౌతిక దేహమును వీడి, బ్రహ్మ
లోకమున కేగి, పూజ్యులై, బ్రహ్మతోఁబాటు ముక్తిని బొందు
చున్నారు.

శ్లో॥ బ్రహ్మణాసహ తే సర్వే సంప్రాప్తే ప్రతి సంచరే ।
పరస్యాన్తే కృతా త్మానః ప్రవిశన్తి పరంపదమ్ ॥

అను సూక్తి పై విషయమునే ప్రకటించు చున్నది. ఎట్లన ? కొందఱు యోగులగు విప్రులు వ్రతాంతమునఁ గృతార్థులై బ్రహ్మలోకమును బొంది, అట బ్రహ్మతోసహా బ్రహ్మపదమునఁ బ్రవేశించు చున్నారు.

వివరణము :- కొందఱు బ్రాహ్మణులు దేవతలవలె విద్యాబలముచే విస్పర్థులై స్వర్గముచేరి దానిని ప్రకాశింపఁ జేయుచున్నారు. వారు బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మములను క్రమముగ నాచరించిన కారణమున స్వర్గముచేరినను క్రమముగా మోక్షమును బొందు చున్నారు. ధర్మస్పర్థలేని వారు తపోబలముచే బ్రహ్మలోకము చేరి మోక్షమును బొందు చున్నారనియు దెలిసికొనవలసి యున్నది.

శ్లో॥ యేషాం ధర్మే చ విస్పర్ధా తేషాం తత్ జ్ఞాన సాధనమ్।
తే బ్రాహ్మణా ఇతో ముక్తాః స్వర్గం యాంతి త్రివిష్టపమ్॥

తా॥ నిష్కామముగా, ఈశ్వరార్పణబుద్ధితోఁ గర్మల నాచరించువారు జ్యోతిష్టోమాది ధర్మము విషయమై సంఘర్షణ చేయరు. అందుచే వారు చేయుకర్మ, జ్ఞానసాధనమే యగును. అట్టి బ్రాహ్మణులు కర్మలచే విశుద్ధచిత్తులై, ముక్తు లగుదురు. అందుచే వారు స్వర్గముచేరినను, క్రమముగా, బ్రహ్మనిలయమును, త్రివిష్టపమను నామధేయముగల సత్యలోకమును జేరు చున్నారు.

శం. భా. :- ఇంద్రియ నిగ్రహముగల మానవులు, అనిత్యమైన స్వర్గఫలము, నొసఁగు జ్యోతిష్టోమాది ధర్మముల

విషయమై సంఘర్షణ చేయరు. వారు నిష్కామముగా ఈశ్వర ప్రీతికై యజ్ఞాది కర్మల ననుష్ఠింతురు. అందుచే అట్టి కర్మలు జ్ఞానసాధనము లగును. "పుణ్యేన పాపం విహాత్య" అను శ్లోకము పై విషయమునే స్పష్టపఱచు చున్నది. యజ్ఞాది కర్మలచే విశుద్ధసత్త్వులై, ఆత్మజ్ఞాన సంపూర్ణులైన బ్రాహ్మణులు, కార్యకారణ లక్షణమైన ఈ లోకమును వీడి ముక్తులై సుఖలక్షణమైన స్వర్గమును బూర్ణానందమైన బ్రహ్మకు నిలయమగు సత్యలోకమును బొందుచున్నారు. సత్యలోకమునుగూడఁ ద్రివిష్టప మందురు. అది స్వర్గముకంటె విలక్షణమైనది. ఏమన? ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము నను తాపత్రయమునుండియు, సత్త్వరజస్తమస్సు లనెడి గుణత్రయము నుండియు, జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి అవస్థాత్రయమునుండియు, విముక్తుఁడై బ్రహ్మస్వరూపావిష్టుఁడైన, జ్ఞానిని గాపాడుటచే దానిని త్రివిష్టప మనిరి.

నీ. భా. :- "యేషాం వ్రతే ఽథ విస్పర్ధా" అను శ్లోకమున యోగధర్మముయొక్క ఫలము నెఱిగించి, ఇందు యజ్ఞధర్మముయొక్క ఫలము నెఱిగించు చున్నాడు. ఎట్లన? "నేనే యజ్ఞాదులను సర్వోత్కృష్టముగా ఆచరించు చున్నాను" అనెడి పట్టుదల గలవారికి యజ్ఞాదికము క్రమముగా జ్ఞానసాధనమగును. అందుచే వారు బ్రహ్మవస్తువును దెలిసికొనఁ గోరెదరు.

"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా ఽనాశకేన" అను శ్రుతిలో యజ్ఞము దానము, తపస్సు, అనునవి, బ్రహ్మవస్తువును దెలిసికొనవలె

నను కోరిక పుట్టించు నని తలచు. అది పైవిషయమును బల పఱచును. అందుచే యజ్ఞాదికర్మలను నిష్కామముగా ఆచరించు బ్రాహ్మణులు ముక్తులై ఆనుషంగిక ఫలప్రదమైన స్వర్గమును, బిమ్మట ప్రదిష్టపమైన సత్యలోకమును బొందుచున్నారు.

"యథా ప్రమేఫలార్థం నిమితే ఛాయా గంధ ఇత్య
నూత్పద్యేతే ।
ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యన్తే"

అను వచనమునం బంప్లకై మామిడి చెట్టెక్కి పరిశో ధించువానికి, దానినీడ, దానివాసన, ఆనుషంగిక ఫలములుగా లభించునని, ఆపస్తంబుఁడు చెప్పెను. అట్లే యజ్ఞాదు లాచ రించువారికి బ్రహ్మజ్ఞానేచ్ఛతోఁ బాటు స్వర్గమును గల్గును.

వివరణము : జ్ఞానులు ప్రవృత్తిధర్మమునందు స్పర్ధ లేక యుందురు. వారు ఫలాశను వీడి విష్ణుప్రీతికై ప్రవృత్తిధర్మమును ఆచరింతురు. అందుచే అట్టిధర్మము జ్ఞానసాధనమే యగును. అట్టి జ్ఞానముచే ముక్తులైన బ్రాహ్మణులు వైకుంఠాది లోకము లను మూడింటిని, మోక్షమునకై చేరుచున్నారని తెలియు చున్నది.

—: విద్వాంసుఁడు - సన్న్యాసి :—

శ్లో॥ తస్య సమ్యక్సమాచార మాహు ర్వేద విదోజనాః ।
నైనం మన్యేత భూయిష్ఠం బాహ్యామాభ్యన్తరం జనమ్ ॥

తా॥ బ్రహ్మచర్య మొనర్చి కామ్యకర్మ సన్న్యాసము గావించినవాఁడే విద్వాంసుఁడు. ఆతఁడే బ్రహ్మనిష్ఠుఁడైన

పండితుఁడు. అతఁడే సన్న్యాసి. అతఁడు బాహ్యమైన ఐహికాముష్మిక ఫలమును గొప్పదిగా భావింపఁడు. అభ్యన్తరులైన పుత్రమిత్ర కళత్రాదులను దలంపఁడు. ఇదియే విద్వాంసుని సమాచార మని వేదవేత్తలు చెప్పుచున్నారు.

నీ. భా. :- పిమ్మట బ్రహ్మచర్యమునం దుండియే, కర్మ సన్న్యాస మొనర్చి వేదాన్త శ్రవణాదికము నాచరించి, మహిమతో విలసిల్లు నట్టియు, 'బరమహంస పరివ్రాజకాచార్యుఁడైన పండితుని సమాచారమును జెప్పఁదొడఁగెను. బ్రహ్మచర్యమందే సన్న్యసించిన పరివ్రాజకులు కర్మల నాచరింపకున్నచోఁ బ్రత్యవాయము కల్గునని తలంచి, ధర్మార్థము ధర్మము నాచరించు చున్నారు. కాని స్వర్గమునకై ఆచరింపరు. అందుచే వేదవేత్తలైన జనులు విరక్తులైన విద్వాంసుల యొక్కయు వైదికధర్మము యొక్కయు, సమాచారము నిట్లు చెప్పిరి. సన్న్యాసులు ఐహికాముష్మిక ఫలములను వాంఛింపరు. వారు అభ్యన్తరులైన పుత్రమిత్ర కళత్రాదులనుగాని, బాహ్య విషయములగు వర్ణాశ్రమాదులనుగాని, గొప్పవిగా భావింపరు.

"స ఏక ఇంద్ర స్యానందః, స ఏకః ప్రజాపతే రానందః, శ్రోత్రియస్య చాకామహతస్య" అను శ్రుతులలోఁ జెప్పిన మానుషానందము, ఇంద్రానందము, ప్రజాపత్యానందము మున్నగు వానిని అస్థిరములుగా భావించి, కామహతులు కాని, శ్రోత్రియులై నందున బ్రహ్మానందమునే బడయుఁగోరెదరు.

—: సన్న్యాసుల జీవనవైఖరి :—

శ్లో॥ యత్ర వ స్యేత భూయిష్ఠం ప్రావృషీవ తృణోలపం ।
అన్నం పానం బ్రాహ్మణస్య తజ్జీవే న్నాను సంజ్వరేత్ ॥30

తా॥ పై శ్లోకమునఁ జెప్పినట్లు మెలగు నాతఁడే సన్న్యాసి. ఆతఁడు వర్షాకాలమునందలి తృణోదకములవలె మునుల యాహారము మిక్కుటముగా లభించు గృహస్థుల యింట్ల కేగి, అన్నపానములను అభ్యర్థించునే కాని, గృహస్థుల కుండు అన్నపానాదులు తనకు లేవని మాత్రము విచారింపడు.

శం. భా. :- మునులు భుజింపఁదగు నాహారమును దూర్వలను, దట్టముగా నుండు తృణమును, ఉలప మందురు. అట్టి తృణోలపము, ఉదకము, బ్రాహ్మణోచితమైన అన్నపాన ములును, వర్షాకాలమందలి తృణోదకములవలె మిక్కుటముగా లభించు తావుల కేగి, సన్న్యాసులు అటనున్న గృహస్థులను జీవయాత్రకై ఆశ్రయించి, జీవింతురే కాని గృహస్థుల కుండు అన్నపానాదులు తమకు లేవని మాత్రము పరితాపమును బొందరు.

శ్లో॥ యత్రాకథయ మానస్య ప్రయచ్ఛ త్యశివం భయం ।
అతిరిక్త మివాకుర్వన్ స శ్రేయా న్నేతరోజనః ॥ 31

తా॥ సన్న్యాసి తన గొప్పను దాను ఇతరులకుఁ జెప్పు కొనడు. ఆతఁడు తన కితరులవలన భయము కల్గినను, బాధ కల్గినను విచారింపడు. పరులవలనఁ గల్గిన యవమానము తనది

కాదన్నట్లే తలంచి మెలగును. తనను అవమానించిన వానినే గొప్పవానినిగాఁ దలంచును. తనను గొనియాడిన వానిని శత్రువుగాఁ దలంచును.

శం. భా. :- నిజమైన పరివ్రాజకులు తమ మహాత్త్వము వ్యక్తము చేయక, యేదో యొకదేశమున నుందురు. దేహయాత్రకై ఆశ్రమానుకూలముగా ఏదో భుజించి, ఎక్కడనో ఒకచోట నిద్రింతురు. లోకమంతటిని దనవంటిదిగాఁ దలంతురు. జడ, మూక, బాల, పిశాచాదులవలె సంచరింతురు. అందుచే వాఁని స్థితప్రజ్ఞులుగా, బ్రహ్మవేత్తలుగా భావించి పూజింపకున్నను. అవమానించినను ఆగ్రహింపరు. తమ నవమానించు వారే గొప్పవారని వారితలంపు.

శ్లో॥ సంమానా ద్బ్రాహ్మణో విద్వా నుద్విజేత విషాదివ ।
అమృతస్యేవ చాకాంక్షే దవమానస్య సర్వదా ॥

విద్వాంసుఁడైన బ్రాహ్మణుఁడు అనగా బ్రహ్మజ్ఞుఁడు తనను ఇతరులు సన్మానించిరేని విషమిచ్చినట్లు భావించి, ఉద్వేగము చెందును. తనకొరకుఁను గావించిన యవమానమును సర్వదా అమృతమునువలె ఆకాంక్షించును. అని మనువు చెప్పెను.

శ్లో॥ సంమాననాం వరాం హానిం యోగస్థేః కురుతే యతః ।
జనేనావమతో యోగీ యోగసిద్ధిం చ విందతి ॥

నిజమైన యోగి తనకితరులు గావించు సన్మానమును మహాహానిగాఁ దలంచును. తనను ఇతరులు అవమానించుటయే

యోగసిద్ధిగా గ్రహించును. అని పరాశరుఁడు పేర్కొనెను.

నీ. భా. : మనువు పరాశరుఁడు చెప్పినట్లు సంచరించు పరివ్రాజకుఁడు; నిజమైన సన్న్యాసి ఆతఁడు భయప్రదమైన దేశమందున్నను, దన విద్యచేఁ దన సామర్థ్యమును వెల్లడి చేయఁడు. పరులు గావించు పీడను అవమానమును దనవి కావనునట్లు విడనాడును. చెడుబుద్ధి కలవాఁడు కావించు నపకారముకు దలంచియు, వ్యధ చెందఁడు. ప్రతీకార మొనర్పఁ దలంపఁడు. సన్న్యాసి యెల్లప్పుడును ఉదాసీనుఁడై, క్షమావంతుఁడై మెలఁగును. భయము కల్గినను, సతతమును అహింసను విడనాడఁడు. మరణ మాసన్నమైనను, దేహమున నిస్పృహతో నుండును.

శ్లో॥ యో వాకథయ మానస్య హ్యాత్మానం నాను సంజ్వరేత్ ।
బ్రహ్మస్వం నోపభుంజీత, త దన్నం సంమతం సతామ్ ॥

తా॥ బ్రహ్మజ్ఞానికిఁ జెందిన ధనము బ్రహ్మస్వము, అనఁబడును. సన్న్యాసి బ్రహ్మజ్ఞాని. కావున ఆతనికిఁ జెందిన "కుశ, దర్భ, నారబట్టలు" మున్నగునవియే బ్రహ్మస్వము అనఁబడును. దానిని ఎన్నఁడును బాధచేయక, శ్రోత్రియుఁడై యుండు గృహస్థునింట నిడువట్టి యన్నమునే సన్న్యాసి భుజించును. కాని సామాన్యులయింట భుజింపఁడు. తన గోత్రనామాదులను ఏరికిని వెల్లడి చేయఁడు. తనగోత్రాదులను దెల్పలేదని పీడించినను, నిజమైన సన్న్యాసి బాధపడఁడు. బ్రహ్మచారులను, సన్న్యాసులను ఆదరించుచు, సన్మార్గమున నున్నవారే సజ్జనులు వారిడునట్టి యన్నమే, సన్న్యాసులకు సమ్మతమైనది.

శం. భా. :-

శ్లో॥ రత్నక్షౌమాదికం నాస్య యోగినస్స్వం ప్రచక్షతే ।
కుశవల్కల చేలాద్యం బ్రహ్మస్వం యోగినో విదుః ।

అను సూక్తిని బరిశీలించినచో "రత్నములు, పట్టుబట్టలు" మున్నగునవి యోగికిఁ జెందిన ధనముగాఁ జెప్పఁబడలేదు. కుశ, దర్భ. నారబట్టలు మున్నగునవియే, యోగికిఁ జెందిన బ్రహ్మస్వముగాఁ జెప్పఁబడినవి. బ్రహ్మజ్ఞాన సంపన్నునకుఁ జెందిన ధనమునే బ్రహ్మస్వముఁ (బ్రాహ్మణద్రవ్యము) అందురు. బ్రహ్మస్వమే బ్రహ్మనిష్ఠాసాధనము. అట్టి బ్రహ్మస్వమును బాడుచేయునట్టియు, దూష్ణీంభూతుఁడై సమస్తమునుపసంహరించుకొని, పూర్ణానందాత్ముఁడై యుండునట్టి గృహస్థుని బరితపింపఁజేయు పనియుఁ జేయరాదు. వాని ధనమును బాడుచేయరాదు. అట్టి వానియింట నిడిన యన్నమే. సజ్జనులకును, నిజమైన సన్న్యాసులకును సమ్మతమైనది. అట్టి వారి యింటనే సన్న్యాసులు భుజింతురు. కొందఱు గృహస్థులు తమ గొప్పను బ్రదర్శింతురు. అట్టివారిని, వారిపరోక్షమునఁ బరితపింపఁ జేయరాదు. వారియుత్కర్షను జూచి, యసూయ పడరాదు. యతి, బ్రహ్మచారి, మున్నగు వారికి భోజన మిడకయే తాను భుజింపరాదు. పైనఁ జెప్పినట్లు మెలఁగినవాఁడే సాధువైన గృహస్థుఁడు. అతఁడే శ్రద్ధతో సన్న్యాసులను ఆదరించును. అట్టి వానియన్నమే సజ్జనులకు సమ్మతము. కొందఱు భిక్షువులు తమ గోత్రవిద్యాదికములను వెల్లడిచేయరు. అయినను గృహస్థుఁడు వారియెడల సహనమునే చూపవలెను.

శ్లో॥ యథా స్వం వాంత మశ్నాతి శ్వావై నిత్య మభూతయే ।
ఏవం తే వాంత మశ్నంతి స్వవీర్యస్యోపసేవనాత్ ॥ 33

తా॥ కక్కినట్టియుఁ, దినుచుండగాఁ గ్రిందఁ బడినట్టియుఁ, బార వేయఁ బడినట్టి యాహారమును వాంతిమందురు. తన గొప్ప తాను జెప్పుకొనుటయును, వాంత మే యగును. కుక్క తాను గ్రక్కిన దానినే తాను దినును. వాంతమును భుజించుట ఆరోగ్యకరము కాదు. అందుచే సన్న్యాసి తనగొప్ప తాను జెప్పుకొనడు. తన గొప్ప తాను జెప్పుకొనుట, తనవీర్యమును దాను సేవించుటవంటిది. అట్టిపనిని నీచులు చేయుదురే కాని, ఉత్తములైన సన్న్యాసులు చేయరు.

శం. భా. :- నిజమైన సన్న్యాసులు శిష్టులు కానివారి వలె సంచరింతురు. వేదములను బఠించుచుందురే కాని అన్నము పెట్టుడని అడుగ నేరరు. అన్న మడుగుట సన్న్యాసులకు నిషిద్ధము. గూఢముగా మెలఁగని సన్న్యాసులు మూఢులతో సమానులు. "మూఢో బాల ఇతి ప్రోక్త శ్వాచ బాల ఇతి స్మృతః" అను సూక్తిలో బాలుని, కుక్కను మూఢులుగా జెప్పిరి గూఢముగా నుండని సన్న్యాసులు మూఢులు. బాలుఁడు కుక్కయు ఉచ్ఛిష్టమును (వాంతమును) భుజింతురు. కక్కినట్టియుఁ దినుచుండగాఁ గ్రిందఁబడినట్టియు, ఏదో కారణముచేఁ బార వేయఁబడినట్టి యన్నమును, వాంత మందురు. బాలుఁడు వాంతమును భుజించును. కుక్క తానుగక్కిన దానిని అనగా వాంతమును భుజించును. వాంతాశనము అనారోగ్యహేతువు. తన వీర్యమును దాను సేవించుట వంటిది. శిష్టులును, బ్రహ్మ

వేత్తలును, సన్న్యాసులును, తమ గొప్పను దాము చెప్పు కొందురేని, వారు వాంతాశను లగుదురు. అందుచే సన్న్యాసులు, తమపాండిత్యమును స్వయముగాఁ బ్రవర్తించి, భిక్ష మడిగితిరేని వాంతాశను లగుదురు. తనగొప్పను దాను జెప్పుకొనుటయు వాంతాశనమే. స్వవీర్యోపజీవనమే. తాము ధర్మము చేసి, దానిని దీసికొనుటయు వాంతాశనమే అగును. సకలమును ద్యజించువారే సన్న్యాసులు. కాన వారి కట్టిపని యుక్తము కాదు.

శ్లో॥ నిత్య మజ్ఞాత చర్యా మే ఇతి మన్యేత బ్రాహ్మణః ।
జ్ఞాతీనాం తు వసన్ మధ్యే తం విదు ర్బ్రాహ్మణం బుధాః॥

తా॥ బ్రహ్మవేత్తయే బ్రాహ్మణుఁడు. అట్టి సన్న్యాసి నిత్యము నియమబద్ధమైన తనచర్య అనఁగా దనసమాధి స్థితియుఁ దనదినచర్యయును ఏరికిని దెలియరాదని తలంచును. ఆతఁడు జ్ఞాతుల నడిమి నున్నను వారినుండి ఏమియును స్వీకరింపకయు వారితో సంబంధము లేకయును ఉండును. అట్టి వానినే బ్రాహ్మణుఁడైన సన్న్యాసిగా బుధులు చెప్పిరి.

శం. భా. :- బ్రహ్మవేత్తయైన బ్రాహ్మణుఁడు తానెవ్వఁడో తెలియకుండ, సంచరించుటయే తన కర్తవ్యమని నిత్యము తలంచును. పుత్ర మిత్ర కళత్రాదులైన జ్ఞాతుల మధ్యనుండియు, వారినుండి లేశమైన స్వీకరించరాదు. తనకు వారితోఁ గల సంబంధమును వెల్లడి చేయరాదు. అట్టివానినే బ్రాహ్మణుఁడైన సన్న్యాసిగా బుధులు చెప్పుదురు. యోగి

యైన వాడు పుత్ర మిత్ర కళత్రాదులను బరిత్యజించి, కేవలము స్వాత్మనిష్ఠుఁడై గూఢచారియై మెలగవలెననియే శాస్త్రము.

శ్లో॥ కుటుంబ పుత్ర దారాంశ్చ వేదాంగానిచ సర్వశః
యజ్ఞం యజ్ఞోపవీతం చ త్యక్త్వా గూఢ శ్చరేన్మునిః ॥

అను శ్రుతిలో మునియైన వాఁడు కుటుంబమును, భార్యాపుత్రులను, వేదాంగములను, యజ్ఞమును, యజ్ఞోపవీతమును, విడిచిపెట్టి గూఢముగాఁ జరించవలెననియే కలదు.

శ్లో॥ యం నసంతం నచాసంతం నాశ్రుతం నబహుశ్రుతం ।
నసువృత్తం నదుర్వృత్తం వేదకశ్చి త్సబ్రాహ్మణః ।
జాన న్నపి చ మేధావీ జడవ ల్లోక ఆచరేత్ ॥

అను సూక్తులలో, బ్రహ్మనిష్ఠ కలవాఁడే బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణుఁడైన సన్న్యాసి, తాను సజ్జనుఁడో, లేక అసజ్జనుఁడో వేదవేదాంగాదు లభ్యసించిన బహుశ్రుతుఁడో, లేక, అశ్రుతుఁడో, సద్వర్తనుఁడో లేక దుర్వర్తనుఁడో, ఎవ్వరికినీ తెలియరాదు. అతఁడన్నియు నెఱిగిన మేధావియైనను, లోకమున జడునివలె సంచరింపవలెను. అట్టివానికే జ్ఞాననిష్ఠాప్రాప్తి రూపమైన మోక్షము లభించును. కాని ఇతరునకు అనేకమైన విక్షేపము లున్నకారణమున మోక్షము లభింపదు, అని చెప్పఁబడెను.

చర్య అనగా నిష్ఠ. అది సమాధిరూపమైనది. అట్టి సమాధిరూపమైన నిష్ఠ ప్రత్యగ్భూతమైన పరబ్రహ్మయందే

యుండవలెను. బ్రహ్మపదార్థము నేత్రాదీంద్రియములకుఁ గాని, వాక్కులకుఁ గాని గోచరముకాదు. అది యుదయాస్తమయములులేని, జ్ఞానరూపమున నుండును. దానికి ఆకలిదప్పికలు మున్నగునవి యుండవు. పూర్ణానందస్వరూపమై అంతట నుండును. అట్టి అజ్ఞాత బ్రహ్మపదార్థమునందే సన్న్యాసులకు నిష్ఠయుండును. దేహేంద్రియములపైఁ గాని, పుత్ర మిత్ర కళత్రాదులపైఁగాని, నిష్ఠ యుండరాదు. సన్న్యాసి తాను స్థూలముగా నుంటినినియుఁ, గృశించితి ననియుఁ దలంచు కొనరాదు. నేను పోవుచున్నాను, నే నుంటిని, అనెడి యహంకారము వానికుండరాదు. వీఁడు క్లీబుఁడు, కాణుఁడు, మూఁగ, బధిరుఁడు: అను భావ ముండరాదు. వీఁడు వీనికిఁ బుత్రుఁడు, వీనికి నప్త, (మునిమనుమఁడు) నాకును గావలసిన వాఁడే అను భావ ముండకూడదు. నేను బ్రాహ్మణుఁడను, క్షత్రియుఁడను, ఈమె నాభార్య, వీఁడు నాపుత్రుఁడు, ఇది నావిభవము. ఈతఁడు నా కాపుఁడు, బంధువు, మిత్రుఁడు అను భావము లుండరాదు.

"యచ్చక్షుషా నపశ్యతి, యేన చక్షూంషి పశ్యతి తదేవ బ్రహ్మ"

బ్రహ్మపదార్థము చర్మచక్షువులకు గోచరముకాదు. జ్ఞాననేత్రమునకే గోచర మగును. దాని ప్రభావముచేతనే లోకమంతటికిని దృష్టి యేర్పడుచున్నది, అని శ్రుతులలోఁ జెప్పఁబడిన బ్రహ్మవస్తువునందే సన్న్యాసులకు నిష్ఠ యుండవలెను.

శ్లో॥ "క్రోధ మానాదయో దోషా విషయా శ్చేంద్రియాణిచ।
మేత ఏవ సమాఖ్యాతా జ్ఞాతయో దేహిన స్తవ॥

దేహికి అనగాఁ బ్రాణికిఁ గ్రోధమానాదులైన దోషములు, ఇంద్రియములు; ఇంద్రియవిషయములే జ్ఞాతులు. (శత్రువులు) కాని వేరే జ్ఞాతులు లేరు. అని పైసూక్తిలో వివరింపఁబడెను. కాన బ్రాహ్మణుఁడైన సన్న్యాసి, ఇంద్రియముల మధ్య నున్నను జూచుట, వినుట, స్పృశించుట, వాసన చూచుట, తినుట, నడచుట మున్నగు నింద్రియవిషయములకు దూరముగా నుండవలెను. ఆత్మకు వానితో సంబంధము లేదు. కానఁ దానును వానితోడి సంబంధమును వీడవలెను. ఇవియే సన్న్యాసి మెలఁగవలసిన పద్ధతులు.

## —: పరమాత్మ స్వరూపము :—

శ్లో॥ కో హ్యాన న్తర మాత్మానం బ్రాహ్మణో హన్తుమర్హతి।
నిర్లింగ మచలం శుద్ధం సర్వద్వైత వివర్జితమ్॥　　3౫

తా॥ పరమాత్మకు ఎక్కువతక్కువ యను నంతరము (భేదము) లేదు. అట్టి పరమాత్మను బ్రాహ్మణుఁడైన మాత్రాన ఎవఁడును దెలిసికొనలేడు, చేరలేడు. పరమాత్మకు స్థూలసూక్ష్మాది లింగము (భేదము) లేదు. పరమాత్మ అచలుఁడు. శుద్ధుఁడు. సుఖదుఃఖా ద్వైతభావములు (ద్వంద్వములు) లేనివాఁడు.

శం. భా. :- పైన జెప్పినట్లు మెలఁగుచు బ్రహ్మజ్ఞాని

వైననాడే సన్న్యాసి బ్రహ్మానుభవము నెఱుఁగఁగలఁడు. కారణ మేమన ? బ్రహ్మపదార్థమునకు ఉపాధికృతములైన స్థూల సూక్ష్మాది వ్యవధానములు లేవు. భేదచిహ్నములును లేవు. పరమాత్మ నిర్లింగుఁడు. అనగా స్థూల సూక్ష్మభావ శూన్యుఁడు. అనుమానాది ప్రమాణములకు గోచరుఁడు కాఁడు. ఆతనికి స్త్రీ, పురుషలింగ భేదము లేదు. క్రియాకర్తృత్వాదులు లేవు. ఆతఁడు సర్వవ్యాపకుఁడు. పరమాత్మ అవిద్యాదోషశూన్యుఁడు. కాన శుద్ధుఁడు. లోక సంగరహితుఁడు. సజాతీయ విజాతీయ స్వగత భేదములు ఆతనికి లేవు. ఆకలిదప్పికలు, శోకమోహములు, జరామరణములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు, మున్నగు ద్వంద్వములు పరమాత్మకు లేనే లేవు. అట్టి పరమాత్మను బ్రాహ్మణుఁడైన మాత్రాన ఎవఁడును దెలిసికొన లేడు.

"య ఏవ సత్యా న్నాపైతి స జ్ఞేయో బ్రాహ్మణ స్త్వయా" అను సూక్తిలో జెప్పినట్లు సత్యశీలుఁడైనవాఁడు మాత్రమే కించిత్తుగా నైనను, బ్రహ్మను దెలిసికొనఁ గలఁడు. అంతే కాని, అల్పతరుఁడు, అనగా స్వల్పప్రయత్నముతో సంసారమును దాఁటఁదలఁచువాఁడు ఏమాత్రమును దెలిసికొనఁ జాలడు.

శ్లో॥ తస్మా ద్ధి క్షత్రియస్యాపి బ్రహ్మ వసతి పశ్యతి. 38

తా॥ పైనఁ జెప్పినట్లు మెలఁగుటవలననే క్షత్రియ సన్న్యాసియైనను బరమాత్మను జూచును. యోగనిష్ఠలో బరమాత్మను అధివసించును. ఏజాతికిఁ జెందిన సన్న్యాసికైనను బైనఁ జెప్పిన నియమము లు అత్యావసరములు.

వివరణము :- 29 వ శ్లోకము మొదలు 36 వ శ్లోకము వరకు గల విషయమును బరిశీలించినచో విద్వాంసుఁడు సన్న్యాసి విద్వత్సన్న్యాసి అనువారి విషయములు చక్కఁగాఁ దెలియును. ఏ మానవుఁడైనను గామ్యకర్మ సన్న్యాసము గావించి బ్రహ్మనిష్ఠుఁడైనచోఁ దప్పక ముక్తుఁడు కాఁగలఁడని తెలిసికొన వలసియున్నది. "బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము" అను నాల్గాశ్రమములలో ఏ యాశ్రమమునకుఁ జెందినవాఁడైనను ధర్మతత్పరుఁడై నిష్కామముగా గర్మలను ఆచరింపవలసినదే. ముఖ్యముగా గృహస్థుఁడు సాత్త్వికాహార సంపన్నుఁడై సన్న్యాసులను ఆదరించవలెను. సన్న్యాసులు కు అట్టి గృహస్థుల యిండ్లకే భిక్ష కేగవలెనని 31 వ శ్లోకమువలనఁ దెలియుచున్నది.

"ఆత్మవత్సర్వభూతాని" అను సూక్తిలోఁ జెప్పినట్లు సర్వభూతములను దనవంటి వానినిగాఁ దలంచును. కాని సన్న్యాసి తన్ను గొప్పవానిగాఁ దలంచుకొనడు. తన సామర్థ్యమును వెల్లడి కానీయడు. ఇందు గమనించవలసిన దేమన ? సన్న్యాసుల కుండఁదగినవిగాఁ జెప్పిన లక్షణములు జ్ఞానియైన గృహస్థునకు నుండవలసినవే. అట్టి సల్లక్షణములుగల గృహస్థే, నిజమైన విద్వాంసుఁడు; స్థితప్రజ్ఞుఁడు నగును. "బధిర, పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి" అను మనుచరిత్ర పద్యమున అల్లసాని పెద్దన్న యోగ్యుఁడైన గృహస్థుని గూర్చి పేర్కొన్న విషయమునకు ఈ సనత్సుజాతీయ విషయముకూడఁ బ్రబలప్రమాణమని తలంచు కొనవచ్చును (1) బ్రహ్మస్వము, (2) వాంతా

శనుడు" అను వానిని గూర్చి భాష్యకర్తలు విపులముగా వివరించి యున్నారు. అవి బాగుగా జ్ఞప్తిలో నుంచుకొనఁ దగిన విషయములు. సన్న్యాసులును, శిష్టులును, బ్రహ్మవేత్తలును దమ గొప్పను జెప్పుకొనరాదు. అది వాంతాశనమన్న మాట. కావుననే నన్నయభట్టు "తన్ను బ్రబ్బికోలు పొగడికోలు, ఆపగాతనూజ ! ఆర్యవృత్తములు గావని" పై విషయము నే చక్కఁగా నిరూపించెను. దీనినిబట్టి శిశుపాలాది మూర్ఖులు వాంతాశనులని స్పష్టముగాఁ దెలియుచున్నది. అందుచే ఎవ్వరును దమగొప్పను దాము చెప్పుకొనరాదని తెలిసికొనవలసి యున్నది. బ్రహ్మవేత్తయైన బ్రాహ్మణుఁడు, బ్రహ్మజ్ఞానియైన సన్న్యాసియును సమానులే. కావున ఈ ఘోరకలియుగమున నిషిద్ధమైన సన్న్యాసమును నేల స్వీకరింపవలెను. బ్రహ్మవేత్తయై మెలఁగుట నేర్చుకొనినఁ జాలదా ?

ఈ సందర్భమున, ౬వ శ్లోకమున పరమాత్మ స్వరూపము చక్కఁగా వివరింపఁబడినది. ఇటఁ జేర్కొనఁబడిన "ఉపాధి" పదమునకు ఆధారము, ఆశ్రయము అని అర్థము చెప్పుకొనవలసి యున్నది. "ఘటాకాశ జలచంద్రాది" న్యాయములను బట్టి పై విషయము స్పష్టమగుచున్నది. ఎట్లన ? ఘటమందలి యాకాశము అనుచో అచట యాకాశమునకు ఘటము ఆధారము. జలమందలి చంద్రుఁడు అనుచో అటనున్న చంద్రునకుఁ జలమాశ్రయము. కావున ఘటము (కుండ) జలము అనునవి ఉపాధులన్న మాట. అట్టి యుపాధికృత స్థూలసూక్ష్మ భేదము అనఁగా బెద్ద, చిన్న అను భేదము పరమాత్మకు లేదు. అదే,

మగ, నపుంసకుఁడు అను లింగభేదము పరమాత్మకు లేదు,

"కార్య కారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే" అను గీతాసూక్తినిబట్టి పరమాత్మ సృష్టిక్రియా, సృష్టికారణ, సృష్టికర్తృత్వములను దనపై నుంచుకొనక తన నుండి వేర్పడిన ప్రకృతియం దుంచెను అని తెలియుచున్నది. కావునఁ బరమాత్మకుఁ గ్రియాకర్తృత్వాదులు లేవు; అని తెలియుచున్నది. అవిద్య యనఁగా, అజ్ఞానము, మాయ, ప్రకృతి. దానిచేఁ గల్గు దోషము పరమాత్మకు లేదన్నమాట. సజాతీయము అనగా ఒకే తెగకుఁ జెందినది. స్త్రీలకు స్త్రీలు సజాతీయులు, పురుషులు విజాతీయులు. అటులనే పురుషులకుఁ బురుషులు సజాతీయులు, స్త్రీలు విజాతీయులు. సజాతీయము నకు వ్యతిరేకముగా నున్నది విజాతీయమన్నమాట. ఈ సజాతీయ విజాతీయ భేదము సృష్టిలో ననేక విధములఁ గలదు. అట్టి సజాతీయ విజాతీయ భేదము పరమాత్మకు లేదని తెలియుచున్నది. ఏ మానవుఁడైనను సత్యశీలము నలవఱచు కొనిన నాఁడే పరమాత్మ స్వరూపమును దెలిసి కొనగలఁడు. అని తెలిసికొనవలసి యున్నది. కర్మ, భక్తి, తపో, యోగ, జ్ఞానాది మార్గములలో నేయొక్క మార్గమున యత్నించి సిద్ధులైనను, అట్టి సిద్ధులలోఁగూడ ఎవఁడో ఒక్కఁడు మాత్రమే పరమాత్మను జూడఁగలఁడు. అందఱును జూడలేరు. అట్టి పరమాత్మ దర్శనశక్తి ధ్రువుఁడు, ప్రహ్లాదుఁడు వంటివారికే యలవడినది. ఈ విషయమే "యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః" అను గీతాసూక్తిలోఁ జెప్పఁబడినది.

సన్న్యాసి కట్టి సిద్ధి, బ్రహ్మజ్ఞానము అలవడును. కాన అతఁడు ఏజాతికి జెందినను, బ్రహ్మజ్ఞానియైనచో బ్రహ్మపదార్థము నెఱుఁగఁ గలఁడు. కావున బ్రహ్మసాక్షాత్కారము కోరు వారు 29 శ్లోకము నుండి 37 శ్లోకమువఱకుఁ జెప్పిన విద్వత్సన్న్యాసి లక్షణములను అలవఱచుకొనుట మంచిది.

—: మూర్ఖుని స్వరూపము :—

శ్లో॥ యో ఽన్యథా సంత మాత్మాన మన్యథా ప్రతిపద్యతే ।
కిం తేన నకృతం పాపం చోరేణాత్మాప హారిణా ॥ 38

తా॥ పరమాత్మ సచ్చిదానందాద్వితీయుఁడు. కాన 'సత్' అగుచున్నాడు. అట్టి బ్రహ్మస్వరూపము సామాన్యుల కాత్మగాఁ దోచు దేహాదులకంటె భిన్నముగా ఉన్నది. అట్టి పరమాత్మను దేహేంద్రియాదులుగా భావించువాఁడు మహా పాపమును ఆచరించువాఁడే యగును. వాఁడు ఆత్మకానిదాని ఆత్మగా భావించిన కారణమున ఆత్మాపహారియైన చోరుఁడే యగును.

శం. భా. :- నేను ఐక్కగాఁ బరమాత్మ నెఱిఁగితి ను నహంకారి మిక్కిలి పాపాత్ముఁడే యగును. కారణ మేమన ? పరమాత్మ జ్ఞానస్వరూపుఁడు, నిర్లింగుఁడు, శుద్ధుఁడు. అట్టి సత్స్వరూపమైన యాత్మను "నేను గర్తను, భోక్తను, బ్రాహ్మణుఁడను, క్షత్రియుఁడను" అను కొను మూర్ఖుఁడు తెలిసికొన లేక ఆత్మాపహారియే యగును. ఆత్మజ్ఞుఁడు మాత్రము

కాదు. ఆత్మవస్తువు నెటులఁగతి ననుకొనినచో, వాఁడు చోరుఁడై మహాపాతకము నాచరించిన వాఁడే యగును.

శ్లో॥ అసుర్యానామతే లోకా అంధేన తమసా వృతాః ।
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః॥

అను శ్రుతిలో జెప్పినట్లు దేహేంద్రియాదులను ఆత్మగా భావించు నహంకారి ఆత్మహీనుఁడైన జనుఁడగును. వాఁడు గాఢాంధకారావృతమైన అసుర్యలోకములను జేరి మఱల జన్మము నే పొందును.

శ్లో॥ బ్రాహ్మణ్యం ప్రాప్య లోకేఽస్మిన్నమూకో బధిరో భవేత్ ।
నాపక్రామతి సంసారాత్ సఖలు బ్రహ్మఘాతకః ॥

అను శ్రుతిలోఁ బై విషయమే వివరింపఁబడెను. ఎట్లన? బ్రహ్మనిష్ఠయే బ్రాహ్మణ్యము. అది యహంకారముచేఁ జెడిపోవును. అందుచే మానవుఁడు మూగయుఁ జెవిటియు నగును బ్రహ్మనిష్ఠగలవాఁడు మూగయు, బధిరుఁడును గారాదు. బ్రహ్మనిష్ఠను బాడుచేసికొనినవాఁడు, బ్రహ్మఘాతకుఁడై, సంసారబంధమునుండి విముక్తుఁడు కాలేడు. ప్రక్కకు దప్పుకొనలేడు. అందుచే మానవుఁడు దేహేంద్రియాదులనే బ్రహ్మపదార్థముగా భావించరాదు. బ్రహ్మవస్తువు వాగాదులకు గోచరము కాదు. అందుచే దానివిషయమై నిష్ఠతో నుండవలెను.

—: బ్రాహ్మణుఁడు - బ్రహ్మవేత్త :—

శ్లో॥ అశ్రాంత స్స్యాదనాదాతా సంమతో నిరుపద్రవః ।
శిష్టో న శిష్టవత్స స్స్యాత్ బ్రాహ్మణో బ్రహ్మవిత్కవిః ॥

తా॥ దేహేంద్రియాదులను ఆత్మవస్తువుగాఁ దలంపని వాఁడే అనాదాత యగును. అనాదాత సంసారశ్రమ లేనివాఁడగును. ఆతఁడే అందఱికిని సమ్మతుఁడగును. క్రోధలోభాది రూపములైన యుపద్రవము లాతని కుండవు. ఆతఁడు శిష్టుఁడైనను శిష్టునివలెఁ గానరాడు. అట్టివాఁడే బ్రహ్మవేత్తయుఁ గవియు నగు బ్రాహ్మణుఁడగును.

శం. భా. :- దేహేంద్రియములును, వానిధర్మములును ఆత్మవస్తువు కానేరవు. అందుచే వానిని ఆత్మగా స్వీకరింపని వాఁడే అనాదాత యగును. అనాదాత అశ్రాంతుఁడు అనగా సంసారశ్రమహీనుఁ డగును. ఆకలిదప్పికలు మున్నగునవి దేహధర్మములే కాని ఆత్మధర్మములు కావు.

శ్రు॥ అశనాయాపి పాసే ప్రాణస్య ।
శోకమోహౌ మనసో జరామరణే శరీరస్య ॥

అను శ్రుతిలో ఆకలిదప్పికలు ప్రాణమునకు జెందినవనియు, శోకమోహములు మనస్సునకు జెందినవనియు, జరామరణములు శరీరమునకుఁ జెందినవనియుఁ జెప్పఁబడెను. అనాదాతకుఁ గ్రోధము, హర్షము; లోభము, మోహము మున్నగు నుపద్రవము లుండవు. బ్రహ్మవేత్తయుఁ గవియు నగు బ్రాహ్మ

ణుఁడు జడునివలె సంచరించునేకాని విద్వాంసులచే శిష్టుఁడుగా సమ్మతింపఁబడిన శిష్టునివలె నుండఁడు.

సర్వజ్ఞభాష్యము :- పరులనుండి సమస్తమును సంగ్రహించుటయే ఆదానము. ఆదానముచేతనే మానవునకు శ్రమ కల్గును. శ్రమనొందినవాఁడే శ్రాంతుఁడు. శ్రమకల్గినచో రోగములు వాటిల్లును. రోగియైనచో దైవధ్యానమునకు విఘ్న మేర్పడును. బ్రహ్మజ్ఞానియైన బ్రాహ్మణుఁడు అనాదాత యగుటచే అశ్రాన్తుఁడగును. అంతటికినీ ఇష్టుఁడే కాని ద్వేష్యుఁడు కాడు. అతఁడెప్పుడును ఎవ్వరిచెంత నుండని కారణమున నిరుపహ్వారుడే యగును. అంతటిచెంత నున్నవాఁడు ఉపహ్వారుఁడగును. అట్టి యవస్థ జ్ఞానికి లేదు. జ్ఞాని గురుశాసనముచే శిష్టుఁడే కాని అశిష్టుఁడు కాడు. అనగా సర్వఘాతకుండు కానేరడు. అందుచే నాతఁడు బ్రహ్మవేత్తయైన కవియై బ్రాహ్మణుఁడగును. అందుచే నాత్మతత్త్వము నెఱుగు నుపాయము వానికి దెలియును.

వివరణము:- నేను బరమాత్మ నెఱిఁగితి ననుకొనువాఁడు దురభిమాని; దురహంకారి; దురభిమానము కాపురుష గుణము అని -

కం॥ కోపము నుబ్బును గర్వము
నాఁపోవని యునికియును దురభిమానము ని ।
ర్వ్యాపారత్వము ననునివి
కాపురుష గుణంబు లండ్రు కౌరవనాథా ! ॥

అనెడి ఆంధ్ర మహాభారత పద్యమువలన దెలియుచున్నది. కాపురుషుఁడు అజ్ఞానియే కాన వానికి ఆత్మజ్ఞానమున కలుగనేరదు. అందుచే వానికి శరీరధర్మము లేవో, మనోధర్మము లేవో, ప్రాణధర్మము లేవో దెలియవు. అందుచే వాఁడు దేహేంద్రియాదులే ఆత్మయనుకొనును. మహాపాతకి యగుచు. జ్ఞాని బ్రహ్మవేత్త కావున అనాదాతయై పూజ్యుఁడగును. ఆతఁడే కవి. అనఁగాఁ గ్రాంతదర్శి యగును. ఆతఁడెవరినుండియు లేశమంతైన స్వీకరింపఁడు. శిష్టుఁడుగాఁ బరిగణింపఁబడును. వైదికమర్యాదలనే పాటించును. అట్టి వానికే గురువుపదేశించును. కావున ఏమాత్రము జ్ఞానము కలవాఁడైనను అనాదాతగా నుండుటయే మంచిది.

—: బ్రహ్మవేత్త మహిమ :—

శ్లో॥ అనాఢ్యా మానుషే విత్తే ఆఢ్యా దైవే తథా క్రతౌ ।
తే దుర్ధర్షా దుష్ప్రకంప్యాస్తాన్విద్యాద్బ్రహ్మణస్తనుమ్ ॥ 38

తా॥ పైనఁ జెప్పఁబడిన లక్షణములుగల బ్రాహ్మణుఁడు జ్ఞానియు, యోగియు నై బ్రహ్మవేత్త యగును. అట్టి బ్రహ్మవేత్త మానుష విత్తమునందనాసక్తుఁడై యుండును. దైవవిత్తమునందాసక్తుఁడై యుండును. క్రతువునందాసక్తుఁడై యుండును. అట్టివాఁడే బ్రహ్మయొక్క తనువు. అనగా బ్రహ్మస్వరూపుఁడన్నమాట. అందుచే బ్రహ్మవేత్తను ఎవ్వరును

ఎదిరింపఁ జాలఁడు. అట్టివాఁడెపుడును దుష్ప్రకంప్యుఁడే అనగా నిర్భయుఁడే అని తెలిసికొనవలెను.

శం. భా. :- జ్ఞానియును, యోగియును, బ్రహ్మవేత్తలుగా బరిగణింపఁ బడుదురు. కాన బ్రహ్మస్వరూపులగు యోగులు మానుషవిత్తమైన, జాయాపుత్రాదులందు అనాధ్యులు, అనగా అనాసక్తులుగా ఉందురు. వేదోక్తములైన అహింస, సత్యము, అస్తేయము, (దొంగిలింపకుండుట) అపరిగ్రహము, బ్రహ్మచర్యము, సమాధి మున్నగు వానియందు ఆసక్తులై యుందురు. అహింసాదులే దైవవిత్తములు. అటులనే యోగులు దైవవిషయికము లగు క్రతువులందును ఆసక్తులై యుందురు. అందుచే వారి నెవ్వరును ధర్షింప జాలరు. వారేమాత్రమును జలింపరు. కాన దుష్ప్రకంప్యు లగుదురు. బ్రహ్మజ్ఞానులైన యోగులు దైవీసంపదలగు పారలౌకిక ధర్మాదులందువలె, ఈశ్వరోపాసన క్రతువునందును ఆసక్తులై యుందురు. వైరాగ్య పూర్వక కర్మోపాసనను అనుష్ఠించుటలో ఆసక్తులగుటచే నిర్భయులై యుందురు. అందుచే వారు మానుషవిత్తమైన ధనాదులందు విరక్తులై యుందురు.

దుర్ఘటార్థభాష్యము :-

శ్లో॥ "అమృతం చైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితం।
మృత్యుమాపద్యతే మోహాత్ సత్యేనామృత మశ్నుతే॥"

అను సూక్తిని బరిశీలించినచో దేహమున కమృతత్వము, మృత్యువు అను రెండును గలవని తెలియుచున్నది.

మానవులు మోహముచేతను, లోభముచేతను, మృత్యువును బొందుదురు. సత్యజ్ఞానముచే అమృతు లగుదురు. అందువలన బ్రహ్మస్వరూపులు మానుష విత్తమును బరిగ్రహింపరు. విషయస్నేహ విహీనులై (ఇంద్రియ వాంఛలు లేనివారై) కామ్యకర్మలను బరిత్యజింతురు. అన్నయజ్ఞమైన క్రతువు నాచరించినను నిష్కాములై యుందురు. అందుచే ఇంద్రియ విషయములైన కామాదులు వారిని వశపఱచుకొనఁ జాలవు

వివరణము :- "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" అను సూక్తిలోఁ జెప్పినట్లు బ్రహ్మవేత్త పరమాత్మజ్ఞానము కల వాఁడు కావునఁ బరబ్రహ్మయే యగును. ఆతఁడు నిష్కాముఁడు కాన మానుష విత్త మపేక్షింపక, "అహింసా సత్యమక్రోధః" అను గీతా సూక్తులలోఁ జెప్పిన అహింసా సత్యాదులను జక్కగా నాచరించును. అందుచే నాతని గాంచిన తోడనే అందఱును వానికి వశ్యులే యగుదురు. ఆతఁడును నిర్భయుఁడై యుండును. సత్యశీలుఁడు కాన మృత్యువును జయించి అమృతుఁ డగును. ప్రవరుఁడు పై విషయమునకుఁ దార్కాణము. ప్రవరుఁడు యౌవనమున నుండియు, నిష్కాముఁడైన సోమయాజి; బ్రహ్మవేత్తయుఁ గావుననే "సాలగ్రామము మున్నగాఁ గొనక "మానుషవిత్తమైన వరూథినీ ప్రేమకు వశుఁడు కాక ఉపానువాక్యమనెడి అగ్నిని సాక్షాత్కారము గావించుకొని, యోగి పూసిన కాలిపసరు మంచు నీటిచేఁ గఱగినను, నిర్భయుఁడై గృహము చేరఁ గలిగెను. కావునఁ బ్రతిమానవుఁడు మనుచరిత్రాది ప్రబంధములు చదివి

మానుషవిత్తమునకు లోనుగాక బ్రహ్మవేత్త లగుటకుఁ బ్రయత్నించుట మంచిది.

శ్లో॥ సర్వాన్ స్విష్టకృతో దేవాన్ విద్యాద్య ఇహ కశ్చన ॥
న సమానో బ్రాహ్మణస్య తస్మిన్ ప్రయతతే స్వయమ్ ॥

తా॥ బాగుగా ఇష్టమును జేకూర్చువారే స్విష్టకృత్తులు. స్విష్టకృత్తులైన దేవతల నుద్దేశించి, యాగములను ఫలాపేక్షతో గావించువాఁడు, త్యాగహీనుఁడైన కారణమున, బ్రహ్మజ్ఞానియైన బ్రాహ్మణునితో సమానుఁడు కాఁడు. ఫలదాతలైన దేవతలు సైతము నిష్కామముగాఁ బ్రవర్తించు జ్ఞానితో సమానులు కారు. అందుచే బ్రహ్మవేత్త నిత్యము నిష్కామమార్గము గూర్చియే స్వయముగాఁ బ్రయత్నించును.

శం.భా:- స్విష్టంకుర్వన్, స్విష్టకృత్ -అను శ్రుతివలనఁ దనను ఆరాధించువారికిఁ జక్కగా ఇష్టమును జేకూర్చువారే స్విష్టకృత్తులని తెలియుచున్నది. బ్రహ్మజ్ఞాన సంపన్నులు బ్రాహ్మణులు. సామాన్యులు ఏదో ఫలము నుద్దేశించి, దానిని బొందుటకై, ఆయా దేవతలకుఁ జెందునట్లు అగ్నిలో హావిస్సును హోమము చేయుదురు. అందుచే ఆ హోమము చేయు యజమాని, సకలదేవతలను స్విష్టకృత్తులుగా గుర్తించినను, ఆతఁడు బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడైన బ్రాహ్మణునితో సమానుఁడు కానేరడు. "ఇదమగ్నయే ఇదమింద్రాయ" మున్నగు శ్రుతులలోఁ జెప్పినట్లు హావిస్సును గ్రహించుటకై ఆహూతులైన అగ్నీంద్రా

దులే బ్రాహ్మణునితో సమానులు కానపుడు వారి నారాధించు యజమాని బ్రహ్మయితో సమానుఁ డెంతమాత్రము కానేరడు.

శ్లో॥ బ్రాహ్మణస్య న సాదృశ్యే వర్తతే సోఽపి కింపునః ।
ఇజ్యతే యేన మంత్రేణ యజమానో ద్విజోత్తమః ॥

అను మోక్షధర్మోక్తిని బరిశీలించినచో ఆయా మంత్రములతో ఇంద్రాదులను ఆరాధించు యజమాని బ్రాహ్మణునితో సమానుఁడు కాడని తెలియుచున్నది. అంతేకాదు.

శ్లో॥ బ్రహ్మవిద్భ్యః పరం భూతం న కించి దిహ విద్యతే।

అను మనువచనమును బరిశీలించినచో బ్రహ్మవేత్తకంటె గొప్పవాఁ డెవఁడును లేఁడని దెలియుచున్నది.

నీ. భా. :- అందఱికంటె బ్రహ్మవేత్తయే గొప్పవాఁడు. అటులనే సకల క్రతువులకంటె బ్రహ్మజ్ఞానమే శ్రేష్ఠమైనది. సు + ఇష్టమ్ = స్విష్టమ్ అనఁగాఁ జాల యిష్టమైనదని యర్థము. భూలోకవాసులకు స్వర్గలోకమందలి వనితలు, అన్నము మున్నగునవి చాల యిష్టములై యుండును. అందుచే భూలోకవాసులు స్వర్లోక సౌఖ్యములకై అశ్వమేధాధియాగము లాచరించి, దేవతలను సంప్రీతులుగా నొనర్తురు. అందులకు మెచ్చి ఇంద్రాదులు మానవుల పట్ల స్విష్టకృత్తులై మెలఁగుదురు. అట్లు ఇంద్రాదులను బూజించి, వారిమెప్పు బడయునాతఁడు బ్రాహ్మణునితో సమానుఁడు కాడు. కారణమేమన?

స్వప్నము, యాగాదిక్రియా సాధ్యము. కావున అనిత్యము. బ్రహ్మపదార్థము స్వతస్సిద్ధము కాన నిత్యము. అట్టి బ్రహ్మకు జెందిన జ్ఞానఫలమైన మోక్షము సైతము నిత్యమే యగును. అందుచే స్వప్నము బ్రహ్మజ్ఞానముతో సమానము కానేరదు.

శ్లో॥ యమ ప్రయతమానంతు మానయంతి సమానితః ।
నమాన్యమానో మన్యేత, నమాన్య మభి సంజ్వరేత్ ॥ ౪౧

తా॥ బ్రహ్మవేత్త తానెట్టి గౌరవము పొందుటకైనను బ్రయత్నింపడు. తానేపని చేసినను ఫలము నపేక్షింపడు. వాని మహిమ నెఱిగి, అందఱును ఆతనినే గౌరవింతురు. అట్టి సన్మానము పొందియు, "నేనే పూజితుఁడ" ననిగర్వింపకయే యుండును. కొందఱు వివేకహీనులై వాని నవమానించినను, ఆతఁ డేమాత్రము ను బరితాపము చెందడు.

శం. భా. :- బ్రహ్మవేత్త సర్వేంద్రియముల నుపసంహరించుకొనినవాఁడై తూష్ణీంభూతుఁడై యుండును. బ్రహ్మచర్యాశ్రమము నుండియే సన్న్యాసియై, ఆత్మసాక్షాత్కారస్థితిలోనిమగ్నుఁడై యుండును. పరమహంస పరివ్రాజకాచార్యుఁడై, వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థుఁడై మెలఁగును. స్థితప్రజ్ఞుఁడైన బ్రహ్మజ్ఞానిగా భావించి, కొందఱు విద్వాంసులాతనిని బూజింతురు. అయినను, అహంకారహీనుఁడగుటచే, ఆతఁ డేమాత్రమును జలింపక, తన కా పూజలతో సంబంధమున్నట్లే భావింపడు. కొందఱు అజ్ఞులు ఆతనిని జడునిగాఁ దలంచి, అవమానించినను, దా నేమాత్రమును బరితపించడు.

నీ. భా. :- బ్రహ్మజ్ఞాని యజ్ఞాదు లాచరింపకున్నను, దేవాదు లాతనిని ఆత్మవిదునిగా భావించి, పూజింతురు.

"అథ యోఽన్యాం దేవతా ముపాస్తే అన్యోఽసావన్యోఽహ
మస్మీతి న సవేద, యథా పశురేవ సదేహానా మితి"

అను శ్రుతిలోఁ జెప్పినట్లు యజ్ఞాదు లాచరించినను, అన్య దేవతల నుపాసించినను, "బ్రహ్మ వేరు, నేను వేరు" అను అజ్ఞానస్థితిలో నుండుటచే, ఆ యజ్ఞకర్త దేవపశువుగా భావింపఁ బడును. అట్లు దేవ పశువైన వాఁడే తా నితరులచేఁ బూజితుఁడైనట్లు భావించును. యజ్ఞాదు లాచరించినను, తానే ఇతరులకుఁ బూజ్యుఁడ నని భావింపక, పరు లాచరించిన యవమానమునకుఁ బరితపించక, మెలగినవాఁడే నిజమైన బ్రహ్మజ్ఞాని యగును.

శ్లో॥ లోక స్వభావ వృత్తిర్హి నిమేషో న్మేషవత్సదా ।
విద్వాంసో మానయంతీహ ఇతి మన్యేత మానితః ॥ ౪౨

తా॥ శం. భా. :- కంటిరెప్పలకు మూతపడుట సహజము. అటులనే తన గౌరవము పొందు నర్హత లేకున్నను, తనను ఆదరించుట విద్వాంసులకు సహజ మని బ్రహ్మవేత్త భావించునే కాని గర్వింపడు.

శ్లో॥ అధర్మ నిపుణా మూఢా లోకే మాయా విశారదాః ।
న మాన్యం మానయిష్యంతి మాన్యానా మవమానినః ॥

తా॥ శం. భా :- లోకమునందలి మానవులలోఁ

గొందఱు జ్ఞానులు. కొందఱు మూఢులు. జ్ఞానులు ధర్మ విద్వాంసులు. అనగా ధర్మకార్యము లాచరించుటలో నిపుణు లన్నమాట. మూఢులు అధర్మవిద్వాంసులు. అనగా అధర్మము చేయుటలో నేర్పరు లన్నమాట. అంతేకాదు. మూఢులు వివేకహీనులు. మాయ చేయుటలో ఆఁతేరిన వారుకూడ. వారు పూజ్యులను బూజింపరు, సరేకదా! అవమానింతురు కూడ. వారికిఁ జాణక్యాది నీతిశాస్త్రములు తెలియవు. అయినను లోకమును మోసగించు చుందురు. అని బ్రహ్మవేత్త భావించునే కాని తనకు జరిగిన అవమానమునకై విచారింపఁడు.

వివరణము :- జ్ఞానినే ఆయా సందర్భముల ననుసరించి బ్రహ్మవేత్త, బ్రహ్మజ్ఞాని, యోగి, అని పెద్దలు చెప్పుదురు. బ్రహ్మవేత్తకు జాతిమతములతో నిమిత్తము లేదు. వేదశాస్త్ర పాఠకుఁడై బ్రహ్మవేత్త కావచ్చును. లేక గురూపదేశ మహిమచేఁ జక్కని యనుభవము పొంది బ్రహ్మవేత్త కావచ్చును. ఆతఁడు నిష్కాముఁడు. కామ్యకర్మలను విడుచు సన్న్యాసి సర్వకర్మ ఫలములను ఆశించని త్యాగి. కావున ఆతఁడు స్విష్టకృతులైన దేవతలకంటెను, సకామముగా యజ్ఞాదులు గావించు ఘనులకంటెను, గొప్పవాఁడు. బ్రహ్మజ్ఞానము నిత్యమైన బ్రహ్మపదార్థమునకు జెందినది. కావున యాగఫలమైన స్విష్టము అనిత్యమగుటచే బ్రహ్మజ్ఞానముతో సమానముకాదు. బ్రహ్మజ్ఞానము వేదాన్తములైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత మున్నగు వానిచే లభించును. అట్టి బ్రహ్మజ్ఞానము

పొందినవాఁడు లోకుల కన్నులకు జడుఁడువలెఁ గానవచ్చును. ఆతఁడు నివురుగప్పిన, నిప్పువంటి వాఁడు. కన్ను, ముక్కు, చెవి మున్నగు ఇంద్రియములకుఁ జెందిన కోరికలను ఆతఁడు గడ్డిపోచగా భావించి విడిచి పెట్టును. బ్రహ్మవేత్త స్థితప్రజ్ఞుఁడు కావున,

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే ॥

అను గీతానూక్తులలోఁ జెప్పినట్లు సకలవాంఛలను విడనాడును. ఎన్నికష్టములు కల్గినను మనసు నంద్దైనను గలఁత చెందఁడు. కామక్రోధ భయములను బూర్ణముగా విడనాడిన మునీశ్వరుఁడుగా నుండును. బ్రహ్మజ్ఞాని కాక స్వర్గసౌఖ్యములను ఆశించి యజ్ఞయాగాదులను ఆచరించువాఁడు దేవపశువు. దేవులనగా లౌకిక సుఖములలో ముంచి యాడించు ఇంద్రియములు. అట్టి యింద్రియవాంఛలకు లోలుఁడై కర్మలాచరించువాఁడు పశుతుల్యుఁడు. పశుకాముఁడు, కావున దేవపశువు అగును. బ్రహ్మజ్ఞాని మాత్రము దేవపశువు కాఁడు. ఆతఁడు యోగి. కావునఁ బరులు గావించు పూజలకుఁ దలయొగ్గఁడు. ఒకప్పుడు సభలలో ధనాదులచే సామాన్య జనులు తనను బూజించినను, తన యోగమునకవి విఘ్నహేతువు లని భావించి ఆ పూజలను గైకొనఁడు. వానిచే ఆనందింపఁడు. తన గురువుల కేమాత్రమను గష్టము కల్గింపఁడు. అందుచే బ్రహ్మవేత్త ఆఁడఁబడకను గాఁవర్షుఁడే (శిరోధార్యుఁడే) యగును.

—: జ్ఞాని - అజ్ఞాని మానము - మౌనము :—

శ్లో॥ న వై మానం చ మౌనం చ సహితౌ వసత స్సదా।
అయం హి లోక మానస్య అసౌ మౌనస్య తద్విదుః॥౭౭

తా॥ లోకమున మానము, మౌనము అను రెండును బరస్పర విరోధులు. అందుచే అవి రెండును ఒక్కచోటఁ గలిసి యెల్లప్పుడును ఉండవు. మానమునకు ఆశ్రయము ఈలోకము. మౌనమునకాశ్రయము పరలోకము. తత్ పదార్థమైన పరబ్రహ్మను మౌనము గలవారు మాత్రమే తెలిసికొనఁగలరు. అని పెద్దలు తెలిసికొనిరి.

శం. భా. :- జ్ఞానులయు, అజ్ఞానులయు విషయ మెత్తిగించు సందర్భమున మానము మౌనము భిన్నవిషయములని వివరించు చున్నాఁడు. అదెట్లన ? లోకమున "మానము, మౌనము" అను రెండును గలిసి యొకచోట నుండవు. ఎల్లప్పుడును బ్రత్యక్షాది ప్రమాణములకు గోచరమైన ఈప్రపంచము మానమునకుఁ జెందినది. పరలోకము మౌనమునకుఁ జెందినది. అనగా మౌనముగా నున్నవాఁడే పరమును జేరఁ గలఁడన్న మాట. పరబ్రహ్మ నెవరు తెలిసికొనిరి ? అని సందేహింప నక్కఱ లేదు.

"ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః।" అను గీతాసూక్తిలో, ఓంకారమే సత్పదార్థమైన బ్రహ్మవస్తువనియు, అదియే బ్రహ్మవిష్ణు మహేశ్వరాత్మకమై త్రివిధముగా నున్నదనియుఁ జెప్పఁబడినది.

"ఓం తత్స ద్విష్ణవే చేతి సాయుజ్యాది ప్రదానివై" అనెడి గీతాసూక్తిలో ఓంకారమే బ్రహ్మపదార్థము. అది సర్వవ్యాపకుఁడైన విష్ణువునకుఁ జెంది యున్నది. అదియే జ్ఞానులకు సాయుజ్యాదుల నొసఁగున దని చెప్పఁబడెను. అట్టి బ్రహ్మవస్తువు మౌనసాధ్య మని గ్రహించవలెను. అందుచేఁ బ్రతి ప్రాణికిని మౌనముచే సంసారము ప్రాప్తించు ననియు, మౌనముచే బ్రహ్మ ప్రాప్తించు ననియుఁ దెలిసికొనవలసి యున్నది. హైరణ్యగర్భ మనుదానిలో -

శ్లో॥ అన్నాంగనాది భోగేషు భావో మౌన ఇతి స్మృతః ।
బ్రహ్మానంద సుఖప్రాప్తి హేతు ర్మౌన మితి స్మృతః ॥

అని చెప్పఁబడెను. అనగా అన్నము, వనితలు, మొన్నగు భోగములందలి కోరికలను మౌనమనియు, బ్రహ్మానందసుఖము కల్గుటకుఁ గారణము మౌన మనియుఁ దెలిసికొనవలసి యున్నది.

నీ. భా. :- మునికర్మ మౌనము. అనగా యోగులు గావించు కృత్యము. దానిచేతనే పరము ప్రాప్తించును. మౌనము కేవలము ఇహలోక సంపదను మాత్రమే చేకూర్చును. మౌనము నాచరించువాఁడే బ్రాహ్మణుఁ డని దెలిసికొనవలసి యున్నది.

దుర్ఘట భాష్యము :- మౌనము అహంకార స్వరూపము. అహంకారము ను మౌనమును బరస్పర విరోధులు. మౌనమనఁగా బూజ. అది అహంకారమునకు మొదటి మెట్టు. అందుచే మౌనమును, ఆత్మపరమైన మౌనమును ఒకచోట

నుండవు. లోకము మానమునకు ఆశ్రయము. మానము పరమానందమునకు నిలయము. మాన మనగా అభిమాన మనియు, మానమనఁగా తత్త్వ జ్ఞానమనియుఁ, గొందఱి మతము. ఈ రెండును విరుద్ధ ఫలహేతువు లగుటచే ఒకచోట నుండవు వీనిలో మానము మోక్షార్థికిఁ బ్రియము. మానము సంసారి కిష్టము. అందుచే మానము జ్ఞానులకు మాత్రమే లభించును.

—: ధనశ్రీ - బ్రాహ్మీశ్రీ :—

శ్లో॥ శ్రీః సుఖస్యేహ సంవాసః సా చాపి పరిపంథినీ।
బ్రాహ్మీ సుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ॥

తా॥ క్షత్రియ! లోకమున శ్రీ రెండు విధములుగా నున్నది. 1. ధనలక్ష్మీరూపము; 2. బ్రాహ్మీరూపము. వీనిలో ధనరూపమగు శ్రీః సుఖమునకు నిలయము. అది మోక్షపురుషార్థమునకు శత్రువు. బ్రాహ్మీశ్రీ ప్రజ్ఞకు నిలయము. అది ప్రజ్ఞాహీనునకు సుదుర్లభమైనది.

శం. భా. :- క్షత్రియ! యజ్ఞ యాగాది కర్మలను, అనుష్ఠించు వారికి, స్వర్గము, పశువులు, అన్నము మున్నగు నవి లభించును. వాని నభిలషించువాఁడు విషయ విషాంధుఁడు అగుఁడు మానార్థి. వానికి సుఖనిలయమైన శ్రీ (ధనలక్ష్మి) లభించును. అది శ్రేయోమార్గమున కంటకము. దాని నాకాంక్షించువానికి శ్రేయో మార్గము లభింపదు.

శ్లో॥ నిబంధినీ రజ్జు రేషా, యా గ్రామే వసతో రతిః ।
ఛిత్త్వైనాం సుకృతో యాంతి నైనాం ఛిందన్తి
దుష్కృతః ॥

అను మోక్షధర్మోక్తిని బరిశీలించినచో, గ్రామాదు లలో నివసించు వారికిఁ గల సుఖాసక్తియే, సంసారమున బంధించు రజ్జువు. సుకృతులు మాత్రమే దానిని ఛేదించుకొని మోక్షమును జేరుచున్నారు. దుష్కృతులు మాత్రము దానిని ఛేదింపఁ జాలరు. అని తెలియుచున్నది.

ఈ విధమైన సంపదను గాక్షించువాఁడు మూఢుఁడు వాఁడు ప్రజ్ఞాహీనుఁడు. అనగా విద్యాహీనుఁడు. వానికి, బ్రాహ్మీ అనగా బ్రహ్మానంద లక్షణరూపమైన శ్రీ శక్తి దుర్లభము. శ్రీ రెండువిధములు. 1. ధనలక్ష్మీరూపమైన శ్రీ. 2. బ్రాహ్మీరూపమైన శ్రీ.

శ్లో॥ యా నిత్యా చిద్ఘనానందా గుణరూప వివర్జితా ।
ఆనందాఖ్యా పరా శుద్ధా బ్రాహ్మీ శ్రీ రితి కథ్యతే ॥

అను హైరణ్యగర్భోక్తిని బరిశీలించినచో బ్రాహ్మీశ్రీ స్వరూపము చక్కఁగాఁ దెలియును. ఎట్లన ? బ్రాహ్మీశ్రీ నిత్య; చిద్ఘనానందస్వరూప; దానికి సత్త్వాది గుణరూపము లుండవు. దానికే "ఆనందా" అను నామము కలదు. అదియే, పరా, శుద్ధా, అను నామములతో వ్యవహరింపఁ బడును. అట్టి బ్రాహ్మీశ్రీ మానార్థులైన సుఖశీలురకు లభింపదు. అది

విన్నంత మాత్రాన ఎవరికిని బట్టుపడదు. ఈ విషయమే "శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః" అను శ్రుతివలనఁ దెలియుచున్నది.

సీ. భా. :- ధనము, అభిజనము, ఐశ్వర్యము, అను రూపములతో నున్న లక్ష్మియే సామాన్యముగా శ్రీశబ్దముచే జెప్పఁబడు చుండును. అది మానవరూపమైన సుఖమునకు నివాసము. అది చోరులవంటిది, కానఁ బరలోకమును నశింపఁ జేయును. అది యోగులకుఁ అనిష్టములను జేకూర్చును. ఋగ్యజుస్సామ వేదాత్మక యగు శ్రీ "బ్రాహ్మీ" అని చెప్పఁబడును. అది బ్రాహ్మణునకు యోగ్యమైనది, సజ్జనులకు అమృతము వంటిది.

"ఋచ స్సామాని యజూగ్ంషి సా హి శ్రీ రమృతా సతామ్ ॥

అను శ్రుతిలోఁ బై విషయమే వివరింపఁ బడినది. ప్రజ్ఞాహీనుఁడు ఆ ఋగాదుల రహస్యమును బొందఁజాలఁడు.

—: బ్రాహ్మీశ్రీ ప్రాప్తికి సాధనములు :—

శ్లో॥ ద్వారాణి తస్యేహ వద న్తి సంతో
బహుప్రకారాణి దురాచరాణి ।
సత్యార్జవే హ్రీ ర్దమశౌచ విద్యా
వ్యాన మోహ ప్రతిబంధకాని ॥ ౪౬

తా॥ బ్రాహ్మీశ్రీ ప్రాప్తికి బహుప్రకారములైన సాధన

ములు కలవని సజ్జనులు చెప్పుచున్నారు. అవి సామాన్యముగ ఆచరింపరానివి. సంరక్షించుకొనలేరు కూడ, అవేవన 1. సత్యము. 2. ఆర్జవము. 3. హ్రీ. 4. దమము. 5. శౌచము. 6. బ్రహ్మవిద్య. ఇవి మోహమునకు ప్రతిబంధకములు.

శం.భా. నీ.భా:- బ్రాహ్మీరూపమైన లక్ష్మియొక్క ప్రవేశమునకు బెక్కు ద్వారములు కలవని సజ్జనులు చెప్పుచున్నారు. అవేవన- 1. సత్యము, 2. ఆర్జవము, 3 హ్రీ, 4 దమము, 5. శౌచము, 6. బ్రహ్మవిద్య. ఈ యారు ద్వారములును మానమోహములకు బ్రతిబంధకములు. సామాన్యులు వీని నాచరించుట కష్టము. భూతరహితమైన యథార్థ సంభాషణమే సత్యము. కౌటిల్యము లేకుండుటయే ఆర్జవము. అకార్యములను ఆచరించుటలోఁగల లజ్జయే "హ్రీ" అనఁబడును. ఈ "హ్రీ" గలవారు లోకాపవాదమునకు భయపడుదురు. దమమనఁగా ఇంద్రియనిగ్రహము. దీనిచేతనే "మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము" అను నంతఃకరణము అడంచబడును. మృజ్జలములచే బాహ్యశరీరమునకుఁ గల కల్మషమును దొలగించుటను, మనస్సును నిర్మలముగా నుంచుటను శౌచము అందురు. వేదశాస్త్రాభ్యాసముద్వారా కల్గు బ్రహ్మజ్ఞానమునే విద్య యందురు. పూర్వ జన్మవాసనచేఁ బ్రాప్తించు అహంకారమును, మిథ్యాజ్ఞాన రూపమైన మోహమును బైయారుద్వారములు గలవారి చెంతకుఁ జేరలేవు.

ఇది రెండవ యధ్యాయము

# శ్రీ సనత్సుజాతీయము

## తృతీయాధ్యాయము

### —: మౌనస్వరూపము :—

ఈ యధ్యాయమున బ్రహ్మజ్ఞాన సాధనము లగు మౌనాదుల లక్షణములను, గుణదోషస్వరూపములను వివరించి చెప్పఁదొడఁగెను.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ కస్యైష మౌనః కతరన్ను మౌనం
ప్రబ్రూహి విద్వాన్ ఇహ మౌన భావం ।
మౌనేన విద్వా ను తయాతి మౌనం
కథం మునే మౌన మిహాచరన్తి ॥ ౧

తా॥ ఆర్యా ! మౌనము దేనికిఁ జెందినది ? అది యే విధముగా నుండును ? విద్వాంసుఁడు మౌనముచేత నే మౌనమును బొందుచున్నాఁడా ? మునిసత్తమా ? ఇహలోకమున మౌనము నెట్లాచరించు చున్నారు ? మీరు విద్వాంసులు కాన మౌనభావమును వివరించి చెప్పుఁడని ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించెను.

శం. భా. :- అయ్యా ! వాక్కు మున్నగు వానిని ఉపసంహరించుట యనెడి మౌన మెవనికిఁ గల్గును ? విద్వాం

సుఁడా ! అసంభావమనము, ఆత్మస్వరూపము, అను వానిలో మౌనమన నేమి ? ఎఱిగింపుము. తూష్ణీం భావముచే మౌనము కల్గునా ? మౌనముచేతనే మౌనము అనగా బ్రహ్మపదార్థ మును మానవుఁడు పొందుచున్నాఁడా ? మునీశ్వరా! మౌనము నెట్లు ఆచరించుచున్నారు ? ఎఱిగింపుఁడు.

నీ. భా. :- మృత్యువు అహంకార స్వరూపము మోహాత్మకము. సత్యాదులు దానిని నిరోధించునంటిరే ? అదెట్లు ? న్యాసపూర్వకముగా స్వీకరించు మునిధర్మమే మౌనమా ? దాని ప్రయోజనమేమి ? లోకప్రసిద్ధమైన వాఙ్నియమమే మౌనమా ? "అమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః" అను శ్రుతిలో బ్రసిద్ధమైన మౌన శబ్దమునకు "పాండిత్యము, బాల్యము" అనునవి పర్యాయపదములుగా అగ పడుచున్నవే ? శ్రవణ మనననామములోఁ జేరిన నిధిధ్యాస నము మౌనమగునా ? దాని లక్షణమేమి ? మనస్సు, ప్రాణ ములు, ఇంద్రియములు, అను వానికృత్యములను సంపూర్ణ ముగా నిరోధించుట మౌనమగునా ? అట్టి మౌనమును ఎట్లాచ రించుచున్నారు ? అని పలువిధముల ధృతరాష్ట్రుఁడు ప్రశ్నిం చెను. పై ప్రశ్నల కన్నిటికిని సనత్సుజాతుఁడు సమాధాన మొసఁగఁ దలపడెను.

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ యతో న వేదా మనసా సహైన
మనుప్రవిశ్యంతి తతోఽథ మౌనం ।

యత్రో క్షితో వేదశబ్ద స్తథాయం
స తన్మయత్వేన విభాతి రాజన్ ॥ ౨

తా॥ వేదములు పరమాత్మను గూర్చి పూర్ణముగాఁ దెల్పఁజాలవు. మనసునకుఁ బరమాత్మ గోచరింపదు. ఇట మౌనమనగాఁ బరబ్రహ్మయని కొందఱు పెద్దలు చెప్పిరి. వేదములను దెల్పు వేదశబ్దము పరమాత్మబోధక మని శాస్త్రాదులు తెల్పుచున్నవి. రాజా! వేదాదులను బరిశీలింపగాఁ బరమాత్మ తన్మయుఁడుగా అనగా జ్యోతిర్మయుఁడుగాఁ బ్రకాశించు చున్నట్లు తెలియుచున్నది.

శం. భా. :- "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అను శ్రుతిలో వాక్కులు పరమాత్మ స్వరూపమును వివరించలేక వెనుకకు మఱలినవి. మనసుతో ఊహించినను బరమాత్మను బొందలేరు. అని చెప్పుటచే, వేదములకుఁ గాని, మనస్సునకు గాని పరమాత్మ గోచరింపదని తెలిసికొనవలెను. అందుచేతనే మౌన మనగా బ్రహ్మయని కొందఱి తలంపు. అయినచోఁ బరమాత్మ లక్షణమేమి? అందురా; వినుఁడు. శాస్త్రాది కారణములచే బ్రహ్మను నిరూపించు వేదశబ్దమునకు "బ్రహ్మ" అను నర్థము నిర్ణయింపఁబడినది. అందుచే బ్రహ్మవాచకముగా వేదశబ్దము ప్రయోగింపఁ బడెనని తెలిసికొనవలెను. కావున వేదశబ్ద ప్రతిపాద్యమైన పరమాత్మ జ్ఞానరూపముగా నున్నదని తెలిసికొనవలెను. పరమాత్మ వాక్కులకు గోచరము కాదని చెప్పిన మీాదు పరమాత్మ వేదశబ్ద బోధిత

మని ఎట్లు చెప్పుచున్నా రందువేమో వినుము. రాజా ! వేదా ర్థమును బరిశీలించిన మేము పరమాత్మను జ్యోతిర్మయునిగా దివ్యదృష్టిచేఁ దెలిసికొంటిమి. ఇది మా యనుభవము. అందుచే మామాటను విశ్వసింపుము. శ్రుతిస్మృతి పురాణేతిహాసాదులు సైతము పరమాత్మను జ్యోతిర్మయునిగా వివరించినవి ఎట్లన ?

"తం దేవా జ్యోతిషాం జ్యోతిః" అను శ్రుతి తేజోరూప మైన వానిలోఁ బరమాత్మ తేజోమయుఁడని దేవత లెఱిఁగి నట్లు చెప్పుచున్నది.

"అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రోయం పశ్యన్తి యతయః క్షీణదోషాః" అను శ్రుతిని బరిశీలించినచో యతీశ్వ రులు దోషరహితులై నిర్మలమనస్కులై తమ శరీరమందలి హృదయాకాశములో ధ్యానించి పరమాత్మను బరిశుభ్రమైన జ్యోతిర్మయునిగాఁ జూచినట్లు తెలియుచున్నది. "జ్యోతిషా మపి తజ్జ్యోతిః తమసః పర ముచ్యతే" అను గీతావచనమునఁ గృష్ణభగవానుఁడు పరమాత్మను జ్యోతిస్సులలో జ్యోతిస్సుగాఁ దమస్సుకంటెఁ బరునిగా ఉత్కృష్టునిగా నిరూపించి చెప్పెను. కావున రాజా ! పరమాత్మను సువర్ణజ్యోతిగా, దానినే మౌన ముగాఁ దెలిసికొనుము.

సీ. భా. :- ధృతరాష్ట్రుఁ డడిగిన ఐదుప్రశ్నలకును సనత్సుజాతుఁడు తాంత్రికముగా సమాధాన మొసఁగఁ దొడఁ గెను. ఎట్లన ? రాజా ! పరబ్రహ్మ వాఙ్మనసా తీతుఁడు. ఆతనికే మౌన మని పేరు. వాఙ్మనసాతీతమైన బ్రహ్మపదమును బొందుటయే మౌనమునకుఁ బ్రయోజనము. ఇంద్రియములను

మనస్సును నిగ్రహించుటయే మౌనము. మౌనము గలవానికిఁ గ్రమముగా బాహ్యాభ్యన్తర ప్రపంచములు జ్ఞానదృష్టిలో భాసింపవు. అప్పుడే యోగి, వాఙ్మనసాతీతమైన బ్రహ్మపద మును బొందుచున్నాఁడని మొదట నాల్గుప్రశ్నలకును సమా ధాన మొసఁగెను.

క్షేత్రమునందు అంకురమును సముద్రమునందుఁ దరంగ మును, ఆవిర్భవించినట్లే పరబ్రహ్మలో వేదశబ్దమును, లౌకిక శబ్దము నుద్భవించినవి. అందుచే భూతాత్మయైన పరమాత్మ శబ్దమయుఁడుగాఁ బ్రకాశించుచున్నాఁ డని ఐదవ ప్రశ్నకు సమాధాన మొసఁగెను. ఇందలి రహస్యమేమన ? వేదమనగాఁ బ్రణవము. ఓంకారము. అదియే వేదసారము. తొలుత ఋగ్వే దమునుండి "భూః" అనునది ప్రభవించెను. పిమ్మట యజు ర్వేదమునుండి "భువః" అనునది ప్రభవించెను. అటుపిమ్మట సామవేదమునుండి "స్వః" అనునది ప్రభవించెను. అవియే శుక్రములు. అనగాఁ దేజస్సులు. అభితప్తములైన వానినుండి "అకారోకారమకారము" లనెడి మూఁడు వర్ణములు జన్మిం చెను. ఆ మూఁడును ఏకమై ఓంకారముగా వెలసెను. అని బహ్వృచ బ్రాహ్మణము నుండి పై విషయము ప్రకటింపఁ బడెను. ఓంకారమే ప్రణవము. అదియే ఏకమైన అక్షర బ్రహ్మ. దానినుండియే సర్వము నిర్మితమాయె నని సార్వాత్మ్య శ్రుతివలన దెలియుచున్నది. ప్రణవముయొక్క మాత్రలే అకా రోకార మకారములు. వానినుండియే క్రమముగా స్థూల సూక్ష్మకారణ ప్రపంచము లుద్భవించెను. పై మూఁడు

మాత్రలును, పై మూఁడు ప్రపంచములకును, వాచకములు. వాచ్యవాచకముల కభేదము కావుననే వేదశబ్దము పరమాత్మ వాచకము, ప్రపంచవాచకము నాయెను. పై మూఁడు మాత్ర లలో పూర్వపూర్వము, ఉత్తరోత్తరములందు లీనమై ఓంకారరూపము దాల్చెను. లవణమే ఉదకమా యెను. ఉద కమే లవణ మాయెను. అని తెల్పు లవణోదక న్యాయముచే స్థూల జగత్తు సూక్ష్మ జగత్తులో విలయ మగును. సూక్ష్మ జగత్తు కారణజగత్తులో లీనమగును. ఆ మాత్రాఖ్యము, తురీ యము నగు నర్ధమాత్రలోఁ గారణజగత్తు లీనమగును.

"శివ మద్వైతం చతుర్థం మన్యంతే" అను శ్రుతివలన అద్వైతము, చతుర్థమైన శివరూప మని తెలియుచున్నది. ద్వైతభావము తొలఁగినతోడనే, ప్రణవరూపము వాఙ్మానసా తీతమైన పరబ్రహ్మలో లీనమగును. కావున పరబ్రహ్మవస్తువు వొక్కటియే, అంతటను బ్రకాశించునని తెలిసికొనవలసి యున్నది. అందుచే వేదశబ్దమే నారాయణుఁ డనియు, ఆతఁడే మౌనమనియు వ్యక్తమగుచున్నది.

వివరణము :- క్రిందటి అధ్యాయమునందలి, 44 వ శ్లోకములో మానము, మౌనము అను రెండిటికినిఁ గల భేదము చక్కగా నిరూపింపఁబడినది. మౌనముచేతనే బ్రాహ్మీశ్రీ అనగా మోక్షశ్రీ లభించునని, తెలియు చున్నది. ఈ అధ్యాయము నందలి మొదటి రెండుశ్లోకములలో మౌనము గూర్చి ప్రశ్నలు సమాధానములు భాష్యకర్తలచేఁ జక్కగాఁ బ్రదర్శింపఁ బడి నవి. పరికించగా లోకమందలి మౌనశబ్దమునకు మాటాడక

ఊరకుండుట యను నర్థము పరబ్రహ్మవాచక మౌనశబ్దము నుండియే యేర్పడిన దని చెప్పవచ్చును. మౌనమైన పరమాత్మయొక్క స్వరూపము ఇదమిత్థమ్మని చెప్పలేనట్లే, సమాధానము చెప్పలేనప్పుడు మౌనము వహించుట తటస్థించును. అంతేకాదు "మునికర్మ మౌనము" అని లోకమంతటికిని దెలిసిన విషయమేకదా ! ముని యన నేమి ? ఋషియన నేమి ? అను ప్రశ్న సామాన్యాలలో ఉదయించును. దానిని పరిశీలింతము.

శ్లో॥ నిత్యాత్తః సర్వతత్త్వజ్ఞః కామక్రోధ వివర్జితః ।
ధ్యానస్థో నిష్క్రియో దాంత స్తుల్య మృత్కాంచనో ముని॥

అను శ్లోకమున సర్వతత్త్వము తెలిసినవాఁడును, కామక్రోధ శూన్యుఁడును, బుద్ధిచాంచల్య మొదవించు ధనము లేనివాఁడును, ధ్యాన నిమగ్నుఁడును, లౌకిక వ్యాపారహీనుఁడును, ఇంద్రియ నిగ్రహము కలవాఁడును, మట్టిని బంగారమును సమానముగాఁ జూచువాఁడే ముని యని చెప్పఁబడెను. అట్టి ముని ధర్మము మౌనము అని చెప్పినచో అదియును బరబ్రహ్మనే సూచించునుగదా !

శ్లో॥ తప శ్శౌచ వదాదాంతా స్సత్యవాచో బహుశ్రుతాః ।
వేదవేదాంగ తత్త్వజ్ఞాః ఋషయః పరికీర్తితాః ।
ఊర్ధ్వరేతా స్తపస్యుగ్రో నియతాశీ చ సంయమీ ।
శాపానుగ్రహ యో శ్శక్తః సత్యసంధో భవేదృషిః ॥

అను శ్లోకములను బరిశీలించినచోఁ దపస్సు, శౌచము, ఇంద్రియ నిగ్రహము, సత్యభాషణము, బహుశ్రుతుఁడై యుండుట, వేదవేదాంగములందలి తత్త్వజ్ఞాన మెఱుఁగుట అనునవి కలవాఁడే ఋషియని తెలియుచున్నది. అంతేకాదు. ఊర్ధ్వరేతస్కుఁడు, ఉగ్రతపశ్శాలి, నియతాహారుఁడు, ఇంద్రియ నిగ్రహము కలవాఁడు, శాపానుగ్రహసమర్థుఁడు, సత్యమైన పరబ్రహ్మయందు లీనమైనవాఁడును ఋషియని తెలియు చున్నది. కావున ఋషిధర్మము మునిధర్మముకూడ బరబ్రహ్మ నెఱుఁగుటయే యని చెప్పవచ్చును. అందుచే మౌనము అనగా బరబ్రహ్మ యని చెప్పుట సమంజసముగా నున్నది. "బ్రహ్మ విత్ బ్రహ్మైవ భవతి" అను సూక్తినే బరమాత్మ నెఱిగిన వాఁడు పరబ్రహ్మయే యగునని తెలియుచున్నది. కాన మౌనము = పరబ్రహ్మ అని చెప్పవచ్చును.

అట్టి పరమాత్మ ఓంకారస్వరూపుఁడు. ఆ యోంకా రము నుండియే స్థూల, సూక్ష్మ కారణ జగత్తులును, స్థూల సూక్ష్మ కారణశరీరములు నుద్భవిల్లినవి. స్థూలజగత్తు అనగాఁ గంటికిఁ గానవచ్చు ఈ ప్రపంచము. సూక్ష్మజగత్తు అనగాఁ బ్రపంచోత్పత్తికిఁ గారణములైన పంచభూతములు. కారణ జగత్తు అనగాఁ బంచభూతోత్పత్తికిఁ గారణ మగు శక్తి. అదియే మాయ, అదియే అజ్ఞానమని పెద్దలు చెప్పుదురు. కరచరణ నయనాదులతోఁ గూడిన దేహము స్థూలశరీరము. మనోబుద్ధి చిత్తాహంకారములు సూక్ష్మశరీరము. కారణ శరీరమనగా

మాయయే. పైనఁ జెప్పినవన్నియు, మహానమైన పరమాత్మ నుండి వెలువడినవే యని, తెలియుచున్నది.

—: వేదపఠనము పాపనాశకమా? :—

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ ఋచోయజూం ష్యధీతేయః సామవేదం చ వేదయః ।
　　పాపాని కుర్వన్ పాపేన లిప్యతే కిం న లిప్యతే ॥　　3

తా॥ అయ్యా! ఋగ్యజుస్సామ వేదములను బఠించిన యాతఁడు పాపములు చేయుచున్నను ఆ పాపములను వేదపఠనముచేఁ బోగొట్టుకొనునా? లేదా? తెలియఁ జెప్పుఁడని ధృతరాష్ట్రుఁడడుగగా సనత్సుజాతుఁడిట్లు చెప్పెను.

నీ. భా. :- ధృతరాష్ట్రుఁడు, వేదస్వభావ మెఱుగఁ గోరి, మఱలఁ బ్రశ్నింపఁ దొడఁగెను. అయ్యా! ఋగ్యజుస్సామ వేదములను బఠించియుఁ, బాపము నాచరించు వానికి ఆ పాపము అంటునా? అంటదా? ఎఱిగింపుఁడు.

"యథైషీకా తూల మగ్నౌ ప్రోతం ప్రధూయేతైవం హాస్య, సర్వే పాప్మానః ప్రదూయంతే." అను శ్రుతిని బరిశీలించినచో, అగ్నిలోఁ బడిన దూదిపింజ భస్మమైనట్లు, వేదాభ్యాసముచేఁ గల్గిన పరమాత్మ జ్ఞానముచే మానవుని పాపము లెల్ల నశించునని తెలియుచున్నది కదా! అట్టి శ్రుతిమార్గము ననుసరించిన మానవుఁడు మహాహీనుఁడైనను, వేదాభ్యాసముచే సకలపాపశూన్యుఁ డగునా? కాదా? ఎఱిగింపు డని

అడుగగా సనత్సుజాతుఁ డిట్లు చెప్పెను. ఏమన?

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ నైనం సామాన్యృచో వాఽపి న యజూంష్యవిచక్షణం।
త్రాయన్తే కర్మణః పాపా న్నతే మిథ్యా బ్రవీమ్యహమ్॥౮

తా॥ రాజా! పాపకర్మల నాచరించువానిని ఋగ్యజు స్సామ వేదపఠనము పాపమునుండి రక్షింపదు. నే నెన్నడును నీకు మిథ్యావచనములు చెప్పను. వినుము.

శం. భా. అవిచక్షణుఁడనగా నిషిద్ధ కర్మల నాచరించు వాఁడు. వానికి వాఙ్మనస నిగ్రహముండదు. శాస్త్రపాండి త్యము కూడ ఉండదు. అట్టివాఁడు గావించిన పాపము, ఋగ్యజు స్సామ వేదపఠనముచే నశింపదు. వాఁడెంతమాత్రము పాప కర్మలనుండి, రక్షింపఁబడడు. రాజా! నేను ఎన్నడును నీకు అసత్యము చెప్పను.

—: వేదపఠనము పాపనాశకము కాదు :—

శ్లో॥ న ఛందాంసి వృజినాత్తారయంతి
మాయావినం మాయయా వర్తమానం।
నీడం శకుంతా ఇవ జాతపక్షా
శ్ఛందాం స్యేనం ప్రజహ న్త్యన్తకాలే॥ ౯

తా॥ మాయావియును, మాయతోఁ బ్రవర్తించు వాఁడు నగు మానవుని వేదము లెంతమాత్రమును బాపము నుండి రక్షింపవు. ఱెక్కలు వచ్చిన పక్షులు గూటిని విడిచి

పెట్టినట్లు మరణకాలమునఁ బాపాత్ముని వేదములు విడిచి పెట్టును. రక్షింపవు.

శం. భా. వేదాధ్యయన మొనర్చి, వేదార్థ మెఱిఁగి నను, నాస్తికుని, బాపకర్ముని; మిథ్యాచార్యుని ఎంతమాత్రము అధర్మము నుండియుఁ బాపమునుండియు వేదములు దరలింపవు రక్షింపవు. ఱెక్కలు వచ్చిన పక్షులు తమగూటినివలె వేదాధ్యయన మొనర్చినను బాపాత్ముని వేదములు, మరణసమయమున విడిచిపెట్టునే కాని, వానికిఁ బుణ్యపార్థము నొసంగవు.

నీ. భా. :- యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్" అను గీతాసూక్తిలోఁ జెప్పినట్లు మరణసమయమున, నిత్యాభ్యాసముచే, ఆయా దేవతామంత్రములు పఠించి, ఆయా దేవతలను స్మరించినను, వాఙ్మనో నిగ్రహారూపమైన మానము లేని వారికి ఆమంత్రములు స్ఫురించవు. ఆయా దేవతలు కానరారు వాఁడు తనకర్మఫలము ననుభవించ వలసిన దే. వేదబలము నాశ్రయించి, పాపకర్మల నాచరించినను, ఫలము లేదు.

"అజ్ఞానేన కృతం పాపం వేదాభ్యాసేన నశ్యతి।" అను సూక్తి తెలియక చేసిన పాపమును మాత్రమే వేదాభ్యాసము నశింప జేయునని జెప్పుచున్నది. కాని తెలిసి చేసిన పాపము ను మాత్రము పోఁగొట్టదని తెలిసికొనవలెను.

—: సర్వజ్ఞ - భాష్యము :—

శ్లో॥ ఉత త్వం సఖ్యే స్థిర పీత మాహు
ర్నైనం హిన్వ న్త్యపి వాజనేషు ।

అధేన్వా చరతి మాయయైష వాచం
శుశ్రువాం అఫలాం మపుష్పామ్ ॥

అను ఋగ్వేద మంత్రములో సైతము పైవిషయమే చెప్పఁబడెను, అదెట్లన ?

అర్థము :

ఉతత్వం = తత్త్వజ్ఞానమును, సఖ్యే = తత్త్వజ్ఞానులతో స్నేహము సంభవించినపుడే, స్థిరపీతం = నిశ్చలానందము కలదిగా, ఆహుః = చెప్పిరి. కాని వాజనేషు + అపి = యజ్ఞతత్త్వము తెలిసినవారితోఁ జేయు యజ్ఞములందు మాత్రము ఏనం = ఈయానందమును, నహి న్వన్తి = పొందఁజాలరు. అనగా యజ్ఞము ప్రవృత్తి మార్గమును జూపు కర్మ యగుటచే, నివృత్తిమార్గము చూపు తత్త్వజ్ఞానము కాని, తత్త్వజ్ఞానుల మైత్రికాని లేనపుడు, కేవల యజ్ఞము లాచరించువారు మోక్షానందమును బొందఁ జాలరన్నమాట.

ఏషః = జ్ఞానహీనుఁడైన కేవలకర్మిష్ఠుఁడు, మాయయా = ప్రవృత్తిమార్గము చూపు యజ్ఞము లాచరించు బుద్ధితో నుండుటచే, అధేన్వా = కేవల ప్రవర్తక కర్మతోడనే, చరతి = సంచరించుచున్నాడు. అందుచే, వాచం = వేదవాక్కును, వాని విషయమై. అఫలాం = ప్రయోజన రహితమైనదిగాను, శుశ్రువాం = ఆలకించెను. అనగాఁ గేవలము ప్రవృత్తి మార్గదాయకములైన యజ్ఞము లాచరించువాఁడు వేద మభ్యసిం

చినను, జ్ఞానహీనుఁడగుటచేఁ బాపరాహిత్యమును బొంద జాలఁడు. పరమానందమును బొందఁజాలఁడు. అందుచే వాని పట్ల వేదవాక్కు నిష్ఫలమగును.

"యదేత త్పుష్పం ఫలం వాచో యత్సన్యమ్ ।" అను నుపనిషద్వాక్యముకూడ సత్యమైన బ్రహ్మవస్తువు నెఱిఁగిననాఁడే వేదవాక్కు ఫలమును బరమానందము నొసంగునని వ్యక్తము చేయుచున్నదని తెలిసికొనవలెను. కావున అట్టి సత్యవస్తువే ఇందు మానపదముచే నిరూపింపఁ బడినది. కేవల ప్రవృత్తి కర్మల నెఱిఁగినవాఁడు మాయావి యగునేకాని, ఆత్మజ్ఞుఁడు కానేరఁడు. అట్టిమాయలో మెలగినవాఁడు మరణించినను, గర్మలు వాని వెంటనేగి రక్షింపఁ జాలవు. జ్ఞానమొక్కటే వెంట నేగి, రక్షించును. అని తెలిసికొనవలసి యున్నది. అని చెప్పగావిని, ధృతరాష్ట్రుఁడు మఱల యిట్లు ప్రశ్నించెను.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ న చే ద్వేదావినా ధర్మం త్రాతుం శక్తా విచక్షణ ।
అథ కస్మాత్ ప్రలాపోఽయం బ్రాహ్మణానాం సనాతనః॥౬

తా॥ నాల్గు జాతులవారికిని విధించిన ధర్మము రక్షించునట్లు, ధర్మమువినా వేదములు మానవులను రక్షింపఁజాలవు. అనుమాట నిజమైనచో, విచక్షణుఁడా! వేదములందు మహత్వము కలదు. వేదవేత్తలే గొప్పవారు, అని అనాదిగా వినఁబడుచున్న బ్రాహ్మణుల మాటలు అప్రమాణములేనా? సనాతనమైన ఆ వచనములు లోకమున ఏల వ్యాప్తిచెందినవి?

అని ధృతరాష్ట్రుఁ డడిగెను దానికి సనత్సుజాతుఁ డిట్లు సమాధానము చెప్పెను.

శం. భా. :- విచక్షణుఁడా! నిత్యమైన కామ్యకర్మలు జీవులకుఁ బితృలోకాదులను జేకూర్చి కొంతకాలమైన తర్వాత సంసారానర్థములకు హేతువులగుచున్నవి. ప్రతిషిద్ధకర్మలు నరకహేతువు లగుచున్నవి. అని తమరు నిరూపించిరి. ధర్మము వినా వేదములు జీవులను రక్షింపఁ జాలవనుచున్నారు. వేదములను బఠింపుడు. వేదవిహితకర్మలను ఆచరింపు డనెడి బ్రాహ్మణుల వచనము సనాతనమై లోకమున వినఁబడుచున్న దేల?

సీ. భా. :-

శ్లో॥ శమోదమ స్తపశ్శౌచం క్షాంతి రార్జవ మేవచ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్ ॥

అను గీతాసూక్తిలో, శమము, దమము, తపస్సు, శౌచము, క్షాంతి, (ఓరిమి), ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము అనునవి బ్రహ్మకర్మలు. అవి స్వాభావికములని వివరింపఁ బడినది. ఇట్లే క్షత్రియ, వైశ్య, శూద్రులకును గొన్ని కర్మలు విధింపఁబడినవే. ఇవన్నియును ధర్మములే. ఇట్టి ధర్మములు తప్ప వేదములు మానవులను రక్షింపఁజాలవని తమరు చెప్పు చున్నారు.

"ఋగ్యజు స్సామభిఃపూతో బ్రహ్మలోకే మహీయతి"

ఋగ్యజు స్సామవేదములచేఁ బవిత్రుఁడై బ్రహ్మలోకమున మానవుడు ప్రకాశించును.

"యావతీర్వై దేవతా స్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణే వస న్తి" వేదవేత్తయైన బ్రాహ్మణునియందు సకలదేవతలు నివసించుచున్నారు, అని కొన్ని బ్రాహ్మణ మాహాత్మ్యమును బ్రకటించు వచనములు అనాదులై వినఁబడుచున్నవేల? మీ మాటలవలన వేదపఠనము నిష్ఫలముగాఁ దోఁచుచున్నదే. ఏమందు రనగా సనత్సుజాతుఁ డిట్లు సమాధానము చెప్పఁ గొడఁగెను.

—: వేదములు సప్రయోజనములు - పరమ పురుషార్థ ప్రతిపాదకములు: —

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ తస్యైవనామాది విశేషరూపై
రిదం జగద్భాతి మహానుభావ ।
నిర్దిశ్య సమ్య క్ప్రవద న్తి వేదా
స్తద్విశ్వవైరూప్య ముదాహర న్తి॥ 2

తా॥ మహానుభావా! పరమాత్మయొక్క నామములుఁ రూపములు పరమాత్మ మాయచేఁ గల్పింపఁబడినవే. పరమాత్మయొక్క నామరూపాదులతోడనే ఈ జగ మంతయు భాసించుచున్నది, వేదములు పరమాత్మయొక్క స్వరూపమును, ఆయా మంత్రముల మూలమునఁ జక్కగా నిర్దేశించి చెప్పుచున్నవి. అంతేకాదు. అవి పరబ్రహ్మయొక్క విశ్వవైరూప్యమును జక్కగా ఉదహరించి చెప్పుచున్నవి.

శం. భా. :- మహానుభావా మోక్షమే పరమపురుషార్థము, అది స్వర్గాదులకంటె విభిన్నమైనది. వేదములందుఁ బ్రధానముగాఁ జెప్పఁబడినది మోక్షవిషయమే. వేదములందుఁ జెప్పఁబడిన వేదపఠనము, వేదవిహిత కర్మాచరణము, వేదబోధితమైన ఉపాసనా క్రమము, మున్నగు వానిలోఁ గొన్ని మోక్షప్రాప్తి సాధనములు; కొన్ని జ్ఞానసాధనములు, మఱికొన్ని అంతఃకరణ శుద్ధికిఁ గారణములు. ఈ విధముగా మోక్షేతర విషయము లన్నియుఁ, బరంపరగాఁ బురుషార్థ సాధనము లగుటచే వేదములందుఁ బ్రతిపాదింపఁ బడినవి. అందుచే వేదపఠనాదులు నిష్ఫలములన వీలులేదు. గమనింపవలసిన దేమనగాఁ బరమాత్మనే పరమపురుషార్థముగా వేదములు ప్రశంసించుచున్నవన్న మాట.

శ్లో॥ "అనందానామ తే లోకా అంధేన తమసా వృతాం ।
తాం స్తేప్రేత్యాభి గచ్ఛన్తి అవిద్వాంసోఽబుధా జనాః ॥"

అను సూక్తిని బరిశీలించితిమేని, జ్ఞానహీనులును' అపండితులు నైన జనులు, కర్మలాచరించి, గాఢాంధకారముతో నిండిన అనందాఖ్యములైన లోకములను జేరి, మఱల యీలోకమునే చేరుచున్నా రని తెలియుచున్నది.

శ్లో॥ ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః ।
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్ ॥

అను సూక్తినిఁ బరిశీలించినచో, ఈ "పరబ్రహ్మయే నేనని ఆత్మవస్తువు నెఱిఁగిన పురుషుఁడు ఏమియును గోరఁడు.

వాని కేవలమాత్రము పునర్జన్మ ప్రసక్తి లేదని తెలియుచున్నది. పై సూక్తుల నెఱింగినచో స్వర్గాది లోకములు పరమపురుషార్థ హీనములు ఆనందశూన్యములు. అవిద్యావంతుల కాశ్రయము లని చక్కఁగాఁ దెలియును. అంతేకాదు.

శ్లో॥ ఇహైవ సంతోఽథ విద్మ స్తద్వయం
నచే దిహా వేదీ న్మహతీవినష్టిః!
య ఏత ద్విదురమృతా స్తే భవ
న్త్యథేతరే దుఃఖ మేవాపియంతి॥

అను సూక్తిని బరిశీలించినచో సజ్జనులు ఇహలోకమున నుండియే ఆత్మానాత్మల నెఱిఁగి, తరించవలె ననియు వాని నెఱుఁగకున్నచో గొప్పనష్టము వాటిల్లుననియు, బ్రహ్మపదార్థ మెఱిఁగినవారు అమృతు లగుచున్నారనియు, ఇతరులు దుఃఖ మునే పొందుచున్నారనియుఁ దెలిసికొని ఆత్మజ్ఞులై తరించు చున్నట్లు తెలియుచున్నది.

"యదైత మనుపశ్య త్యాత్మానం దేవ మంజసా।
ఈశానం భూత భవ్యస్య నతతో విజుగుప్సతే॥"

అను సూక్తిని బరిశీలించినచోఁ బరమాత్మయే స్వయం ప్రకాశ మానుఁడు అతఁడే భూతభవిష్య ద్వర్తమాన ప్రపంచ ములకుఁ బ్రభువు. ఈ విషయమును వేగముగా గ్రహించిన జ్ఞాని, విజుగుప్సను బొందడని తెలియుచున్నది.

భగవంతుఁడైన పరమాత్మపై మహావాక్యములద్వారా

జ్ఞానులకుఁ బరబ్రహ్మ స్వరూపమును బరమపురుషార్థమును, దత్ఫలమును బహువిధములఁ బ్రదర్శించెను. పిమ్మట అహంకార మమకారములకు, రాగద్వేషాదులకును, వశుఁడైన జీవి, ఇంద్రియవాంఛలచే బంధితుఁడై పాపకారియై బహు నరకము లకు ఈడ్వఁబడుచున్నాడే! వానినిపై తము తరింపజేయు టెట్లు? వానిని బరమపదమైన మోక్షసామ్రాజ్యమున బ్రతిష్ఠించు టెట్లు? అని తర్కించి, తలంచి, పరమాత్మ, పాపజీవుల సము ద్ధరణకై వేదపఠనము, ఉపాసనాక్రమము, యజ్ఞము మున్నగు వానిలో గొన్నిటిని మోక్షప్రాప్తి సాధనములుగా మఱికొన్ని టిని జ్ఞానసాధనముగా ఇంకొన్నిటిని అంతఃకరణశుద్ధికిఁ గారణ ములుగా నిర్ణయించెను. పై విషయములే.

శ్రు॥ త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిష న్తి।
యజ్ఞేన, దానేన, తపసా నాశకేన ॥

అను సూక్తివలనఁ దెలియుచున్నది. కావున వేదపఠ నము, యజ్ఞము, దానము, తపస్సు అనునవి పరంపరగాఁ బరమపురుషార్థ సాధనములేకాన వానిని నిత్యము ప్రతి మానవుఁ డాచరించవలెను. స్వర్గాదులను గూర్చి భోగ కాంక్షతోఁ జేయు శ్యేనయాగాదులు మాత్రము పురుషార్థ పరములుకావు. అవన్నియును సంసారానర్థ హేతువులే, అను విషయము.

శ్రు॥ ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్త మవరం యేషుకర్మ ।
ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా
జరా మృత్యూ తే పునరేవాపి యన్తి ॥

అను శ్రుతివలనఁ దెలియుచున్నది. ఎట్లన ? యజ్ఞరూపములైన కర్మలన్నియును జలప్రయాణ సాధనములైన తెప్పలవంటివి. అదృఢములు. అనగా అశాశ్వతములు. వేదములందేకాదు, అష్టాదశ విద్యలందుఁ జెప్పఁబడిన కర్మకాండ సైతము అవసరమే. కాని శ్రేష్ఠమైనదికాదు. అట్టి కర్మజాలమే శ్రేయోదాయకమని భావించి, యానందించు వారు మూఢులు అందుచే వారు జరామరణములను బొందుచు బాధపడుచున్నారే కాని తరించలేరు. అని తెలియుచున్నది. పరికింపగా వేదములు, మోక్షమును మోక్షసాధనములైన వేదపఠన యజ్ఞోపాసనాదులను బోధించుచు, సంసారానర్థ నివృత్తిహేతువులగుచున్నవి. అందుచే వేదవేత్తను వేదములు రక్షింప సమర్థములే. వేదపఠనాదులు నిష్ఫలములు కావను విషయమును బోధింపదలంచి, తొలుత —

"తస్యైవ నామాది విశేషరూపైః" అను శ్లోకమున నిత్యమును అపరోక్షమును బరమపురుషార్థము నగు పరమాత్మకుఁ జెందిన విషయమును జెప్పుచున్నాఁడు.

మహానుభావా ? పరమాత్మకుఁ జెందిన నామములు రూపములు మున్నగునవి పెక్కు కలవు. అవన్నియును మాయా పరికల్పితములే. పరమాత్మకుఁ జెందిన నామరూప విశేషములతో ఈ జగత్తంతయును భాసించు చున్నది.

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అను మంత్రమున దేవదేవుఁడైన ఇంద్రుఁడు తన మాయాశక్తిచే

తామరతూడు రూపమును బొందినట్లు చెప్పఁబడినది. ఇట్టి మూర్తా మిర్మితరూపము లెన్నియో పరమాత్మకుఁ గలవు. అని వేదమంత్రములవలనఁ దెలియుచున్నది.

మం. "తదేతద్బ్రహ్మ పూర్వ్యమనపర మనన్తర మబాహ్య
మయమాత్మా, బ్రహ్మ, సర్వానుభూరిత్యను శాసనమ్".

అను మంత్రమున ఈ కానవచ్చు ప్రకృతియంతయును ఆ పరబ్రహ్మయే. బ్రహ్మపదార్థము అపూర్వము., అనుపమము (వేరుసాటిలేనిది) అనంతరము, అబాహ్యము. ఈ యాత్మ వస్తువే సకలాధార మని వివరింపఁబడినది.

"ద్వే వా బ్రహ్మణో రూపే మూర్తం చైవామూర్తంచ" మున్నగు మంత్రములలో ఆ పరబ్రహ్మ సాకారము, నిరాకారమునై ఆత్మన జగత్స్వరూపమునై యున్నదని, తొలుత నిర్దేశించి, ఆ పరబ్రహ్మయొక్క సమ్యగ్రూపమునే "నేతినేతి" మున్నగు మంత్రములద్వారా వేదములు చెప్పుచున్నవి. ఎట్లన?

"ఆత్మన ఆకాశ స్సంభూతః" మున్నగు మంత్రములలో వియత్తు అనగా ఆకాశము మొదలు భూమ్యంతమైన ప్రకృతియంతయు ఆపరబ్రహ్మయొక్క కార్యరూపమైన సృష్టియే యని నిర్దేశించి, "యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ" మున్నగు మంత్రములద్వారా, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశముల వివరణము ద్వారా ఆపరబ్రహ్మయొక్క సమ్యగ్రూపమును వేదములు నిరూపించు చున్నవి. అంతేకాదు.

"అధీహి భగవో బ్రహ్మేతి ఇతి హోపససాద" మున్నగు మంత్రములలో, నామాది ప్రాణాన్తమైన జగత్తంత టికిని, ఆపరబ్రహ్మయొక్క మాయయే నిమిత్త మని నిర్దేశించి, "యత్ర నాన్య త్పశ్యతి, నాన్య చ్ఛృణోతి నాన్య ద్విజానాతి సభూమా" మున్నగు మంత్రములద్వారా, ఆపర బ్రహ్మయొక్క సమ్యగ్రూప మే తమస్సుకంటెఁ బరమై తన మహిమలోఁ గలదని వేదములు వివరించుచున్నవి. అంతే కాదు. మునులుకూడ పరబ్రహ్మను విశ్వవైరూప్యము, విశ్వ రూప విపరీతరూప మని ఉదాహరించిరి. ఎట్లన ?

భగవంతుఁడైన పరాశరమహర్షి,

శ్లో॥ ప్రత్యస్తమిత భేదం యత్సత్తామాత్ర మగోచరం ।
మనసా మాత్మ సంవేద్యం తత్ జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్ ।
తచ్చ విష్ణోః పరం రూప మరూపాఖ్య మనుత్తమం ।
త ద్విశ్వరూప వైరూప్య లక్షణం పరమాత్మనః ॥

అను సూక్తిలోఁ బరబ్రహ్మ, సత్తామాత్రము (శాశ్వతము). మనోగోచరముకాదు. ఆత్మైక సంవేద్యము దానికి జెందిన జ్ఞానమే బ్రహ్మజ్ఞానము. అదియే విష్ణువు యొక్క పరరూపము. అనుత్తమము. నామరూప రహితము. విశ్వరూప వైరూప్యము అని వివరించి చెప్పెను. ఈవిధముగా శంకరాచార్యులవారు పై శ్లోకార్థమును వివరింపగా నీలకంఠుఁడు ఈ క్రింది విధమున వివరించెను.

సి. భా. :-

శ్రు॥ అస్యమహతో భూతస్య నిశ్వసిత మేతత్ ।
ఋగ్వేదో యజుర్వేద స్సామవేద ఇతి ॥

అను శ్రుతిలో మహాభూతమైన పరమాత్మయొక్క నిశ్వసితమే, అనగా ఉచ్ఛ్వాస, నిశ్వాసరూపమే, వేదశాస్త్రాది ప్రపంచము. అదియే పరబ్రహ్మయొక్క ప్రలాప మని చెప్పఁబడెను. అట్టి పరమాత్మ స్వయముగా అవ్యాకృతుఁడే. అనగా ఏవిధమైన మార్పులు లేనిస్థిరుఁడే. అయినను ఒకప్పుడు తన మాయావిలాసముచే బహు నామరూపములతో వ్యాకృతుఁడాయెను. అట్టి వ్యాకృతమైన స్వరూపమే ఈ భాసించుచున్న జగత్తంతయును సందేహము లేదు.

మహానుభావా :

శ్లో॥ తద్ధేదం తర్హ్యవ్యాకృత మాసీత్ త న్నామరూపాభ్యా।
మేవ వ్యాక్రియతా సౌనామాఽయ మిదం రూప ఇతీతి ॥

అను శ్రుతిలో పై విషయమే నిరూపింపఁబడెను.

"ద్వే వావ బ్రహ్మణోరూపే మూర్తం చైవామూర్తం చేతి" అను మంత్రములో దృశ్యమును, అదృశ్యము నగు ఈ జగత్తంతయును ఆ పరబ్రహ్మరూపమే, అని నిర్దేశింపఁ బడెను. "బ్రహ్మైవేదం" మున్నగు మంత్రములద్వారా వేదములు ఆ పరబ్రహ్మయొక్క సమ్యగ్రూపమును బక్కగాఁ జెప్పుచున్నవి.

పై విషయమును బరిశీలించినచో "బ్రహ్మయే ఈ

జగత్తు" అనునది అధ్యారోప ప్రసంగమే కానిండు, అపవాద ప్రసంగమే కానిండు. మూర్తామూర్తరూపములతో నున్న ఈ విశ్వరూపుఁడే విరూపముల నొందెనని చెప్పక తప్పదు. ఆ విరూపమే విలక్షణమైన వైరూప్య మని పెద్దలుదాహరించు చున్నారు. "నేతి నేతి" అను మంత్రమందలి నిషేధార్థకమైన నకారద్వయము మూర్తామూర్తములను నిషేధించి, శూన్యమే శేషించిన దను ప్రసక్తి తెచ్చిననుఁ ఈ పరమాత్మకంటె, అన్యమును, ఉత్కృష్టమును, అతిరిక్తమునునైన కార్యముకాని, కారణముకాని లేవను విషయమునే "నేతినేతి" వాక్యము వ్యక్తముచేయు చున్నదని చెప్పక తప్పదు. పైవిషయమునే "నతు శూన్య మవశిష్యతే" అను శ్రుతి దృఢపఱచు చున్నది. ఈ విధముగా వేదములు ఆ పరమాత్మయొక్క విశ్వవైరూప్యమును ఉదాహరించు చున్నవి. భగవత్ప్రభావమును ప్రకటించుటచే వేదములు మాన్యములు పూజ్యములు. అందుచే వేదోక్త మార్గము ననుష్ఠింపనిచో వేదములను అవమానపరచుటయే యగును. అపుడు వేదాధ్యయనము నిష్ఫల మగును. భగవంతుని యాజ్ఞను భంగపఱచిన దోషము వాటిల్లును. కావున దేహాదులే "ఆత్మ" అను భావమును విడిచి, వేదములను బఠింపవలసినదే.

వివరణము :– 1వ శ్లోకము మొదలు 7వ శ్లోకమువరకు గల వానిలో వేదప్రామాణ్యము, వేదప్రభావము, వేదావశ్యకత, వేదప్రయోజనమును వివరింపఁబడినవి. వేదపదమునకు జ్ఞానము, విష్ణువు, బ్రహ్మ, వేదములు అను నర్థములు కలవు.

వేదమంత్రము లన్నియుఁ బైన పేర్కొనిన జ్ఞానాదులను గూర్చి తెలియఁ జేయుచున్నది. పరికింపగా వేదములు, నూటిగాఁ గాని, పరంపరంగాఁ గాని బ్రహ్మపదార్థమును జ్ఞానమును జక్కగా మానవులకు తెలియఁ జేయును. అందుచే వేదపఠనము వేదశ్రవణమును, పాపనాశకము, మోక్షదాయకము నగునని చెప్పవచ్చును. వేదోక్తములైన యజ్ఞయాగాదులు సైతము నిష్కామముగా ఆచరించినచో దప్పక ముక్తి నొసఁగును. సకామముగా జేసినచో సంసారబంధమును బునర్జన్మను ఒసంగును. బ్రాహ్మణులకు జెప్పిన "శమదమాదులు" క్షత్రియులకుఁ జెప్పిన "శౌర్యము, తేజస్సు" మున్నగునవి, వైశ్యులకుఁ జెప్పిన "కృషి గొరక్ష్య వాణిజ్యాదులును" నాల్గవ జాతివారికిఁ జెప్పిన "పరిచర్యయు" వేదోక్తములైన ధర్మములే పైనఁ జెప్పినధర్మము లన్నియును బ్రహ్మార్పణబుద్ధితో నాచరించినచో మానవులను దప్పక రక్షించును. రక్షణ మనగా మోక్ష మని ఇటఁ జెప్పకొనవలసియున్నది. "ధర్మోరక్షతి ధార్మికమ్" అను నార్యోక్తియును బైవిషయమునే ప్రకటించును. ఈ కానవచ్చు ప్రకృతియంతయు బరమాత్మయొక్క విశ్వవైరూప్యమే యని వేదములు చెప్పుచున్నవి, వేదములు చెప్పినరీతిని ఆయా దేవతలను బరమాత్మగా భావించి ఉపాసించినచో మోక్షము ప్రాప్తించును. అంతేకాదు, నాల్గువేదములు, శిక్షవ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థ

శాస్త్రము అనెడి పదునెనిమిది విద్యలందుఁ జెప్పఁబడిన కర్మ కాండ యంతయు బ్రహ్మార్పణ బుద్ధితో నాచరించినచో అంతః కరణ శుద్ధిని జేకూర్చి, తద్ద్వారా మోక్షమును దప్పక యొసంగును. ఎంతమాత్రము కర్మలను ఆచరించుటలో అశ్రద్ధ వహించరాదు. మానవులు చేయు సత్కార్యములు, ఆరాధించు దేవతలు, పరికించు వస్తువులును పరమాత్మ విలసితములే. ఈ జగత్తంతయును బరమాత్మయే. ఆ విషయమునే శాస్త్ర వేత్తలు, ఆరోపదృష్టి, అపవాదదృష్టి, వ్యామిశ్రదృష్టి అను పద్ధతుల ననుసరించి వివరించిరి. ఆ మూఁడువిధములైన దృష్టు లును 41 వ శ్లోకభాష్యములందు విపులముగా వివరింపఁబడును. పైనఁ జెప్పిన విషయములను శ్రద్ధగాఁ బరిశీలించినచో ఏ మానవుఁడును వేదపఠనము నిష్ప్రయోజన మని భావింపఁడు, అని తెలియును.

—. తపస్సు - యజ్ఞము - జ్ఞానమును మోక్షదానములే :—

శ్లో॥ తదర్థముక్తం తపఏత దిజ్యా
తాభ్యా మసౌ పుణ్య ముపైతి విద్వాన్ ।
పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్
సంజాయతే జ్ఞాన విదీపితాత్మా ॥  ౭

తా॥ పరబ్రహ్మప్రాప్తికే, తపస్సు, యజ్ఞము, ముఖ్య ముగాఁ జేయవలెనని వేదములందుఁ జెప్పఁబడినది. తపో యజ్ఞములచేతనే విద్వాంసుఁడు పుణ్యమును బొందుచున్నాఁడు బ్రహ్మార్పణ బుద్ధితో ఇజ్యాది కర్మలను (యజ్ఞాదులను) ఆచ

రించుటచేఁ గల్గిన పవిత్రతయే అపూర్వము. అదియే పుణ్యము. అట్టి పుణ్యముచే మానవుఁడు పాపమును క్షీణింపఁ జేసికొని జ్ఞానమును పొందును. జ్ఞానముచేతనే పరమాత్మ స్వరూపము చక్కగా వానికి గోచరించును.

శం. భా. : ఈశ్వరుఁడు అనగాఁ బరమాత్మ. ఈశ్వర ప్రాప్తికి జ్ఞానము ముఖ్యహేతువు. వేదపఠనాదులు పరంపరగా హేతువులు. వేదపఠనము, యజ్ఞాదులు ఉపాసన మున్నగునవి ఈశ్వరప్రాప్తికై గావించినపుడే ఆ వేదపఠనాదులకుఁ బురుషార్థత్వము చేకూరును. లౌకిక వాంఛలతో జేయునపుడు మాత్రము వానికిఁ బురుషార్థత్వము చేకూరదు. అపుడు వేదపఠనాదులు సంసారానర్థ హేతువులే యగును. అను విషయము ఈ క్రింది రెండుశ్లోకములలోఁ బ్రదర్శింపఁ బడుచున్నది. ఎట్లన ? పరబ్రహ్మ విశ్వరూపముకంటె విలక్షణమైనవాఁడు. అట్టి పరబ్రహ్మను పొందుటకై, కృచ్ఛ్రచాంద్రాయణాది రూపమును, ధ్యానధారణాది రూపము నగు తపస్సును, జ్యోతిష్టోమాదియాగములను ఆచరింపవలెను.

"తపసా బ్రహ్మవిజిజ్ఞాసస్వ" అను శ్రుతిలో సైతము బ్రహ్మజిజ్ఞాసకై తపస్సు చేయవలె ననియే చెప్పఁబడినది. విద్వాంసుఁడు తపోయజ్ఞరూపములైన కర్మలను ఈశ్వరార్థము ఆచరించుచుఁ బుణ్యమును బొందుచున్నాఁడు. అట్టి పుణ్యమునే పెద్దలు కర్మజన్యమైన అపూర్వముగాఁ బేర్కొనిరి. విద్వాంసుఁ డట్టిపుణ్యముచేఁ బాపమును నశింపఁ జేసికొని, సకలకల్మషహీనుఁ డగును. అపు డతఁడు తనకుఁ గల్గిన జ్ఞానముచే, ఆత్మ

తత్త్వము చక్కగా నెఱిఁగినవాఁడై చిత్సదానందాద్వితీయ బ్రహ్మస్వరూపుఁ డగును. అట్టి విద్వాంసునే జ్ఞానవిదీపితాత్ముఁ డందురు. మహానుభావా! పై విషయము చక్కగాఁ దెలిసికొంటివేని తపోయజ్ఞములు సాక్షాత్తుగా మోక్షహేతువులు కావనియు, జ్ఞానదాయకము లగుటద్వారా మోక్షసాధనము లనియుఁ దెలిసినవాఁడ వగుదువు.

శ్లో॥ జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వా
న ధాన్యథా వర్గ ఫలానుకాంక్షీ ।
అస్మిన్ కృతం తత్పరి గృహ్య సర్వ
మముత్ర భుంక్తే పున రేతి మార్గమ్ ॥ ౯

తా॥ ఈశ్వరార్పణబుద్ధితో యజ్ఞ, దాన, తపః కర్మల నాచరించుటయే జ్ఞానము. అట్టి జ్ఞానముచేతనే విద్వాంసుఁడు పరమాత్మను జేరును. అట్టి జ్ఞానములేనివాఁడే అజ్ఞాని. అజ్ఞానముచే మానవుఁడు స్వర్గము మున్నగు నింద్రియసుఖములనే కాంక్షించును. ఇహలోకమునఁ గావించిన పుణ్యపాపములను సంపూర్ణముగా స్వీకరించి, స్వర్గనరకములను జేరును. స్వర్గనరకఫలము ననుభవించిన పిమ్మట గర్మశేషముచేఁ బునర్జన్మ పొందుటకై భూలోక మార్గము చేరును.

శం. భా. :- అంతేకాదు. ఆత్మవిదుఁడైన పండితుఁడు జ్ఞానముచేతనే పరమాత్మను బొందుచున్నాఁడు. ఈశ్వరార్థము కర్మల ననుష్ఠించనివాఁడు ఆతనిలోఁగల కల్మషము నశించని కారణమున జ్ఞాని కానేరఁడు. అపుఁ డాతఁడు వర్గఫలములను

అనగా యింద్రియఫలములైన స్వర్గాదులను గాంక్షించువాఁడై ఇహలోకమునఁ జేసిన యజ్ఞాదికముల ఫలము సంపూర్ణముగా స్వీకరించి, మరణానంతరము యజ్ఞాదుల ఫలములైన స్వర్గాదుల ననుభవించుచున్నాఁడు. పిమ్మటఁ బుణ్యఫలము క్షీణింపగాఁ గర్మశేషముచే సంసారమార్గమును బొందుచున్నాడు. అనఁగా మఱల భూలోకమున జన్మించుచున్నాఁడు.

"తస్మిన్యావత్సంపాత ముషిత్వా థైవత మేఽవాధ్వానం పున ర్నివర్తన్తే" అను శ్రుతిలోఁ బుణ్యఫలానుభవమునకై స్వర్గమునఁ గొంతకాలముండి, మఱల యీమార్గమున భూలోకమునకే మఱలుచున్నారని చెప్పఁబడెను.

నీ. భా. :-

శ్లో॥ ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః।
కి మిచ్ఛన్ కస్యకామాయ శరీర మనుసంజ్వరేత్ ॥

ఈ కనఁబడుచున్న ప్రకృతియంతయు "నేను" అను పదముచేఁ జెప్పఁబడు పరబ్రహ్మమే, అనెడి ఆత్మజ్ఞానము కలవాఁడు ఏ కోరికలు లేక, భౌతికశరీరమునకై బాధపడఁడని తెలియుచున్నది. పై శాస్త్రవచనమును బరిశీలించినచో ఆత్మలాభము కంటె ఉత్కృష్టమైన లాభము లేదని తెలియుచున్నది. అట్టి బరమాత్మ జ్ఞానములేక ఆత్మ కాని, దేహాదులే ఆత్మయని, పురుషార్థమను తలంపుతో వేదపఠనాదులను గావించువాఁడు వర్గఫలము, ననఁగా ఇంద్రియసుఖమును గాంక్షించువాఁడై,

ఇహలోకమునఁ గావించిన పుణ్యాపాపములను స్వీకరించి, స్వర్గ నరకఫలములైన సుఖదుఃఖములను అనుభవించుచున్నాఁడు. తత్ఫలానుభవమైన పిమ్మట భూలోకమార్గమునే పొందుచున్నాఁడు.

"తం విద్యా కర్మణీ సమన్వారభేతే పూర్వ ప్రజ్ఞాచ" అను శ్రుతివలనఁ "బూర్వజ్ఞానము, విద్య, కర్మ" అను నవి మూఁడును స్వర్గనరక భూలోకములను జేరు జీవుని అనుసరించియే యుండును. అని తెలియుచున్నది.

"వృంక్తే ఆత్మాన మితి వర్గః" "వర్గః=ఇంద్రియగణః" అనగాఁ దమతమ విషయోపసంహారము ద్వారా ఆత్మను ఆవరించి యుండునదియే వర్గము. ఇదియే ఇంద్రియగణమని "వృజ్" ధాతువునుండి పుట్టిన వర్గపదమునకు అర్థము.

"తస్మా ల్లోకా త్పునరై త్యస్మై లోకాయకర్మణః" అను శ్రుతివలన, జీవి, వాని కర్మల ననుసరించి, స్వర్గఫలానుభవమైన తోడనే ఇహలోకమును జేరుచున్నాఁడని తెలియుచున్నది.

8, 9 వివరణము :- మోక్షప్రాప్తికి జ్ఞానము నూటిగా గారణము. తపోయజ్ఞములు కర్మకాండకుఁ జెందినవి. కావున మోక్షప్రాప్తికిఁ బరంపర సాధనములు. అవియును నిష్కామముగా జేసినపుడే అంతఃకరణ శుద్ధిని జేకూర్చి, జ్ఞాన మొదవించి తద్ద్వారా ముక్తిని జేకూర్చును. విశ్వామిత్రుఁడు తప మొనరించినను సకామముగా నొనరించుటచే వేగముగాఁ దరించలేక పోయెను. దశరథుఁడు, ద్రుపదుఁడు మున్నగువారు,

పుత్రకామేష్టి మున్నగు యాగములు గావించినను సకామముగా జేయుటచే వేగముగాఁ దరించి ముక్తులుకాలేక పోయిరి. జనక మహారాజు యజ్ఞయాగాది కర్మ లాచరించినను, రాజ్యపాలన మొనర్చినను నిష్కాముఁడై బ్రహ్మార్పణబుద్ధితోఁ జేయుట చేతనే శీఘ్రముగా ముక్తి నొందెను "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః" అను గీతానూక్తియుఁ బై విషయమునే వ్యక్తము సేయుచున్నది. శంకరులవారు, రమణమహర్షి రామకృష్ణపరమహంస నిష్కామకర్ములు, కావుననే తరించి శాశ్వతప్రతిష్ఠ నందిరి. తపస్సు సాత్త్వికము, రాజసము, తామసమని త్రివిధము. వానిలో ఫలాకాంక్ష లేక, చేసినతపస్సే సాత్త్వికము. అదియే యుత్తమము. "అఫలాకాంక్షిభిర్యుక్తైః స్సాత్త్వికం పరిచక్షతే" అను గీతానూక్తి పై విషయమునే వ్యక్తము చేయును. సత్కార మానపూజార్థము, దంభముతోఁ జేయు తపస్సు రాజసము. అది ధ్రువమైనది కాదు. ఆత్మపీడా నివృత్తికిఁ జేయు తపస్సు తామసము. రాజస, తామస తపస్సులు సంసార బంధహేతువులే కాని ముక్తిదాయకములు కావు. పై తపస్సులు శారీరకము, వాఙ్మయము, మానసము అని మఱల ముత్త్రివిధములు. ఫలమపేక్షింపక, దేవతలను ద్విజులను, గురువులను, ప్రాజ్ఞులను బూజించుట, శౌచము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అహింస అనువానిని అవలంబించుటయు, సాత్త్వికమైన శారీర తపస్సు. ఈ తపస్సును సకలజాతులవారును జేయవచ్చును. భీష్ముఁడు బ్రహ్మచర్య తపంబొనర్చి ముక్తుఁడాయెను. ధర్మవ్యాధుఁడు గురువులైన తల్లిదండ్రులఁ

సేవించి తరించెను. ఏకలవ్యుఁడు గురుపూజా రూపతపస్సు గావించెను. మహాత్ముఁడు (గాంధీ) అహింసారూప తపస్సాచరించి శాశ్వతుఁడాయెను.

శ్లో॥ దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం ।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

అను గీతానూక్తిచేఁ బై విషయము తేటతెల్లమగును స్వాధ్యాయాభ్యాసనముఁ (వేదపఠనము) వాఙ్మయ తపస్సునకుఁ జెందినది. ఆణవాది మలినములులేని మనస్సుతో నుండుట, మౌనవ్రత మాచరించుట, ఆత్మనిగ్రహము అను నవి మానస తపస్సునకుఁ జెందినవి. ఇవన్నియును మోక్షదాయకములే.

"యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతి యజ్ఞమును విష్ణువుగాఁ బేర్కొనెను. అనగా విష్ణుపూజ యజ్ఞమన్నమాట.

తపస్సువలెనే యజ్ఞముకూడ సాత్వికము, రాజసము, తామస మని ముత్త్రివిధము. వానిలో సాత్వికయజ్ఞమే మోక్షసాధకము. ఫలాపేక్ష లేక యష్టవ్యమని తలంచి యథాశాస్త్రముగాఁ జేయు యజ్ఞము సాత్వికము.

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్వికః ॥

అను గీతానూక్తిచేఁ దెలియుచున్నది.

ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము,

స్వాధ్యాయము, జ్ఞానయజ్ఞము అని యజ్ఞము లెన్నో విధములఁ గలవు. అనువిషయము.

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే ।
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః ॥

అను గీతానూక్తిచేఁ దెలియుచున్నది. వీనిలో జ్ఞాన యజ్ఞము నూటికిగా ముక్తి సాధనము. మిఁగిలినవి పరంపరయా ముక్తి సాధనములు. ప్రతిమానవుఁడు వీనిని జేయుటయు, జేయించుటయు మిక్కిలి యవసరము. అవి చేయకుండుటచేతనే మనకు స్వాతంత్ర్యము వచ్చి 25 సం.లు దాటినను మన మాతృదేశము కరువుకాటములకు దూరము కాకున్నది. ఈనాఁడు కొందఱు పుణ్యాత్ములు చేయు దానధర్మాదులు ద్రవ్యయజ్ఞకోటిలోఁ జేరును. అందుచే వారు తప్పక తరింతురు. వారి నాధర్మము తప్పక రక్షించును. "ధర్మో రక్షతి ధార్మికమ్" అను నార్యోక్తి పై విషయమునే చాటుచున్నది. "యద్దదాతి యదశ్నాతి తదేవ ధనినాం ధనమ్" తా ననుభవించినది, ఇతరులకు ఇచ్చినదియే ధనవంతులకుఁ గల ధనము. అది ధర్మ మార్గమునకుఁ జెందినది. ధర్మకర్మ, విద్య, జ్ఞానము అను మూఁడే మరణించినను జీవులను వెంబడించి రక్షించునని వేద మంత్రములవలనఁ దెలియుచున్నది. కావునఁ బ్రతి మానవుఁడును మోక్షదాయకములైన తపో, యజ్ఞములను ఆచరించుచు, జ్ఞానము సంపాదించుకొనవలెనని పై రెండు శ్లోకములు చాటి చెప్పుచున్నవి.

—: తపోభేదములు :—

శ్లో॥ అస్మిన్ లోకే తప స్తప్తం ఫల మన్యత్ర భుజ్యతే ।
బ్రాహ్మణానా మిమే లోకా ధాన్యే తపసి తిష్ఠతామ్॥ ౧౦

తా॥ ఈలోకమునఁ గావించిన తపస్సుయొక్క ఫలము పరలోకమున అనుభవించుట పండితపామరుల కందఱకును సమానమే. బ్రహ్మజ్ఞానులు మాత్ర మీలోకమునఁ గావించిన తపస్సుయొక్క ఫలమును ఈలోకమునందే అనుభవింతురు. జ్ఞానులు తపస్సును "దప్పక చేయఁదగినదిగాఁ దలంచి" చేయుదురు.

శం. భా. :- "య దేవ విద్యయా కరోతి శ్రద్ధయో పనిషదా, త దేవ వీర్యవ త్తరం భవతి" అని శ్రుతిలోఁ దపస్సు, వీర్యవ త్తరము, అనగా సఫల మగుటకు విద్య, శ్రద్ధ, బ్రహ్మ సామీప్యస్థితి ముఖ్యకారణములని వివరింపఁ బడెను. పై కారణ ములు విషయవాసనా వాసితులైన అజ్ఞానుల కుండవు. అందుచే వారి తపస్సు ఇహలోకమున సమృద్ధము కాదు. అజ్ఞానులు మంద సంవేగులు. జ్ఞానులు తీవ్ర సంవేగులు కాన జ్ఞానుల తపస్సు ప్రత్యక్ష ఫలమొసఁగును.

సీ. భా. :- అయ్యా! రాజస త్తమా!

"స్వాధ్యాయ ప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః ।
తద్ధి తప స్తద్ధి తపః ।"

అను మంత్రమును బరిశీలించినచో మౌద్గల్య మహర్షి వేదాధ్యయన ప్రవచనములనే తపస్సుగాఁ బేర్కొని అవియే

మోక్షహేతువులని చెప్పెనుగదా! తమరు జ్ఞానమే మోక్ష హేతువుకాని, వేదపఠనాదులు నూటిగా మోక్షహేతువులు కావనుచున్నారే. ఎట్లు? అని శంకింపకుము. విద్వాంసుల తపస్సునకు, విద్వాంసులు కానివారి తపస్సునకును భేదము కలదు. అని తెలిసిన సందేహ ముండదు. వినుము.

బ్రహ్మజ్ఞానములేని సామాన్యు లెల్లరు ఈ లోకమునఁ గావించిన తపఃఫలమును బరలోకమున అనుభవింతురు. బ్రహ్మ జ్ఞానులైన విద్వాంసులు మాత్రము ఈ లోకమునఁ దప మొన రించి, ఈ లోకముననే ఆ తపఃఫలము ననుభవించుచున్నారు. జ్ఞానులు తపస్సును "ధాత్ర్యము" అనగా అవశ్యకర్తవ్య మని భావించి, ఆచరించి, తత్ఫలము సమృద్ధమగుటచే ఈ లోకముననే అనుభవించి సిద్ధు లగుదురు. అందులకు "వారిలోఁగల శమము, దమము, శౌచము" మున్నగునవియే కారణములు. విద్వాంసులు కానివారికి శమదమాదు లుండవు. అందుచే వారి తపస్సు ఇహలోకమున సమృద్ధము కాదు.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ కథం సమృద్ధ మసమృద్ధం తపో భవతి కేవలం ।
సనత్సుజాత తద్బ్రూహి యథా విద్యా మతద్వయమ్ ॥

తా॥ శం. భా. :- మునిసత్తమా! తపస్సు సమృద్ధము, అసమృద్ధము అని రెండువిధములుగా నున్నట్లు చెప్పుచున్నారే! ఆ రెండువిధముల నెఱిగింపుడు. అని యడుగగా సనత్సుజాతుఁ డిట్లు చెప్పెను.

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ నిష్కల్మషం తపస్త్వేతత్ కేవలం పరిచక్షతే ।
ఏతత్సమృద్ధ మప్యృద్ధం తపోభవతి కేవలమ్ । ౧౨

తా॥ నిష్కల్మషమైన తపస్సే కేవలము మోక్షసాధన మని పెద్దలు చెప్పిరి. అదియే సమృద్ధము, ఋద్ధ మని మఱల రెండువిధములుగా నున్నది.

శం. భా. :-

శ్లో॥ గుణసామ్యే స్థితం తత్త్వం కేవలం త్వితి కథ్యతే ।
కేవలా దేత దుద్భూతం జగ త్సదసదాత్మకమ్ ॥

ఆహాశనుఁడు చెప్పిన ఈ సూక్తిని బరిశీలించినచో సత్త్వరజస్తమో గుణములు సమముగాఁ గల్గిన తత్త్వమే ప్రధానమైన దనియు, దాని నుండియే "సత్, అసత్" అను రూపములతో నుండిన జగత్తు ఉద్భవిల్లినదనియు, దెలియు చున్నది. అందుచే మహానుభావులు నిష్కల్మషతపస్సే తత్త్వము. సకల ప్రపంచమునకును నిమిత్తము. అదియే, "సమృద్ధము, ఋద్ధము" అని మఱిరెండు విధములుగాఁ గలదు. పరిశీలింపగా నిష్కామముగా, శ్రద్ధాసక్తులతోఁ గావించు తపమే కేవలము మోక్షసాధన మని చెప్పఁబడెను.

నీ. భా. :- అట్టి తపమే శ్రద్ధాసక్తులతోఁ గూడినను సకామమైనచో సమృద్ధమనియు, దంభముతోఁ గావింపఁ బడినచో ఋద్ధమనియు, నిష్కామతపస్సు కేవలమనియు ముప్విధముల వ్యవహరింపఁ బడుచున్నట్లు తెలియుచున్నది.

“య దేవ విద్యయా కరోతి, శ్రద్ధ యోపనిషదా, త దేవ వీర్యవ త్తరం భవతి” అను శ్రుతియుఁ బై విషయమునే బలపఱచుచున్నది. ఈ శ్రుతి 10 వ శ్లోకభాష్యమున వివరింపఁ బడినది.

శ్లో॥ తపోమూల మిదం సర్వం యన్మాం పృచ్ఛసి క్షత్రియ ।
తపసా వేదవిద్వాంసః పరం త్వ మృత మాప్నుయుః” ॥

తా॥ శం. భా. :- క్షత్రియుఁడా! నీ వడుగుచున్న తపస్సును గూర్చి చెప్పుచున్నాను వినుము. లోకమున స్వర్గాదులే కదా? భోగ్యవస్తువులు. వాని నన్నిటిని బొందుటకు ఈ తపస్సే మూలకారణము. కాన వేదవిద్వాంసులు మాత్రము నిష్కల్మషమైన తపం బొనర్చి, ఉత్కృష్టమైన అమృతమును అనగా మోక్షమును బొందుదురు. అనగా విని, ధృతరాష్ట్రుఁ డిట్లు ప్రశ్నించెను.

—: తపస్సునకుఁ గల కల్మషము :—

శ్లో॥ కల్మషం తపసో బ్రూహి శ్రుతం నిష్కల్మషం తపః ।
సనత్సుజాత ! యే నేదం విద్యాం గుహ్యాం సనా
తనమ్. ౧౮

శం.భా. తా॥ :-అయ్యా ! నిష్కల్మష తపస్సుచేతనే రహస్యమును, సనాతనము నగు బ్రహ్మపదార్థము తెలిసికొన వీలు గలదని వింటిని. నిష్కల్మషమగు తపస్సునుగూర్చి వింటిని. నిష్కల్మష మనుటచేఁ దపస్సునకుఁ గల్మష మొకటి యున్నట్లు

తెలియుచున్నది. తపస్సునకుఁ గల కల్మష మేమో ఎఱిగింపుఁడు. అనగా సనత్సుజాతుఁ డిట్లు చెప్పెను.

శ్లో॥ క్రోధాదయో ద్వాదశ యస్య దోషా
స్తథా నృశంసాని దశ త్రి రాజన్ ।
ధర్మాదయో ద్వాదశై తే పిత్ర్యాణాం
శా స్త్రే గుణా యే విదితా ద్విజానామ్ ॥ ౧౫

తా॥ శం. భా. :- రాజా ! తపస్సునకుఁ జెందిన క్రోధాది దోషములు పంౘ్రెండు కలవు. అవి తపస్సునకుఁ జెందిన కల్మషములు. వానిలో ఏఁడు చాలక్రూరమైనవి. వంశకర్తలైన మన్వాదులు, పరమగురువులైన, సనత్కుమార కపిలాదులును ద్విజులు. వారు చెప్పిన శాస్త్రములలో దపస్సునకుఁ జెందిన గుణములును బంౘ్రెండు గలవు. ఆగుణములే ధర్మము జ్ఞానము మున్నగునవి. కొందఱి మతమునఁ దపస్సునకుఁ జెందిన దోషములు పదమూఁడు కూడఁ గలవు. ఆదోషములేవో గుణములేవో చెప్పెదను వినుము. ధర్మాది గుణయుక్తమైన తపస్సే నిష్కల్మషమైనది. అదియే మోక్షహేతువు. అని వంశకర్తలైన మనువు మున్నగువారు చెప్పిరి. వారే లోకమునకుఁ బితరులు.

శ్లో॥ క్రోధః కామో లోభ మోహౌ విధిత్సా
కృపా సూయే మాన శోకౌ స్పృహాచ ।
ఈర్ష్యా జుగుప్సా చ మనుష్యదోషా
వర్జ్యా స్సదా ద్వాదశై తే నరాణామ్ ॥ ౧౬

తా॥ "క్రోధము, కామము, లోభము, మోహము, విధిత్స, అకృప, అసూయ, మానము, శోకము, స్పృహ, ఈర్ష్య, జుగుప్స" అను పండ్రెండును దపస్సునకుఁ జెందిన కల్మషములు. ఈ దోషములు తపస్సునకే కాదు, యోగులకును యోగులుకాని సామాన్య జనులందఱకును, విడువఁ దగిన దోషములు. ఇవి మోక్షపురుషార్థమునుండి మానవులను దూరముగాఁ బడద్రోయును. అందుచే సదా మానవులు వీనిని విడనాడవలెను. బ్రహ్మజ్ఞాన మనెడి మహాగుణము కలవాఁడు తప్పక వీనిని విడువవలెను.

శం. భా. :-

శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మ కర్మ స్వభావజమ్॥

అను గీతానూక్తిని బరిశీలించినచో శమము, దమము, తపస్సు, శౌచము, క్షాంతి, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము, అను సుగుణములు బ్రాహ్మణులకు స్వభావసిద్ధములు. అందుచే వారు తమ సుగుణములను బాడుచేయు క్రోధాదులను బండ్రెండింటెని, విడకున్నచో దుర్గుణులై నరకపతితులగుదురు.

శ్లో॥ మహాన్ బ్రహ్మేతి చ ప్రోక్తో మహత్త్వా న్మహాతా మపి।
త త్ప్రాప్తి గుణసంయుక్తో మహాగుణ ఇతి స్మృతః॥

అను నామమహోదధిసూక్తిని బరిశీలించినచో మహాత్తులలో మహత్త్వము కలదగుటచే బ్రహ్మపదార్థమునకు

"మహాత్మ" అను నామము కలదనియు, దానిని బొందఁదగు గుణములు కలవాఁడే మహాగుణుఁ డనియుఁ జెప్పఁబడినట్లు తెలియుచున్నది. అందుచే బ్రహ్మజ్ఞానియైన మహాగుణుఁడు షై దోషములను విడిచి తీరవలెను.

క్రోధాదులను గూర్చి శంకరాచార్యులవారు మున్నగు పెద్దలు చెప్పిన విషయములను ఇంచుకంత పరిశీలించెదము.

ఈ క్రింద వివరింపఁబోవు దోషములకు, గుణములకును, ఉదాహరణములుగాఁ గొన్ని కథలను యథాశక్తి వర్చి కూర్చితిని, గమనింతురుగాక.

1. క్రోధము :- కోరికలు తీరనపుడు మానవహృదయములో జనించు దుర్గుణమే క్రోధము. దీని ప్రభావముచేతనే మనుష్యులు ఇతరులను హింసించెదరు. గాయపఱచెదరు. కౌరవులు పదుగురు కలిసి అభిమన్యుని వధించుటకు ఈ క్రోధమే కారణము. బలహీనులు చేతకాక దుఃఖించెదరు. క్రోధముచేఁ గొందఱు మానవుల దేహము చెమటపట్టును. శరీరము వడంకును. ఈ క్రోధము అంతఃకరణము ను అనగా మనో, బుద్ధి చిత్తాహంకారములను గదల్చును. దీనిరూపాన్తరమే మనస్తాపము. ఇది పరులను సంహరింపఁ బ్రోత్సాహ పఱచును. దుర్యోధనుఁడు రాజసూయయాగ సందర్భమున పాండవుల రత్నాల భవనముగాంచి, తనకట్టిది లేదనియు, ధర్మరాజునకువలె రాజులు తనకు వశ్యులు కాలేదని చింతించి, మనస్తాపము చెందెను. అందుచేఁ బాండవుల సంపద నపహరించుటకును వారిని సంహరించుటకును బన్నాగములు పన్నెను.

2. కామము :- కాంతాకనకాదు లందుఁ గల్గు కోరికయే కామము. దీని రూపాంతరమే తృష్ణ. ఇదియే దురాశగాఁ బరిగణింపఁబడును. ఈ దురాశచేతనే ధనగుప్తుఁడు నందిగుప్తుని ధన మపహరించి, న్యాయాధికారుల విచారణలో బట్టువడెను. శిక్షింపఁబడెను.

జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకుఁ జెందిన కోరికల మొత్తమే కామము. ఈకామమేకదా, శకుంతలా దుష్యన్తుల వివాహమునకుఁ గారణమాయెను.

3 లోభము :- పరద్రవ్యేచ్ఛనే లోభ మందురు. ఆర్జించిన ద్రవ్యమును బుణ్యకార్యములందు ఖర్చుచేయుటకు వెనుదీయుటయు లోభమే. ధనవ్యయమునకు భయపడుటయును దీనిప్రభావమే. ఈ లోభముచేతనే చిత్రగ్రీవుఁడును పావురముల రాజు వలలోఁ జిక్కుకొనెను. దేవశర్మ యను సన్న్యాసి ధనము కూడఁబెట్టి బొంతలో దాచుటకును, ఆ దాచిన ధనమును శిష్యుఁడైన ఆషాఢభూతి గొనిపోవుటకును ఈలోభమే కారణము. ఉదంకుఁడు గురుపత్నికొసఁగుటకై తెచ్చుచున్న అదితికుండలములను సర్పరాజైన తక్షకుఁడు అపహరించుటకు ఈలోభమే కారణము.

4 మోహము :- కార్యాకార్య వివేకము లేకుండుటయే మోహ మనఁబడును. ఆత్మకాని దేహాదులను ఆత్మగా భావించుటయు మోహమే. ఇదియే మిథ్యాజ్ఞానము. ఇట్టి మోహముచే భ్రష్టులైన వారిలో ధృతరాష్ట్రుఁ డొకఁడు.

5. వివిత్స (లేక) విధిత్స :- శాస్త్రచోదిత విషయములను విషయరసములను దెలిసికొనఁ గోరుటయే వివిత్స. "విద్ల లాభే" అను ధాత్వర్థము ననుసరించి చెప్పినచో ధనము పొందఁగోరుటను విధిత్సగాఁ జెప్పవలసి యున్నది. దీనిని అణఁగ ద్రొక్కఁగల ననుకొనుటయు విధిత్సయే. తృష్ణాత్మకమైన కర్మలందిచ్ఛయు విధిత్స యగును. కామ్యకర్మలను ఆరంభించుటయు విధిత్సయే. అంతేకాదు. "ధేట్ - పానే" అను ధాత్వర్థమును బరిశీలించినచో ఉత్తరోత్తరం లాభము నందుచున్నను దృప్తి లేకుండుటను గూడ విధిత్సగాఁ దెలిసికొనవలసి యున్నది. బలిచక్రవర్తి కథను ఈ విధిత్స కుదాహరణముగా గ్రహించవచ్చును.

6. అకృప :- అనగా దయావిహీనుఁడై నిష్ఠురముగా నుండుట. పుత్రాదులయెడ దయచూపుచు ఇతరులయెడఁ గఠినముగాఁ బ్రవర్తించుట, అకృప యగును. ఈ యకృపకు ఆలంబమై ధృతరాష్ట్రుఁడు ఇతరులైన పాండవులపట్లఁ గఠినముగాఁ బ్రవర్తించెను. పరుల దుఃఖమునకుఁ గలఁతచెంది, తన ధ్యానయోగమును విశ్వామిత్రునివలెఁ జెడఁగొట్టుకొనుటను అకృప యని కొందఱందురు. కృపకు రూపాంతరము కరుణ. అది జ్ఞానులకు విహితమే యైనను, బరుల దుఃఖములను బాపుటకు బ్రయత్నించుటచే విశ్వామిత్రునివంటి వాని తపంబునకు అది విఘ్నదాయక మాయెను. అందుచే దానిని అకృపగాఁ గొంద ఱందురు. అది అకర్మ యగును.

7. అసూయ :- అనగాఁ బరుల గుణములందు సైతము దోషములను బేర్కొనుట. అంతేకాదు. పరుల సుగుణములను గాంచి ఓర్వలేకుండుటయును అసూయయే యగును. దాని ప్రభావముచేతనే పరుల యభివృద్ధిగాంచి సహింపలేకుందురు. కర్ణుఁడు అర్జునునిపై అసూయ వహించుటచేతనే దుర్యోధన పక్షపాతియై నశించెను.

8. మానము :- అనగాఁ దనను దాను గొప్పవానిగాఁ దలంచుకొనుట, లేక తానే ఎల్లరకును బూజ్యుఁడ ననుకొనుట. ఇది గర్వమునకు రూపాంతరము. హిరణ్యకశిపుఁ డట్టి గర్వమునకు నిలయమగుటచేతనే మరణించెను ఇట్టి గర్వము చేతనే మానవుఁడు తనగుణములను గొప్పవిగాఁ బ్రకటించుకొనఁ బ్రయత్నించును. చిత్తసమున్నతియే మానమని కొందఱు తలంతురు.

9. శోకము :- తన యిష్టము జరుగకున్నచో విలపించుచుఁ జింతించుట శోకము. దీనిప్రభావముచేతనే గతించిన దానికై పరితపించెదరు. నింబవృక్షముపై నివసించు కొంగల జంటకథను ఇందుల కుదాహరణముగాఁ జెప్పవచ్చును.

10. స్పృహా :- అనగా నింద్రియసుఖముల ననుభవింప గోరుట. అజ్ఞానముచే నవి నిస్పృహా జనములని మానవుఁడు తెలిసికొనలేఁడు. వాలి సుగ్రీవునిభార్యను జేఁబట్టుటకు స్పృహాయే కారణము. శూర్పణఖ రామలక్ష్మణులను బతులుగాఁ గోరుటకును ఈస్పృహాయే కారణము. అందుచేతనే

అది ముక్కుచెవులను గోల్పోయి, లంకకంతకును ముప్పు తెచ్చినది.

11. ఈర్ష్య :- అనగాఁ బరుల సంపదను గొప్పతనమును గాంచి, దుర్యోధనునివలె సహింపలేకుండుట దీని ప్రభావము చేతనే దుర్యోధనుఁడు ఘోషయాత్ర గావించి, గంధర్వులకుఁ బట్టుబడెను. దీని ప్రభావముచేతనే కదా! మానవుఁడు. పరుల గుణములను గాంచి, ఓర్వలేక వారియభివృద్ధిని బాధు చేయఁ బ్రయత్నించును. పరుల కోరికలను గాంచి సహింపలేకుండుటకును ఇదియే కారణము.

1 . జుగుప్స :- అనగాఁ బరుల గుణములను, గొప్పతనమును వ్యక్తముకానీయక, కప్పిపుచ్చఁ దలంచుట. దీని ప్రభావముచేతనే మానవుఁడు పరులను నిందించుచు, భయపెట్టఁ దలంచును సురుచి తండ్రియంకమునుండి ధ్రువుని దొలగించుటకును, కద్రువ వినతను ఓడించుటకును మంథర కైకకు దుర్బోధ చేయుటకును ఈజుగుప్సయే ప్రధాన కారణము.

కావునఁ బ్రతిమానవుఁడు పై దోషములను విడనాడుటకే సదా ప్రయత్నించుట మంచిది.

శ్లో॥ ఏకైకః పర్యుపాస్తేహ మనుష్యాన్ మనుజర్షభ ।
లిప్సమానో ఽ న్తరం తేషాం మృగాణామివ లుబ్ధకః॥”

తా॥ మనుజర్షభ ! లోకమున వేటగాఁడు మృగము

లలోఁ గల లోపములను గమనించి, వెదకుచు హింసించుటకై వెంబడించును. అట్లే పైనఁ బేర్కొనిన క్రోధాదులలోఁ బ్రతియొక్కటియే మనుష్యులలోఁగల లోపములను అన్వేషించుచుఁ బొంచి చూచి పైఁబడి వారిని హింసించును. కావున మానవుఁడు వానిని సదా విడువవలెను.

శం. భా. :-

శ్లో॥ యథా పాంథస్య కాంతారే సింహవ్యాఘ్ర మృగాదయః।
ఉపద్రవకరా స్తద్వత్ క్రోధాద్యా దుర్గుణాన్నృణామ్" ॥

ఈ హైరణ్యగర్భోక్తియుఁ బై విషయమునే సమర్థించుచున్నది. ఎట్లన? సింహము వ్యాఘ్రము మున్నగు క్రూర జంతువులు దుర్గమమార్గమున నుండి దాఁటిపోవు బాటసారులను హింసించును. అట్లే క్రోధాది దుర్గుణములు మానవుల కుపద్రవములను జేకూర్చును.

—: పాపధర్మములు :—

శ్లో॥ వికత్థనః స్పృహయాళుర్మనస్వీ
బిభ్రత్కోపశ్చ పలోఽరక్షణశ్చ ।
ఏతాన్ పాపాః షణ్ణరాః పాపధర్మాన్
ప్రకుర్వతే నో ఽత్ర సంత స్సుదుర్గే ॥ ౧౮

తా॥ శ. భా. పైనఁ జెప్పిన దోషములే కాక పదమూఁడు మహాదోషములును గలవు. వానిలో ఆరు పాపధర్మములు. వానిని పాపాత్ములు విధిగాఁ గావింతురు. అవి మహా

కష్టములలో నున్నను మిక్కిలి హింసించును. అవి, సజ్జను
నైనను. దుర్జనునైనను హింసించును. అంతేకాదు అవి దుర్జ
నునకు వలె, సజ్జనునకు సైతము నరకమునందు సైతము హాని
గావించును. ఆ పాపధర్మము లాఱింటిని గావించు వారెవరన?

1. వికత్థనుఁడు. 2. స్పృహయాళువు. 3. మనస్వీ
4. కోపశీలుఁడు 5. చపలుఁడు 6. అరక్షణుఁడు. వీ రారుగు
రును బాపాత్ములు.

వారిని గూర్చి శంకరాదిభాష్యకర్తలు చెప్పిన విషయ
ములను ఇంచుకంత పరిశీలించెదము.

1. వికత్థనుఁడు :- ఈతఁడు పరుల గుణములను ఆక్షే
పించుచుఁ దనగుణములను గొప్పవిగాఁ జెప్పుకొనును. అంతే
కాదు. "ఈతఁడు పరులను దర్జించును. అనగా బెదిరించును.
శిశుపాలుఁడు జరాసంధుఁడును వికత్థనులుగాఁ బరిగణింపఁ
బడుదురు.

2. స్పృహయాళువు :- ఈతఁ డెంతో ప్రయత్నించి,
పరకాంతాదుల భోగములను అనుభవింపఁ గోరును. లుబ్ధుఁడై
యుండును. రావణుఁడు ఈ తెగకుఁ జెందినవాఁడు. స్పృహయా
ళువు అసంతుష్టుఁడై స్వప్రయోజనములకై ఇతరవస్తువులను
హేయముగాఁ జూచును. వానిలో మంచివానిని సంగ్రహింపఁ
జూచును.

3. మనస్వీ :- ఈతఁడు గొప్పగర్విష్ఠుఁడై పరులను
అవమానించుచుండును. ఇతరులవలన గల్గిన యవమాన

లేశములైనను సహింపఁడు. విశ్వామిత్రుఁడు మనస్వియై దేవ
సభలో వశిష్ఠుని ధిక్కరించెను. మనస్వి మనస్సు ధనాశతో
నిండియుండును. ఆతఁడు అహంకారియై యుండును.

4. బిభ్రత్కోపుఁడు (కోపశీలుఁడు) :- ఈతఁడకారణ
ముగా నితరులపై ఆగ్రహించును. కోపముచేఁ బరోక్షముగానోఁ
అపరోక్షముగానో, పరులకు అపకారము చేయఁదలంచును.
నిత్యము కోపముతో నిండియుండును. తక్షకుఁడు బిభ్రత్కో
పుఁడు కాన ఉద్దాలకుని మార్గమధ్యమునఁ గలవఱపఱచెను.

5. చపలుఁడు :- అనగా అస్థిరుఁడు. ఆతఁడు స్వీక
రించిన ధనమునుగూడ అనిమిత్తముగాఁ ద్యజించును.

6. అరక్షణుఁడు:- అనగా శక్తికల్గియు, స్వీకరించిన వని
తాదులను సంరక్షింపక ప్రమత్తుఁడై యుండును. కొందఱు రక్ష
ణుఁడు ఆరవ వాఁడని యందురు. ఈతఁడు ధనార్జన పరుఁడగు
టచే దానవిముఖుఁడై యుండును. తనకు వచ్చిన వసువులను
రక్షించుటయే వీనిపని. కొందఱు అరక్షణునికి మాఱుగా
రూక్షణుని బైవారిలోఁ జేర్చిరి. రూక్షణుఁ డనఁగా బరుష
ముగా మాటాడువాఁడు. పరుషముగా మాటాడుట సప్తవ్యస
నములలోనిదని,

"వెలది జూదంబు పానంబు వేట పలుకు
ప్రల్లదనంబు దండంపుఁ బరుసదనము ।
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేత
యనెడి సప్తవ్యసనముల జనకు తగుల ॥

ఈ పద్యమువలనఁ దెలియుచున్నది. పైనఁ జెప్పఁబడిన యేఁడుగురును బాపులుగా భావింపఁ బడున్నారు.

—: సప్తనృశంసులు :—

శ్లో॥ సంభోగ సంవి ద్విషమో ఽతిమానీ
దత్తానుతాపీ కృపణో ఽబలీయాన్ ।
వర్గప్రశంసీ వనితాసు ద్వేష్టా
ఏ తేపరే సప్త నృశంసవర్గాః ॥ ౧౫

తా॥ నృశంసులని యేఁడుగురు కలరు వీరును మహా దోషులలోఁ జేరినవారే. వారెవరన ? 1. సంభోగ సంవిత్తు, 2. విషమేధమానుఁడు, 3. దత్తానుతాపి; 4. కృపణుఁడు, 5. అబలీయాంసుఁడు; 6. వర్గప్రశంసి; 7. వనితాద్వేషుఁడు; అను నేడుగురును ఘాతుకవర్గములోఁ జేరినవారు. వారిలోఁ గల విశేషములను దెలిసికొందము.

శంకరాది భాష్యములు :-

1. సంభోగ సంవిత్తు :- ఇంద్రియ సుఖముల సమ్మేళన మును సంభోగ మందురు. ఎల్లప్పు డింద్రియ సుఖానుభవమునే వాంఛించు వానిని "సంభోగసంవిత్తు" అని పెద్దలు చెప్పిరి. ఇంద్రియ సుఖవాంఛచేఁ జపలచిత్తుఁడైన వానిని "సంభోగ సంవిద్విషముఁడని" నీలకంఠుఁడు వ్రాక్రుచ్చెను. నిత్యము స్వపర భేదములేక వనితాసుఖ మనుభవించుచు దన తపస్సును భగ్నము చేసికొనినవాఁడని కొందఱి మతము. విశ్వామిత్రుఁడు ఈ

పద్ధతికిఁ జెందినవాఁడు కావుననే మేనకా సంపర్కమొంది, తన తపస్సును భగ్నము చేసికొనెనని చెప్పవచ్చును.

2. విషమేధమానుఁడు :- విషమునుబోలు మహోపద్రవముచేఁ బరులను బీడించుచు, వృద్ధిచెందువాఁడు. విషము వంటి ఇంద్రియ సుఖములం దనురక్తుఁడై వృద్ధిపొందువానిని సైతము "విషమేధమానుఁ" డందురు. అక్బరు చక్రవర్తి ఈ తెగకుఁ జెందినవాఁ డనవచ్చును. ద్విషమేధమానుఁడని జ్ఞాని యగు శంకరుఁడు చెప్పెను. ఈ తెగకుఁ జెందినవాఁ డెల్లప్పుడును బ్రాహ్మణులలోఁ బ్రాహ్మణులకు ద్వేషము పుట్టించి, తాను వృద్ధిచెందుచుండును. ఆంగ్లేయులు ఈవిధముగనే భారతదేశీయ రాజులకు ద్వేషము పుట్టించి, మన దేశమున రాజ్యము స్థాపించుకొనిరి. అత్యంతము గర్వముగల అతిమానిని రెండవవానినిగా గొందఱు పేర్కొనిరి.

3. దత్తానుతాపి :- అనగాఁ దొలుత ధర్మబుద్ధితో ధనాదికము నొసఁగి, పిమ్మట అయ్యో! ఏల నిష్కారణముగా నిచ్చితినని పరితపించువాఁడు. ఈతఁడీ లోకమున లోభియనఁ బడును.

4. కృపణుఁడు :- ఈతఁడు లేశమంత ధనలాభమునకు లోభపడి సకలావమానములను సహించును. అంతేకాదు. ప్రాణావసాన సమయమందైనను ఈతఁడు ధనవ్యయమును సహింపఁడు. అందుచే వీఁడు ఇతరులకు ఇచ్చుటకుఁగాని, తాననుభవించుటకుఁగాని ఏమాత్ర మంగీకరింపఁడు.

5. అబలీయాంసుఁడు :- అనగాఁ బూర్ణముగా జ్ఞాన బలము లేనివాఁడు. కొందఱు బలీయాంసుని ఐదవవానిగాఁ బేర్కొనిరి. వీఁడు శత్రురాజులనుండి మాత్రమే కాక ప్రజలనుండియు అధికముగా బలిని అనగాఁ బన్నును బుచ్చుకొనును. అంతేకాదు. మోటైన శరీరబలముతో అందఱిని బెదిరించి, అణఁగఁ ద్రొక్కును. ఒకప్పుడు ధనబలమునే ప్రధానముగా బ్రకటించి వ్యవహరించును, "ఔరంగజేబు" అను మొగలాయీ చక్రవర్తి ఈ తెగకుఁ జెందినవాఁడు. కంసుడును ఇట్టివాఁడే.

6. వర్గ ప్రశంసి :- అనగా ఇంద్రియవర్గమునే ప్రశంసించువాఁడు. వర్గమనగా వృజినము. పరులను అవమానించుట అనగా ఇతరులకుఁ దాను గావించు అవమానమునే గొప్పగాఁ జెప్పుకొనుచుండుము. ఇతరులకు గష్టములు కావించి, తాను సుఖించును. అంతేకాదు. ధర్మార్థకామము లనెడి త్రివర్గమునే ప్రశంసించును గాని, మోక్షమును బ్రశంసింపఁడు. పరుల మనస్సు నాకర్షించుటకై పరవర్గమును బ్రశంసించువాఁడును వర్గప్రశంసియే యగును.

7. వనితాద్వేషుఁడు:- అనగా అన్యశరణ కాని భార్యను ద్వేషించువాఁడు. అంతేకాదు, ఎల్లప్పుడు వనితలలోఁ గల దోషములనే ఎంచుచు, వారిని ద్వేషించుచు, సకల కార్యములందును వనితలనే నియోగించును. తాను గావించు వనితలు తనకు లభింపకున్నచోఁ బగఁబూని, వారిని ద్వేషించును.

కావునఁ బాపధర్ములు, నృశంసులు అనఁబడు పద

ముగ్గురును, దుష్టులే. సంఘమున దూరముగా నుండదగినవారే అని తెలిసికొనవలెను.

ఈ విధముగఁ జెప్పిన పిమ్మట ద్వాదశగుణములను, వివరించి, చెప్పఁదొడఁగెను.

—: ద్వాదశగుణములు :—

శ్లో॥ ధర్మశ్చ సత్యం చ దమ స్తప శ్చ
అమాత్సర్యం హ్రీ స్తితిక్షా ఽనసూయా ।
యజ్ఞశ్చ దానం చ ధృతి శ్శ్రుతం చ
వ్రతాని వై ద్వాదశ బ్రాహ్మణస్య ॥ ౨౦

తా॥ 1. ధర్మము; 2. సత్యము; 3. దమము; 4. తపస్సు 5. అమాత్సర్యము; 6. హ్రీ; 7. తితిక్ష; 8. అనసూయ; 9. యజ్ఞము; 10. దానము; 11. ధృతి; 12. శ్రుతము; అను పండ్రెండును బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడైన బ్రాహ్మణుఁడు ఆచరించవలసిన వ్రతములు. ఇవియే పరమపురుషార్థమైన మోక్షమునకు సాధనములు. ఇవి లేనివానికి వేదార్థజ్ఞానము సరిగాఁ గలుగనేరదు.

పై గుణములనుగూర్చి పెద్దలు చెప్పిన దానిని బరిశీలింతము.

శంకరాదిభాష్యములు :–

1. ధర్మము :– వర్ణాశ్రమధర్మములుగా నిర్ణయింపఁబడిన సంధ్యావందనాదులను ఆచరించుటయే ధర్మము. దీనిని

ధర్మరాజు చక్కగాఁ బాటించెను. శంకరాచార్యులవారు ధర్మమునకు మారుగ జ్ఞానమును చేర్కొనెను. జ్ఞానమనగా బ్రహ్మతత్త్వమును దెలిసికొనుట. భీష్ముఁడు, వశిష్ఠాదులును ధర్మతత్త్వమును జక్కగాఁ దెలిసికొనిరి.

2. సత్యము :- అనగా భూతహితమున కనుకూలముగా యథార్థమును బలుకుట. పలుకులలోఁ గాయిక, వాచిక, మానసికములైన హింస లుండరాదు. కన్నులారఁ జూచిన దానికనుగుణముగాఁ బలుకుటయు సత్యమే యగును. హరిశ్చంద్రుఁడు ఈ సత్యగుణమును జక్కగా, బాటించిన ఘనుఁడు.

3. దమము :- అనగా మనోనిగ్రహము. అంతేకాదు జిహ్వ, ఉపస్థ మున్నగు వానిని నిగ్రహించుట. తపఃక్లేశమును సహించుటయును దమమే యగును. బాల్యావస్థయందే ధ్రువుఁడు దమమును బాటించి తపస్సాచరించి, శాశ్వతత్త్వమును బొందెను.

4. తపస్సు :- అనగాఁ గష్టమైన చాంద్రాయణాదులను ఆచరించుట. అంతేకాదు నివృత్తి మార్గమునకుఁ జెందు కాయక్లేశమును సహించుటయును దపస్సే యగును.

5. అమాత్సర్యము :- పరుల గుణములను గొప్పతనమును గాంచి సహింప లేకుండుటయే మాత్సర్యము. దానికి జెందిన క్రోధము లేకుండుటయే అమాత్సర్యము.

6. హ్రీ :- అకార్యముల నాచరించుటచేఁ గలుగు లజ్జయే హ్రీ అనఁబడును.

7. తితిక్ష :- సుఖదుఃఖములు, లాభనష్టములు, వృద్ధి క్షయములు మున్నగు ద్వంద్వములను సహించియుండుటయే తితిక్ష. అంతేకాదు. క్రోధము కల్గుటకుఁ దగిన కారణమున్నను క్రోధమును వీడి, అందులకుఁ జెందిన కలహాదులను త్యజించుట యును దితిక్షయే యగును. భారవికథ యిందుల కుదాహరణ ముగాఁ జెప్పఁ దగియున్నది.

8. అనసూయ :- అనగాఁ బరులదోషములను బ్రక టింపకుండుటయే కాక, పరుల గుణములందు దోషములను ఆరోపించుటయు, అసూయ యనఁబడును.

9. యజ్ఞము :- అగ్నిష్టోమము, జ్యోతిష్టోమము, నిత్యము ఆ యా దేవతల నుద్దేశించి, హోమము చేయుట, మున్నగు సత్కార్యములను ఆచరించుటయే యజ్ఞము. ఇందులకు జనక మహారాజు కథ ఉదాహరణము.

10. దానము :- బ్రాహ్మణులకు ధనాదుల నొసంగు టయే దానము.

11. ధృతి :- అనగా ఇంద్రియ నిగ్రహము. అంతే కాదు. ఆపదలు కల్గినను వ్రతాదులను విడువకుండుట, వికార హేతువులున్నను మనస్సును జలింప నీయక నిగ్రహించుటను ధృతి యందురు. త్రిపురసుందరి యగు పార్వతీదేవి, మన శ్చలన కారణముగా, దరినున్నను, మనో నిగ్రహముతోఁ దపసు గావించిన మహాదేవుఁడే దీని కుదాహరణము. అంతే కాదు. ప్రారబ్ధాది కర్మల నాశమొందించు జ్ఞానము నొంది,

దుఃఖములను సహించుటయు ధృతి యగును. భార్యావియోగము, వికృతరూపము, మున్నగు దుఃఖములు వాటిల్లినను ధృతితోఁ గార్యము సాధించిన నలమహారాజే ఇందుల కుదాహరణముగా జెప్ప దగినవాఁడు.

12. శ్రుతము :- ఆధ్యాత్మిక శాస్త్ర విషయములను ఆలకించుటతోఁ బాటు. మంత్రార్థము నెఱుఁగుచు, బఠించుటను శ్రుతమందురు. గురూపదేశ పూర్వకముగా వేదశాస్త్ర విషయములను దెలిసికొనుటయు శ్రుత మనఁబడును. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములతోఁ బాటు అంతఃకరణమును సైతము అడంచుటయే శమము. ఈ శమమును బండ్రెండవ గుణముగా శంకరులవారు పేర్కొనిరి.

—: గుణఫలము :—

శ్లో॥ యస్త్వే తేభ్యః ప్రభవేత్ ద్వాదశభ్యః
సర్వా మపీమాం పృథివీం సశిష్యాత్ ।
త్రిభి ర్ద్వాభ్యాం ఏకతో వార్థితో యః
తస్య స్వమ స్తీతి సవేదితవ్యః ॥ ౨౧

తా॥ శం. భా. :-పైన జ్ఞానాది గుణములను బేర్కొనిన పిమ్మట గుణస్తుతి పూర్వకముగా వాని ఫలమును వివరింపఁ దొడగెను? ఎట్లన ?

పై పండ్రెండు గుణములు కలవాఁడు ఈ మహీమండల మంతటిని శాసించుచు, 'దనపిడికిట నుంచుకొను ననుటలో

సందియము లేదు. వానిలో మూఁడో, రెండో లేక యేయొక్క గుణమైనను సరే ఎవనిలో నుండునో వాఁడు బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడై బ్రహ్మయే యగును.

నీ. భా. :- "యస్త మాత్మాన మనువిద్య విజానాతి స సర్వాం శ్చ లోకా నాప్నోతి సర్వాంశ్చ కామాన్" అను శ్రుతివలన అధ్యాత్మ విద్య నెఱిఁగిన వాఁడు, సర్వలోకములను సర్వకామములను బొందునని తెలియుచున్నది. పై గుణములలో నే యొక్క గుణమైనను గలవాఁడు దైవీవిత్తమును బొందునని తెలిసికొనవలెను. పై గుణములు కలవాఁడు బంధ హేతువైన సంసారమును దొలగించుకొని ముక్తుఁ డగును. మానవుఁడు స్వగృహమును వీడి, గురుకులమున నివసించి, పై గుణముల నలవఱచు కొనవలెను.

శ్లో॥ దమస్త్యాగో ఽప్రమాదశ్చ ఏ తే ష్వమృత మాహితం।
తాని సత్య ముఖాన్యాహుః బ్రాహ్మణా యే మనీషిణః॥ ౨౨

తా॥ నీ. భా :- ఇంద్రియ విజయమే దమము. ఈశ్వరార్పణ బుద్ధితోఁ గర్మల నాచరించుటయే త్యాగము. భగవత్తత్వాను సంధానమే అప్రమాదము. ఈ మూఁడు గుణములు కలవాఁడు తప్పక ముక్తుఁ డగును. పై గుణములకుఁ దోడు సత్యగుణము ప్రధానముగాఁ గల్గియుండవలెను. అని మనీషులైన బ్రాహ్మణులు పల్కిరి.

—: దమదోషములు :—

ఇప్పుడు పదునెనిమిది దమదోషములను మూఁడు శ్లోక

ములలో చెప్పుచున్నాడు.

శ్లో॥ దమో హ్యష్టాదశ గుణః ప్రతికూలం కృతాకృతే ।
అనృతం చాభ్యసూయా చ కామార్థౌ చ తథా స్పృహా ॥

శ్లో॥ క్రోధ శ్శోక స్తథా తృష్ణా లోభః పైశున్య మేవచ ।
మత్సరశ్చ విహింసాచ పరితాప స్తథా రతిః ॥ ౨౪

శ్లో॥ అపస్మార శ్చాతి వాద స్తథా సంభావనాత్మని ।
ఏతై ర్విముక్తో దోషై ర్యః సదాంత స్సద్భి రుచ్యతే ॥

తా॥ మున్ముందు చెప్పఁబోవు దోషములు పదునెని మిది. అవి మనోనిగ్రహ రూపమును ఇంద్రియ విజయరూపము నగు దమమునకుఁ బ్రతికూలములు. వానిని వీడినచో దమ మను గుణము పదునెనిమిది రెట్లు బలము కలదగును. అందుకే యష్టాదశదోషములను దమమును జెడఁగొట్టుటకై దాని నాశ్ర యించి యుండును. పై దోషములలోనే యొకటి చేయఁబడి నను అది దమమునకుఁ బ్రతికూలమే యగును. పైదోషము లలో మొదటిది ప్రతికూల మనునది దానిని బరిశీలింతము.

శంకరాది భాష్యములు :-

1. ప్రతికూలము :- వేదోక్తమైన కర్మ చేయునపుడు ఈ ప్రతికూలదోషము, అశ్రద్ధ, ఆలస్యము, మున్నగు రూప మున నుండును. వైదికకర్మలు చేయుటకై ఉపవాసవ్రతము చేయునపుడే ప్రతికూల దోషము ఆకలి, జిహ్వా చాపల్యము మున్నగు రూపమున నుండును. దమమును ఈ ప్రతికూలాది

దోషములు అంటిపెట్టుకొని యుండును. ఇవన్నియు దొలగ వలసినవే. అందు ప్రతికూలము అన్నిటికిని బానకములోం బుడకవలె అడ్డముగా నిల్చును. కావున ఈ దోషమునుఁదొలుత దొలగించి తీరవలెను. పరిశీలింపగా దమమునకుఁ గృతమనగా సుకృతము, అకృతమనగా దుష్కృతము, అను రెండును ప్రతికూలములే, అనగా విరోధులే. అని తెలిసికొనవలసియున్నది. ప్రాతికూల్య మనునది దుఃఖహేతువు. ఎట్లన ? ఉదాహరణముగాఁ దపమును గైకొందము. తపస్సు చేయునపుడు కల్గు దుఃఖము ప్రత్యక్షసిద్ధము. తపస్సు చేయకున్నచో, అయ్యో ! చేయలేక పోయితినే ! యని యదియును దుఃఖ జనకమే యగును. ప్రతికూల స్వరూప మిట్టిదని యెఱుఁగ వలయును

2. అనృతము :- అనగా యథార్థము కాని దానిని వచించుట.

3. అభ్యసూయ :- అనగా అసూయ. దీని ప్రభావము చేతనే పరులదోషములను బ్రకటించుట, పరులగుణములను సైతము దోషములుగాఁ జూపుట సంభవించును.

4. కామము :- అనగా స్త్రీభోగాదులను గోరుట.

5. అర్థము :- అనగా ధనార్జనకై గావించు మహా ప్రయత్నము.

6. స్పృహా :- అనగా ధనాద్యభిలాష, తన్మూలక సుఖాభిలాష.

7. క్రోధము :- అనగాఁ గోరికలు తీరనపుడు ఇతరులపై గల్గు నాగ్రహము

8. శోకము :- సుఖాభావముచేఁ గల్గు దుఃఖము.

9. తృష్ణ :- అనగా నైహిక జీవనముపై గల యాశ. అంతేకాదు. సుఖ సంతానములపైఁ గల యభిలాషయు, తృష్ణయే. అందుచే అధికముగా విషయేచ్ఛ గల్గును.

10. లోభము :- అనగా ధనాభిలాష.

11. పైశున్యము :- అనగా బరుల దోషములను సూచించుట (లేక) వెల్లడి చేయుటతోఁ బాటు పరులను దూషించుటయుఁ బైశున్యమే యగును.

12. మత్సరము :- అనగా బరుల యభివృద్ధిని గాంచి, సహింపకుండుట. ఈ సందర్భమున "తమస్సును" అనగా అజ్ఞానమును గూడ ఒకదోషముగాఁ జేర్కొనిరి.

13. హింస :- అనగా విశేషముగా హింసించుట.

14. పరితాపము :- వ్యర్థముగాఁ గావించు కష్టచింతనము. అందుచే అధికముగా దుఃఖించుట. దీనికి గుణియైన వారు అల్పదుఃఖమునకు సైతము అతిగాఁ జింతించెదరు.

15. అరతి :- అనగా యథాలాభముగా సంతుష్టి పొందకుండుట. అంతేకాదు. సత్కార్యము లందు అభిలాష లేకుండుటయు అరతియే యగును.

16. అపస్మారము :- అనగా కర్తవ్యమును విస్మరించుట.

17. అతివాదము :- అనగా నిరర్థకమైన అతిప్రసంగము. దానిమూలమునఁ బరులపై ఆక్రోశించుట.

18. ఆత్మసంభావన : అనగా దనను దాను మహానుభావునిగా భావించుకొని తన గొప్ప చెప్పుకొనుట. అనగా ఆత్మశ్లాఘ. కొందఱు వీనిలోఁ గొన్నిటికి విభిన్నముగా లోకద్వేషాదులను దోషములుగాఁ జేర్కొనిరి. అవేవన ?

1. లోకద్వేషము :- అనగా లోకులకు భయము గొల్పుపనులు గావించుట.

2. అభిమానము :- అనగా అందఱికడ వినయము లేక పెడసుగాఁ బ్రవర్తించుట.

3. వివాదము :- అనగా దఱచుగా జనులతో జగడము లాడుట.

4. ప్రాణిపీడనము :- అనగాఁ దన పొట్ట పోషించుకొనుటకై ప్రాణులను హింసించుట.

5. పరివాదము :- అనగా సమక్షముననే పరులను దూషించుట.

6. అతివాదము :- అనగా నిష్ప్రయోజనమైన అధిక ప్రసంగము.

7. పరితాపము :- అనగా వ్యర్థముగాఁ గావించు దుఃఖచింతనము.

8. అక్షమ :- అనగా సుఖదుఃఖాది ద్వంద్వములను సహింప లేకుండుట.

9. అధృతి :- అనగా ఇంద్రియ వాంఛలకుఁ జెందిన చాంచల్యము.

10. అసిద్ధి :- అనగా ధర్మమును జ్ఞానమును వైరాగ్యమును బొందకుండుట.

11. పాపకృత్యము :- అనగా శాస్త్రప్రతిషిద్ధములైన పాపకర్మల నాచరించుట.

12. హింస :- అనగా శాస్త్రవిరుద్ధముగా హింసించుట. పైనఁ జేర్కొనిన దోషములు లేకుండుటయే దమమను గుణముగా సజ్జనులు చెప్పిరి.

—: షడ్విధత్యాగములు :—

శ్లో॥ మదో ఒష్టాదశ దోషస్స్యా త్త్యాగో భవతి షడ్విధః ।
విపర్యయా స్స్మృతా ఏ తే మదదోషా ఉదాహృతాః॥ ౨౬

తా॥ శం. భా. :- మదమునకుఁ గూడ పదునెనిమిది దోషములు కలవు. అస్మృతము మొదలు, హింసవరకుఁ గల పదునెనిమిది దమదోషములును వ్యతిరేకముగా నున్నచో మదనాశకరములైన దోషములుగాఁ జెప్పఁబడినవి. అవేమన ?

1. సత్యము, 2, అపైశునము, 3. అతృష్ణ, 4. అప్రాతికూల్యము, 5. తమోగుణము లేకుండుట, 6. అరతి, 7. లోకమును ద్వేషింపకుండుట, 8 అనభిమానము, 9 అవివాదము, 10. హింస, 11. అపరివాదము, 12. అనతివాదము, 13. అపరితాపము, 14. అక్షమ, 15. ధృతి, 16. సిద్ధి, 17. అపాపకృతి, 18. అహింస అనునవి. ఇవి మదమును నశింపఁ జేయును. శమమును లోపింపఁ జేయు కారణమునఁ దమదోషములనే శమదోషములుగాఁ గొందఱు చెప్పిరి

నీ. భా. :- ఇటులనే చెప్పఁబోవు షడ్విధత్యాగమునకును విపర్యయములు ఆరు గలవు. అవేవన ? 1. లక్ష్మి ప్రాప్తించినచోఁ గల్గు హర్షము, 2. అప్రియము జరిగినతోడనే కల్గు వ్యథ, 3. స్త్రీయ విషయకమైన యాచన, 4. పాత్రులకు దానము చేయకుండుట, 5. అధికారము అనగా అర్హత యున్నను ఇష్టాపూర్తములను ఆచరింపకుండుట, 6. కామమును వీడకుండుట యను ప్రమాదము. ఈ యారింటిని, పై పదునెనిమిదింటితోఁ జేర్చినచో ఇరువదినాల్గు అగును. ఇవియును మదదోషములే.

శ్లో॥ శ్రేయాంస్తు షడ్విధ స్త్యాగః తృతీయో దుష్కరో భవేత్।
తేన దుఃఖం తరత్యేవ భిన్నం తస్మిన్ జితం కృతే॥ ౨౭

తా॥ షడ్విధ త్యాగము శ్రేష్ఠమైనది. వానిలో మూఁడవది దుష్కరము. దానిచే మానవుఁడు దుఃఖమును మీఱఁగలఁడు. దానిచే ద్వైతభావము తొలఁగిపోవును. దాని నాచరించినచో సర్వత్ర విజయము వాటిల్లును.

శంకరాది భాష్యములు :- త్యాగము ఆరు విధములు. అవేవన-

1. ప్రియమును బొందియు హర్షింపకుండుట మొదటిది.

2. అప్రియము కల్గినను ఎప్పుడును వ్యధ చెందకుండుట. ఇష్టులను పుత్రులను, భార్యను ఉద్దేశించియు, అయాచ్యులు కాన, వారిని మువ్వురిని ఎపుడును యాచింపకుండుట యను నది రెండవది.

3. అవాచ్యము నాడు యాచకునకును, అర్హుడైన యాచకునకును ఒసంగియు దుఃఖింప కుండుట మిక్కిలి శుభ రము. ఇది మూడవది.

4. పై మూడు విధములైన గుణములతోఁ గూడి మెలఁగుట నాల్గవది.

5. వనితాదులను వీడి నిష్కాముఁడుగా నుండుట, న్యాయహీనములను విడనాడుట, విడిచిన వస్తువులచేఁ గల్గు సుఖమును వాంఛింపకుండుట యనునది యైదవది.

6. కార్యములు నెఱవేరకున్నను, దుఃఖింపకయు, బాధ పడకయు నుండుట యారవది.

పై యారును త్యాగభేదములని విమలబోధుఁడు వివ రించెను. ఈ షడ్విధ త్యాగము చాలశ్రేష్ఠమైనది. కామత్యా గము దుష్కరము. కామముచే, ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అను దుఃఖములు కల్గును. కావున గామత్యాగ

ముచే ద్వైతభావము, (భిన్నత్వమనునది) తొలఁగును.

శ్రు॥ "ద్వితీయాద్వై భయం భవతి । యత్రాన్య త్పశ్య
త్యన్య చ్ఛృణోతి తదల్పం । అథ యదల్పం తద్దుఃఖమ్ ॥"

అను శ్రుతులను బరిశీలించినచో, ద్వైతభావమున్న పుడే, బ్రహ్మకంటె భిన్నమైన దానిని జూచుట, వినుట, అను నల్పవిషయము జరుగుచున్నది. దానివలననే భయము దుఃఖము కల్గుచున్నవి, అని తెలియుచున్నది. అట్టి ద్వైతభావమే కామ బీజము. అది తొలగినచో దుఃఖనివృత్తి రూపమైన మోక్షము లభించును.

శ్రు॥ "యదా సర్వే ప్రముచ్యన్తే కామాయే ఽస్య హృది
స్థితాః ।
అథ మర్త్యో ఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥"

పై విషయమును బలపఱచు యీ మంత్రమును పరిశీలించితిమేని, హృదయ మందలి కామములు తొలఁగినచో మర్త్యుఁ డమృతుఁడై బ్రహ్మవస్తువును బొందునని తెలియు చున్నది.

వివరణము :- పరికింపగాఁ బరమాత్మ, సత్త్వ, రజ స్తమోగుణాతీతుఁడు, సృష్టివాంఛ కల్గిన తోడనే సగుణుఁ డాయెను. వాని సత్త్వగుణము సుఖకరము రజోగుణము కర్మ కారి. తమోగుణము జ్ఞానమును నశింపఁజేసి ప్రమాదమును జేకూర్చును. ముఖ్యముగా గామక్రోధములు రజోగుణ సము

ద్భవములు. కామమే సర్వానర్థ కరము. అది తొలగినచో జీవుఁడు సుఖియై ముక్తుఁడగును.

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత॥

శ్లో॥ కామ ఏషః క్రోధ ఏష రజోగుణ సముద్భవః।
మహాశనో మహాపాప్మా ... ... ...॥

అను గీతాసూక్తులు పై విషయమునే ప్రకటించు చున్నది. నిర్వికార నిరంజనుఁడై ఏకాకియైన పరమాత్మ పుష్కరపర్ణమున నుండఁగాఁ ఆతని మనసున సృష్టివాంఛ కల్గె నట. తోడనే వానియెదుటఁ గామము నిలచెనట. అపుడు పరమాత్మ మనసునుండి రేతస్సు స్రవింపగా, శరీరము కంపించగా, వాతరశనాదు లుద్భవిల్లిరట. ఇదియే పరమాత్మలోఁ గల్గిన ద్వైతభావము, కామబీజము.

శ్రు॥ "స ప్రజా పతి రేకః పుష్కరపర్ణే సమభవత్।
తస్యాం తర్మనసి కామ స్సవర్తత।
ఇదగ్ం సృజేయ మితి"
"కామ స్తదగ్రే సమవర్తతాధి
మనసో రేతః ప్రథమం యదాసీత్॥"
శరీర మధూనత తస్య యన్మాగ్ం సమాసీత్।
తతోఽ రుణాః కేతవో వాతరశనా ఉదతిష్ఠన్".

అనెడి అరుణమంత్రములు పై విషయమునేఁ ప్రక

టించుచున్నవి. పరమాత్మయంతటివాఁడే కామబీజమున
కాకరమై ద్వైతభావము పొంది, సగుణుఁడాయెను. సామాన్య
జీవులు కామజాలమునఁ జిక్కువడెదరనుట ఒక వింతయా?
కావునఁ బ్రతిమానవుఁడు జ్ఞాన మార్జించుకొని, కామ
దూరుఁడై, మోక్షసుఖి యగుటకుఁ బ్రయత్నించుట ముఖ్యము.

శ్లో॥ శ్రేయాంస్తు షడ్విధ స్త్యాగః శ్రియః ప్రాప్య న హృష్యతి ।
ఇష్టాపూర్తే ద్వితీయం స్యా న్నిత్య వైరాగ్య యోగతః ॥

తా॥ షడ్విధత్యాగము శ్రేష్ఠమైనది. దాని నాచరించిన
వాఁడు సంపదనొందియు, హర్షింపఁడు. వానిలో ఇష్టాపూర్తము
రెండవది. నిత్యము వైరాగ్యముకలవాఁడై దాని నాచరించుట
ఉత్తమము.

భాష్యములు : షడ్విధత్యాగములలో యోగ్యుఁడైన
యాచకునకుఁ బుత్రులను, ధనమును, ఒసఁగుట యను త్యాగ
ద్వయము మొదటిది. ఇష్టాపూర్తము రెండవది. కామ
త్యాగము మూఁడవ దని శంకరులవారు చెప్పిరి. లక్ష్మిని,
విద్యను బొందియు, హర్షింపక, గర్వింపక యుండుట, త్యాగ
ములలో మొదటిది. ఇష్టాపూర్తము రెండవదని; నీలకంఠుఁడు
చెప్పెను. ప్రియవిషయము లందలి రాగమును, అప్రియవిష
యము లచేఁ గల్గు వ్యథ యనెడి ద్వేషభావమును విడుట
ప్రథమ త్యాగమని మఱికొందఱు చెప్పిరి "శ్రౌతకర్మలలోఁ
జేయుదానము పూర్తము హోమకార్యములలో దేవతల
కొసఁగునది ఇష్టమనియుఁ, బితృదేవతల కొసఁగు పిండప్ర

దానము పూర్తమనియు శంకరులవారు చెప్పిరి. యాగహోమాదు లిష్టమనియుఁ దటాకారామాది నిర్మాణము పూర్తమనియు నీలకంఠుఁడు చెప్పెను. ఇట్టి యిష్టాపూర్తము రెండవ త్యాగము.

శ్లో॥ కామత్యాగ శ్చ రాజేంద్ర స తృతీయ ఇతి స్మృతః ।
అప్య వాచ్యం వదన్త్యేతం సతృతీయో గుణస్స్మృతః॥ ౨౯

తా॥ రాజోత్తమా! కామత్యాగము మూఁడవది. దాని నాచరించు దాతచెంతకు యాచకుఁడు వచ్చి అవాచ్యము నడిగినను దాత దుఃఖింపరాదు, అపుడే యదిసుగుణ మగును.

నీ. భా. :- నిత్యాగు విశుద్ధసత్త్వుఁడై అనిత్యము లేవో చక్కఁగా నెఱిఁగినవాఁడు, విరక్తుఁ డగును. అట్లు విరాగియై ధనాదులను బరిత్యజించుటయే కామత్యాగము. అది మూఁడవ త్యాగముగాఁ జెప్పఁబడినది. యాచకుఁడు వచ్చి, దాతకు దుఃఖముకల్గించు వస్తువుల నడిగినను దుఃఖింపక ఒసఁగుటయే నాల్గవత్యాగము.

శ్లో॥ త్యక్తై ర్ద్రవ్యై ర్యద్భవతి నోపయుక్తై శ్చ కామతః ।
నద్రవ్యై స్తద్భవతి నోపయుక్తై శ్చ కామతః ౩౦

శ్లో॥ నచ కర్మస్వసిద్ధేషు దుఃఖం తేనచ న గ్లపేత్ ।
సర్వై రేవ గుణై ర్యుక్తో ద్రవ్యవా నపి యోభవేత్॥ ౩౧

శ్లో॥ అప్రియే చ సముత్పన్నే వ్యథాం జాతు న గచ్ఛతి ।
ఇష్టాన్ పుత్రాంశ్చ దారాం శ్చ న యాచేత కదాచన॥౩౨

తా॥ నీ. భా. :- వనితాదులను వీడుటచేఁ గల్గు నిష్కా మత్వము కామపూర్వకముగా అనుభవించినను గల్గనేరదు. "నజాతు కామః కామాన ముపభోగేన శామ్యతి" అను వార్యోక్తియుఁ బై విషయమునే వివరించు చున్నది. బహుళ ద్రవ్యములు లభించినను దృప్తి నొంది, మానవుఁడు నిష్కా ముఁడు కానేరఁడు. కామపూర్వకముగా బహుద్రవ్యముల ననుభవించినను, నిష్కాముఁడు కానేరఁడు. కావున నిష్కా ముఁడై తా నాచరించు కర్మలు సఫలములు కాకున్నను, దుఃఖంపక, బాధపడక యుండువాఁడే త్యాగి యగును. సమృద్ధిగా సకల ద్రవ్యములు కీర్త్యాది సకల గుణములతోఁ గూడినవాఁడై కలవాఁడై విఱ్ఱవీగని వాఁడే త్యాగి యగును. అట్టి త్యాగి, తన కప్రియము కల్గినను ఎప్పుడును, వ్యథ నొందఁడు. పై విధమున మెలఁగుటయు నాల్గవ త్యాగ మగును. తన యిష్టులను, పుత్రులను, భార్యను జూచియు, ఏమియును, ఎప్పుడును, యాచింప కుండుట, ఐదవత్యాగము. యోగ్యుఁడైన యాచకునకు అడిగిన దొసఁగుట, శుభకరము. అది యాఱవ త్యాగము. పరికింపగా అయాచితులకు స్వేతము వారి కిష్టమైన వస్తువుల నొసఁగుట సుగుణము. కావలసినన్ని వస్తువులున్నను, అనుభవింపకుండుట, ఉపభోగ త్యాగము. వనితాదులు వచ్చి తనపైఁబడినను, (బిగరునివలెఁ) జలింప కుండుట, మహాత్యాగము. ఈ విధముగా రాగత్యాగము, ద్రవ్యత్యాగము నాచరించుట ఉత్తమపద్ధతి.

"మిథిలాయాం ప్రదగ్ధాయాం న మే కించ నదహ్యతి"

మిథిలానగర మంతయు, దగ్ధ మగుచున్నను, నన్నేదియు

దహించలేదు; అనాడి జనకమహారాజువలె సకల సంపన్నుఁడై నిష్కాముఁడై యున్నవాఁడే మహాత్యాగి.

శ్రు॥ శిష్యబుద్ధిర్మతో యథా సర్వైరపి గుణైర్యుక్తో ।
ద్రవ్యవానపి యోభవేత్ ... ... ... ॥

అను సూక్తి ననుసరించి సకలగుణములు ద్రవ్యము లున్నను, విరక్తుఁడై, గర్వహీనుఁడై, త్యాగియై శిష్యబుద్ధి గలవాఁడై యున్నవాఁడే బ్రహ్మజ్ఞానోపదేశమున కర్హుఁడు. అట్టివానిలో షడ్విధ త్యాగ ముండితీరును.

—: అప్రమాది - అష్టగుణుఁడు :—

శ్లో॥ అర్హతే యాచమానాయ ప్రదేయం తచ్ఛుభం భవేత్ ।
అప్రమాదీ భవేదేతైః సచాప్యష్ట గుణోభవేత్ ॥ 33

తా॥ అర్హుఁడైన యాచకున కొసఁగునదియే శుభకరము అగును. పై త్యాగములచే మానవుఁడు ప్రమాదహీనుఁడును అష్టగుణుఁడును అగును.

శం. భా. :- పై షడ్విధత్యాగము లాచరించువాఁడు అప్రమాదియు, అష్టగుణుఁడును అగును. అప్రమాదులకుఁ గామము నశించును.

శ్లో॥ అపధ్యాన మలోధర్మో మలో ఉర్ధస్య నిగూహనం।
అప్రమాద మలః కామో భూయస్స గుణవర్ధనః ॥

అను రాజధర్మములందలి సూక్తిని బరిశీలించితిమేని

మోక్ష పురుషార్థమునకు గాని కానీయక కప్పివైచునదే మలము. అట్టి మలము అపధ్యానమనియు, అప్రమాదమనియు రెండు విధములు. అందు ధర్మమునకు జెందిన మలము అపధ్యానము, కామమునకుఁ జెందిన మలము అప్రమాదమని తెలియుచున్నది. త్యాగబుద్ధిచేఁ బ్రమాదము తొలఁగును. ప్రమాదము నశించిన తోడనే దాని కాశ్రయమైన కామము నశించును. అపుడు మానవుఁడు తనలోని గుణములను వృద్ధిచేసికొని, మోక్షమును బొందునని తెలియుచున్నది. కావునఁ గామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యము లనెడి యారింటిని త్యజించినవాఁడే అప్రమాదియై మోక్షము నొందఁగలడని తెలియుచున్నది.

శ్లో॥ సత్యం ధ్యానం సమాధానం చోద్యం వైరాగ్య మేవచ ।
అస్తేయం బ్రహ్మచర్యం చ తథా సంగ్రహ మేవచ ॥ ३८

శ్లో॥ ఏవం దోషా మదస్యోక్తా స్తాన్ దోషాన్ పరివర్జయేత్ ।
తథా త్యాగో ఽప్రమాదశ్చ సచాప్యష్ట గుణోమతః॥ ३९

తా॥ క్రోధాదులు పండ్రెండు వికత్థనాదులు ఆరును గలిసి పదునెనిమిది దమదోషములు పూర్వము చెప్పఁబడెను. అవియే మదదోషములు. ఆ దోషములను విసర్జింపవలెను. వానిని వీడినచో అప్రమాదియగును. అట్టి ప్రమాదహీనుఁడే అష్టగుణుఁ డగును. ఆ యెనిమిది గుణము లేవన? 1. సత్యము 2. ధ్యానము, 3. సమాధానము, 4. చోద్యముఁ 5. వైరాగ్యము, 6. అస్తేయము, 7. బ్రహ్మచర్యము, 8. అసంగ్రహము. వీనిని గూర్చి పెద్దలు చెప్పిన దేమన?

## —: శంకరాది భాష్యములు :—

సత్యము :- 1. యథార్థసంభాషణమే సత్యము. సత్య భాషణ మహిమ మను, హరిశ్చంద్రచక్రవర్తి యాచరించి చూపెను.

2. ధ్యానము :- మండలస్థ పురుషుఁడగు సూర్యుఁడు మున్నగు వారియెడఁ దైలధారవలె అవిచ్ఛిన్నముగా సతతముండు నట్టి మనః ప్రవృత్తియే ధ్యానము. ధ్యానమార్గమున ఈశ్వ రునియందు ఆత్మను అనుసంధాన మొనర్చుట ముఖ్యము. ఇట్లు సూర్యుని ధ్యానించి శ్యమంతక రత్నము సంపాదించినవాఁడు సత్రాజిత్తు - శివుని ధ్యానించి, అకాలమృత్యువు తొలగించు కొని, చిరంజీవియైనవాఁడు మార్కండేయుఁడు. విష్ణువును ధ్యానించి శాశ్వతమండలము పొందినవాఁడు ధ్రువుఁడు. శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానంద మున్నగు మహానుభావు లెందఱో ధ్యానమార్గమున సిద్ధి నొందిన ఘనులుకలరు.

3. సమాధానము :- ఓంకారరూప మగు ప్రణవముతో విశ్వాదుల నుపసంహరించుకొని, సచ్చిదానంద స్వరూపుఁ డగు పరబ్రహ్మయే తానను బుద్ధితో నుండుటయే సమాధి. (సమా ధానము) ఇట్టి సమాధిస్థితిలో నుండి "రామ" అనెడి ప్రణ వము నుపాసించి తరించినఘనుఁడు వాల్మీకి మునీంద్రుఁడు. అట్టి సమాధియే, సంప్రజ్ఞాతము, అసంప్రజ్ఞాతము అని ద్వివిధ ముగాఁ గలదు. కొందఱు ధ్యానమునకు మారుగా న్యాస మను గుణమును బేర్కొనిరి. గర్హ్యములైన నీచకర్మలనుండి మనస్సును మఱల్చుటయే న్యాస మనఁబడును. విశ్వామి

త్రుఁడు నిలకడ లేని మనస్సుతోఁ దపంబొనర్చి తొలుత విఘ్నము లొందినను, దుదకు ఈ ధ్యానగుణమును బాటించి తపం బొనరించి, బ్రహ్మర్షి యాయెను.

4. చోద్యము :- "కోఽహం కస్య కుతో ఽఽవా" నే నెవఁడను? నే నెవనికిఁ జెందినవాఁడను? నే నెటనుండి వచ్చితిని? మున్నగు ప్రశ్నలద్వారా తర్కించి, "నేను" అనఁబడు ఆత్మ వస్తువును వెదకుటయే చోద్యము. కర్మలకుఁ జెందిన సంశయము కలుగఁగా, గురువుల చెంత కేగి, విచారణ చేయుటయే చోద్య మని కొందఱు చెప్పిరి. ధర్మరాజు అంపశయ్యపై నున్న భీష్ముని చెంతఁజేరి, యీచోద్యకర్మను జక్కఁగా నాచరించి, మహాజ్ఞానియై తరించెను.

5. వైరాగ్యము :- కంటికిఁ గనఁబడునట్టియు, చెవికి వినఁబడునట్టి విషయము లందు విరక్తి చెందుటయే వైరాగ్యము. ఇట్టి వైరాగ్యముచేతనే జనకమహారాజు జ్ఞానియై తరించెను.

6. అస్తేయము :- ఆత్మవస్తువునకో లేక ద్రవ్యమునకో చెందిన దొంగబుద్ధి లేకుండుటయే అస్తేయము. అనగాఁ బరుల సొత్తు నపహరించు తలంపు లేకుండుట. ఇట్టి యస్తేయ గుణము లేనికారణముననే, రావణుఁడు దుర్యోధనుఁడు మున్నగువారు వంశనాశకులై నశించిరి. తక్షకుఁడు అస్తేయ గుణహీనుఁ డగుట చేతనే సర్పయాగాగ్నికి గుఱియై, తుద కాస్తీక మునీంద్రునిచే రక్షింపఁబడెను.

7. బ్రహ్మచర్యము :-

శ్లో॥ "స్మరణం కీర్తనం కేళి రీక్షణం గుహ్య భాషణం।
సంకల్పో ఽధ్యవ సాయశ్చ క్రియా నివృత్తి రేవచ।
ఏతన్మైథున మష్టాంగం ప్రవదన్తి మనీషిణః।
విపరీతం బ్రహ్మచర్య మేతదే వాష్టలక్షణమ్ ॥

అనుసూక్తిలోఁ జెప్పినట్లు స్మరణము, కీర్తనము మున్నగు నష్టవిధ మైథున లక్షణములు లేకుండుటయే బ్రహ్మచర్యము. ఇట్టి బ్రహ్మచర్యవ్రతమును సంపూర్ణముగాఁ బాటించి తరించిన ఘనుఁడే భీష్ముఁడు. పైనఁ బేర్కొనిన యష్టవిధ మైథునములలో నే యొకటి యున్నను మానవుఁడు తప్పక చెడిపోవును. యథాశక్తిగా వీనిని వీడుటకు యత్నించుట మంచిది.

8. అసంగ్రహము :- పుత్రులు, భార్య, క్షేత్రము మున్నగు వానిని స్వీకరింప కుండుటయే అసంగ్రహము. వీనిలో నే యొక్కదానిని మోహముతో స్వీకరించినను దశరథుఁడు మున్నగు వారివలె నష్టము పొందుదురు. ఈ యెనిమిది సుగుణములును అప్రమాదికిఁ జెందినవి. ఇవి త్యాగబుద్ధి కలవానిలోఁ దప్పక యుండును.

—: ప్రమాద దోషములు :—

శ్లో॥ అష్టౌ దోషాః ప్రమాదస్య తాన్ దోషాన్
పరివర్జయేత్ ।
ఇంద్రియేభ్యశ్చ పంచభ్యో మనసశ్చైవ భారత॥
అతీతా నాగతేభ్యశ్చ ముక్త్యుపేత సుఖీభవేత్ ॥ 32

తా॥ ప్రమాదమునకుఁ గల యెనిమిది దోషములను విడువవలెను. పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, అనువానికిఁ జెందిన కోరికలను వీడవలెను. ఆఱవ యింద్రియ మగు మనస్సును, గోరికలనుండి అరికట్టవలెను. గడచిన పుత్ర శోకాది కష్టములను స్మరింపరాదు. కలుగవలసిన సంతానము కలుగలేదే యనెడి విచారము విడువవలెను. అట్లు మెలఁగిన వాఁడే మానవుఁడు సుఖియై ముక్తుఁ డగును.

నీ. భా. :- భారతా! మనసుతో జోడించిన-దో ఇంద్రి యము లారు. వీని ప్రభావముచేతనే స్వస్వవిషయములకుఁ జెందిన రాగద్వేషాది దోషములు ఆరును ప్రభవించు చున్నవి. కావున ఇవి ప్రమాదస్థానములు. నశించిన పుత్రాదులచేఁ గల్గిన దుఃఖము ఏఁడవది. ఇది అతీతము. అనఁగాఁ గడిచినది. పుత్రకామునకు, బుత్రాదులు లేకుండుటచే గల్గు దుఃఖము ఎని మిదవది. ఇది అనాగతము. పై యెనిమిది కష్టములనుండి విముక్తి నందినవాఁడే సుఖము కలవాఁడగును.

అ. మి. భా. :- గడచిన విషయములను స్మరించుటచేఁ గల్గిన దుఃఖమే అతీతము. వర్తమాన విషయములచేఁ గల్గు దోషములను జూచుటచేతను, మనోబాహ్యములను బరిహ రించుటచేతను గల్గిన దుఃఖము అనాగతము. ఈప్రమాదదోష ములచే విముక్తుఁడైనవాఁడు ఇంద్రియ యుక్తుఁడైనను సుఖియే యగును.

దు. భా. :- అంతేకాదు. ప్రమాదమునకు ఎనిమిది దోషములు కలవుకదా! వానిని దప్పక విడువవలెను. అవేవన?

శ్లో॥ కామః క్రోధ శ్చలోభ శ్చ శోక ఈర్ష్యా భయం తథా।
అసూయా చ జుగుప్సా చ అష్టాదోషాః ప్రమాద్యతః ॥

అను సూక్తిలోఁ జెప్పినట్లు కామము, క్రోధము, లోభము, శోకము, ఈర్ష్య, భయము, అసూయ, జుగుప్స యనెడి యెనిమిదియును ప్రమాదమునకుఁ జెందిన దోషములు. ఇవి మానవుని మత్తెక్కించి, పెడత్రోవలోఁ బెట్టి పీడించును.

సర్వజ్ఞ-భాష్యము :- అంతేకాదు. శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహా, అపోహా, అర్థవిజ్ఞానము, తత్త్వజ్ఞానానుచింతనము అనెడి యెనిమిదియును, బుద్ధిగుణములు. ఈ గుణములు పెడత్రోవలో నున్నచోఁ గల్గు దోషములును, ప్రమాదమునకుఁ జెందిన దోషములే. వీనిని గూడ, తప్పక విడిచినవాఁడే సుఖియగును.

శ్లో॥ సత్యాత్మా భవ రాజేంద్ర! సత్యేలోకాః ప్రతిష్ఠితాః।
తాం స్తు సత్యముఖానాహుః సత్యేహ్యమృత మాహితమ్ ॥

తా॥ నీ. భా. :- రాజేంద్రా! పై విషయములను బక్కగా నెఱిఁగి, స్వస్వరూపుఁడవై, సత్యమునందే చిత్తము గలవాఁడవై మెలఁగుము. సత్యమునందే లోకములన్నియును బ్రతిష్ఠింపఁ బడినవి. ఆత్మలాభము లన్నియును, సత్యాధీనములే. అని తెలిసికొనుము. దమము, త్యాగము, అప్రమాదము అనునవి మూఁడును, సత్యాధీనములు. సత్యప్రధానము లని పెద్దలు చెప్పిరి. సత్యము నందే అమృతము, అనగా మోక్షము,

ప్రతిష్ఠింపఁ బడినది. కావునఁ బ్రతిమానవుఁడు సత్యమార్గమునఁ బ్రవర్తిల్లుట ముఖ్యము.

—: తపోవ్రతము :—

శ్లో॥ నివృత్తే నైవ దోషేణ తపో వ్రత మిహాచరేత్ ।
ఏత ద్ధాత్రాకృతం వృత్తం సత్యమేవ సతాం వ్రతమ్ ॥ 38

తా॥ శం. భా. :- క్రోధాది దోషములను బూర్ణముగా విడనాడి, తపోవ్రతమును ఈలోకమున ఆచరింపవలెను. అప్పుడే తపస్సు సిద్ధించును. బ్రహ్మచే ఈ నిర్ణయము గావింపఁ బడెను. కావున సత్యవ్రతమును సజ్జను లాచరింపవలెను.

శ్లో॥ దోషై రేతై ర్విముక్తస్తు గుణై రేతై స్సమన్వితః ।
ఏత త్సమృద్ధ మత్యర్థం తపో భవతి కేవలమ్ ॥ 39

శ్లో॥ య న్మాం పృచ్ఛసి రాజేంద్ర ! సంక్షేపాత్ప్రబ్రవీమి తే।
ఏత త్పాపహరం పుణ్యం జన్మమృత్యు జరాపహమ్॥40

తా॥ శం. భా. :- పైనఁ బేర్కొన్న సమృద్ధము బుద్ధము అను వానిని జెప్పి, క్రోధాది దోషములు లేనివాఁడై జ్ఞానధర్మాది గుణములు కలవాఁడై చేయు తపమే ముఖ్యమైనది. సమృద్ధమైనది. అదియే అర్థమును అనగా లౌకిక ప్రయోజనములను అతిక్రమించునదై యుండును. రాజేంద్రా ! నీ వడిగిన నిష్కల్మష తపస్సును గూర్చి, సంక్షేపముగాఁ జెప్పితిని. నేఁ జెప్పిన తపోవ్రతము పాపహరము, పుణ్యము అని యెఱుఁగుము. ఇట్లు

తపోవ్రత మాచరించినవారే జన్మమును, మృత్యువును, జరను మీరఁగలరు. అని తెలిసికొనుము. అనగా విని, ధృతరాష్ట్రుఁ డిట్లు ప్రశ్నించెను.

—: వేదము అననేమి ? :—

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ ఆఖ్యాన పంచమై ర్వేదైః భూయిష్ఠం కథ్యతే జనః ।
తథా చాన్యే చతుర్వేదా స్త్రివేదా శ్చ తథాపరే ॥ ౪౧

శ్లో॥ ద్వి వేదా శ్చైకవేదా శ్చా ప్యనృచశ్చ తథాపరే ।
తేషాం తు కతరః సస్స్యా ద్యమహం వేదవై ద్విజః ॥ ౪౨

తా॥ శం. భా. :- మునీంద్రా ! "ఇతిహాస పురాణం పంచమం" అను ఛాందోగ్య మంత్రము చొప్పున ఇతిహాస పురాణము పంచమవేద మని తెలియుచున్నది. కావునఁ బంచ వేదములను బఠించిన ద్విజుఁడే శ్రేష్ఠుఁడని కొందఱు చెప్పిరి. చతుర్వేదములను బఠించినవాఁడు శ్రేష్ఠుఁ డని కొందఱు, ఋగ్యజుస్సామ వేదములను బఠించినవాఁ డుత్తముఁడని మఱి కొందఱు, ఋగ్యజుర్వేదాధ్యేత గొప్పవాఁ డని కొందఱు, ముఖ్యమైన ఋగ్వేదము పఠించినవాఁ డుత్తముఁ డని కొందఱు, ఋగాది వేదములను వీడి, ఆఖ్యానమును మాత్రము పఠించిన వాఁడుత్తముఁ డని మఱికొందఱు చెప్పుచున్నారు. వీరిలో మీరు చెప్పిన బ్రాహ్మణుఁ డెవఁడు ? అధికుఁ డెవఁడు ? చెప్పితి రేని తెలిసికొందును. చెప్పుడు.

సీ. భా. :- అంతేకాదు. బ్రహ్మ నెఱిఁగిన వాఁడు కదా బ్రాహ్మణుఁడు.

"సర్వం ఖల్విదం బ్రహ్మ; బ్రహ్మైవేదం విశ్వమ్; పురుష ఏవేదం సర్వమ్." మున్నగు మంత్రములను బరిశీలించినచో, ఈ కానవచ్చు సమస్తవిశ్వమును, బ్రహ్మస్వరూపుఁడైన పురుషుఁడే అని తెలియుచున్నది. ఆ పరబ్రహ్మయే నామాది ప్రపంచముకంటె అధికతముఁడు. భూమాఖ్యమైన పరబ్రహ్మ. అతఁడే జనుఁడు, అనగా స్థావర జంగమరూపమైన జగత్తు అని పంచవేదములచేఁ బ్రకటింపఁ బడుచున్నది. వేద మనగా బ్రహ్మ. వేదములచేఁ జెప్పఁబడు చున్నదియును బ్రహ్మయే యని తెలియుచున్నది. నాల్గువేదములు నలుఁగురు పురుషులను దెలియఁజేయు చున్నవి. వారు. 1. శరీరపురుషుఁడు 2. ఛందఃపురుషుఁడు; 3. వేదపురుషుఁడు; 4. మహాపురుషుఁడని ప్రఖ్యాతులై యున్నారు. అని కొందఱు చెప్పుచున్నారు.

గాయత్రి మున్నగు ఛందస్సులు ఋగ్యజు స్సామములకుఁ జిహ్నములు. అవి కర్మచోదనాత్మకుఁడైన బ్రాహ్మణుని గూర్చి చెప్పుచున్నవి. త్రివేదములు; 1. క్షరుఁడు; 2. అక్షరుఁడు; 3. ఉత్తముడు; అను ముగ్గురు పురుషులను దెలియఁజేయుచున్నవి. క్షర, ప్రధాన, అమృతాక్షర, హార, (పర) క్షరాత్మ అను నామములు ఒకేదేవునకుఁ జెందినవి. అమృతుఁడు, జీవుఁడు, కూటస్థుఁడు, అక్షరుఁడు, అను నామములు స్థూలపురుషునకుఁ జెందినవి. క్షరాక్షరులకంటె భిన్నుఁడు ఉత్తమపురుషుఁడు.

శ్లో॥ క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ।
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ॥

అను గీతాసూక్తిని బరిశీలించితిమేని, క్షర మనగా సర్వభూతములనియుఁ, గూటస్థుఁ డనగా అక్షరుఁ డనియు, ఉత్తమపురుషుఁ డనగాఁ బై యిరువురికంటె భిన్నుఁడైన పరమాత్మ యనియుఁ దెలియుచున్నది.

"ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మపరం చ యత్ ॥"

అను సూక్తిని బరిశీలించితిమేని, శబ్దబ్రహ్మ, పరము, అని బ్రహ్మపదార్థము రెండువిధములుఁగా నున్నట్లు తెలియుచున్నది. "వాచ్యవాచకముల కభేదము" అను న్యాయము చొప్పున సంపూర్ణము, నామరూపాత్మకము నగు ప్రపంచము శబ్దబ్రహ్మపదముచేఁ జెప్పఁబడినట్లు తెలియుచున్నది. "తత్, అతీతం" అను నామములు గల పరబ్రహ్మ పరపదముచేఁ జెప్పఁబడుచున్నది, అని కొందఱు చెప్పుచున్నారు.

## —: ఏకవేదులు - అన్యచులు :—

"ఏకధైవాను ద్రష్టవ్యం నేహ నానాస్తి కించన"

మున్నగు మంత్రములచే "బ్రహ్మపదార్థ" మొక్కటే యనియు, అదియే జ్ఞానదృష్టితోఁ జూడఁదగినఁ దనియు, బ్రహ్మవస్తువులో నానాత్వము, అనగా భిన్నత్వము లేదనియుఁ దెలియుచున్నది. కావున ఏకవేదము అనగా ఒకటే బ్రహ్మవస్తువు అని కొందఱు చెప్పుచున్నారు.

"ఋచ్యతే = స్తూయతే" అను ధాతువునుండి పుట్టిన ఋక్ శబ్దముచే స్తుతింపఁబడు నీశ్వరుఁ డొక్కఁడే యనియు, ఆతని విషయమునఁ బృథక్త్వము, భిన్నత్వము, లేదనియుఁ, గావున "అన్యృచః" అనగా ఈశ్వరుఁడైన పరమాత్మ అని బ్రహ్మాద్వైతవాదులు చెప్పుచున్నారు. ఏకవేదులకు, అన్యృచులకును గల భేద మేమన ? ఏకవేదుల మతమున, వ్యుత్థాన కాలమున అనగా జాగ్రదవస్థలో బ్రహ్మపదార్థముపట్ల ద్వైత భావము కలదు. సమాధ్యవస్థలో అట్టి ద్వైతభావము నశించును. అన్యృచులపక్షమున, అవస్థాద్వయమునందును, అనగా జాగ్రత్ సుషుప్త్యవస్థలలో సైతము ద్వైతభావము లేకుండుట తుల్యము.

అయ్యా ! నే నెఱిఁగిన ద్విజుఁడు అనగా బ్రహ్మవేత్త పై యారుపక్షములలో దేనికిఁ జెందినవాఁడో నాకు దెలియఁ జెప్పుడు. అయ్యా ! భూమాఖ్యమైన పరబ్రహ్మయే స్థావర జంగమ రూపమైన జగత్తు, అనెడి మొదటివాదము సవిశేషము కావున ద్వైత పక్షమై యున్నది. పురుష చతుష్టయమును గూర్చి చెప్పెడి రెండవవాదము, సాంఖ్యులకు, మీమాంసకులకును జెందిన నిరీశ్వరపక్షము. త్రివేదులు పాతంజలులు. వారు జీవునకును ఈశ్వరునకును, జగత్తునకును భేదము కలదని చెప్పుచున్నారు. అది మూఁడవపక్షము. ద్వివేదులను నాల్గవ పక్షమునకుఁ జెందినవారు ఔడులోమలు. వారు కార్యాత్మచేఁ గల్గు భేదభావము, కారణాత్మచేఁ గల్గు అభేదభావము అను రెండును శక్యములే అని చెప్పుచున్నారు. ఎట్లన ? ఒకే కన

కనము (బంగారము) కటక మకుటాదుల రూపమున నేర్పడు భేద భావమును కనకరూపమున నేర్పడు అభేదభావము, అను రెండును సత్యములే కదా! కటకాదులు కార్యములు, కనకము కారణము, ఈ రెండును సత్యములే యని ఔడులోముల మతము.

ఏకవేదులు ఐదవపక్షమునకుఁ జెందినవారు. వారి మతమునఁ గించి ద్బాధకు యోగ్యమైన ద్వైతభావము కలదు. అది సత్యాసత్యములచే అనిర్వచనీయము, వ్యావహారికము నై యున్నది. అది ప్రాతిభాసికము, అనగా భ్రమ ప్రమాద సిద్ధమును, సద్యోబాధ్యము నైన రజ్జూరగాదుల కంటె విలక్షణమైనది. మోక్షప్రాప్తి వరకు మాత్రము అబాధ్యము. మోక్ష ప్రాప్తి సమయమున జ్ఞానోదయముచే అట్టి ద్వైతభావము నశించును. కావునఁ గించి ద్బాధకు యోగ్య మగుచున్నది. చీఁకటిలో నున్న రజ్జువును (త్రాటిని) గాంచి సర్పమని భావింతురు దీపప్రభచే యదార్థ మెఱిగిన పిమ్మట ఆభ్రాంతి తొలఁగును. రజ్జువు సత్యమై నట్లు పరబ్రహ్మయు సత్యమే. రజ్జువు నందలి సర్పభ్రమవలె బ్రహ్మవిషయకమైన ద్వైతభావము అసత్యము. అది వ్యవహారిక మే కాని సత్యముకాదు.

అన్యులు ఆరవపక్షమునకుఁ జెందినవారు. వీరు దృష్టి సృష్టివాదులు. చీఁకటిలో రజ్జువును గాంచి, భ్రాంతిచే, సర్పము స్రక్కు, (పూలదండ) అని కల్పించి చెప్పినట్లు, ఆత్మయందు జాగ్రత్స్వప్నములను. సమముగాఁ గలవని కల్పించి చెప్పు

చున్నారు. ఇదియే ఏకవాదుల పక్షమునకు. అన్యచవాదుల పక్షమునకును గలభేదము.

పై యాఱుపక్షములలో మొదటి నాల్గుపక్షములు వ్యవహారసిద్ధములు.

"తత్రాధ్యారోపాప వాదాభ్యాం నిష్ప్రపంచః
ప్రపంచ్యతే" ॥

అను న్యాయము ననుసరించి, అధ్యారోపదృష్టిచేఁ "పారమార్థికత్వ పరములుగా" అవి ఉపన్యసింపఁబడినవి.

—: అధ్యారోపాపవాదములు అన నేమి ? :—

అధ్యారోపమనగా ?

వస్తువునందు అవస్తువు కానిదానిని ఆరోపించుట. రజ్జువునందు సర్పమును, శుక్తియందు రజతమును, అరోపించుట అధ్యారోపము. ఈ న్యాయము ననుసరించి. నిష్ప్రపంచమైన బ్రహ్మయందుఁ, బ్రపంచము, శరీరపురుషాకులు, క్షరాదులు, శబ్దబ్రహ్మమును ఆరోపింపబడినవి. చిట్టచివరిదగు అన్యచపక్షమున బ్రహ్మయందు జాగ్రత్స్వప్నావస్థలు, "అధ్యారోప న్యాయ" మందలి అపవాద దృష్టిచే, వ్యవహారాపలాపముచే బ్రహ్మతిరిక్తములు కల్పితములైనవి.

అపవాద మనగా ? బ్రహ్మయందుఁ దదతిరేకముగాఁ, బ్రతీతమైన ప్రపంచముయొక్క అభావమును నిశ్చయించి చెప్పుట, అపవాదము 1. శ్రౌతము, 2. యౌగికము, 3. ప్రత్యక్షము, అని మూడువిధములుగాఁ గలదు.

1 శ్రౌతము :- "నేహ నానా స్తి కించన" మున్నగు శ్రుతులచే బ్రహ్మాతిరిక్తాభావమును నిశ్చయించి చెప్పుట శ్రౌతాపవాదము.

2. యౌగికము :- కనకముకంటె అతిరేకముగాఁ గన కాద్యభావము నిశ్చయించి నట్లు, ప్రపంచము బ్రహ్మమాత్రా త్మకమే కాని, బ్రహ్మాతిరేకము గా లేదని చెప్పుట యౌగికము.

3. ప్రత్యక్షము:- దీపప్రభచేఁ బ్రత్యక్షముగాఁ జూపి, ఇది రజ్జువేకాని, సర్పము కాదని చెప్పినట్లు, "తత్త్వమసి" మున్నగు సూత్రములచే బ్రహ్మతిరిక్తము లేదని చెప్పుట ప్రత్యక్షాపవాదము.

—: ఆరోపాది దృష్టిత్రయము :—

ఏకవాదపక్షము మాత్రము అనిర్వచనీయమను పేరు గల వ్యామిశ్ర దృష్టిచేఁ జెప్పఁబడినది. వ్యామిశ్ర మనగా ఒక దానితో నొకటి విశేషించి, ఈషత్తుగానో, సంపూర్ణముగానో, కలిసి యుండుట. ఈవిధముగా అధ్యారోపదృష్టి, అపవాదదృష్టి వ్యామిశ్రదృష్టి అను మూఁడింటిని ఆశ్రయించి, శాస్త్రము ప్రవర్తించు చున్నది. "ఆకృతేః పరిణామాత్" అనగా ఆకా రముయొక్క మార్పువలన అను సూక్తి ననుసరించి అధ్యా రోపకాలములోఁ బరిణామ దృష్టి సూచింపఁ బడినది. కనకము వకు దానిచే నిర్మింపఁబడిన కుండలములకును, ఆకార భేదమే కాని, నిజమైన భేదము లేదు. అను విషయమును దెల్పు కనక

కుండల న్యాయముచే, బ్రహ్మయే జగదాకారముతో మార్పు చెందినదని చెప్పఁబడినది.

శ్రు॥ తదాత్మాన నగ్గంస్వయ ముకురుత ।
సత్యంచా నృతంచ సత్యమభవత్ ॥

అను శ్రుతియుఁ బై విషయమునే వ్యక్తము సేయుచున్నది. ఎట్లన ? సత్యమనగా వ్యావహారికమైన జాగ్రదవస్థ, రజ్జువు మున్నగునది.

అనృత మనగాఁ బ్రాతిభాసికమైన స్వప్నావస్థ, రజ్జూరగము మున్నగునది. ఈ యుభయాత్మకమైన సత్యమును గల త్రయాబాధ్యమైన బ్రహ్మయే అని పై శ్రుతియందలి విషయము.

"తథా ఆత్మని చైవం విచిత్రాశ్చహి" అను సూత్రమును బరిశీలించినచో, స్వప్నకాలములో ఆత్మయం దున్నవే, జాగ్రత్కాలములో మాయేంద్రజాల, మరీచికోదకాదులు ప్రసిద్ధతరములైన సృష్టులై యున్నవి. అవన్నియును విచిత్రములే ! అనుభవములో నున్న ఆ విచిత్రసృష్టులు లేవనుటకు శక్యము కాదు. జ్ఞానము కల్గిన తోడనే అవి నశించును. అందుచే నవి కలవనుటకును వీలులేదు. ఇట్లు పరబ్రహ్మయందును విచిత్రమైనట్టియు, అనిర్వచనీయమైన సృష్టి కలదు. అని తెలియుచున్నది.

శ్రు॥ "కో అద్ధా వేదక ఇహ ప్రవోచ త్కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః"

అను శ్రుతి, జగత్తు అనిర్వచనీయము, అను విషయ మును వ్యక్తము చేయుచున్నది. ఎట్లన ? ఎవఁడును ఈ జగత్ప్రాదుర్భావము తెలిసికొనలేఁడు. ఎక్కడనుండి ఈ ప్రకృతి పుట్టినది. ఈ సృష్టి ఎవనినుండి ఏర్పడినది ? అను దానిని ఎవరును స్పష్టముగాఁ జెప్పలేరు. అనునది శ్రుతియందలి విష యము. ఇది యంతయును వ్యామిశ్ర దృష్టికిఁ జెందిన విషయము.

"ఆహచ తన్మాత్రమ్" అను సూక్తిచే అపవాద దృష్టి సూచింపఁబడినది. సృష్టియంతయుఁ దన్మాత్రము; అనగా బ్రహ్మ (తన్మాత్ర) కుఁ జెందినది; అని సూచింపఁబడినది.

శ్రు॥ "స యథా సైంధవ ఖిల్య ఉదకే
ప్రాస్త ఉదక ఏవాను విలీయేత ।
స యథా సైంధవ ఘనో ఽనన్తరోఽ
బాహ్యః కృత్స్నో రసఘనః
ఏవం వా అరే ఽయమాత్మా
కృత్స్నః ప్రజ్ఞాఘనః ॥

అను శ్రుతియుఁ బై విషయమునే ప్రకటించు చున్నది. ఎట్లన ? సైంధవలవణము జలము నుండియే బహిర్గత మగు చున్నది. కాన దానికి జల ముపాదాన కారణము. జలము నుండి యుద్భవించిన సైంధవలవణము జలమునందే లీనమై యుండును. లేదన్నచోఁ గరకాలయమునందువలెఁ బరిణామా

ధిక్యము జరుగును. ఆ సైంధవఘనము రసతన్మాత్ర స్వరూప మున రసఘనమై, జలమునం దభివ్యక్త మగునపుడు, (కనం బడునపుడు) అనన్తరము అనగా గారణహీనము, అబాహ్యము అనగా ఘనీభావరూపహీనమునై యుండును. అటులనే ఆత్మ నుండి అనగా బ్రహ్మపదార్థమునుండి వెలువడిన యీ ప్రపం చము ఆత్మయందే లీన మగును. ఆ ప్రపంచము తన్మాత్రరూప మున నున్నపుడు సమాధిలోఁ గేవల ప్రజ్ఞానఘనమై, కార్య కారణోభయ స్వరూపహీనమై యుండును ఇదియే యపవాద దృష్టి.

1. ఆరోపము, 2. అపవాదము, 3. వ్యామిశ్రమము అను దృష్టిత్రయముతో జనబోధకై శాస్త్రము వెలిసినది.

శ్లో. 1. ఆరోపదృష్టి రపవాదక దృష్టి రేవం
వ్యామిశ్ర దృష్టిరితి దృష్టివిభాగ మేనం।
సంగృహ్యా సూత్రకృ దయం పురుషం ముముక్షుం
సమ్యక్ప్రబోధయితు ముత్సహతే క్రమేణ ॥

అనునది మొదలు,-

శ్లో॥ 2. "శ్రుతివచాంసి, మునిస్మరణాని చ,
న్యాయ విశారద గీః పి సర్వశః।
త్రయముపేక్ష్య దృశాం త్రితయం వినా,
న హి ఘటా ముపయాంతి కదాచ న ॥"

అను వరకుఁగల "సంక్షేపశారీరక" మను గ్రంథమందలి శ్లోకములు పై విషయమునే స్పష్టపఱచుచున్నవి.

సూత్రకారుఁడు ముముక్షు పురుషుని జక్కగా బోధించుటకై, బ్రహ్మవస్తువును వివరించు నపుడు వరుసగా, ఆరోప దృష్టి, అపవాదదృష్టి, వ్యామిశ్రదృష్టి, అను విభాగము గావించెను. శ్రుతులు, స్మృతులు చక్కగాఁ దెలిసిన పండితుఁడైనను, పై మూఁడు దృష్టులను విడిచి, ఋగ్యజుస్సామ వేదములందలి బ్రహ్మవస్తువు విషయమును, బోధింపఁ జాలఁడు, అని పై శ్లోకములచే వెల్లడి యగుచున్నది. కావునఁ బైనఁ బేర్కొనిన ఆరు పక్షములలో ఏపక్షమునకుఁ జెందిన ద్విజుఁడుత్తముఁడు? జాతిచే బ్రాహ్మణుఁ డేర్పడుచున్నాఁడా? లేక జాతికిఁ జెందియు వేదములచే ఉత్తమ బ్రాహ్మణుఁ డగుచున్నాఁడా? ఎఱిగింపుఁడనిన ధృతరాష్ట్రునకు సంజయుఁ డిట్లు చెప్పెను.

## —: బ్రాహ్మణుఁడు - వేదము :—

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ ఏకస్య వేదస్యాజ్ఞానా ద్వేదాస్తే బహవః కృతాః ।
సత్యస్యైకస్య రాజేంద్ర సత్యే కశ్చి దవస్థితః ॥ ౪౩

తా॥ ఏకమైన బ్రహ్మపదార్థముయొక్క జ్ఞానము లేని కారణమున, దానిని తెలియఁ జేయుటకై పెక్కు వేదములు బయల్వెడలినవి. ఏకమైన బ్రహ్మవస్తువే సత్యమైనది. అది తెలిసినవాఁ డెవఁడో ఒకఁడు మాత్రమే సత్యమైన పరబ్రహ్మయందు లగ్నుఁడై యుండును.

శం. భా. :- రాజా! స్వాభావికమైన సచ్చిదానందా

ద్వితీయమైన బ్రహ్మయే నేను అను జ్ఞానముకలవాఁడే బ్రాహ్మణుఁడు తద్వ్యతిరిక్తమైన సర్వమునకును అజ్ఞానమే మూలము. అది ఎట్లో చెప్పెదను వినుఁడు.

"అనిదంరూపము" అనగా లౌకికమైన రూపము లేనట్టిదియు, ముఖ్యమైనట్టి ఈ బ్రహ్మస్వరూపము మాత్రమే వేద్యము. అనగాఁ దెలిసికొనఁ దగినది. అది అద్వితీయము. జ్ఞానస్వరూపము. పరమేశ్వరుఁడు దానిని ముఖ్యముగాఁ దెలియఁ జేయునదే ఏకవేదము. అట్టి యేకవేదమును దెలిసికొన లేకుండుటచే దానిని దెలుపుటకై ఋగాది వేదములు పెక్కులు వెలసినవి.

1. బ్రహ్మపదార్థ ప్రాప్తికై విచారణ చేయుకారణమున, ఋగ్యజుస్సామాథర్వణములకు వేదము అను నామము వాటిల్లినది.

2. సద్భావమును సాధించునవి వేదములు.

3. వేదనమునకు అనగా జ్ఞానమునకు సాధన భూతములు వేదములు.

4. బ్రహ్మాధీనమైన ఆత్మను బొందునవి కావున వేదములు, లేక బ్రహ్మకు ఆత్మలగుటచే లాభహేతువులు కాన వేదములు.

5. బ్రహ్మనుగూర్చి చెప్పునవి కావున వేదములు అని వేదపదమున కెన్నియో అర్థములు కలవు.

1. విద - విచారణే, 2. విద - సత్తాయాం, 3. విద జ్ఞానే, 4. విద్ల - లాభే, 5. వద - భావణే, అను ధాతువుల నుండి "వేదః" అను పద మేర్పడుటచేఁ బైయర్థములు లభించు చున్నవి. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అను శ్రుతివలన బ్రహ్మవస్తువు సత్యస్వరూపము, జ్ఞానస్వరూపము, అనంతమైన దని తెలియుచున్నది. ఇదియే వీక వేద స్వరూపము.

వేదము అనగా బ్రహ్మ. ఇట్టి బ్రహ్మపదార్థము తెలి యని కారణమున దానిని దెలుపుటకు ఋగాది నామములతోఁ బెక్కు వేదములు వెలసినవి. ఇవన్నియును బ్రహ్మదర్శన హేతువులే. పరికింపగా నెవఁడో ఒక్కఁడు మాత్రమే సత్య మైన బ్రహ్మయందు లగ్నుఁడై స్థిరముగా నుండును. రాజేంద్రా! ఈ విషయ మెఱిగియు నీవేల ఇట్లుంటివో తెలియకున్నది.

సీ. భా. :- పంచవేదులు, చతుర్వేదులు, మున్నగు పక్షములు ఎన్ని యున్నను సిద్ధాంతమును జెప్పుచున్నాను. వినుము. పరికింపగా బ్రహ్మపదార్థ మొక్కటియే వేద్యమైన వస్తువు. అదియే సత్యము; కాలత్రయాబాధ్యము, అని తెలిసి కొనక, అజ్ఞానముచే బ్రహ్మకాని వస్తువులు, అబ్రహ్మలు ఉపాస్యములుగాఁ గల్పింపఁబడినవి.

"తదేవ బ్రహ్మత్వం విద్ధి, నేదం యదిద ముపాసతే." అను శ్రుతి, ఉపాసింపఁబడుచున్న ఈ దృశ్యమాన ప్రపంచము బ్రహ్మకాదు. సత్యస్వరూపమైన ఆ తత్పదార్థ మొక్కటియే

ఉపాస్యమైన బ్రహ్మయని నీవు ఎఱుగుము. అని బోధించు చున్నది.

కావున వేదమే ఐహికోపాస్యములకు అబ్రహ్మత్వమును (పరబ్రహ్మ కాకుండుటను) నిరూపించి, సత్యప్రాప్తికి దగిన జ్ఞానము ఎఱింగించు చున్నది. సత్యమైన అట్టి బ్రహ్మయందు ఎవఁడో ఒకఁడు మాత్రమే నిలకడగా నుండును. బ్రహ్మలాభము అతి దుర్ఘటము. జగత్తంతయు అజ్ఞానకార్యమే అనువిషయము.

"తుచ్ఛే నాభ్వ పిహితం యదాసీత్, తమస స్తన్మహినా ఽజాయతైకమ్" అను శ్రుతివలనఁ దెలియుచున్నది. ఎట్లన ? నిజమునకు రజ్జువు సర్పముకాదు. ఐనను చీకఁటిలో అజ్ఞానముచే ఆవరింపఁబడిన ఆరజ్జువే సర్పాకారమున ఆవిర్భవించినది. అట్లే తుచ్ఛమైనట్టియు, మిథ్యయైన తమస్సుచే, (అజ్ఞానముచే) "ఆభు" అనగా సర్వవ్యాపకమైన బ్రహ్మపదార్థము ఆచ్ఛాదింపఁబడి ఆ యజ్ఞానమహిమచే, ఏకమును, సత్తు నగు, ఆబ్రహ్మపదార్థమే ప్రపంచాకారమున ఆవిర్భవించినట్లు తోఁచుచున్నది. కొందఱిమతమునఁ దపస్సుయొక్క మహిమచే బ్రహ్మపదార్థము ప్రపంచరూపమున ఆవిర్భవించి నట్లు చెప్పఁబడినది. తపస్సు అనగా సంకల్ప మాత్రమైన ఆలోచన. ఆలోచింపఁగా రజ్జువు సర్పముకానట్లే బ్రహ్మ వస్తువు ప్రపంచము కాదని తెలియుచున్నది.

అర్జున, సర్వజ్ఞ భాష్యములు:-

ఆ విషయము తెలియని అల్పప్రజ్ఞులైన అల్పజీవితులచే

అజ్ఞానమువలన ఋగ్యజుస్సామాథర్వణభేదముతోఁ దెలియఁ దగిన బ్రహ్మవస్తువు, పెక్కురీతులఁ గావింపఁబడినది. అటులనే అద్వితీయమును, సత్యమునగు, బ్రహ్మవస్తువు ఒక్కటే యైనను, అజ్ఞానముచే బహుసత్యములుగా జీవభావముతోఁ జెప్పఁబడినది. వీతరాగుఁడైన వాఁ డెవఁడో ఒకఁడు మాత్రమే, ఏకమును, సత్యము నగు బ్రహ్మను దెలిసికొనఁ గలఁడని తెలియుచున్నది. సత్యమైన బ్రహ్మ నెఱిఁగినవాఁడే సర్వవేదియైన బ్రాహ్మణుఁడు. అట్టి బ్రహ్మ నెఱుఁగనివారు అజ్ఞానులు కాన స్వర్గాదిఫల లోభముతోఁ బ్రవర్తించినవారై పంచవేదులు, చతుర్వేదులు మున్నగు విధముల భిన్నులై యున్నారు.

లక్ష్మాభరణ భాష్యము :-

—: సత్య భేదములు :-

రాజేంద్రా! శాక్తేయుల మతమున జగత్తంతయు, సత్యమే. అదియే అర్ధనారీశ్వరాకారి యగుటచే బ్రహ్మతోఁ గూడి ఏకాకారమై యున్నది. అదియే సత్యమను నామముగల పారమార్థిక సత్యము. జ్ఞానశక్తిలేని కారణమున మానవులు ఒకే సత్యమును బహుసత్యములుగా అనగా 1. పారమార్థికము, 2. వ్యావహారికము, 3. ప్రాతిభాసిక మని ముత్రివిధములుగాఁ జెప్పుచున్నారు. పరికింపగా వాయురూపుఁడైన జ్ఞానియొక్కఁడే యోగసమాధిలో సత్యమునందు అనగా జగత్తుతోఁ గూడిన బ్రహ్మలోఁ గలఁడని తెలిసికొనవలెను ఇట నొక విచిత్ర విషయము స్వప్రమాణముగనే తెలిసికొనవలసియున్నది. అదేమన?

—: కశ్చిత్ - సత్యముః అను పదముల నిర్వచనము :—

"సత్యే కశ్చి దవస్థితః" అనుచోట "కః + చిత్" అను రెండు పదములుకలిసి "కశ్చిత్" అను ఏకపదముగా భాసించు చున్నవి. "మారుతే వేధసి బ్రధ్నే పుంసి. కః, కం, శిరోంబునోః" అను సూక్తి ననుసరించి "కః" అనగా వాయురూపుఁడని తెలిసికొనవలెను. "చేతయతి సర్వమ్" అను వ్యుత్పత్తి ననుసరించి, సమస్తమును చైతన్యవంతముగాఁ జేయువాఁడు "చిత్" అనగా జ్ఞాని యని తెలిసికొనవలెను. "సత్ + యే" అను రెండుపదములు కలిసి "సత్యే" అను పదముగా నేర్పడినవి. "సద్ల - గతౌ" అను ధాతువునుండి "సత్" అనుపదమేర్పడెను. సత్ అనగా సర్వవ్యాపకమైన జగత్తు అని యర్థము "ఈయతే - ఇతియః, తస్మిన్ యే" అను వ్యుత్పత్తి ననుసరించి, "యః" అనగాఁ బొందఁ బడువాఁడు, పొందించువాఁడు నగు నారాయణుఁ డని యర్థము. "సత్యః" అనగా సత్తుతో = జగత్తుతోఁ గూడియున్న "యః = నారాయణుఁ" డని యర్థము. అనగా శక్తిసహితుఁడైన పురుషుఁ డని యర్థము, గోచరించు చున్నది.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యా ఇతి వేదాన్త డిండిమః" అను సూక్తి ననుసరించి చూచినచో బ్రహ్మవస్తువు సత్యము; శాశ్వతము; జగత్తు మిథ్య అనగా అశాశ్వత మని తెలియు చున్నది. కాని "బ్రహ్మసత్యం జగత్సత్యమ్" అను శాక్తేయుల మతము ననుసరించి చూచినచో, బ్రహ్మ, జగత్తు అను రెం

డును సత్యము లే అని గోచరించుచున్నది. "సత్ + యః" అనగా జగద్రూపమైన శక్తితోఁ గూడిన పురుషుఁడే సత్యమని శాక్తేయుల వాదము. "శివశ్శక్త్యా యుక్తః" అను సౌందర్య లహరి సూక్తియుఁ బై విషయమునే ధృఢపఱచును.

—: యజ్ఞాచరణము :—

శ్లో॥ ఏవం వేద మవిజ్ఞాయ ప్రాజ్ఞోఽహమితి మన్యతే ।
దాన మధ్యయనం యజ్ఞో లోభా దేత త్ప్రవర్తతే ॥ ౮౮

తా॥ ఈవిధముగా వేదమును బ్రహ్మపదార్థము తెలియఁ గక, అహంకారముచే నేనే ప్రాజ్ఞుఁడనని మానవుఁడు తలంచు చున్నాఁడు. అంతేకాదు. ఫలాశతో దానమును, వేదాధ్యయ నమును, యజ్ఞమును జేయుచున్నాఁడు.

అర్జున భాష్యము :- సత్యమైన బ్రహ్మపదార్థమును ఏక వేదమని తెలిసికొనక, బహువేదముల నభ్యసించి, అహంకార ముచే, నేనే ప్రాజ్ఞుఁ డనని, బ్రాహ్మణుఁడు తలంచుచున్నాఁడు. "తత్వ మసి శ్వేతకేతో" మున్నగు శ్రుతులచే "నేనే బ్రహ్మ పదార్థమును" అనెడి జ్ఞానము లేక, స్వర్గఫల లోభముచే యజ్ఞమును, బాహ్యసుఖ లోభముచే దానాధ్యయనములను ఆతఁడు ఆచరించుచున్నాఁడు. వేదములు యజ్ఞముల కొఱకే అని తలంచినచో అవి ఫలలోభమునకు మూలము లగును. క్రమముగా నవి దుఃఖమునకు మార్గమును జూపును.

లక్షాభరణ భాష్యము:- "అన్నం బ్రహ్మేతి విజానాత్" అను శ్రుతి చెప్పిన "అన్నము అనగాఁ బ్రపంచమే" సత్యమగు బ్రహ్మవస్తువు అని తెలిసి కొనినవాఁడు వాయుదేవరూపుఁడు. ఆతఁడు ప్రాణాయామ పూర్వక యోగాభ్యాసము నాచరించి, ప్రాజ్ఞుఁ డగును. అట్టివానికే పూర్ణప్రజ్ఞుఁ డను నామము గల్గును. ఆతఁడు బ్రహ్మ జగత్తుతోఁ గూడి, ఏకాకారముగల సత్యము. అదియే పారమార్థిక సత్యమని యెఱుఁగును. అట్టి జ్ఞానము లేనివాఁడు, లోభమువలన, దానాధ్యయనములను యజ్ఞములను ఆచరించుఁ బ్రవృత్తిమార్గమునఁ బ్రవేశించును.

శ్లో॥ సత్యాత్ప్రచ్యవమానానాం సంకల్పశ్చ తథా భవేత్ ।
తతో యజ్ఞః ప్రతాయేత సత్యస్యైవావ ధారణాత్ ॥ ౪౫

తా॥ సత్యమైన పరమార్థ జ్ఞానమునుండి జారినవాని సంకల్పము వ్యర్థమే యగును. అందుచే వాఁడు స్వర్గాది ఫల లోభముతో యజ్ఞము చేయును. సత్యమును, యజ్ఞమును గుర్తించినవాఁడు సత్యప్రీతికై యజ్ఞము చేయును.

శం. భా. :- సత్యజ్ఞానాది లక్షణములు గలదియే స్వాభావికమైన బ్రహ్మవస్తువు: అని తెలియనివాఁడు ఆత్మ కాని, దేహాదులను ఆత్మగాఁ దలంచి ప్రచ్యవమానుఁ డగును. వాని సంకల్పము లన్నియు వ్యర్థములే యగును. వాఁడు పరమాత్మయే ఆత్మవస్తు వనెడి సత్యమును దెలిసికొనలేక, అజ్ఞాన నిమిత్తమైన సంసారమునఁ బడి, తాపత్రయమునకు

లోనై, మకరాదులవంటి రాగద్వేషాదులచే ఆకర్షింపఁబడి, మోహమున పడునుఁగును. అందుచే వాఁడు, స్వర్గము, పశువులు, అన్నము మున్నగు హేయములను ఆశించి, యజ్ఞములు చేయును. ఇట్లు కర్మకాండ లోకమునఁ బ్రవర్తిల్లు చున్నది. అంతేకాదు.

సీ. భా. :- సత్యము పరమానందస్వరూపము. అట్టి సత్యమునుండి జారినవాఁడు క్షుద్రుఁడు. వాని యానందము క్షుద్రానందము. క్షుద్రానందుల సంకల్పము అనగాఁ గోరిక క్షుద్రమే యగును. అందుచే క్షుద్రుఁడు "జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేత" అను వేదవచనమును బ్రమాణముగాఁ గొని, బ్రహ్మార్పణముగాఁ జేయు దలంపువీడి, సంసారబంధ హేతువైన స్వర్గమును గామించువాఁడై జ్యోతిష్టోమాది యజ్ఞములను ఆచరించుచున్నాఁడు. సత్యమెఱిఁగిన వాని సంకల్పము సత్యసంకల్ప మగును. అట్టి సంకల్పముతో సత్యప్రీతిగాఁ జేయు యజ్ఞములు సఫలము లగును. సత్యప్రీతిగాఁ జేయని యజ్ఞాదులు వితథములు అనగా వ్యర్థము లగును.

"ఏత ద్బుధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చ భారత"

అను గీతానూక్తియు, సత్యము నెఱిఁగినవాఁడే బుద్ధిమంతుఁడు, సత్యబుద్ధితో యజ్ఞాది కర్మలుచేయువాఁడే కృతకృత్యుఁడు, అనగా ముక్తుఁడగును అని చెప్పెను.

అర్జున భాష్యము :- సత్యమునుండి వేఱుపడిన అజ్ఞాని శబరసంవర్ధితుఁడైన రాజపుత్రుని వంటివాఁడు. శబర పోషిత

రాజపుత్రుఁడు స్వస్వరూప మెఱుగక, శబరోచిత హింసాకర్మ లనే చేయును. అట్లే సత్యహీనుఁడు అజ్ఞానముచే భోగకాంక్షియై బంధ హేతువులైన దానాదులను ఆచరించును.

సర్వజ్ఞ భాష్యము :- ఇట్లు చెప్పిన మాత్రాన జ్ఞానులకు వేదములు నిరర్థకములని, యజ్ఞాదికములు నిష్ప్రయోజనములనియు అనరాదు. జ్ఞానియైనను లోభబుద్ధితో యజ్ఞదానాదులను గావించినచో అవి నిషిద్ధకర్మలే యగును. సంకల్ప పూర్వకముగాఁ జేసిన యజ్ఞాదులు బంధహేతువులే యగును. అందుచే ఏ మానవుఁడైనను బ్రహ్మార్పణ బుద్ధితో, కామ సంకల్పహీనముగా, యజ్ఞ దాన వేదాధ్యయనములు గావించుట ఉత్తమము.

## —: యజ్ఞ భేదములు :—

శ్లో॥ మనసా న్యస్య భవతి వాచా న్యస్యాథ కర్మణా।
సంకల్పసిద్ధః పురుష స్సంకల్పా నధితిష్ఠతి ॥ ౪౬

తా॥ మనస్సుతో నాయా దేవతలను ధ్యానించుటయే మానసిక యజ్ఞము. వాక్కులతో నాయా దేవతలను స్తుతించుట, జపించుట జపయజ్ఞము. యజ్ఞయాగాదుల నాచరించుట కర్మయజ్ఞము. సత్యసంకల్పుఁడే సంకల్పసిద్ధుఁడైన పురుషుఁడు. ఆతఁడే సంకల్పములైన బ్రహ్మ లోకాదులను అధిష్ఠించుచున్నాఁడు.

నీ. భా. :- మనసున దేవతలను ధ్యానించుట మానస యజ్ఞము. బ్రహ్మప్రీతిగాఁ జేసినచో నది జ్ఞానయజ్ఞ మగును

బ్రహ్మయజ్ఞము, జపాదులును వాగ్యజ్ఞములగును. జ్యోతిష్టోమము, అగ్నిష్టోమము మున్నగునవి కర్మయజ్ఞములు కర్మయజ్ఞముకంటె జపయజ్ఞమును, దానికంటె జ్ఞానయజ్ఞమును ఉత్తమములు. సమ్యగ్జ్ఞానమే సంకల్పము. దానిచే సిద్ధినొందిన వాఁడే సంకల్ప సిద్ధుఁడు అనగా సత్యసంకల్పుఁ డన్నమాట. అట్టివాఁడే సంకల్పములగు బ్రహ్మలోకాదులను అధిష్ఠింపఁగల బ్రహ్మవేత్త యగును. అట్టివాఁడే భ్రాంతిహీనుఁడై బ్రహ్మస్వరూపుఁడగును.

—: స్వారాజ్యము–వాక్పతి–చక్షుష్పతి–శ్రోత్రపతి – విజ్ఞానపతి :-

పై విషయమునే "ఆప్నోతి స్వారాజ్యం ఆప్నోతి మనసస్పతిం. వాక్పతి శ్చక్షుష్పతిః, శ్రోత్రపతి ర్విజ్ఞానపతిః" అను శ్రుతియు స్పష్టపఱచు చున్నది. ఎట్లన ? స్వారాట్టు అనగాఁ బరబ్రహ్మ, స్వారాజ్య మనగా బ్రహ్మైశ్వర్యము. అట్టి యైశ్వర్యమును వాక్పతి, చక్షుష్పతి, శ్రోత్రపతి, విజ్ఞానపతియును బొందఁగలరు.

వివరణము :- బ్రహ్మవస్తువును మనస్సున ధ్యానించి పొందినవాఁడే మనస్పతి యగును. వేదపఠనమును జపమును బ్రహ్మప్రీతిగాఁ గావించువాఁడే వాక్పతి యగును. కనులుమూసి ఆజ్ఞాచక్రమున బ్రహ్మను దలంచువాఁడే చక్షుష్పతి యగును. శ్రోత్రములతో బ్రహ్మవిషయముల నాలకించువాఁడే శ్రోత్రపతి యగును. పైరీతిని విజ్ఞాన స్వరూపముగా బ్రహ్మ నెఱిఁగిన వాఁడే విజ్ఞానపతి యగును. వాక్పతి అనాహతచక్రమున మన

స్పతి మణిపూరకచక్రమున, చక్షుష్పతి ఆజ్ఞాచక్రమున, విజ్ఞాన పతి సహస్రారమున, శ్రోత్రపతి ప్రణవస్వరూపనాద బ్రహ్మ కాధారములైన మూలాధార స్వాధిష్ఠాన చక్రములందును బ్రహ్మపదార్థమును ప్రాణాయామమునఁ జూడఁగలరు. ఉపాసనా విధానమున యోగులు పైనఁ జెప్పిన షట్చక్రములందును బరమాత్మను దర్శించి బ్రహ్మానందము పొందుదురు.

—: దీక్షిత వ్రతము :-

శ్లో॥ అన్నైభృత్యేన చైతస్య దీక్షిత వ్రత మాచరేత్ ।
నామైత ద్ధాతు నిర్వృత్తం సత్యమేవ సతాం పరమ్॥ ౪౭

తా॥ పై శ్లోకమునఁ జెప్పిన సంకల్పము మనశ్చాంచల్యముచే దృఢమైనది కాదు. సంకల్పము దృఢమగుటకు దీక్షితవ్రతమును ఆచరించవలెను. "దీక్ష" అను ధాతువునుండి దీక్షితుఁ డనెడి పదమేర్పడినది. దీక్షితుఁడు మున్నగు సజ్జనులకు సత్యమైన బ్రహ్మయే ధ్యానార్హ మగుటచే శ్రేష్ఠమైనదని యెఱుఁగుము.

నీ. భా. :- తన యజ్ఞానమువలన ఆత్మయన నేమో సరిగాఁ దెలియదు. అపుడు బ్రహ్మలోకాదులకుఁ జెందిన తన సంకల్పము దృఢము కానందున వ్యర్థమగును. అందుచేఁ దన సంకల్పము దృఢమగుటకు, ముష్టీకరణము, వాగ్యమనము, మున్నగు వానితోఁ గూడిన దీక్షితవ్రతమును ఆచరించవలెను. "దీక్ష - వ్రతాదేశే" అను ధాతువునుండి ఏర్పడిన దీక్షిత పదము దీక్షగలవానికే చెల్లును. దీక్షితుఁ డనెడి సంస్కారము,

దీక్షావ్రతము అనెడి కర్మ చేసిన వానికే చెల్లును. కాని అది ఆగంతుక నామమైనచో వినాశకర మగును. దీక్షితుఁడు మున్నగు సజ్జనులకు సత్యమే, అనగా బ్రహ్మయే శ్రేష్ఠమైనది. కాన సత్యప్రాప్తికై దీక్షిత వ్రతాదులను ఆచరించుట ఉత్తమము.

అర్జున భాష్యము :- అంతే కాదు మనస్సు చంచల మైనది. అది నిశ్చలముగా నుండనిదే బ్రహ్మసాక్షాత్కారము జరుగదు. మనస్సు నిలకడగా నుండుటకై దీక్షితుఁడు బ్రహ్మోపదేశము పొంది, యమము, నియమము, ఆసనము, మున్నగు నష్టాంగములుగల యోగ వ్రతము నాచరింపవలెను. యోగ వ్రత మాచరించిన దీక్షితుఁడు, సత్పదముచేఁ జెప్పబడు బ్రహ్మ విష్ణు శివాత్మకుఁ డగును. సత్పద బోధితులైన బ్రహ్మ విష్ణు శివులకు సైతము సత్యమే ధ్యేయము, కాన శ్రేయస్కర మగును. "సత్య" అను పదము "అస-భువి" అను ధాతువునుండి యేర్పడినది. సత్తుయొక్క ధర్మమే సత్యము. అనగా శాశ్వత మైన దని యర్థము. "సత్" అనెడి పదము "షద్ల – విశరణ గత్యవసాదనేషు" అను ధాతువునుండి యేర్పడినది, అనియుఁ జెప్పవచ్చును. అపుడు "సీదతి = లయం గచ్ఛతి కార్యజాత మస్మిన్" అనెడి యర్థమున "క్విబంత" మగును. అట్టి సత్తుయొక్క ధర్మమే సత్యము. అనగా సత్యమునందు నిష్ఠకల్గినపుడు లౌకికమైన కార్యజాత మంతయు నశించును. అట్టి నిశ్చల మనస్సుతో సత్యమును ధ్యానించిన నాఁడే దీక్షితుఁడను నామము సార్థక మగును.

సర్వజ్ఞ భాష్యము .- అంతేకాదు. సంకల్పమువలె యజ్ఞముకూడ మానసయజ్ఞము, వాచికయజ్ఞము, కర్మ యజ్ఞము అని ముఫ్విధములఁ గలదు. మానసయజ్ఞమునకుఁ జెందిన బ్రహ్మజ్ఞానమే నైభృత్య మనఁబడును. మానసయజ్ఞ మనెడి కర్మ నారంభించునపుడు నామోచ్చారణ పూర్వక ముగా సంకల్పమును జెప్పరాదు. తూష్ణీం భావమే దానికి ముఖ్యము. మానస యజ్ఞముకంటె భిన్నమైన వాచికయజ్ఞమే దీక్షితవ్రతము. దీక్షితవ్రతము నారంభించునపుడు "సత్య ప్రీత్యర్థము" అని సంకల్పము చెప్పవలెను.

అంతేకాదు. కర్మయజ్ఞమునందును సత్యనామపూర్వక ముగా సంకల్పము చెప్పవలెను. "సత్యము" అను నామము "అస – భువి" యను ధాతువునుండి యేర్పడినది. కావున సత్యనామము శాశ్వతమని తెలియు చున్నది సత్యప్రాప్తియే సజ్జనులకు ఉత్కృష్టమైనది. అందుచే వాచికాది యజ్ఞములందు సత్యమును ఉచ్చరించి తీరవలెను. మోక్షప్రాప్తికి మానస యజ్ఞము సాక్షాత్తుగా సాధనము. వాచిక, కర్మ యజ్ఞములు మోక్షప్రాప్తికి మేడకు మెట్లువలెఁ గ్రమ సాధనములు, అని తెలిసికొనవలెను.

### —: ముఖ్య బ్రాహ్మణుఁడు :—

శ్లో॥ జ్ఞానం వై నామప్రత్యక్షం, పరోక్షం జాయతే తపః ।
విద్యాద్బహుపఠం తంతు ద్విజం వై బహుపాఠితమ్॥ ౪౮

తా॥ జ్ఞానమనగాఁ బరబ్రహ్మ. పరబ్రహ్మను గూర్చి తెలిసికొనుటచే శోకమోహములను దొలగించుకొనుట యను ప్రత్యక్షఫలము లభించును. బ్రహ్మార్పణబుద్ధితోఁ గావింపని తపస్సు పరోక్షమైన స్వర్గాదికముచే బసంగును. బహువేదములను బఠించి. శిష్యులచేఁ బఠింపఁజేసిన బ్రాహ్మణుఁడైనను బ్రహ్మజ్ఞాన మార్జించిన నాఁడే ముఖ్య బ్రాహ్మణుఁ డగును.

సీ. భా. :- సత్యము, జ్ఞానము, ఆనందము, బ్రహ్మ అను పదములు సమానార్థకములు. కావున జ్ఞానమనగాఁ బర బ్రహ్మ యని తెలిసికొనవలెను. జ్ఞానస్వరూపమైన బ్రహ్మయే శోకమోహములను దొలగించును. అదియే జ్ఞానమునకుఁ గల ప్రత్యక్ష ఫలము. ఇటఁ దపః పదము సర్వకర్మలకు నుపలక్షణము. కావునఁ దపః పదముచే వ్యక్తమగు కర్మ (1) కాయికము; (2) వాచికము, (3) మానసికము అని ముత్త్రివిధముల నున్నది. అట్టి తపస్సు సత్యప్రీతిగాఁ గావించునపుడు పరోక్ష ఫలమగు ఆముష్మికమును, అనగా స్వర్గసుఖమును మాత్రమే యొసఁగి, సంసారకూపమునఁ బడఁద్రోయును. కావునఁ దపోరూపమైన కర్మను బ్రహ్మార్పణ బుద్ధితోఁ జేయుట ముఖ్యము.

శం. భా. :- స్వాభావిక చిత్సదానందాద్వితీయ బ్రహ్మ తానే అను తలంపుతో మెలంగుచు, సత్యనిష్ఠతో నున్న వాఁడే ముఖ్య బ్రాహ్మణుఁ డని తెలిసికొనుము.

శ్రు॥ మానం చామానం చ నిర్విద్యాథ బ్రాహ్మణ స్స బ్రాహ్మణః ।
విపాపో విరజోఽవిచికిత్సో బ్రాహ్మణో భవతి ॥

అను రెండు శ్రుతులలో ముఖ్య బ్రాహ్మణునిగూర్చి వివరింపఁ బడెను. ఎట్లన? మానము అనగా బ్రహ్మ, అమానము అనగా బ్రహ్మేతరము. ఏదో తెలిసికొని, మానపరుఁడై మెలగినవాఁడే బ్రాహ్మణుఁడు. ఆతఁడే పాపరహితుఁడు. విరజుఁడు, అనగా రజోగుణహీనుఁడు. అవిచికిత్సుఁడు, అనగా నిస్సందేహుఁడు నగు బ్రాహ్మణుఁడని పై శ్రుతులు చెప్పుచున్నవి.

అర్జున భాష్యము :- అందుచేఁ బ్రతిమానవుఁడు జపయజ్ఞము నైనను, తపోయజ్ఞము నైనను, బ్రహ్మార్పణబుద్ధితోఁ జేయుట యుత్తమము. పంచవేదులు, చతుర్వేదులు, త్రివేదులు, ద్వివేదులు, అని చెప్పఁబడు విప్రులు, పరోక్షఫలము నాసించు వేదపఠన రూపమైన కర్మయజ్ఞమును జేసిన కారణమున ముఖ్య బ్రాహ్మణులు కారు. అట్టి అముఖ్య బ్రాహ్మణులే, బహుపఠంత, బహుపాఠిత పదములచేఁ జెప్పఁబడుచున్నారు. వారు కేవలము పరోక్షఫలమును మాత్రమే పొందనర్హులు.

శ్లో॥ తస్మాత్ క్షత్రియ మామంస్థా జల్పితే నైవ వైద్విజం ।
యఏవ సత్యాన్నాపైతి సజ్ఞేయో బ్రాహ్మణ స్త్వయా॥

తా॥ క్షత్రియుఁడా: వేదాధ్యయనమునే జల్పితముగా నెఱుఁగుము. కేవల వేదాధ్యయనము చేయు విప్రుని ద్విజునిగా భావింపకుము. సత్యమైన పరబ్రహ్మనుండి ఎవని మనస్సు జారదో వానినే బ్రాహ్మణునిగా భావింపుము.

సీ. భా. :- జల్పితమనగా అధ్యయనము. క్షత్రియా! కేవలము వేదాధ్యయనము చేసిన మాత్రాన విప్రుని బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడైన బ్రాహ్మణునిగా భావింపకుము. బ్రహ్మార్పణ బుద్ధితోఁ జేసిన జపయజ్ఞముచేతనే బ్రాహ్మణునకు బ్రహ్మజ్ఞాన యోగ్యత ప్రాప్తించును. అంతేకాదు. ప్రత్యగద్వయానంద స్వరూపుఁడైన బ్రహ్మకు దగ్గరగానుండు వాఁడే అపరోక్షజ్ఞానియైన బ్రాహ్మణుఁడని, "యోవా ఏత దక్షరం గార్గి విదిత్వా ఽస్మాల్లోకా త్ప్రైతి స బ్రాహ్మణం" అను శ్రుతి తెల్పుచున్నది.

అదేమనగా! గార్గి! అక్షరమైన ఈ బ్రహ్మపదార్థము, నెఱిఁగినవాఁడే ఈ లోకము ను వీడి, బ్రహ్మలోకమును జేరిన బ్రాహ్మణుఁడని యెఱుఁగుము. కావున బ్రహ్మజ్ఞానము లేని పంచవేదాదులు బ్రాహ్మణులు కారన్నమాట. అందుచే సత్యమునందే నిశ్చలమనస్సుతో నుండుట యనెడి మానస యజ్ఞము నాచరించుట మంచిదని తెలిసికొనుము.

—: ఛందస్సులు :—

శ్లో॥ ఛందాంసి నామ క్షత్రియ తా న్యథర్వా
పురా, జగౌ మహర్షి సంఘవిమః ।
ఛందో విద స్తే య ఉత నాధీత వేదా
న వేద వేద్యస్య విదు ర్హి తత్త్వమ్ ॥ ౫౦

తా॥ ఛందస్సులనగా వేదములు. క్షత్రియా! వానిని దొలుత అథర్వ మహాముని పఠించెను. పిమ్మట వానిని ఈ

మహర్షి సంఘము పఠించెను. కేవల వేదములను, వేదార్థమును దెలిసికొనిన మాత్రాన వేదవేత్తలు కారు. వేదవేద్యమైన తత్త్వమును, అనగాఁ బరబ్రహ్మను ఎఱిఁగినవారే వేదవేత్త లగుదురు.

నీ. భా. :- బ్రహ్మేతర పరముగాఁ గావించు వేదపఠనముచే విప్రుఁడు సిద్ధిపొందలేఁడు. అంతమాత్రాన అధ్యయన యాగాదులు వ్యర్థములని తలంప నవసరము లేదు. ఉపనిషత్ప్రసిద్ధుఁడైన అథర్వ మహామునియు, మహర్షి సంఘమును గానముచేసిన మంత్రములే, ఉపనిషద్రూపములైన ఛందస్సులు. "ఛాదయంతి, హ, వా, ఏనం ఛందాంసి పాపాత్కర్మణః" అను శ్రుతిచేఁ బాపకర్మ నుండి ప్రాణులను గప్పివైచి, రక్షించునవే ఛందస్సులు అని తెలియుచున్నది.

"ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః" అనెడి అథర్వణోపనిష న్మంత్రములో, యజ్ఞరూపములైన కర్మలు, తెప్పలవంటి అల్పసాధనములు, అదృఢములని చెప్పఁబడినది. అందుచేఁ బాపమునుండి ప్రాణులను రక్షించుటకు యజ్ఞాది కర్మలు సమర్థములు కావని తెలియుచున్నది. బ్రహ్మవిద్య వర్థించు ఋషులకు మాత్రమే ఛందస్సులు ముఖ్యములు. కాని కర్మార్థులకు మాత్రము ఛందస్సులు గౌణములే అనగా అప్రధానములే అని తెలియుచున్నది. వేదములను ఉపనిషత్తులను అర్థముతో సహా పఠించిన అధీతవేదులుకూడ వేదవేద్యుఁడైన పరబ్రహ్మయొక్క తత్త్వమును ఎఱుఁగని కారణమున వేదవేత్తలు కానేరరు.

శ్రు॥ అధేన్వా చరతి మాయ యైవ వాచం
శుశ్రుహి అఫలా మపుష్పామ్,
పుష్పం హి ఫలం వాచస్సత్యమితి.

అను రెండుశ్రుతులను బరిశీలించినచో సత్యమనగాఁ "బరబ్రహ్మయే" వేదవాక్కులకుఁ జెందిన ఫలము, పుష్పము అని తెలియుచున్నది. మానవుఁ డాడుమాటలు, ఆనందమును, ముక్తిఫలము నొసంగు నవిగా నుండవలె నన్నమాట. పుష్ప ఫలముల నొసంగునది ధేనువు. వాని నొసగనిది అధేనువు. ప్రకృతికిఁ జెందిన మాయాముక్తిని, ఆనందము నొసఁగని అధే నువు. దాని ప్రభావముచేతనే ప్రతిప్రాణియుఁ జరించు చున్నది. దాని ప్రభావముచేతనే ప్రతి మానవుఁడు అఫలము, అపు ష్పము నైనట్టియుఁ, బరబ్రహ్మకుఁ జెందిన మాటలనే ఆలకించు చున్నాఁడు. కావున వేదములను అర్థములతో పఠించిన మాత్రాన ప్రయోజనము లేదని తెలియుచున్నది.

అర్జున మిశ్ర భాష్యము :-ఛందస్సు లనగా ఋషులు. "ఋష్యతే - జ్ఞాయతే" అను వ్యుత్పత్తి ననుసరించి, జ్ఞానము నొసఁగు శక్యపాదములే ఋషులు. అట్టి ఋషులనుండి పరబ్రహ్మ తత్త్వ మెఱుగని వేదవేత్తలు ఛాందసులని పిలువఁబడుదురు. అంతేకాదు. స్వేచ్ఛగా వేదములను బఠించినచో అవి ఇంద్రా గ్న్యాదుల నామములే యగును. గురుముఖముగా వేదముల నాలకించి, పఠింపకున్నచో దాని ముఖ్యార్థము నెవరును దెలిసి కొనలేరు. అందుచే వారికి ముఖ్య ప్రతిపాద్యమైన బ్రహ్మవస్తువు ఏమాత్రమును దెలియదు.

వివరణము :- "పుష్పం హి ఫలం వాచ స్సత్యమ్" అను శ్రుతిని బరిశీలింపగా శాశ్వతమైన పరబ్రహ్మయే సత్యమనియు, అదియే వేదవాక్కులకుఁ జెందిన ఫలము, పుష్పము అనియుఁ దెలియుచున్నది. పుష్పము సువాసనతోఁడి యానందమును, ఫలము రుచితోఁడి యానందము నొసఁగును. ఇట జ్ఞానమే సువాసనగా, రుచిగా బేర్కొనఁ బడినది. వానివలన లభించు నానందము జ్ఞానమువలన లభించు నానందమును సత్యమైన పరప్రహ్మయొక్క స్వరూపమే. అందుచేతనే సత్యపదార్థము వేదవాక్పుష్పముగాఁ బేర్కొనఁ బడెను. అట్టి సత్యపదార్థమే ప్రకృతితోఁ గూడి, సృష్టి గావించినపుడు సూర్యాగ్ని వాయ్వాదుల రూపము దాల్చినది ప్రథమ సృష్టియైన జలమే ప్రకృతి. దానితోఁ గూడి దానిలోనుండి, బ్రహ్మాండాండాండ పిండాండములను గావించు సత్యపదార్థమే, సూర్యాగ్ని వాయు చంద్ర నక్షత్ర పర్జన్య సంవత్సర రూపములతోఁ బరిణామముచెంది సృష్టిగావించు చున్నది. పుష్పరూపమైన అట్టి సత్యపదార్థ ప్రభావమును దెలియఁజేయు భాగమగుటచేతనే "యోపాం పుష్పం వేద" అనునది మొదలు "యోప్సునావం ప్రతిష్ఠితాం వేద" అను వరకుఁ గల మంత్రభాగమునకు మంత్రపుష్ప మను నామ మేర్పడెనని నాతలంపు. ఆ వేదమంత్రములందలి జ్ఞాన మార్జించి, దానిని మనోబుద్ధులతో మననము చేసికొని సత్యము నందు లీనమైన నాఁడే మానవుఁడు ముక్తుఁ డగునని తెలియు చున్నది.

—: వేద ప్రయోజనము :—

శ్లో॥ ఛందాంసి నామ ద్విపదాం వరిష్ఠ
స్వచ్ఛందయోగేన భవంతి తత్ర ।
ఛందోవిదస్తేన చ తా నధీత్య
గతా న వేదస్య న వేద్య మార్యాః ॥  ౫౦

తా॥ మానవోత్తమా! వేదములు స్వేచ్ఛగాఁ బరమాత్మను గూర్చి తెలుపుటయందే ప్రమాణములుగా నున్నవి. కావునఁ బండితులు బ్రహ్మప్రీతిగా వేదములను బఠించి, వేద వేద్యమైన బ్రహ్మవస్తువునే పొందుదురు. అందుచే జ్ఞానులైన యార్యులు వేద్యమైన ప్రపంచమును బొందరు.

శం. భా. :- మానవోత్తమా! వేదములన్నియు యథేష్టముగాఁ బరమాత్మను నిరూపించుటలోఁ బ్రమాణములుగా నున్నవి.

శ్రు॥ "సర్వే వేదా యత్పదమామనన్తి"
"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః"

అను శ్రుతులను బరిశీలించినచో సకలవేదములును ఆ బ్రహ్మపదార్థమునే బోధించుచున్నవనియు, సకల వేదములచే అహంపదార్థమైన బ్రహ్మవస్తువే, తెలిసికొనఁ దగినదనియు దెలియుచున్నది. వేదములు పురుషార్థమైన బ్రహ్మవస్తువును బ్రతిపాదించుటచే బ్రహ్మేతరమైన దంతయు, అనిత్యము, అశుచి, దుఃఖభూయిష్ఠము నై యున్నదనియుఁ దెలియుచున్నది.

అందుచే వేదములవలన, బ్రహ్మస్వరూపమును, బ్రహ్మజ్ఞాన మును, బ్రహ్మప్రాప్తి సాధనములను దెలిసికొన వచ్చును. కావునఁ బండితులు వేదములను అధ్యయన మొనర్చి, వేదాన్త శ్రవణాదుల నాచరించి, వేదముయొక్క అనగా జ్ఞానరూపుఁడైన పరమాత్మయొక్క స్వరూపమును బొందుచున్నారు. వేద్యమైన ప్రపంచమును బ్రహ్మవిదులు పొందరు.

సీ. భా. : కర్మకాండ నాచరించువారు, కర్మాచరణ సమయమున, దానియర్థము నపేక్షింపరు. కర్మానుష్ఠానానన్తరము దానియర్థము నపేక్షింతురు. అట్లే వేదవిదులు వేదపఠన సమయమున, బ్రహ్మకాండార్థము నపేక్షింపరు.

శ్రు॥ "తద్ధైత త్పశ్యన్ ఋషి ర్వామదేవః ప్రతి
పదేఽహం మనురభవమ్ సూర్యశ్చ"

అను శ్రుతివలన వామదేవఋషి, సూర్యదర్శన సమయమున, నేనే మనువుననియు, దర్శనానంతరము జ్ఞానియైన, నేను సూర్యుఁడనైతినని, జ్ఞానముపొంది, తాదాత్మ్యమును జెందెను; అని తెలియుచున్నది. పై శ్రుతిని బరిశీలించినచో, ఒకక్రియ జరుగునపుడు, రెండవ క్రియ జరుగదనియు, అందుచే దర్శన క్రియలో సార్వాత్మ్యము సిద్ధించలేదు. దర్శనానంతరమే సార్వాత్మ్యము సిద్ధించినదని తెలియుచున్నది. "తిష్ఠన్ గాయతి" అనునదే దీనికి దృష్టాన్తము. ఎట్లన ? ఉండుట, గానము చేయుట అను రెండు క్రియలలో, "తిష్ఠతి" క్రియ జరుగునపుడు, "గాయతి" క్రియ జరుగదు. "తిష్ఠతి" క్రియ జరిగిన తర్వాతనే

"గాయత్రి" క్రియ జరుగును. అటులనే వేదపఠన క్రియ జరుగునపుడే జ్ఞానక్రియ జరుగదు. తదనన్తరము జరుగునని తెలిసికొనవలసి యున్నది. కావున కేవలకర్మమాత్ర జ్ఞానముచే వేదవేత్తలుకారు. సత్యజ్ఞానము కల్గినపుడే ఛందోవిదులు అగుదురు. "గతా న వేదస్య న" అనుచోటంగల రెండు నకారములు, సత్యజ్ఞాన పూర్వక వేదపఠనముచేఁ దప్పక వేదవేద్యమైన బ్రహ్మను బొందుదురని తెల్పుచున్నవి. అందుచే అట్టి బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి గురువునే ఆశ్రయించి తీరవలెనని తెలియుచున్నది. బ్రహ్మజ్ఞానము కలవారు వేద్యమైన ప్రపంచమును మఱిచేరరని తెలిసికొనుము. వేదవేద్యమైన బ్రహ్మను ఎఱుగనివారే ఛాందసులు, అనగా జ్ఞానహీను లన్నమాట. వారికి వేదమంత్రములకుఁ జెందిన ఋషి, ఛందస్సు, దేవత అను వాని వినియోగము తెలియదు. కావున గురుముఖమున వాని నన్నిటి నెఱిఁగి జ్ఞానవంతులు కావలెను. ద్విజులు పఠించు వేదాక్షరము లన్నియు హరినామములే సందేహములేదు. పై విషయమును గర్గ్యపాదులే నిర్ణయించిరి. కాన ఆ విషయములను గూడఁ దెలిసికొనవలెను.

—: బ్రహ్మజ్ఞుఁ డెవఁడు :—

శ్లో॥ న వేదానాం వేదితా కశ్చి దస్తి
కశ్చి త్త్వేతాన్ బుధ్యతే వాపి రాజన్ ।
యో వేద, వేదాన్ నసవేద వేద్యం
సత్యేస్థితో యస్తు స వేదవేద్యమ్ ॥ ౫౨

తా॥ వేదరహస్యముల నెఱింగినవాఁ డెవ్వఁడును లేఁడు. రాజా! చిత్తశుద్ధి కలవాఁ డెవఁడో, ఒకఁడు మాత్రమే, బ్రహ్మవస్తువును దెలియఁజేయు వేదములను దెలిసికొను చున్నాడు. వేదముల నెఱింగిన వాఁడైనను, సంశయాత్ముఁడైనచో వేదవేద్యమైన బ్రహ్మపదార్థమును ఎఱుఁగఁ జాలఁడు. సత్య మైన అక్షరబ్రహ్మయందు చిత్తమును నిల్పినవాఁడు మాత్రమే బ్రహ్మవస్తువును దెలిసికొనఁ గల్గుచున్నాఁడు.

నీ. భా. :- రాజా! పరబ్రహ్మస్వరూపము తెలిసికొన నశక్యము. వేదములందలి రహస్య మెఱిగినవాఁ డెవ్వఁడును లేఁడు. అతిశయమైన చిత్తశుద్ధి కలవాఁ డెవఁడో యొకఁడు మాత్రమే బ్రహ్మరహస్య ప్రతిపాదకములైన వేదములను దెలిసికొనుచున్నాఁడు. "తత్త్వమసి" అను వాక్యార్థమును అనుసంధించు వాఁడు వేదముల నెఱింగినను, అతఁడు పెక్కు వికల్పములతో (సందేహములతో) గూడిన కారణమున నిర్వి కల్పకమైన (వేద్యమును) బ్రహ్మపదార్థము నెఱుఁగ జాలఁడు. వేద్యమైన బ్రహ్మవస్తువు సకలేంద్రియ వ్యాపారములును లయమైనపుడే స్పష్టముగా గోచరించును. ప్రత్యక్చైతన్యము సత్యపదార్థము. అది యక్షరము. క్షరమైన ప్రకృతి యంత యును అధిభూతము. అధిభూతమున, నున్నను సకలేంద్రియ వృత్తులు నశింపఁ జేసికొని, సత్యమునందున్న వాఁడే నిర్వికల్ప సుఖ మెఱుఁగఁగలఁడు. వానికే వేద్యమైన బ్రహ్మవస్తువు గోచరించును.

అర్జున భాష్యము :- వేదములు బ్రహ్మస్వరూప నిరూపకములు, అనుటలో అన్వయ వ్యతిరేక వ్యభిచారములు గలవు. అన్వయ వ్యతిరేక వ్యభిచారముల నెఱిఁగినవాఁ డెవఁడో యొకఁడు మాత్రమే వేదములను దెలిసికొనుచున్నాఁడు. అట్లు వేదముల నెఱిఁగినను, ఆతఁడు సత్యమైన బ్రహ్మయందు లీనుఁడు కాలేఁడు; అని చెప్పుటయే అన్వయ వ్యభిచారము. ఈతఁడు సత్యస్థితిమంతుఁడు; "వేదముల నెఱుఁగుటవలన" అని చెప్పుట అనుమాన ప్రమాణము. వేదముల నెఱిఁగిన మాత్రాన సత్యస్థితి సంభవింపదు; అని చెప్పుటయే అనుమాన వ్యభిచారము. అన్వయ వ్యభిచారము ఈ క్రింది విధమున వివరింపఁ బడుచున్నది. ఎట్లన ? వేద మనగా విజ్ఞానము. వేదము సత్యమైనను గేవల వేదవేత్త ఆత్మజ్ఞానము లేనందున సత్యము నెఱుఁగఁ జాలఁడు. అని చెప్పుట అన్వయ వ్యభిచార మగును. సత్యవేదాజ్ఞానమందును సత్యజ్ఞానము కలదని చెప్పుట, వ్యతిరేక వ్యభిచారము. అనగా వేదమే సత్యము. అను జ్ఞానము లేనివానికిని సత్యజ్ఞానముండుట లోకమునఁ గలదు. కావున ఇదియే వ్యతిరేక వ్యభిచారము. పైనఁ జెప్పిన అన్వయ వ్యతిరేక వ్యభిచారములచే సత్యమైన బ్రహ్మపదార్థమునందు లీనుఁడై యున్నవాఁడు మాత్రమే వేద్యమైన సత్యమును దెలిసికొనుచున్నాఁడు. అట్టివాఁడే బ్రాహ్మణుఁడని యెఱుగవలెను.

స. భా. :- అంతమాత్రాన వేదములు అప్రయోజనము లనరాదు. వేదములైన ఉపనిషత్తుల యర్థ మెఱిఁగినవాఁ డెవఁడును

లేఁడనుచున్నారే. తమ రెట్లు తెలిసికొనుచున్నా రందు రేమో? ఎవఁడో జ్ఞానియైన వాఁడొకఁడు, తెలిసికొనుచున్నాఁడు. కాని సాధారణముగా నందఱును దెలిసికొన లేరని నాయభిప్రాయము వేదములైన కర్మభాగములను మాత్ర మెఱిఁగి, యజ్ఞములను జేయువాఁడు మాత్రము వేదవేద్యమైన బ్రహ్మ నెఱుఁగఁ జాలఁడు. వానికిఁ బ్రపంచము కూడ సరిగాఁ దెలియదు. వేద ములు పఠించి, బ్రహ్మజ్ఞానము పొంద యత్నించినవాఁడు సత్యమునందు లీనుఁడై వేద్యమైన బ్రహ్మవస్తువు నెఱుఁగును. వాఁడే పరులకు బ్రహ్మజ్ఞానోపదేశము చేయఁగల బ్రాహ్మణుఁ డగును.

శ్లో॥ న వేదానాం వేదితా కశ్చి దస్తి
వేద్యే న వేదం న విదు ర్న వేద్యం ।
యో వేద వేదం స చ వేద వేద్యం
యో వేద వేద్యం న స వేద సత్యమ్ ॥ ౫౩

తా॥ వేదములు జడములు. వేద్యమైన బ్రహ్మపదా ర్థము జ్ఞానస్వరూపము, కావున ఋగాది వేదములలో నేయొక్క టియును బరమాత్మను దెలిసికొనఁ జాలదు. అనగాఁ గేవల వేదపాఠకుఁడు జడుఁడుకానఁ బరమాత్మ నెఱుఁగ లేఁడన్న మాట. వేద్యపదమునకు, బ్రహ్మపదార్థము, జడమైన ప్రపం చము అని రెండర్థములు కలవు. వేద్యముననగాఁ గేవల జడ ప్రపంచము నెఱిఁగినవాఁడు వేదమైన పరమాత్మను ఎఱుఁగఁ జాలఁడు. అంతేకాదు. వానికి వేద్యమైన ప్రపంచముయొక్క

విషయముకూడ సరిగాఁ దెలియను. వేదమును అనగాఁ బర మాత్మను ఎఱిఁగిన జ్ఞానిమాత్రమే, సత్యమైన పరమాత్మను, వేద్యమైన ప్రపంచమును రెండింటిని దెలిసికొనఁ గలఁడని తెలియుచున్నది.

శం. భా. :-

శ్రు॥ అన్యదేవ, తద్విదితాదథో అవిది తాదధి
యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసాసహ ॥

అను శ్రుతులలో బ్రహ్మస్వరూపము వాక్కులతో వివ రింప శక్యముకాదనియు, మనస్సునకు సైతము గోచరము కాదనియు, విదితవస్తువుకంటెను, అవిదితవస్తువుకంటెను భిన్న మైన దనియుఁ జెప్పఁబడినది. వాని ననుసరించి చూచినచో ఋగాది వేదములలో నేయొకటియును, వాచామ గోచరుఁ డును, జ్ఞానరూపుఁడు నగు పరమాత్మను దెలియఁ జేయలేదని తెలియుచున్నది. ఋగాది రూపములైన వేదములు జడములు. జడములకు జ్ఞానరూపమైన బ్రహ్మపదార్థము తెలిసికొన శక్యము కాదు. వేద్యమైన జడప్రపంచమునకుఁ గూడ బ్రహ్మ వస్తువు తెలిసికొన శక్యముకాదు. సర్వసిద్ధియు, అనగా సృష్టి యంతయు సంవిద్రూపుఁడైన పరమాత్మ యధీనమునఁ గలదు. కానఁ బరమాత్మ నెఱిఁగిన జ్ఞానియే సకలసృష్టిని, బ్రపంచము నెఱుగును.

"ఆత్మనో వా అరే దర్శనేన, శ్రవణేన, మత్యా విజ్ఞా నేనేదం విదితమ్" అను శ్రుతిలో ఆత్మను దర్శించినవాఁడు, ఆత్మను గూర్చి ఆలకించినవాఁడు, ఆత్మను బుద్ధిబలముచేఁ

దెలిసికొనినవాఁడు ఆత్మ విజ్ఞానముకలవాఁడును మాత్రమే ఈ సర్వమును దెలిసికొనును అని చెప్పఁబడినది. అందుచే వేద్యమైన ప్రపంచమును మాత్రమే ఎఱిగినవాఁడు సత్యమును అనగాఁ బరమాత్మను దెలిసికొనఁ జాలఁడనియు, సత్యము నెఱిగిన వాఁడు వేద్యమైన ప్రపంచము నెఱుగఁగలడనియును దెలియు చున్నది.

నీ. భా. :- అంతేకాదు. వేద్యములైన అహంకారాదులు అచేతనములు. వానిలో నేయొకటియును వేదమును అనగా వేదవేద్యమైన బ్రహ్మవస్తువునుఁ దెలియఁజాలదు. వేద్యమైన చేతస్సుచే (మనస్సుచే) వేదబోధ్యమైన ఆత్మ నెవఁడును దెలిసికొనలేఁడు. మనస్సు జడము. అట్టి జడమునకు, ఆత్మకాని, అనాత్మ అనగా ఆత్మభిన్నమైన ప్రపంచముకాని గోచరములు కావు. అందుచే వేద్యమైన చేతస్సుచే అనాత్మ కూడఁ దెలిసికొనఁబడదు.

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" అను శ్రుతివలనఁజూలు కైన బుద్ధిచే ఆత్మవస్తువు తెలిసికొనఁ బడుచున్నట్లు తెలియు చున్నదే. ఏమందురు? అని శంకింపకుఁడు. ఆత్మయందే ప్రభవించుటచే, అనాత్మయైన సర్వప్రపంచమును, వేదమును అనగా ఆత్మను దెలిసికొనిన జ్ఞాని, తప్పక తెలిసికొనఁగలఁడు. బహిర్ముఖుఁడై, కేవల వేద్యమును అనగా అనాత్మయైన ప్రపంచము నెఱిఁగినవాఁడు మాత్రము సత్యమైన బ్రహ్మపదార్థమును దెలిసికొనఁజాలఁడు.

"పరాంచిఖాని వ్యతృణ త్స్వయంభూ
స్తస్మా త్పరాఙ్పశ్యతి నాంతరాత్మన్"

అను శ్రుతిలో స్వయంభువుఁడును, స్వతంత్రుఁడు నగు ఈశ్వరుఁడే పరాంచి అనగా బహిర్ముఖములైన ఇంద్రియములను హింసించెను. అనగా ఈశ్వరుఁడు మాత్రమే వీనిని అణఁగఁద్రొక్కెను. ఈశ్వరునికంటె భిన్నుఁడైన జీవి అజ్ఞాని యగుటచే ఇంద్రియములను, ఆత్మగాఁ దలంచి చూచుచున్నాఁడు. కాని అంతరాత్మను మాత్రము చూడలేకున్నాఁడని చెప్పఁబడెను. పై శ్రుతియు వేద్యమైన ప్రపంచము నెఱిఁగినవాఁడు సత్యము నెఱుఁగలేఁడనియే తెల్పుచున్నది.

—: ప్రమాత-బ్రాహ్మణుఁడు; అన నెవరు ? :—

శ్లో॥ యో వేద వేదాన్ స చ వేదవేద్యం
న తం విదు ర్వేదవిదో న వేదాః।
తథాపి వేదేన వద న్తి వేదం
యే బ్రాహ్మణా వేదవిదో భవ న్తి॥ ౫౪

తా॥ కేవలము ఋగాది వేదములను బఠించువాఁడు మాత్రము, వేదవేద్యమైన పరబ్రహ్మను దెలిసికొనఁ జాలఁడు. జడములైన వేదములు, కేవల వేదపాఠకులును మాత్రము, తత్ పదార్థమైన పరమాత్మను దెలిసికొనఁ జాలరు. తెలియఁజేయలేరు. బ్రహ్మజ్ఞాన సంపన్నులైన వేదవేత్తలు మాత్రము పరమాత్మను దెలిసికొని, ఇతరులకు దెలియఁజేయఁ గలరు.

వేదపఠనము, వేదార్థజ్ఞానము, వేదకర్మానుష్ఠానము, అను మూడింటిని ఎఱిగినవారే వేదవేత్తలైన బ్రాహ్మణు లగు చున్నారు.

శం. భా. :- "వేదే న వేదం నవిదు ర్న వేద్యమ్" అను సూక్తినిబట్టి, వేదములైన కర్మభాగముల నెఱిగినవానికి బ్రహ్మ పదార్థమే కాక వేద్యమైన ప్రపంచముకూడఁ దెలియదని చెప్పిరి కదా! అయినచో ఆత్మవిదుఁడు కానివానికిఁ బ్రపంచమే సిద్ధించదన్నమాట; అని శంకింప నవసరములేదు. కారణ మేమన ?

కేవలము ఋగాది వేదపఠనము తెలిసినవాఁడు అనాత్మ విదుఁడే అగును అనగా ఆత్మజ్ఞానము లేనివాఁడే యగును. అట్టివాఁడు ఆత్మకంటె భిన్నమైన ప్రపంచము నెఱుఁగును. అంతమాత్రానఁ బరమాత్మను సైతము తెలిసికొన శక్యము కాదు. కేవల వేదవిదులు, వాచామగోచరుఁడైన పరమాత్మ నెఱుఁగఁజాలరు. వేదవిదులే కాదు, వేదములు సైతము సూటిగాఁ బరమాత్మను దెలుపఁజాలవు. అట్లైనచో వేదము లైన ఉపనిషత్తులు మాత్రము, బ్రహ్మవస్తువు నెట్లు వివరింపఁ గలవని శంకింప నవసరము లేదు. బ్రహ్మజ్ఞాన సంపన్నులు మాత్రము ఋగాది వేదములచే వాగాదులకు గోచరము కానట్టియు, సంవిద్రూపుఁడు నగు పరమాత్మను దెలిసికొను చున్నారు. అట్టివారే వేదము లెట్లు బ్రహ్మను బ్రతిపాదించునో తెలిసికొని, లోకమునకు ఉపనిషద్రూపమునఁ దెలియఁ

జేయఁగలరు. కావున వారే వేదవేత్తలైన బ్రాహ్మణులు అగు చున్నారు.

నీ. భా. :- అంతేకాదు. చిదాత్మ అందఱకుఁ బ్రత్యక్ స్వరూపుఁడుగా బ్రసిద్ధుఁడై యున్నాఁడు. అట్టి ప్రత్యక్ స్వరూపుఁడైన పరబ్రహ్మను దెలియఁజేయుటచేతనే వానికి వేదము లను సంజ్ఞ యేర్పడినది. వేదపఠనము, వేదార్థగ్రహణము, వేదోక్తకర్మానుష్ఠానము అను మూఁడింటిని ఆచరించినవారే వేదవిదులు అగుదురు. వారు అధ్యయన యజ్ఞాదులచే సంస్కృత చిత్తు లగుదురు. పై రీతిని వేదముల నెఱిఁగిన వారే వేద ప్రమాణముల నెఱిఁగిన వారై ప్రమాత లనఁబడుదురు వారికే వేద్యము అనగాఁ బ్రమేయమైన పరమాత్మ తెలియును. కేవల వేదములు జడములు కాన వేద్యమును దెలిసికొనలేవు.

శ్రు॥ "ప్రాణస్య ప్రాణం, చక్షుష శ్చక్షుషం, శ్రోత్రస్య శ్రోత్రం, మనసో యే మనోవిదుః"

అను శ్రుత్యర్థమును బరిశీలించినచోఁ బ్రాణములను నేత్రములను, శ్రోత్రములను, మనస్సును ఆయా పనులపైఁ బ్రవర్తింపఁ జేయువాఁడు పరమాత్మయే అను విషయము నెఱుఁగుటకు, వేదములే ప్రమాణములు. అట్టి పరబ్రహ్మ శక్తిని, నారాయణునిఁ గేవల వేదపాఠకులు తెలిసికొనలేరు. "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానముగల వేదవిదులు వేదప్రమాణముచే, వేద్యమైన పరమాత్మను దెలిసికొనుచున్నారు. అట్లు పరబ్రహ్మ నెఱిఁగిన వేదవిదులే బ్రాహ్మణు లగుచున్నారు.

శ్లో॥ ధామాంశ భాగస్య (యమాంశ భాగస్య) తథా హి వేదా

యథా చ శాఖా హి మహీరుహస్య ।
సంవేదనే చైవ యథామనన్తి
తస్మిన్హి సత్యే పరమాత్మనో౽ర్థే ॥ ౫౨

తా॥ చెట్టు గుర్తించుటకు దాని శాఖలు హేతువులగునట్లే, యామాంశభాగమైన పాడ్యమి చంద్రుని గుర్తించుటకు వేదమే హేతు వగుచున్నది. తేజోమయుఁడైన చంద్రుని గుర్తించుటకు ప్రతిపచ్చంద్రకళయే హేతు వగుచున్నది. అట్లే సత్యమైన పరమాత్మను, బరమాత్మజ్ఞానమును దెలియఁ జేయుటకు వేదములే హేతువులగుచున్నవి.

శం. భా. :- వృక్షము కలదని గుర్తించుటకు శాఖలు హేతువగునట్లు, యామాంశ భాగమైన ప్రతిపచ్చంద్రకళను (పాడ్యమిచంద్రుని) గుర్తించుటకు "త్రియామశ్చంద్రః" అను శ్రుతి హేతువగుచున్నది. అట్లే నిత్యమును, వినాశహీనమును బరమ పురుషార్థమును, బూర్ణానందరూపము నగు పరమాత్మ స్వరూపమును, నిరూపించుటకు వేదములు హేతువు లగుచున్నవి. అవి (వేదములు) వాచామగోచరుఁడైన పరమాత్మను సాక్షాత్తుగాఁ బ్రతిపాదించవు. అనుమాన ప్రమాణముచే నిరూపించు చున్నవి.

నీ. భా. :- "ధామాంశభాగస్య" అను పాఠమును గ్రహించినచో ధామము అనగాఁ దేజస్సు చంద్రుఁడు తేజో

మయుఁడు. అతని భాగమైన ఒకకళను, ప్రతిపత్తును అనఁగాఁ బాడ్యమినిఁ బొందినది. ఆప్రతిపత్కళయే, చంద్రుని జ్ఞప్తికిఁ దెచ్చుటకు స్వీకరింపఁ బడుచున్నది. చెట్టు అని తెలిసికొనుటకు దాని శాఖ గ్రహింపఁబడుచున్నదికదా! అట్లే పరమపురుషార్థ రూపుఁడును, సర్వథా అబాధ్యుఁడును, సత్యస్వరూపుఁడు నగు పరమాత్మను గుర్తించుటకు వేదములు స్వీకరింపఁ బడుచున్నవి. "సోయం దేవదత్తః" అను వాక్యము ఆ వీఁడే దేవదత్తుఁ డని సూచించినట్లే "తత్త్వమసి" మున్నగు వాక్యములును లక్షణాశక్తిచే ఉపనిష ద్బోధితుఁడైన పరమపురుషుని సూచించును. అట్లే వేదములును వాచామగోచరుఁడైన పరమపురుషుని సూచించుచున్నవి.

లక్ష్మాభరణ భాష్యము :- అంతేకాదు. "ధర్మాంశభాగస్య" అను పాఠమును స్వీకరించినపుడు, ఇట్లు చెప్పవలెను వేదములు పరమాత్మ ధర్మములను, బరమాత్మనుండి వెలువడిన ప్రకృతియొక్క ధర్మములను బ్రతిపాదించుటచే ధర్మాంశభాక్కులు అగుచున్నవి. శాఖలు, మహీరుహామునువలె, వేదములు పరమాత్మ ప్రీతికై పరమాత్మ ధర్మములతోఁబాటు పరమాత్మను సైతము తెలియఁ జేయుచున్నవి. పదసమన్వయముచేతను, వాక్య సమన్వయముచేతను బరమాత్మను జ్ఞాపకము చేయుచున్నవి. పరమాత్మ ధర్మములు యజ్ఞాది కర్మల రూపమున వెల్లడి చేయఁబడుచున్నవి. ప్రళయమునందుఁ గర్మలు నశించినచో గర్మ ప్రతిపాదకములైన వేదభాగములు

నిరర్థకము లగును. అందుచే ధర్మరూపములైన కర్మలు నిత్యములే కాని అనిత్యములు కావు.

శ్రు॥ క్వచి దజయాత్మ నానుచరతో ఽనుచరే న్నిగమః॥

అనుశ్రుతి గీతానూక్తిని బరిశీలించినచో ఒకప్పుడు సృష్టికాలమున అజయయైన లక్ష్మితోఁగూడిన పరమాత్మ రామకృష్ణాది రూపమున అవతరించి, తమ కనుకూలములైన యజ్ఞాదికములను దనప్రీతికై ఆచరించుటకు నిగమములను వేదరూపమునఁ బ్రకృతిలోఁ బ్రకటించె నని తెలియుచున్నది. అందుచే వేదములు విధినిషేధ రూపధర్మములను లోకమున వెదజల్లినవి. అందుచే వేదములు "ధర్మాధర్మములకు భేదము లేద"ను న్యాయము ననుసరించి, ధర్మస్వరూపుఁడైన నిత్యసత్య స్వరూపుని వ్యక్తము చేయుటయందే చరితార్థము లగుచున్నవి.

శ్లో॥ అభిజానామి బ్రాహ్మణం వ్యాఖ్యాతారం విచక్షణం।
యశ్ఛిన్నవిచికిత్సస్స వ్యాచష్టే సర్వసంశయాన్॥ ౫౬

తా॥ బ్రహ్మయనగా వేదము. అందలి పరమాత్మ స్వరూపమును బక్కగా వివరించి చెప్పఁగలవాఁడే విచక్షణుఁడైన బ్రాహ్మణుఁడు. అతఁడే పరబ్రహ్మ నిరూపణలోఁ గల్గు సందేహములను, సామాన్యములైన సంశయములను దొలఁగించి, చెప్పఁగలఁడు అట్టివానినే బ్రాహ్మణునిగా నేను గుర్తించుచున్నాను.

శం. భా. :- వేదములందలి పరమాత్మ స్వరూపమును వేదన చేయువాఁడే (తెలియఁ జేయువాఁడే) బ్రాహ్మణుఁడు ఆతఁడే విచక్షణుఁడు. అనగాఁ జక్కఁగా వివరించి చెప్పఁగల వాఁడు. ఆతఁడే వినెడివారి విచికిత్సలను అనగా సందేహములను దొలఁగించఁ గలఁడు. పరమాత్మ నిరూపణములో సామాన్యులకుఁ గల్గు సంశయములను వివరించి చూపి, తొలగించఁగలఁడు.

నీ. భా. :- బ్రాహ్మణుఁ డనగా బ్రహ్మవేత్త. ఆతఁడే బ్రహ్మవిద్యను బోధించుటలో, ఉపక్రమము, ఉపసంహారము, ఏకరూప్యము, మున్నగు షడ్విధ మార్గముల ననుసరించి, వేద వాక్యార్థములను నిరూపింపఁ గుశలుఁడు. అట్టి కుశలునే వేద వ్యాఖ్యాత యందురు. అట్టి వేదవ్యాఖ్యాతయే నిధిధ్యాస పరిపాకముచే అపరోక్ష బ్రహ్మను సాక్షాత్కరింప జేయ బలము గలవాఁడై విచక్షణుఁడు అని అనిపించుకొనును. "స్వరూప వ్యాక్రియైన పరాక్రియా" అను న్యాయము ననుసరించి, ఆతఁడే ఛిన్నసంశయుఁడై పరుల సంశయముల నెల్లఁ బాపఁగలఁడు. ఆతఁడే పరబ్రహ్మోపదేశము చేయఁ గల గురువు.

సర్వజ్ఞ భాష్యము :- "అత్రా సఖాయ స్సఖ్యాని జానతే" అను శ్రుతిలోఁ జెప్పినట్లు నేను మాత్రమే తత్త్వజ్ఞాని నగుటచే అట్టి బ్రాహ్మణుని గురువును ఎఱుఁగఁగలను. నీవు ఎఱుఁగఁ జాలవుసుమా! అని సనత్సుజాతుఁడు చెప్పెను.

వివరణము :- గురుశుశ్రూష సేయువానికిని శ్రద్ధ, చిత్తశుద్ధియును గలవానికి మాత్రమే వేదరహస్యములు తెలియును.

పై మూఁడింటిలో నే యొకటి లోపించినను వేదరహస్యములు తెలియవు. అపుడు వేదపాఠకునకు సంశయములే కల్గును. అజ్ఞుఁడు అగును. అందుచే వాఁడు "అజ్ఞశ్చా శ్రద్ధ ధాన శ్చ సంశయాత్మా వినశ్యతి" అను గీతాసూక్తిలోఁ జెప్పినట్లు నశించును. అందుచేఁ బ్రతిమానవుఁడు శ్రద్ధాచిత్తశుద్ధులు కల్గి క్షరాక్షర వస్తువులు ఏవేవి తెలిసికొని, వానిలో అక్షరమైన బ్రహ్మవస్తువును దెలిసికొనవలెను.

"క్షరస్సర్వాణి భూతాని కూటస్థో ఒక్షర ఉచ్యతే" అను గీతాసూక్తిని బరిశీలించి, క్షరములైన (నాశస్వభావము గల) వానియందు దృష్టినుంచక, అక్షరుఁడగు పరబ్రహ్మ యందు దృష్టి నుంచవలెను. అట్టి స్థితిలోనున్న వానికే (1) స్థూల సూక్ష్మ శరీరసహితుఁడైన పరబ్రహ్మ జీవుఁడై అధ్యాత్మము అగుననియు, (2) కంటికిఁ గానవచ్చు క్షరవస్తువు అధిభూత మగు ననియు, (3) అధ్యాత్మాధి భూతములకుఁ గలయిక చేకూర్చు జీవాత్మ అధిదైవమగు ననియు, (4) జీవులచే ఆరాధింపఁ బడు నీశ్వరుఁడే అధియజ్ఞ మగుననియుఁ జక్కఁగాఁ దెలియును. అట్టివాఁడే విచక్షణుఁడైన బ్రాహ్మణుఁడై ఇతరులకు బ్రహ్మపదార్థమును బోధింపఁ గలవాఁడగును. అట్టివాఁడే వేద్యమేదో, వేదమేదో చక్కఁగాఁ దెలిసికొని చెప్పఁగలవాఁడగును. అట్టివాఁడే వేదములను బరమార్థదృష్టితో నభ్యసించి వేదార్థ మెఱిఁగి వైదికకర్మలను బ్రహ్మార్పణబుద్ధితోఁ గావించి. వేదవేత్త యగును.

శ్రు॥ తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివే
నమస్కుర్యాత్"

అను స్వాధ్యాయ మంత్రముల లోఁ జెప్పినట్లు అట్టి వేద వేత్తయైన బ్రాహ్మణుఁడే నిత్యనమస్కార్యుఁ డగును. అట్టి వేదవేత్తయే "ఆత్మానాత్మ వివేకము కలవాఁడగును." అందుచేఁ బ్రతిమానవుఁడును వేదవేత్తయగుటకుఁ బ్రయత్నింప వలెను. ఈ మహాఘోర కలియుగమున సర్వవిజ్ఞాన నిధియైన వేదములను, వేదవేత్తలను సంరక్షించి, కలిబాధను దొలఁగించుటకుఁ బెద్దలందఱును బ్రయత్నించుట చాలముఖ్యము.

శ్లో॥ నాస్య పర్యేషణం గచ్ఛేత్ ప్రాచీనం నో తదక్షిణం।
నార్వాచీనం కితస్తిర్యఙ్నాదిశం నకథం చన ॥ ౫౭

తా॥ తూర్పు, దక్షిణము మున్నగు దిక్కులందును, ఆగ్నేయము మున్నగు నవాంతర దిక్కులందును బరమాత్మ గలఁడేమో యని వెదకుట వ్యర్థము. పరమాత్మ అంతటను గలఁడు. అట్టి పరమాత్మను నిరూపించుటకు జ్ఞానియైన బ్రాహ్మణుఁ డొక్కఁడే సమర్థుఁడు

నీ. భా. :- రాజా ! పైనఁ జెప్పినట్లు సత్యనిష్ఠ కలవాఁడు విషయపరుఁడు కాలేఁడు. కాన నిజమైన బ్రాహ్మణుఁడు అగును. నిజమైన బ్రాహ్మణునకు అభిముఖముగా నుండి, ఆతఁడు చెప్పిన మార్గము ననుసరించి, పరమాత్మను అన్వేషింపవలెను. ధ్యానించవలెను. వ్యాఖ్యాతయైన బ్రాహ్మణుఁడు పరబ్రహ్మ స్వరూపమును జక్కగా నెఱిగించుటనే

పరమోత్కృష్టక్రియగా భావించి, బోధించును. కావునఁ బరమాత్మ, తూర్పున, దక్షిణమున, బడమరను, ఉత్తరముననను, అవాంతరదిక్కులను గలఁడని అన్వేషింపరాదు. ఆతఁడు అధిశుఁడు. అనగా ఒకదిక్కున లేఁడు. ఒక దేశమున లేఁడు. ఆతఁడు సర్వాంతర్యామి. సర్వవ్యాపకుఁడు. అంతర్హృదయుఁడు. కాన ధ్యానించు వారికి హృదయములందు గోచరించును అందులకై ప్రయత్నించుట, పరమాత్మ సాక్షాత్కారమునకై ఆత్మానుసంధాన మొనర్చుకొనుటయు ముఖ్యము. పుత్రాదులను వలె, బరమాత్మను బాహ్య ప్రదేశముల వెదకుట వ్యర్థము.

వివరణము :-

> శ్లో॥ "అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా ।
> సదా జనానాం హృదయే సన్నివిష్టః ॥"

అంగుష్టమాత్రః పురుషో జ్యోతి రివాధూమకః" అను నిడి ఉపనిషన్మంత్రములను బరిశీలించినచో బరమాత్మ అంగుష్ఠప్రమాణుఁడై, ధూమము లేని జ్యోతిరూపుఁడై జనుల హృదయపద్మమునఁ గలఁడనియు, ఆతఁడే అంతరాత్మ యని చెప్పఁబడుచున్నాఁడనియుఁ దెలియుచున్నది. పరమాత్మ హృదయమున నెచటఁగలఁడని ప్రశ్నింప నక్కఱలేదు ?

> శ్రు॥ పద్మకోశ ప్రతీకాశం హృదయంచా ప్యధోముఖం ।
> అథో నిష్ట్యామితి స్యాంతే నాభ్యా ముపరితిష్ఠతి ।

జ్వాలామాలాకులం భాతి విశ్వస్యాయతనం మహత్
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః।
నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా।
నీవార శూకవత్తన్వీ పీతాభా స్స్వత్స్వణూపమా॥

అను పురుషసూక్త మంత్రములలో ఆవిషయము చక్కగా వివరింపఁ బడినది. ఎట్లన? ప్రాణుల శరీరమున నాభికి మీఁదిభాగమునఁ దామర మొగ్గవంటి యాకారముగల కోశము అధోముఖముగాఁ గలదు. అందు విశ్వమంతటికిని మహాధారమైన పరమాత్మ జ్వాలామాలారూపమున, ప్రకాశించుచుఁ గలఁడు. ఆ హృత్పద్మకోశపు మధ్యభాగమున నున్న పరమాత్మ అణుస్వరూపమైన అగ్నిశిఖగా నుండి మెఱయు చున్నాఁడు ఆతఁడు నివరధాన్యపు గింజ చివరను గల ముల్లువలె సూక్ష్మరూపుఁడై పీతవర్ణుఁడై కలఁడు. ఆతఁడు చూపరులకు నల్లటి నీటిమేఘపు మధ్యభాగమున నున్న మెఱపుఁ దీగవలె మెఱయుచుఁ గానవచ్చునట. ఆ చూపరు లెవరందురా? వారే, యోగులు, జ్ఞానులు, ఉపాసకులు, తపశ్శాలురు; వేదవేత్తలును. వా రెట్లు చూడఁగల్గుచున్నారో ఈ క్రింది మంత్రము మనకుఁ దెలుపుచున్నది చూడుఁడు.

శ్లో॥ ఊర్ధ్వం ప్రాణ మున్నయ త్యపానం ప్రత్య గస్యతి।
మధ్యే వామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే॥

పైనఁ బేర్కొన్న చూపరులే విశ్వేదేవులు. వారు పరమాత్మ సాక్షాత్కారమునకై ప్రాణాయామము చేయు

దురు. అందుచే బ్రాణవాయువును మీఁదికి నెట్టి, అపాన వాయువును గ్రింది కడంచి, కుంభకస్థితిలో హృత్పుండరీక మధ్యస్థుఁడైన, వామన నామమున విలసిల్లు పరమాత్మను జూచి, ముక్తు లగుచున్నారట. మన యాంధ్రభాషా పోషక చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు ప్రత్యూషకాలమున మేల్కాంచి, పైనఁ బేర్కొన్నట్లు ప్రాణాయామ మాచరించుచు, వామనునిగాంచి, స్తుతించు చుండెడి వాఁడని యాంధ్రకవితా పితామహుఁడు.

"ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ, వామన స్తుతి పరత్వమున లేచి"

అను మనుచరిత్రపద్యమున సూచించెను. ఇదియే మా యమ్మగారివంటి ముసలమ్మలు తెల్లవారు ఝామున పాడెడి దధి వామన స్తోత్రము.

—: ఆత్మాన్వేషణ పద్ధతి :—

శ్లో॥ తస్య పర్యేషణం గచ్ఛేత్ ప్రత్యర్థిషు కథం చన ।
అవిచన్వ న్నిమం వేదే తపః పశ్యతి తం ప్రభుమ్॥౫౬

తా॥ దేహేంద్రియాదులు శబ్దస్పర్శాదులును బరమాత్మకుఁ బ్రత్యర్థులు. వానిలోఁ బరమాత్మ లేఁడు. అందుచే వానినే పరమాత్మగాఁ దలంచరాదు. జ్ఞానులు పరమాత్మను గూర్చి వేదములందే వెదుకుదురు. కొందఱు వేదములద్వారా పరమాత్మను దెలిసికొనఁ లేక, తపోమార్గమునఁ బరమాత్మను

గాంచెదరు. పిమ్మట సమస్తమునకును బరమాత్మయే ప్రభువని జ్ఞానులును దపశ్శాలురును నిర్ణయించిరి.

४०. భా. :-

శ్లో॥ విషయా శ్చేంద్రియా ణ్యేవ దేహోఽహం కార ఏవచ ।
బాహ్యా ఆభ్యన్తరా ఘోరా శ్శత్రవో యోగిన స్స్మృతాః॥

అను సూక్తిని బరిశీలించినచో ఆత్మానుసంధానము గావించు యోగికి ఆటంకము లొదవించు శత్రువులెందఱో కలరు. వారిలోఁ గొందఱు బాహ్యులు, కొందఱు ఆభ్యన్తరులు. విషయములు అనగా విషయవాసనలును (శబ్దస్పర్శాదులు) అహంకారమును యోగికి విఘ్నములు గావింతురు. ఇంద్రియములు దేహమును యోగికి బాహ్యశత్రువులు. అవి యోగి దృష్టిని బాహ్యప్రపంచమునకు మఱల్చి విఘ్నము లొనర్చును కావున దేహేంద్రియ శబ్దాది విషయములు పరమాత్మప్రాప్తికిఁ బ్రత్యర్థులు. అనగా శత్రువులు. వారిని గూర్చి దిక్కులం దెచ్చటఁ గలరా? యని వెదకుట వ్యర్థము. అందుచే ఆత్మాన్వేషకులు విషయాన్వేషణ పరులుకారాదు. జ్ఞానులు విషయములనుండి దృష్టిని మఱల్చి, ప్రత్యగాత్మయైన పరబ్రహ్మను గూర్చి, వేదములయందు, ఉపనిషత్తులందు, "తత్త్వ మస్యాది వాక్యములందును" బరిశీలించెదరు. పిమ్మట సకల ప్రపంచమునకును బరమాత్మయే ప్రభువని తెలిసికొందురు.

కావున ఆత్మకుఁ బ్రతిపక్షులైన దేహేంద్రియాదులను, వానిధర్మములను ఆత్మగా గ్రహించరాదు. దేహేంద్రియాదు

లకే కాదు; సకలసృష్టికిని సాక్షీభూతుఁడైన ఆత్మయే ప్రభువని తత్త్వంపదార్థ శోధనానంతరము తెలియును.

సీ. భా. :- అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయానంద మయకోశము లైదును ఆత్మగా లోకమునఁ ప్రఖ్యాతములు. అవియే నిజముగాఁ బరమాత్మకుఁ బ్రత్యర్థులు వానిని జక్కఁగా నన్వేషించి, ఆ పంచకోశములును ఆత్మ కావని తెలిసికొనవలెను. కాని ఆత్మ అవ్యక్తమని తెలిసికొనుట చాలకష్టము.

"అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహావద్భి రవాప్యతే" అను సూక్తిని బరిశీలించినచో అవ్యక్తమైన ఆత్మయే అందఱికిని గతి. అనగా ముఖ్యముగాఁ బొందఁదగిన వస్తువు. కాని ఆత్మను బొందుటకై దేహవంతులైన జీవులు చాల దుఃఖమును క్లేశమును బొందు చున్నారని తెలియుచున్నది.

వేదాన్త న్యాయము ననుసరించి, వేదములందు ఆత్మ కలదా? లేదా? అని వెనుకరాదు. "తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః" అను శ్రుతి ననుసరించి చూచినచో నిష్కలుఁడును ప్రభువు నగు ఆత్మను తెలిసికొనుటకుఁ గాని, చూచుటకుఁ గాని తపోమార్గము, లేక, ధ్యానమార్గము అనునవే ముఖ్యములు. ముఖ్యముగాఁ దపశ్శాలి ఆత్మను జూచుచున్నాఁడని చెప్పవచ్చును. అందుచే ఆత్మాన్వేషణలోఁ దపోధ్యాన మార్గముల ననుసరించుట మంచిది.

లక్షాభరణ భాష్యము :- గురుశుశ్రూష, విద్య, ధనము మున్నగు సాధనములచే శ్రవణ మనన ధ్యానాదులఁ గావించి, ఆత్మను అన్వేషింపవలెను.

శ్లో॥ తూష్ణీం భూత ఉపాసీత, నచేష్టే న్మనసా పిచ ।
ఉపావర్త స్వతద్బ్రహ్మ అంతరాత్మని విశ్రుతమ్॥ ౬౯

తా॥ సకల లౌకిక విషయములను బరిత్యజించుటయే తూష్ణీంభావము. తూష్ణీంభావము పొందినవాఁడే తూష్ణీం భూతుఁడు. అట్లు ప్రతిమానవుఁడు తూష్ణీం భూతుఁడై, మనసు నందు నైతము విషయవాంఛ లేనివాఁడై, పరమాత్మ నుపాసించవలెను. అట్లు సమస్తము నుపసంహరించు కొనినవాఁడై, తన యంతరాత్మలోనే పరబ్రహ్మ కలఁడని యెఱింగి ఆతనినే ధ్యానించవలెను.

శం. భా. :- సర్వవిషయ పరిత్యాగముచేసినఁ గాని ఆత్మదర్శనము సిద్ధింపదు. కావున మానవుఁడు సర్వకర్మ సన్న్యాస మొనర్చి, స్వాత్మ వ్యతిరిక్తమైన సమస్తమును బరిత్యజించి, కేవలుఁడై లోకమును స్వాత్మగానే ఉపాసించవలెను. మనసునందైనను విషయేచ్ఛ కల్గియుండరాదు. ఇట్లు తూష్ణీంభూతుఁడై విషయముల నుపసంహరించి, లోకమును స్వాత్మగా భావించినవాఁడే బ్రాహ్మణుఁడు. అట్టివానికే అపూర్వమైన బ్రహ్మసాక్షాత్కారము జరుగును.

"యమే వైష వృణుతే, తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వామ్". అను సూక్తిలోఁ బై విషయమే

ప్రకటింపఁ బడెను. ఎట్లన ? ఎవఁడు ఆత్మను నిశ్చల మనస్సును నిల్పి, ధ్యానించునో వానికే పరబ్రహ్మ తన రూపమున జూపును. అని తెలియుచున్నది.

నీ. భా. :- బ్రహ్మసాక్షాత్కారముకై ప్రయత్నించు నాతఁడు వాక్కు మున్నగు బాహ్యేంద్రియముల వ్యాపారములను విడిచిపెట్టవలెను. జ్ఞానేంద్రియములను బరమాత్మ ధ్యానానుకూలములుగా నుంచవలెను. మనస్సును నిగ్రహించుకొనవలెను. దేవప్రసిద్ధమైన పరబ్రహ్మను అంతరాత్మలో అనగా హృదయాకాశము లో నిల్పి, మనోనేత్రముతోఁ గాంచవలెను.

లక్షాభరణ భాష్యము :- బ్రహ్మవలోకమునకై జపాదులుపయోగింపవు. తూష్ణీం భావముతో మెలంగి, జ్ఞానమార్గమునఁ బరబ్రహ్మను హృత్పుండరీకమునఁ గాంచవలెను. పరమాత్మాన్వేషణకు అపరోక్ష జ్ఞానము ముఖ్యము. "ఆవృత్తి రసకృ దుపదేశాత్" అను సూత్రమునఁ జెప్పినట్లు, యోగీశ్వరుల చెంతకేగి, ఉపదేశము పొంది, వారు చెప్పినది మాటిమాటికిని ఆవృత్తి చేసికొనవలెను. అనగా మననము చేసికొనవలెను. అట్లు శ్రవణ మననముల నొనర్చి, బ్రహ్మను ధ్యానించి, చిత్తమున నిల్పిచూడవలెను.

## —: మునియన నెవఁడు :—

శ్లో॥ మౌనా న్న సముని ర్భవతి, నారణ్య వసనా న్మునిః ।
స్వలక్షణం తు యోవేద సముని శ్రేష్ఠ ఉచ్యతే ॥ ౬౦

తా॥ మౌనము వలన మునికానేరఁడు. అరణ్యమున నివసించిన మాత్రాన ముని కానేరఁడు. "స్వ" అనగాఁ బర బ్రహ్మ. ఆతని లక్షణ మెఱిఁగిన యాతఁడే మునిశ్రేష్ఠుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

శం. భా. :- తూష్ణీం భావరూప మౌనమువలన ముని కానేరఁడు. అరణ్యమున నివశించిన మాత్రాన ముని కానేరఁడు. "అయ మహ మస్మి" అను వాక్యములోఁ జెప్పి నట్లు "నేను ఈ పరమాత్మను" అను నిశ్చయముతో అక్షర మైన పరబ్రహ్మ నెఱిఁగిన వాఁడే స్వలక్షణ మెఱిఁగిన వాఁడు. వాఁడే మునిశ్రేష్ఠుఁ డగును. "ఏత మేవ విదిత్వా ముని ర్భవతి" అను సూక్తియు నీ విషయమునే నిరూపించుచున్నది.

నీ. భా. :- అటులనే ధ్యానించినమాత్రాన ముని కానేరఁడు. జగజ్జన్మాది హేతువును సచ్చిదానంద స్వరూ పుఁడు నగు ప్రత్యగాత్మ నెఱిఁగిన జ్ఞానియే మునిశ్రేష్ఠుఁ డగును. ఆతఁడు సన్న్యాసులకంటె యోగులకంటెను శ్రేష్ఠుఁడు.

అర్జున భాష్యము :- జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయము లనెడి యర్థమును వ్యక్తపఱచు "అకారోకార మకారార్థ మాత్రల కలయికయే ఓంకారము." అదియే స్వరూపమైన అక్షరపరబ్రహ్మ. దాని నెఱిగినవాఁడే ముని యగును.

సర్వజ్ఞ భాష్యము :- ఆ యోంకారమే విష్ణు శివ బ్రహ్మ పరబ్రహ్మ వాచకమై "ఓం తత్సత్" అని సవాక్షర పాదమై యున్నది. దాని నెఱిగినవాఁడే మునిశ్రేష్ఠుఁడు. "తే వా ఏ కే నాక్షరేణ ఛందాంసి వియన్తి నవాద్యాభ్యామ్" అని బ్రాహ్మణ

మునఁ గలదు. "ఓం" అనెడి యేకాక్షరముతోడనే ఛందస్సులు అనగా వేదములు నిండియున్నవి. కాని రెండింటితో లేవు. అదియే బ్రహ్మపదార్థము. ఆ విషయ మెఱిగిన జ్ఞానియే ముని శ్రేష్ఠుఁడు.

—: వైయాకరణుఁ డన నెవఁడు ? :—

శ్లో॥ సర్వార్థానాం వ్యాకరణా ద్వైయాకరణ ఉచ్యతే ।
తన్మూలతో వ్యాకరణం వ్యాకరోతీతి తత్తథా ॥ ౬౧

తా॥ సకల వస్తువులను, వాని నామరూపములను ప్రకృతి ప్రత్యయాదుల ద్వారా వివరించి చెప్పెడివాఁడే వైయాకరణుఁడు, నామరూపము లన్నియు అక్షరరూపములే. పరబ్రహ్మయును అక్షరుఁడే. ఆతఁడే నామరూపాత్మక ప్రపంచమునకును, వానిని దెల్పుశబ్దములకును మూలము. వాని నన్నిటిని వివరించి చెప్పుటచే వ్యాకరణము తన్మూల మాయెను. తత్ అనగాఁ బరబ్రహ్మ. ఆతఁడే వేదాది శబ్దముల ద్వారా ప్రకృతిని వివరించి చూపుచున్నాఁడు. అందుచేఁ బరమాత్మయు, ఆత్మజ్ఞానము తెల్పు వ్యాకరణశాస్త్ర మభ్యసించినవాఁడును వైయాకరణులు అగుచున్నారు.

శం. భా. :- శబ్దములను, శబ్దైకదేశములైన అక్షరములను వివరించి చెప్పినమాత్రాన వైయాకరణుఁడు కానేరఁడు. సర్వార్థములను, వాని నామరూపములను వివరించి చెప్పుట చేతనే వైయాకరణుఁ డగును. అక్షరరూపుఁడైన పరబ్రహ్మ వలన నామరూప ప్రపంచము వ్యక్తమగుచున్నది.

"అనేన జీవేనాత్మనాను ప్రవిశ్యనామరూపే వ్యాకర వాణి" అను సూక్తిని బరిశీలించినచోఁ, బరమాత్మ జీవాత్మ రూపమునఁ బ్రకృతిలోఁ బ్రవేశించి, నామరూప ప్రపంచమును వ్యాకరించుచున్నాఁడని తెలియుచున్నది. అందుచే సాక్షాత్తుగా బ్రహ్మపదార్థమునుండియే వైయాకరణత్వము అనగా సర్వవస్తు ప్రకటనము జరుగుచున్న దన్నమాట. కావున బ్రహ్మజ్ఞానము కలవాఁడు వైయాకరణి అనిపించుకొనును.

సీ. భా. :- పరికింపగా వైయాకరణుఁడు కూడ పరబ్రహ్మయే. ఆతఁడే జ్ఞాని. ఆతఁడు సర్వజ్ఞుఁడు. కాన సర్వార్థములను అనగా బ్రహ్మను, బ్రహ్మేతరములను చక్కగా నిరూపించును. వ్యాకరణము అనగాఁ జక్కగా వివరించి నిరూపించుట యని యర్థము. అదియే జ్ఞానము. జ్ఞానముచే సర్వార్థములను దెలిసినట్లు యోగధర్మముచేఁ దెలియఁజాలవు. ఆత్మజ్ఞానముచే సర్వవిజ్ఞానము కల్గును. కాని కేవల శబ్దజ్ఞానముచే విజ్ఞానము కలుగనేరదు. అట్టి విజ్ఞానము ప్రకృతి ప్రత్యయ విభాగమును జూపు వ్యాకరణ శాస్త్రముచేఁ గల్గనేరదు. సమస్తమునకును మూలకారణము పరబ్రహ్మయే. పరబ్రహ్మను బొందినవానికిని, తెలిసికొనిన వానికిని సమస్తమును దెలియునన్నమాట. సమస్తమునకును వ్యాకర్త పరమాత్మయే. పరమాత్మచేతనే నామరూపములు వివరింపఁ బడుచున్నవి. కావున వ్యాకరణమునకు మూలము పరబ్రహ్మ యని తెలిసికొనవలసియున్నది.

అర్జున భాష్యము:- ప్రణవమైన ఓంకారము పరబ్రహ్మ. దానికిఁ జెందిన అర్థములే, దానియవయవములు. అవియే జాగ్రత్స్వప్నాది రూపమున అధ్యాత్మ మందును, విశ్వరూపాదుల రూపమున అధిదైవమునందును గలవని జ్ఞానియైన వైయాకరణిచే నిరూపింపఁ బడుచున్నది. ఓంకారావయవములను వివరించి చెప్పుటయే వ్యాకరణము. అది పరబ్రహ్మనుండియే వినిర్గత మగుచున్నది. కావునఁ బరబ్రహ్మయే వ్యాకరణమునకు మూలము. దానిని దెలియఁజేయు మునియే వైయాకరణి అని తెలిసికొనుము. కేవల వర్ణపదవాక్య సాధనమగు శబ్దశాస్త్రాభ్యాసముచే మాత్రము మోక్షము వాటిల్లదని తెలిసికొనుము.

వివరణము :-

"నహినహిరక్షతి డుకృఞ్ కరణే భజ
గోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే"

అను గోవిందస్తోత్ర శ్లోకమున కేవల వ్యాకరణాభ్యాసముకంటె గోవింద భజనమే ముఖ్యమని పేర్కొనఁబడినది. గోవులను అనగా జీవులను దిక్కు, నేత్రములు, భూమి, జలమున్నగు రూపమున నున్న ప్రకృతిని దనలోనికిఁ గైకొని రక్షించువాఁడు పరబ్రహ్మయే. ఆతనిని సేవించి తెలిసికొనని వాఁడే మూఢమతి యగునని దాని వలనఁ దెలియుచున్నది.

—: బ్రహ్మజ్ఞానియే సర్వజ్ఞుఁడు :—

శ్లో॥ ప్రత్యక్షదర్శీ లోకానాం సర్వదర్శీ భవే న్నరః ।
సత్యే వై బ్రాహ్మణ స్తిష్ఠన్ తద్విద్వాన్ సర్వవిద్భవేత్ ॥

తా॥ లోకము లన్నియును బరమాత్మ స్వరూపములే. కావున లోకములను, లోకరూపుఁడైన పరమాత్మకును బ్రత్యక్షముగాఁ జూచు మానవుఁడే సర్వదర్శి, సర్వజ్ఞుఁడు నగును. పరమాత్మ సత్యస్వరూపుఁడు. సత్యమైన పరమాత్మయందే మనస్సును నిలకడగా నుంచుచుఁ బరమాత్మ నెఱిఁగినవాఁడే సర్వవేత్తయు, విద్వాంసుఁడునగు బ్రాహ్మణుఁడగును.

శం. భా. :- పై శ్లోకమునఁ జెప్పినట్లు బ్రహ్మజ్ఞానియైన వైయాకరణియే సర్వజ్ఞుడు. నిజమునకు సర్వజ్ఞుఁడు పరబ్రహ్మయే పరబ్రహ్మను దెలిసినవాఁడును సర్వజ్ఞుఁడే యగును. ఎట్లు? అందురేని వినుఁడు. "భూర్లోక భువర్లోక సువర్లోకాదులైన" పదునాల్గు లోకములను బ్రత్యక్షముగాఁ జూచునరుఁడే సర్వదర్శియగును. సర్వరూపుఁడైన పరమాత్మను జూచువాఁడు అగును. ఆతఁడే సత్యాది లక్షణుఁడైన పరబ్రహ్మయందు మనస్సును నిలకడగా నుంచి, తత్పదార్థమైన పరబ్రహ్మను ఎఱిగినవాఁడగును. సర్వవిదుఁ డగును. ఆతఁడే సాక్షాత్తుగా సర్వజ్ఞుఁడన్నమాట. అంతే కాని అనాత్మయైన ప్రకృతి నెఱిఁగినవాఁడు మాత్రము సర్వజ్ఞుఁడు కాఁడు. పరికింపగా దేహాద్యాకారము సత్యపదార్థము కాదు. పరమాత్మయే సత్యపదార్థము. అదియే బ్రహ్మపదార్థము. బ్రహ్మపదార్థ మెఱిఁగిన వాఁడే

బ్రాహ్మణుఁడు. బ్రహ్మపదార్థము నెఱుఁగుటయే స్వరాక్షర జ్ఞానవిభూతి. స్వరాక్షరమనగాఁ బ్రణవ మని ముం దెఱిఁగి యుంటిమికదా !

నీ. భా. :- స్వర్గాది లోకములు ప్రత్యక్షములు వాని నెఱిఁగిన వాఁడు ప్రత్యక్షదర్శి. స్వర్గము చేరినవాఁడు సైతము అభ్యాసాతిశయముచే స్వస్థానమున నుండియే, అతీంద్రియ పదార్థము నెఱిఁగిన తత్త్వజ్ఞుఁడగును.

—: జ్ఞాన సత్యాది విచారము అవశ్యకర్తవ్యము :—

శ్లో॥ ధర్మాదిషు స్థితోఽప్యేవం క్షత్రియ ! బ్రహ్మపశ్యతి ।
వేదానాం చానుపూర్వ్యేణ ఏత ద్బుధ్వా బ్రవీమి తే॥ ౬3

తా॥ క్షత్రియ ! జ్ఞానము, ధర్మము, సత్యము మున్నగు వానిని అవశ్యము తెలిసికొనవలెను. అవి తెలిసిన మాత్రాన లాభము లేదు. వాని నాచరించుచు, సత్యమునందు దృష్టినుంచి నట్లే, బ్రహ్మజ్ఞానార్జనమునందును దృష్టి యుంచవలెను. మనో నేత్రమునఁ బరబ్రహ్మను గాంచవలెను. అందులకై గురువు నాశ్రయించి, వేదముల నభ్యసించి, వేదాన్త విచారణ చేయ వలెను. అందుచే వేదాన్త విచారము గావించవలసిన పద్ధతిన్ని నీకుఁ జెప్పఁగలను; అని సనత్సుజాతుఁడు పలికెను.

శం. భా. :- రాజా ! "యస్తే తేభ్యః" మున్నగు శ్లోకములందుఁ జెప్పినట్లు జ్ఞానాద్యార్జనము అవశ్యకర్తవ్యమే. జ్ఞానాదులు గల్గిన మాత్రాన మానవుఁడు బ్రహ్మవస్తువును

గాంచలేఁడు. వేదములను, వేదాన్తములను, ఆనుపూర్వ్యముగా గురువు నాశ్రయించి, చక్కగా నాలకించి, మననము చేయవలెను. అపుడే వేదాన్త విచారము జరుగును. అందుచే మానవుఁడు విద్వాంసుఁడై బ్రహ్మదర్శి యగును. అంతేకాదు.

సర్వజ్ఞ భాష్యము :- యోగాదులను అభ్యసించ వలెను. యోగమనగాఁ జిత్తవృత్తి నిరోధము. దానికి నిధిధ్యాసాదులు సాధనములు. నిధిధ్యాసాదులచేఁ దొలుత అనాత్మ సాక్షాత్కారము జరుగును. పిమ్మట భగ్నముకాని యోగాభ్యాసాతిశయముచే బ్రహ్మసాక్షాత్కారము జరుగును. ధృఢమైన యోగము కలవాఁడు సత్యనిష్ఠుఁడైన బ్రాహ్మణుఁ డగును. యోగధర్మములందు స్థిరుఁడైన బ్రాహ్మణుఁడు బ్రహ్మపదార్థమును జూచును. యోగధర్మము లన్నియు వేదములవలనను, ఉపనిషత్తులవలనను స్పష్టముగాఁ దెలియును. కాన వేదాభ్యాసము వ్యర్థము కాదని తెలిసికొనుము.

నీ. భా. :- ధర్మము, సత్యము, దమము, తపస్సు మున్నగునవి పండ్రెండును మానవుఁ డాచరింపఁ దగినవి. అటులనే సత్యాది రూపములైన అష్టవిధ ప్రమాదములందును మానవుఁడు నిలకడగా నుండుట నేర్చుకొనవలెను. పిమ్మట సాధనచతుష్టయమును అనగా 1. నిత్యానిత్య వస్తువివేకము; 2. ఇహాముత్ర ఫలభోగవిరాగము; 3. శమదమాది సాధన సంపత్తి; 4. ముముక్షుత్వము అను వానిని అలవాటులో నుంచుకొని, వేదములను "ఆరోపదృష్టి, అపవాదదృష్టి, వ్యామిశ్రదృష్టి" అను మార్గముల ననుసరించి, పరిశీలింప

వలెను. అపుడే మానవుఁడు సోపానారోహణ న్యాయము ననుసరించి, పరమపదవి నొందఁగలఁడు. మెట్లను వరుసగా, ఎక్కనిదే మేడమీఁదికి వెళ్ళలేఁడుకదా ? అటులనే, ధర్మాదులు, అప్రమాదములు. సాధనచతుష్టయము, ఆరోపదృష్టి మున్నగు దృష్టులును బరమపదవి పొందుటకు సోపానములు. కావున వాని నలవఱచుకొననిదే, మానవుఁడు పరమాత్మను జేరలేఁడు. వాని నలవఱచుకొనినచో మానవుఁడు "అహమేతత్" అనెడి స్వానుభవసిద్ధి నొందఁగలఁడు. రాజా ! నీపైఁగల స్నేహముచే నీకీవిషయమును జెప్పుచున్నాను.

"ఓ తాను జ్ఞాత్రనుజ్ఞా వికల్పైః" అను నృసింహతాతనీయోపనిష త్సూక్తిలో సోపానక్రమము చక్కఁగాఁ జెప్పఁబడినది చూడుఁడు.

"ఓతత్వ" మనగాఁ గారణవ్యాప్తి. అనగా గార్యమునందుఁ గారణము వ్యాపించుట. ఎట్లన ? ఘటము కార్యము మృత్తుకారణము. కారణమైన మృత్తు కార్యమైన ఘటమునందు వ్యాపించి యున్నదికదా !

"సర్వం బ్రహ్మేతి తన్నిష్ఠా జానతే పరిణామతః" అను సూక్తిని బరిశీలించినచో సర్వమును అనగాఁ గానవచ్చు ప్రకృతి యంతయును బ్రహ్మయే. పరిణామవాదము ననుసరించి ప్రకృతి బ్రహ్మయందు గలదన్నమాట. బ్రహ్మకారణము. ప్రకృతి దాని కార్యము కార్యమైన ప్రకృతి కారణమైన బ్రహ్మయందు గలదని యర్థము. అనగా బ్రహ్మయే ప్రకృతిగాఁ బరిణమించిన దన్నమాట. దీనినే పరిణామ వాదమందురు.

2. అనుజ్ఞాతి అనగా గార్యాసమసత్వము. కారణమైన బ్రహ్మయందుఁ గార్యమైన ప్రకృతి సమముగా లేకున్నను భ్రాంతిచే సమానముగా నున్నదనుకొందురు. అదియే వివర్తనము. ఎట్లన? మరువునందు అనగా మృగతృష్ణలో (ఎండమావులలో) నీరు లేకున్నను, భ్రాంతిచే నీరుకలదను కొందురు. ఇదియే వివర్తవాదము. ఇదియే అనుజ్ఞాతృ శబ్దమున కర్థము.

శ్లో॥ కార్యస్యా సమసత్వం యత్కారణే సముదీరితం।
తదనుజ్ఞాతృ శబ్దార్థో మరౌ వారివివర్తనమ్॥

అను సూక్తిలో నై విషయమే స్పష్టముగా నిరూపింపఁబడెను.

3. అనుజ్ఞ అనగా బ్రహ్మపదార్థమును అనుసరించి జగత్తు మిథ్యయని తెలిసికొనుట. బ్రహ్మనిష్ఠులైన జ్ఞానులు బ్రహ్మ సత్యము; శాశ్వతము; జగము మిథ్య; అశాశ్వతము. శశమునకు (చెవులపిల్లికి) శృంగములు లేనట్లే, బ్రహ్మకు, జగత్సంబంధము లేదు. కావున జగత్తంతయుఁ దుచ్ఛమే, అని తెలిసికొనుటయే, "అనుజ్ఞ" అనఁబడును.

శ్లో॥ ఏత న్నిష్ఠా స్తతో భూత్వా జగ న్మిథ్యేతి జానతే।
అనుజ్ఞాయాం జగత్తుచ్ఛం శశశృంగాది వన్మతమ్॥

అను సూక్తిలోఁ నై విషయమే స్పష్టముగా నిరూపింపఁబడెను.

శ్లో॥ ఏవం సోపాన రీత్యైవ భూమి త్రితయ లంఘనాత్ ।
అవికల్పం పరం యత్తదహం బ్రహ్మాస్మి నిర్భయమ్ ॥

అను సూక్తిని బరిశీలించినచో, అవికల్ప జ్ఞానమన నేమో; తెలియును. వికల్ప మనగా మార్పును గల్పించుట. అది లేకుండుట అవికల్పము. బ్రహ్మపదార్థములో వికల్పము లేదు. కాన అది అవికల్పమైనది. బ్రహ్మ అవికల్పము, అని తెలిసికొనుటకు (1) ఓతత్వము, (2) అనుజ్ఞాత, (3) అనుజ్ఞ అను మూఁడును మేడ నెక్కుటకు సోపానములవలె ఉపయోగ పడును. ఓతత్వాదులు మూఁడును బ్రహ్మపదార్థ మనెడి సౌధము నిలుచుటకు భూమివంటివి. ఆ మూడింటిని జక్కగా నెఱుగుటయే భూమిత్రితయమును లంఘించుట. భూమిత్రితయ మును లంఘించుటవలననే జ్ఞాని "అవికల్పమైన పరబ్రహ్మ నేను" అని తెలిసికొని, నిర్భయముగా నుండును. "అహం బ్రహ్మాస్మి" అను జ్ఞానము కలవానికి, జనన మరణాదుల వలనఁ గాని, సంసారము వలనఁగాని, భయ ముండదు. పై విషయము నందలి స్థూలసూక్ష్మ రూఢిక్రమము నెఱుగుటకు, వేదములను అనుపూర్వ్యముగాఁ దెలిసికొనవలెను. ఓ క్షత్రియా! నీయందలి కరుణచేఁ జెప్పితిని. చక్కగాఁ దెలిసికొనుము. అని సనత్సు జాతుఁడు చెప్పెను.

ఇది మూడవ యధ్యాయము

# శ్రీ సనత్సుజాతీయము

## చతుర్థాధ్యాయము

—: బ్రహ్మచర్యము - గురుకులవాసము - బ్రహ్మజ్ఞాన సాధనములు :—

ఈ యధ్యాయమున బ్రహ్మవిద్యా సాధనమైన, బ్రహ్మచర్యమును, బ్రహ్మ స్వరూపము అను వానిని గూర్చి చెప్పఁబడుచున్నది.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ సనత్సుజాత ! యా మిమాం పరాం త్వం
బ్రాహ్మీం వాచం వదసే విశ్వరూపాం।
పరాం హి కామేన సుదుర్లభాం కథాం
ప్రబ్రూహి, మే వాక్య మిదం కుమార ॥ ౧

తా॥ సనత్సుజాత ! నీవు చెప్పుచున్న ఈ బ్రాహ్మీ వాక్కు బ్రహ్మవిద్య ఉత్కృష్టమైనది. అది నానారూపములు కలదని చెప్పుచున్నావు. ఉత్కృష్టమైన బ్రహ్మకథ కోరిన మాత్రాన లభింపదు. అట్టి యీ బ్రహ్మవిద్యను సనత్కుమార ! నా కెఱిగింపు మని ధృతరాష్ట్రుఁ డడిగెను.

శం. భా. :- బ్రహ్మచర్యాది సాధన ప్రతిపాదనానన్తరమే పరబ్రహ్మప్రాప్తి జరుగును. అని సనత్సుజాతుఁడు

చెప్పఁగా విని, ధృతరాష్ట్రుఁడు బ్రహ్మపదార్థమును దెలిసికొనఁ దగిన పద్ధతిని గూర్చి చెప్పుమని కోరెను.

సనత్సుజాత ! నీవు బ్రహ్మసంబంధమైన వాక్కును జెప్పుచుంటివి. అది పరార్థము. ఉత్కృష్టార్థము. పరికింపగా నది, నానారూపమున నున్నది. ఉత్తమమైన బ్రహ్మవిద్య కోరినమాత్రాన గ్రాహ్యమైన ప్రపంచమందు అది సుదుర్లభము.

శ్రు "శ్రవణాయాపి బహుభి ర్యో న లభ్యః
శృణ్వంతో ఽపి బహవో య న్న విద్యుః ।
ఆశ్చర్యో వక్తా కుశలో ఽస్య ప్రోక్తా
ఆశ్చర్యో జ్ఞాతా కుశలాను శిష్టః ॥

అను కఠోపనిష త్సూక్తిలోఁ జెప్పినట్లు, బ్రహ్మజ్ఞానము పెద్దలు పదిమందివలన వినినను దుర్లభమే. వినినవారిలోఁ గూడఁ బెక్కురు ఆవిషయమును దెలిసికొనఁ జాలరు. బ్రహ్మ జ్ఞానము గూర్చి నేర్పుగాఁ జెప్పెడివారుకాని, చక్కఁగాఁ దెలిసికొనిన వారుకాని, లోకమున అరుదుగా నుందురు. కుమారా ! నీవు చెప్పినది బ్రాహ్మీవాక్కు. అది పరమ పురుషార్థ సాధనభూతము. సుదుర్లభము. నాదృష్టిలో నీవే ఆబ్రహ్మవస్తువు నెఱిగింప సమర్థుఁడవు కావున నా కెఱిగింపుము.

నీ. భా. :- కుమారా! నీవు చెప్పిన ఆత్మజ్ఞాన మార్గమును ఆలకించితిని. దాని కంతరంగ సాధనమైన యోగమును వినఁగోరుచున్నాను. నీవు ఉపనిషత్తులందలి బ్రహ్మపదార్థ విషయమును జెప్పుచున్నావు. నీవు చెప్పినదానిలో విశ్వమంతయుఁ

ప్రకాశించుచున్నది. ప్రశ్నించుట కవకాశము లేకుండఁ జెప్పు చుంటివి. సుదుర్లభమైన ఆవిషయమును ఇంకను వినఁ గుతూ హాలుఁడనై యున్నాను. నా ప్రార్థనను మన్నించి; ఎఱిగింపు మని వేడగా సనత్సుజాతుఁ డిట్లుచెప్పెను.

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ నైతత్ బ్రహ్మ త్వరమాణేన లభ్యం
యన్మాం పృచ్ఛన్నపి హృష్యస్యతీవ ।
బుద్ధే విలీనే మనసి ప్రచింత్యా ।
విద్యా హి సా బ్రహ్మచర్యేణ లభ్యా ॥ ౨

తా॥ రాజా ! తొందఱపడిన మాత్రాన బ్రహ్మవిద్య లభ్యము కాదుసుమా ! నీవు నన్ను బ్రశ్నించుచునే చాల సంతసించుచున్నావు. చెప్పెదను వినుము. మనస్సును బుద్ధితో లీనముచేసి, బాగుగాఁ జింతింపఁదగిన దాబ్రహ్మవిద్య. బ్రహ్మ చర్యముచేతనే అది లభ్యమని యెఱుఁగుము. అని సనత్సుజా తుఁడు చెప్పెను.

శం. భా. రాజా ! నీవు ఉత్సాహముతో నడుగుచున్నావు. కాని తొందరపడు మానవున కది లభ్యము కాదుసుమా ! సంకల్ప వికల్పాత్మకమైన మనస్సును, "అహం బ్రహ్మాస్మి" అని నిశ్చయాత్మమైన బుద్ధిలో లీనముచేసి, బాగుగాఁ జింతింపఁ దగిన దాబ్రహ్మవిద్య. కావున విషయములనుండి మనస్సును మఱల్చి, బ్రహ్మచర్యములోనున్న వారికే బ్రహ్మవిద్య లభ్య

మగును. సర్వవ్యాపారములను నిరోధించి యుంచు బ్రహ్మ విద్య గురుకులవాసముచేఁగాని, బ్రహ్మచర్యముచేఁ గాని లభ్య మగును. అంతేకాని నేనే బ్రహ్మవిద్య నెఱుఁగ అధికారి నని గర్వించిన మాత్రాన బ్రహ్మవిద్య తెలియ నేరదు. ఇంద్రియ నిగ్రహము కల్గినను, ఆరవ యింద్రియమైన మనస్సు నణంచ నిదే, అది బుద్ధిలో లీనముకానిదే బ్రహ్మవిద్య యేరికిని బట్టు వడదుసుమా !

నీ. భా. :- రాజా ! నీవు బ్రాహ్మణ్యమును గూర్చి నన్ను బ్రశ్నించు చున్నావు. ఆత్మజ్ఞానమే బ్రాహ్మణ్యము. అదియే "అవ్యక్తము, విద్య" అను నామముల నొప్పుచున్నది. అట్టి జ్ఞానమును కొలఁది దివసములలోనే పట్టుదలతో సాధించి, సంపాదింపఁ గలరన్నమాట గర్వముతో నాడినమాట. గర్వితున కేమాత్రమును జ్ఞానము కలుగదుసుమా ! గురువుల కటాక్ష మున, మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుట నేర్చి, స్థిరబుద్ధిగల్గి బ్రహ్మచర్య మాచరించినవారికి మాత్రమే అది లభ్యమగును. అంతేకాని, గర్వము, రాగద్వేషములును గల వారికి మాత్రము బ్రహ్మజ్ఞానము లభ్యముకాదు. రాజా ! నీలో బ్రహ్మచర్యము లేదే ఎట్లు ? అనగా విని ధృతరాష్ట్రుఁ డిట్లుపల్కెను.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ అత్యంత విద్యా మితి య త్సనాతనీం
బ్రవీషి త్వం బ్రహ్మచర్యేణ సిద్ధాం ।

అనారంభ్యాం వసతీహ కార్యకాలే
కథం బ్రాహ్మణ్య మమృతత్వం లభేత ॥ 3

తా॥ అయ్యా! బ్రహ్మవిద్య యొక్కటియే మిక్కిలి తెలిసికొనఁ దగినది. సనాతనమైనది. బ్రహ్మచేతనే అది సిద్ధించు ననుచున్నావు. సృష్టిచేయు కాలమున ఆత్మయందే యున్న బ్రహ్మయజ్ఞాది కర్మలవలె ఆరంభింప వీలుకాని దను చున్నావు. బ్రహ్మనిష్ఠకల బ్రాహ్మణునకు మాత్రమే లభించు మోక్షవిద్య నావంటివాని కెట్లు లభించునో చెప్పుమా? అని ధృతరాష్ట్రుఁడడిగెను.

శం. భా. :- అయ్యా! అన్నిటికిని ఆదియైన బ్రహ్మ విద్యను గూర్చి చెప్పుచున్నావు. నిజముగా నది సత్యస్వరూ పము. దానినుండియే ప్రపంచము వెలసినది. అందుచేఁ గార ణము బ్రహ్మ. కార్యము ప్రపంచము అని యొప్పుకొనక తప్పదు. బ్రహ్మవిద్య యెన్నడును గార్యముకాదు. అసత్య మైన ప్రపంచమునకుఁ జెందినది కాదు. అది తొందరపడినను లభించునది కాదని నే నెఱుఁగుదును. బ్రహ్మచర్యాది సాధన సంపత్తికల్గి, అంతఃకరణమును అడంచిన వారికి మాత్రమే బ్రహ్మవిద్య లభించు ననుచున్నావు. సజ్జనులు సైతము బ్రహ్మ చర్యముచేతనే దానిని బొందుచున్నా రనుచున్నావు. బ్రహ్మ విద్య నొందినవారు మర్త్య భావమును విడుచుచున్నారనియుఁ జెప్పుచున్నావు. వృద్ధులైన గురువుల మూలమున శిష్యుల కది

లభించు ననుచున్నావు. కాన నీవే నాకు గురువుగా నుండి బ్రహ్మచర్యమున నేమో అది యెట్లు లభించునో చెప్పుము.

సీ. భా. :- పరికింపగా బ్రహ్మవిద్య అండాండ, పిండాండ, బ్రహ్మాండము లనెడి త్రివిధ పరిచ్ఛేదములను అతిక్రమించి యున్నది. అంతేకాదు. స్థూల సూక్ష్మకారణ శరీరము లనెడి త్రివిధపరిచ్ఛేదములను, సత్వరజస్తమో గుణములచే నేర్పడు త్రివిధ పరిచ్ఛేదములను, అతిక్రమించి యున్నది. "యత్సాక్షా దపరోక్షాద్బ్రహ్మ" అను శ్రుతివలన బ్రహ్మ పదార్థము సాక్షాత్తుగా అపరోక్షమైన ప్రత్యగాత్మనుండి అభివ్యజ్యమానమై నట్లు తెలియు చున్నది. కాన అది సనాతనమైనది. కార్యమైన ప్రకృతిని సృష్టించు కాలమున ఆత్మయందే యుండుటచే బ్రహ్మవిద్య, యజ్ఞాది కర్మలవలె ఆరంభింప యోగ్యముకాదు. కేవలము బ్రహ్మచర్యముచేతనే అది సిద్ధించు నని నీవు చెప్పుచున్నావు. అయినచో బ్రాహ్మణునకు యోగ్యమైన అమృతత్వము మావంటి వారి కెట్లు లభించునో చెప్పుము.

అర్జున భాష్యము :- అంతేకాదు. పండితుఁడా ! గార్హస్థ్యములో నున్న నాకు గురువు చెంత బ్రహ్మచర్యముతో నుండుట యెట్లు పొసగును ? నేను రాజునై రాజ్యమును పాలించు చుంటినిగదా ! రాజ్యపాలన కాలమున నాకు గురుకుల వాసమును, బ్రహ్మచర్యమును ఆచరించుట యెట్లు పొసగును. కావున నీవే నాకు గురువుగా నుండి అమృతత్వము

లభించు మార్గము నెటిగింపు మని ధృతరాష్ట్రుఁ డడుగగా సన త్సుజాతుఁ డిట్లు జెప్పెను.

వివరణము :- పరికింపగా, వాక్కు, 1. పరా, 2. పశ్యంతీ, 3. మధ్యమా, 4. వైఖరీ అను నాల్గువిధముల నున్నది. లౌకిక వ్యవహారమున సర్వజనులచే వాడఁబడు వాక్కు, మధ్యమా, వైఖరీ అను రెండు తెగలకుఁ జెందును. బ్రాహ్మీవాక్కు మాత్రము, పరా, పశ్యంతి అనువానికిఁ జెంది యున్నది. అందుచేఁ బరాపశ్యంతీ రూపమున నున్న బ్రాహ్మీ వాక్కు గురుకుల వాసముచేసి బ్రహ్మచర్యమున నున్నవానికో, తపో, యోగ, మార్గములతో నున్నవారికో, జ్ఞానమార్గమున నున్నవారికో తప్ప అందటికినీ లభింపదు. పై మార్గము లన్ని యును గురుశుశ్రూష చేయువారికిఁ దప్ప అందటికినీ లభింపవు. వాల్మీకి, ధృవుఁడు తపోమార్గమున బ్రాహ్మీ వాక్కు నాశ్ర యించి తరించిరి. మార్కండేయుఁడు యోగ మార్గమున, కుచేలుఁడు గురుశుశ్రూష చేతను, అంబరీషుఁడు భక్తిమార్గ మున, ప్రహ్లాదుఁడు జ్ఞాన మార్గమున, జనకమహారాజు కర్మ మార్గమునను, బ్రాహ్మీవాక్కు నాశ్రయించి తరించిరి. కావున మనవంటి సామాన్యులకు ఈబ్రాహ్మీవాక్కు గురుసేవచేఁ దప్ప వేరొక మార్గమున లభించదని తెలియుచున్నది. ఉపాసకులును, యోగులను బైవాక్కులను షట్చక్ర మార్గమునను, బ్రాణా యామ మార్గమునను గాంచి తరించుచున్నారు.

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ అవ్యక్త విద్యా మభిధాస్యే పురాణీం
బుద్ధ్యాచ తేషాం బ్రహ్మచర్యేణ సిద్ధాం।
యాం ప్రాప్యై నం మర్త్యలోకం త్యజన్తి
యా వై విద్యా గురువృద్ధేషు నిత్యా॥ ౪

తా॥ రాజా! బ్రహ్మవిద్య అవ్యక్తము. అతిప్రాచీన మైనది. అయినను జెప్పఁగలను. వినుము. అది బుద్ధిబలముచే లభించదు బ్రహ్మచర్యముచే మాత్రమే అది సిద్ధించును. ఆవిద్య పొందినపిమ్మట మానవు లీమర్త్యలోకమును విడిచెదరు. నిత్య మైన ఆవిద్య వృద్ధులైన గురువుల చెంతఁ జేరి తెలిసికొనఁ దగిన దని యెఱుగుము. అని సనత్సుజాతుఁడు చెప్పెను.

నీ. భా, ;- బ్రహ్మపదార్థము ఆత్మయగుటచే నిత్యము అపరోక్షమునై యున్నది. అది అశనాయాసా ద్యతీతము. అనగా ఆకలిదప్పికలు మున్నగునవి లేనిదన్నమాట. అందుచే అది అందఱికిని వ్యక్తముకాదు. కాన అవ్యక్తవిద్య యైనది. బుద్ధికినిఁ గాలుష్యము కలదు. కాన బుద్ధిబలముచే దాని నెఱు గుట అశక్యము. పురాణియైన బ్రహ్మవిద్య బ్రహ్మచర్యము చేతనే సిద్ధించును. బ్రహ్మవిద్య నెఱిగినవారు మర్త్యలోకమును విడిచెదరు. గురువృద్ధు లందు అది నిత్యము నుండును. కావున గురువుల నాశ్రయించి, బ్రహ్మచర్యమన నేమో తెలిసికొను మనగా విని ధృతరాష్ట్రుఁ డిట్లడిగెను.

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో॥ బ్రహ్మచర్యేణ యా విద్యా శక్యా వేదితు మంజసా।
తత్కథం బ్రహ్మచర్యం స్యా దేతత్ బ్రహ్మన్
బ్రవీహి మే॥ ౫

తా॥ శం. భా. :- బ్రహ్మణ్యుఁడా! బ్రహ్మచర్యము చేతనే బ్రహ్మవిద్య వేగముగాఁ దెలిసికొన శక్యము; అనుచుంటివి. బ్రహ్మచర్యమే ఋజుమార్గమైనచో అది నా కెట్లు చేకూరును; అనగా సనత్సుజాతుఁ డిట్లు చెప్పెను.

—: గురువేతంద్రి ఆతఁడే బ్రహ్మవిద్యా ప్రదాత :—

సనత్సుజాత ఉవాచ :-

శ్లో॥ ఆచార్య యోని మిహాయే ప్రవిశ్య
భూత్వా గర్భే బ్రహ్మచర్యం చరన్తి।
ఇహైవ తే శాస్త్రకారా భవన్తి
ప్రహాయ దేహం పరమం యాంతి యోగమ్॥ ౬

తా॥ రాజా! బ్రహ్మవిద్య గోరు మానవులు ఆచార్యయోనిలోఁ బ్రవేశించి, అనగా ఆతనిచెంతఁ జేరి, ఆతనికి బుత్రులై, బ్రహ్మచర్య మాచరించి, జ్ఞానులగుచున్నారు. వారే ఈలోకమున శాస్త్రకారు లగుచున్నారు. వారే ఈ మానవదేహమును వీడి, ఉత్కృష్టమైన బ్రహ్మయోగము పొందుచున్నారు.

శం. భా. :- రాజా ! మానవులు ఆచార్యుని సమీపమున కేగి, ఆతని సేవచేసి, శిష్యులై గురుశుశ్రూషాదికమును ఆచరింతురు. వారే ఈలోకమున శాస్త్రకారు లగుచున్నారు. శాస్త్రకర్తలే పండితులై బాల్య యౌవనాదులను జక్కగా నెఱిగి, బ్రాహ్మణులై ప్రారబ్ధ కర్మక్షయము కాగానే, దేహమును వీడి, సత్యాదిలక్షణ సంపన్నుఁడైన పరమాత్మను బొందుచున్నారు. లోకమున జననీజనకులు పూర్వజన్మ ఫలానుగుణమైన శరీరమును మాత్రమే జీవున కొసఁగుచున్నారు. ఆత్మ శబ్దవాచ్యమైన దేహమును మాత్రము వారు ఒసఁగ లేదు. స్థూల, సూక్ష్మ శరీరములతో నేర్పడిన జన్మ మాత్రము అసత్యము; అశాశ్వతము, అట్టి శరీరమునే తల్లి దండ్రు లొసఁగుచున్నారు. చిత్సదానంద ద్వితీయ బ్రహ్మత్మతో నేర్పడిన జన్మను మాత్రము ఆచార్యుఁడే ఒసఁగుచున్నాఁడు. అదియే జ్ఞానరూపముతో నేర్పడిన జన్మ. అదియే సత్యమైనది. పరమార్థమైనది. అదియే వినాశము లేని జన్మ. కావున అమృతమైనది. అట్టి యమృతజన్మ నొసఁగిన వాఁ డాచార్యుఁడు. కావున ఆచార్యుఁడే నిజమైన తండ్రి. అందుచేతనే జీవుఁడు ఆచార్యయోనిలోఁ బ్రవేశించి, బ్రహ్మచర్య మాచరించి, జ్ఞానియై శాస్త్రకారుఁడై పరబ్రహ్మను జేరవలె నని చెప్పఁబడినది.

శ్రు॥ త్వం నః పితా యో ౽స్మాక మవిద్యాయాః
పరం పారం తారయసి॥

అనెడి ప్రశ్నోపనిషత్తులోని మంత్రమును బరిశీలించినచో ఆచార్యా! అవిద్యనుండి తొలగించి, ఉత్కృష్టమైన పర బ్రహ్మను జేర్చు నీవే మాకుఁ దండ్రివి. కాని జన్మహేతువు లైన వారు మాత్రము నిజమైన తల్లిదండ్రులు కారని తెలియు చున్నది.

శ్రు॥ "స హివిద్యా త స్తం జనయతి, తచ్ఛ్రేష్ఠం జన్మ।
శరీర మేవ మాతాపితరౌ జనయతః॥"

అనెడి యాపస్తంబ సూక్తిలో, శ్రేష్ఠమైన జన్మను జ్ఞానమువలనఁ గల్గించు నాతఁడే నిజమైన తండ్రి. భౌతికస్థూల శరీరము నొసఁగువారు మాత్రము సామాన్యమైన జననీ జనకులుగా నున్నారని చెప్పఁబడినది.

సీ. భా. :-

శ్రు॥ "యో నిష్ట ఇంద్ర నిషదే అకారి, స్వయో నా నిషదంతం సరూపాః॥"

మున్నగు శ్రుతులనుబట్టి యోనిపదమునకు స్థానము అని యర్థ మున్నట్లు తెలియుచున్నది. కావున జ్ఞానార్థులు ఆచార్య స్థానమును జేరి, నిష్కపట సేవచే, అంతరంగత్వమును బొంది, అనగా వారి కాప్తులై బ్రహ్మచర్యము నాచరించుచు, బ్రహ్మజ్ఞానులై శాస్త్రకారు లగుచున్నారు.

"మహాతో భూతస్య నిశ్వసిత మేత దృగ్వేదః" అను శ్రుతిలో మహాభూత సంజ్ఞ గల బ్రహ్మయొక్క నిశ్వాసమే

ఋగ్వేద మని చెప్పఁబడినది. కాన వేదశాస్త్రములు బ్రహ్మ ప్రతిపాదకము లన్నమాట. అందుచే బ్రహ్మచర్య మాచరిం చినవారు, శాస్త్రకారులు; అనగా బ్రహ్మప్రతిపాదకు లన్న మాట. శాస్త్రకారులు గుర్వనుగ్రహమువలన ఇహలోకము ననే, కారణ దేహముఁను వీడి బ్రహ్మత్వమును బొందు చున్నారు. అనగా బునరావృత్తిలేని యోగమును, అనగా బ్రహ్మైక్యమును బొందు చున్నారని తెలిసికొనుము.

శ్లో॥ అస్మిన్ లోకే వైజయంతీ హ కామాన్
బ్రాహ్మీం స్థితిం హ్యను తితిక్షమాణాః।
తఆత్మానం నిర్హర స్తీహ దేహాత్
ముంజా దిషీకా మివ స త్త్వసంస్థాః॥ ౭

తా॥ ఈ లోకమున అనగా ఈ జన్మలో జ్ఞానులు ఐహికములైన కామములను విడుచుచున్నారు. ప్రతిదినము పరబ్రహ్మయందే తమ మనస్సు నిశ్చలస్థితి నొందు నట్లు చేయు చున్నారు. వారు సత్త్వమైన బ్రహ్మపదార్థమునందే స్థిరముగా నున్నవారై ముంజగడ్డినుండి, దానిలో నున్న దుబ్బును (కాండ మును) వేరుచేసినట్లు తమ దేహమునుండి ఆత్మను వేరుచేసి దానిని బొందుచున్నారు.

శం. భా. :- జ్ఞానులు ప్రతిదినము తమమనస్సును, బుద్ధిని బరబ్రహ్మయందే నిలకడగా నుంచి, బాహ్యావిఘ్నము లను, సుఖదుఃఖాది ద్వంద్వములను సహించి, కామములను, గామకారణములైన దేహేంద్రియాదులను జయించు చున్నారు.

అపుడు వారు ఆత్మను దేహేంద్రియాదులకంటె విలక్షణ మైన దిగా నిర్ణయించు చున్నారు. పిమ్మట దేహాదుల నుండి దేహేంద్రియాదులకు సాక్షియైనట్టియు, చిన్మాత్ర మైన పర బ్రహ్మను, ముంజగడ్డినుండి ఇషీకనువలె అనగా దానిలో నున్న స్థూల తృణవిశేషమునువలె, వేరుచేసి, తెలిసికొను చున్నారు. అట్లే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయా, నందమయ కోశములకంటె, సర్వాత్మ, భిన్నముగా నున్నదని, నిర్ధారణ చేసి, తెలిసికొను చున్నారు.

శ్రు॥ అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః ।
తం స్వాచ్ఛరీరా త్ప్రవృహే న్ముంజాది
వేషీకాం ధైర్యేణ తం విద్యా చ్ఛుక్రమమృతమితి॥

అను కఠోపనిషత్సూక్తిలోఁ బై విషయము స్పష్టముగా నిరూపింపఁ బడెను. ఎట్లన? జనుల హృదయపుండరీకములో అంతరాత్మ సదా సన్నివిష్టమై యుండెను. అదియే అంగుష్ఠ పరిమాణమున నున్న అక్షరపురుషుఁడు. జ్ఞాని ధైర్యముతో అనగా నిశ్చల చిత్తముతో ముంజగడ్డినుండి దానిలో నున్న గడ్డికాడను వేరుచేసి, తెలిసికొను నట్లే తన శరీరమునుండి ఆత్మను వేరుచేసి, తెలిసికొనును. అట్లు తెలిసికొనఁ బడిన యాత్మనే అమృతముగాఁ దెలిసి కొనవలెను.

అర్జున భాష్యము :- యోగులైనను, బ్రహ్మచారు లైనను, గృహస్థులైనను, స్వధర్మనిష్ఠులై, ధ్యాన ధారణ,

సమాధులు మున్నగు నుపాయములతోఁ దమ చిత్తమును నిశ్చలము గావించుకొని, రెల్లుదుబ్బునుండి రెల్లుకాండమును వేరుచేసి తెలిసికొనినట్లే, తమ శరీరమునుండి ఆత్మను వేరుచేసి తెలిసికొందురు. వారు తమచిత్తము స్థిరముగా నుండుటకై యోగనిష్ఠలో నుండుటకు ముందే సకలకామములను వీడి, బ్రాహ్మీస్థితి నలవఱచు కొందురు. సత్వగుణ ప్రధానులై యుందురు.

—: ఆచార్యుని మహత్త్వము :—

శ్లో॥ శరీర మేతౌ కురుతః పితా మాతా చ భారత ।
ఆచార్య శ్శాస్త్రాయా జాతిః సా పుణ్యా సా జరామరా॥

తా॥ భారత ! లోకమునఁ దల్లియుఁ దండ్రియును, భౌతికమైన దేహమునే నిర్మించి, తమ సన్తానమున కొసఁగు చున్నారు. ఉపనయనమున గాయత్రి నొసఁగి తద్ద్వారా రెండవ జన్మ నొసంగి, శాసించువాఁ డాచార్యుఁడే. ఆ తఁడొసఁగిన జన్మయే పుణ్యమైనది. జరామరణ రహితమైనదని యెఱుగుము.

శం. భా. తల్లిదండ్రులుండగా నాచార్యుఁడే జన్మకారణ మెట్లు ? అని శంకించి, ఆచార్యుఁడే జన్మకారకుఁడని చెప్పఁ దొడఁగెను.

రాజా ! తల్లిదండ్రులని ప్రసిద్ధినొందినవారు తమ సన్తానమునకు సహజభంగురమైన శరీరము నొసంగు చున్నారు. ఉపనయన కర్మ దీక్షలో గాయత్రీమంత్రము నుపదేశించి, సావిత్రమైన ద్వితీయజన్మ నొసంగువాఁడు శాస్త్ర ఆచార్యుఁ

డని పిలువఁబడును. ఆతఁడు జ్ఞానావిర్భావ కారణమైన తండ్రి యగును. పిమ్మటఁ బరబ్రహ్మవిద్యా ప్రాప్తికి, అధికారమును జ్ఞానము నొసంగు నాతఁడు నిజమైన తండ్రియగును. జ్ఞానోదయమే ఉత్తమజన్మ. అదియే మోక్షహేతువు. కాన అది పుణ్యమైనది. జరామరణహీనమైనది; నిత్యపదము నొసంగునది యని తెలిసికొనుము.

శ్లో॥ యః ప్రావృణో త్యవితథేన కర్ణా
వృతం కుర్వ న్నమృతం సంప్రయచ్ఛన్ ।
తం మన్యే త పితరం మాతరం చ
తస్మై న ద్రుహ్యే త్కృత మస్య జానన్ ॥

తా॥ ఆచార్యుఁడు బ్రాహ్మణాది వర్ణములను వితథము కాని అనగా సత్యమైన చిచ్చైతన్యముతో నింపుచున్నాఁడు. ఋతమైన బ్రహ్మవస్తువును వాక్కులతో వివరించుచు, అమృతము నొసంగుచున్నాఁడు. కావున ఆతనినే తల్లిగాఁ దండ్రిగాఁ దలంచవలెను. ఆతఁడు గావించిన యుపకారము నెఱుఁగుచు, ఆతని కెన్నఁడును ద్రోహము చేయరాదు.

శం. భా. :- పరమపురుషార్థ సిద్ధి ఆచార్యాధీనమని చెప్పఁదొడఁగెను. ఆతఁడు అమృతమును అనగాఁ బూర్ణానందమైన బ్రహ్మను ఆత్మగాఁ దెలియఁ జేయుచున్నాఁడు. కావున ఆచార్యునకు ద్రోహము చేయరాదు.

శ్లో॥ యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥

అను శ్రుతిలో దేవునియందుండు మహాభక్తిని గురువు నందుంచవలెను. అట్టివాఁడే మహాత్ముఁడు. అతనికే చెప్పిన విషయములు చక్కఁగాఁ దెలియును. అంతటను వ్యక్తములై రాణించును; అనికలదు.

ఆపస్తంబుఁడు కూడ, "తస్మై న ద్రుహ్యేత్కదాచన స హి విద్యాతస్తం జనయతి" అను సూక్తిలో గురువు విద్యను బోధించిన కారణమున శిష్యునకుఁ దండ్రియగును. కావున వాని కెన్నడును ద్రోహము చేయరాదు; అని చెప్పెను. అట్లు మెలఁగిన నాఁడే తన కాతఁడు చేసిన యుపకారమును తెలిసికొనుచుఁ, గృతజ్ఞుఁ డగును. అందుచే శిష్యుఁడు గురువుకు నిత్యమును నమస్కరించవలెను. ఆచార్యునే దైవముగా ఉపాసించవలెను. ఎల్లప్పుడు జాగరూకుఁడై, ఆచార్యుఁడు చెప్పిన దానినిఁ జక్కఁగా నాలకించుచు, మంత్రములను అర్థవంతముగాఁ బఠించవలెను. అదియే స్వాధ్యాయము.

"స్వాధ్యాయ మిచ్ఛేచ్ఛ్రవణాది పరో భవేత్" అను సూక్తియుఁ బై విషయమునే ప్రకటించును.

సీ. భా. :- ఆత్మకంటె భిన్నమైన దంతయు జడమే. అదియే యనృతము. దానిని వితథమందురు. ఆత్మమాత్రమే సత్యమును జిత్స్వరూపము నై యున్నది. ఆచార్యుఁడు బ్రాహ్మణాది వర్ణములకు జ్ఞానము నొసఁగుచు, సత్యస్వరూపముతో బాహ్యాభ్యన్తరముల నావరించి, పరిపి రక్షించు చుండును. ఆతఁడు శిష్యులకు ద్వైతభావముచేఁ గల్గు భయ

మును నివారించి, వారిని రక్షించును. శిష్యులకు బ్రహ్మపదార్థమును వాక్యములతో వివరించి, చెప్పుచు వారిని బ్రహ్మజ్ఞానులను గావించి, వారు తత్ఫలమైన అమృతమును (మోక్షమును) బొందునట్లు గావించును.

సర్వజ్ఞ భాష్యము :- ఇట్లు జ్ఞానమార్గమున అమృతమును జేర్చు నాచార్యుండే తమకు దల్లియును దండ్రియు నని తలంచవలెను. అందుచేం గృతజ్ఞులై యుండి ఆచార్యునకు ద్రోహము చేయని వారగుదురు.

శ్రు॥ "య ఆవృణో త్యవితథేన కర్ణావదుఃఖం
కుర్వ న్నమృతం సంప్రయచ్ఛన్ ।
తం మన్యేత పితరం మాతరం చ
తస్మై న ద్రుహ్యే త్కృత మస్య జానన్" ॥

అను శ్రుతిలో సైతముం బై విషయమే వివరింపంబడెను.

## —: చతుష్పాద బ్రహ్మచర్య వివరణము :—

శ్లో॥ గురుం శిష్యో నిత్య మభివాదయీత
స్వాధ్యాయ మిచ్ఛే చ్ఛుచిరప్రమత్తః ।
మానం న కుర్యా న్నాదధీత రోష
మేషః ప్రథమో బ్రహ్మచర్యస్య పాదః ॥ ౧౦

తా॥ శిష్యుఁడు నిత్యము గురువునకు వందనములు సమర్పించవలెను. తాను శుచియై ప్రమత్తుఁడుకాక, స్వాధ్యాయమునే కోరవలెను. ఆతని చెంత నాత్మాభిమానము చూపరాదు. ఆతనిపట్ల కోపము వహింపరాదు. ఇట్లు మెలఁగుటయే బ్రహ్మచర్యముయొక్క మొదటిపాదము.

శం. భా. సీ. భా. లు :- పిమ్మటఁ చతుష్పాద బ్రహ్మచర్యమును గూర్చి నాల్గుశ్లోకములందుఁ జెప్పఁదొడగెను. ఎట్లన ? శిష్యుఁడు గురువునకు నిత్య మభివందన మాచరింపవలెను. ఆచార్యుని దేవునిగా భావించి యుపాసించవలెను. శిష్యుఁడు స్నానాదులచేత శుచియగుటయే కాదు. భావశుద్ధి అనగా మానసికశుద్ధియుఁ గల్గి యుండవలెను. గురుశుశ్రూషయందు అప్రమత్తుఁడై, యాతనిని బూజించుచు, ఆతనినుండి వేదమును జక్కగా నాలకించుచు, స్వాధ్యాయమును (సార్థమగు వేదపఠనమును) గావింపవలెను. ఆతనిచెంత నహంకారమును, ఆత్మాభిమానమును జూపరాదు. ఆతని శిశువులకుఁ జెందిన శౌచాదికము అతితుచ్ఛమైన కార్యమైనను, ఎంతశ్రమనైనను సహించి, చేయవలెను. మనసునందైనను గురువుపట్ల రోషమును వహింపరాదు. ఇదియే బ్రహ్మచర్యముయొక్క మొదటి పాదము.

శ్లో॥ శిష్యవృత్తి క్రమేణైవ విద్యా మాప్నోతి యశ్శుచిః ।
బ్రహ్మచర్య వ్రతస్యాస్య ప్రథమః పాద ఉచ్యతే ॥ ౧౧

తా॥ సీ. భా. :- శిష్యుఁడు శుచియై సాయంప్రాతః కాలములందు భిక్షావృత్తితో జీవనము చేయవలెనేకాని గురువు గృహమున ఆతని యన్నమును భుజింపరాదు. అదియే శిష్యవృత్తి క్రమము. అట్లు ప్రవర్తించిన వానికే విద్య ప్రాప్తించును. ఇదియే బ్రహ్మచర్య వ్రతముయొక్క మొదటి పాదము.

శ్లో॥ ఆచారస్య ప్రియంకుర్యాత్ ప్రాణై రపి ధనై రపి ।
కర్మణా మనసా వాచా ద్వితీయః పాద ఉచ్యతే॥ ౧౨

తా॥ తన ప్రాణములచేతను, ధనముచేతను, ఆచార్యునకుఁ బ్రియమునే ఆచరింపవలెను. మనోవాక్కాయ కర్మలచే సైతము ప్రియమాచరించుచు, ఆచార్యునిపట్ల వినయవంతుఁడై మెలఁగవలెను. ఇదియే బ్రహ్మచర్యముయొక్క ద్వితీయ పాదము.

శ్లో॥ సమాగురౌ యదావృత్తి ర్గురుపత్న్యాం తథాఽచరేత్ ।
తత్పుత్రే చ తథా కుర్వన్ ద్వితీయః పాద ఉచ్యతే ॥ ౧౩

తా॥ గురువునందువలె గురుపత్నియందు, గురుపుత్రుని యందును, గౌరవాభిమానములను జూపుచు, సవినయముగాఁ బ్రియ మాచరించుటయును బ్రహ్మచర్యవ్రతము యొక్క ద్వితీయ పాదమే యగును.

శ్లో॥ ఆచార్యేణాత్మకృతం విజానన్
జ్ఞాత్వా చార్థంభావితో ఽస్మీత్యనేన ।

యన్మన్యతే తం ప్రతిహృష్ట బుద్ధిః
సవై తృతీయో బ్రహ్మచర్య స్యపాదః ॥ ౧౪

తా॥ ఆచార్యుఁడు తన కొనర్చిన మేలు తలంచి, కృతజ్ఞుఁడుగా నుండవలెను. ఆతనివలన వేదార్థము నెఱింగి, ఆతనిచేఁ బవిత్రుఁడ నైతినని భావించవలెను. నిత్యము ఆతనిపట్ల సంతుష్ట బుద్ధియై యుండవలెను. ఇదియే బ్రహ్మచర్యముయొక్క మూఁడవ పాదము.

శం. భా. :- శిష్యుఁ డాచార్యునిచేఁ దనకుఁ గల్గిన వేద పఠన మనెడి, యుపకారమును దెలిసికొని ఆతనివలన వేదార్థమును సైతము చక్కఁగాఁ దెలిసికొనవలెను. వేదార్థము ద్వారా పరమపురుషార్థమును దెలిసికొనుటయే కాక, చక్కఁగాఁ జిత్తమున ధ్యానించి, చూడవలెను. పిమ్మటఁ దాను గురువు వలన "అహం బ్రహ్మస్మి" అనెడి జ్ఞానము నొంది, స్వాభావిక చిత్సదానందాద్వితీయ బ్రహ్మత్మగాఁ దాను జనింపఁ బడి నట్లు భావించవలెను. తర్వాత ఆచార్యునిగూర్చి హృష్టబుద్ధియై తనను గృతార్థునిగాఁ దలంచుకొనవలెను అదియే బ్రహ్మచర్యముయొక్క తృతీయపాదము.

నీ. భా. :- ఆచార్యుఁడు తనకు వేదవిద్య నేర్పి, గావించిన యుపకారమును, శిష్యుఁడు చక్కగా గ్రహించవలెను. వేదార్థమును వానివలనఁ జక్కగాఁ దెలిసికొనవలెను జ్ఞానబోధచేఁ దనకుఁ గల్గిన దుఃఖనివృత్తిని, గల్గిన మహానందమునుఁ జక్కగాఁ దెలిసికొనవలెను. ఈ విధముగా నాచార్యునివలన

వృద్ధిపొందితి నని తలఁచి, శిష్యుఁ డాచార్యునిపట్ల సంతుష్ట చిత్తుఁడై యుండుటయే బ్రహ్మచర్యవ్రతముయొక్క తృతీయ పాదము

శ్లో॥ నాచార్యస్యా న పాకృత్య ప్రవాసం
ప్రాజ్ఞః కుర్వీత నైత దహంకరోమి ।
ఇతివ మన్యేత న భావయేత
స వై చతుర్థో బ్రహ్మచర్యస్య పాదః ॥ ౧౫

తా॥ ఆచార్యుని ఋణము తీర్చనిదే ప్రవాసమునకుఁ, (గృహస్థాద్యాశ్రమ స్వీకారమునకు) నేగరాదు. తాను గురు ఋణము తీర్చితినని యహంకరించరాదు. అట్లితరులకుఁ జెప్ప రాదు. అట్లు చెప్పినచో శిష్యుఁడు ప్రాజ్ఞుఁడు కానేరడు. అంతే కాదు. శిష్యుఁను గురుఋణ విముక్తుఁడ నైతినని తలంచరాదు. ఇట్లు మెలఁగుట బ్రహ్మచర్యముయొక్క నాల్గవపాదము.

నీ. భా. :- ఆచార్యుఁడు తనకు (శిష్యునకు) జెప్పిన విద్య అమూల్యమైనది. అయినను విద్యాప్రదానముచే ఏర్ప డిన ఋణమును శిష్యుఁడు గురువునకు ధనము నొసంగి తీర్చు కొనవలెను. గురుఋణమును దీర్చనిదే ప్రాజ్ఞుఁడైన శిష్యుఁడు గురుగృహమును వీడి ఆశ్రమాన్తరమున కేగరాదు. ఆశ్రమాం తరము పొందుటయే ప్రవాసము. అట్టి ప్రవాసమును దా నాచరింపరాదు.

శిష్యుఁ డర్థప్రదానరూపమునఁ దాను గురుఋణమును దీర్చితి నని తలంచరాదు. గురు ఋణవిముక్తుఁడ నైతినని

శిష్యుఁడు తా నెవరితోడను జెప్పరాదు. తమకెంత ధనము ఋణవిముక్తికై యొసంగవలె నని శిష్యుఁడు గురువు నడుగ రాదు. ప్రశ్నించి యతనికిఁ గోపము పుట్టించరాదు. నిర్బంధము చేసి, యతని మనస్సునకు నొప్పి కల్గించరాదు. ఇదియే బ్రహ్మ చర్య వ్రతముయొక్క చతుర్థపాదము.

—: చతుష్పదీ విద్యా నిరూపణము :—

శ్లో॥ కాలేన పాదం లభతే తథార్థం
తతశ్చ పాదం గురు యోగతశ్చ ।
ఉత్సాహ యోగేన చ పాదమృచ్ఛేత్
శాస్త్రేణ పాదం చ తతో ఽభియాతి ॥ ౧౬

తా॥ శిష్యునకు విద్యలో నొకటవవంతు గురుబోధన వలనను, రెండవవంతు బుద్ధిబలముచేతను, మూఁడవవంతు సహాధ్యాయులతోఁ జర్చించుటచేతను, నాల్గవవంతు తన బుద్ధి పరిపాకము చేతను లభించును.

శం. భా. :- విద్యాస్వీకారములోఁ గ్రమము వివక్షింపఁ బడదు. విద్యలో ఒకటవవంతు గురుయోగము వలనను, అనగా గురుబోధన వలన లభించును. రెండవవంతు బుద్ధివైభవముచేఁ గల్గును. ఉత్సాహముచే జేకూరును. మూఁడవవంతు బుద్ధి పరిపాకముచే లభించును. నాల్గవవంతు సహాధ్యాయులతో గూడి గావించు శాస్త్రచర్చచే లభించును.

శ్లో॥ ఆచార్యా త్పాద మాదత్తే పాదం శిష్య స్స్వమేధయా ।
కాలేన పాద మాదత్తే పాదం సబ్రహ్మచారిభిః ॥

అను నూక్తిలోఁ బైవిషయమే స్పష్టముగాఁ బ్రతిపాదింపఁ బడినది. ఇట్లు చతుష్పాద బ్రహ్మచర్యములోఁ జతుష్పాదీ విద్య లభించు చున్నది.

—: బ్రహ్మచర్య ఫలము :—

శ్లో॥ ధర్మాదయో ద్వాదశ యస్య రూప
మన్యాని చాంగాని తథా బలంచ ।
ఆచార్య యోగే ఫలతీతి చాహు
ర్బ్రహ్మార్థయోగేన చ బ్రహ్మచర్యమ్ ॥ ౧౭

తా॥ జ్ఞానము ధర్మము మున్నగు పం(డెండు గుణములును బ్రహ్మచర్యముయొక్క రూపములు. ఆసన, ప్రాణ జయాదులును బలమును దానికిఁ జెందిన యితరాంగములు. ఆచార్యునితోఁ గలిసి యుండుట చేతను, ఆతని దయచేతను బ్రహ్మచర్యము, సఫల మగును. పరబ్రహ్మైక్యము పొందుటయే బ్రహ్మచర్యముయొక్క సంపూర్ణ ఫలము.

శం. భా. :- ఆచార్య సన్నిధానమునందే జ్ఞానాది ఫలములు లభించును ఎట్లన? జ్ఞానము, ధర్మము, మున్నగు ద్వాదశగుణములే బ్రహ్మచర్యముయొక్క స్వరూపములు. "శ్రేయాంస్తు షడ్విధ స్త్యాగః" "సత్యంధ్యానమ్" అను శ్లోక ద్వయమునఁ జెప్పిన విషయములు బ్రహ్మచర్యముయొక్క

యితరాంగములై యున్నవి. ఆసన ప్రాణ జయాదులను గొందఱు అంగములుగాఁ జెప్పుచున్నారు. తద్ధర్మ పరిపాలన సామర్థ్యము, విద్యాస్వీకారమునకై నిత్యము జాగరూకతతో నుండుటయును. బ్రహ్మచర్య వ్రతము యొక్క ఫలమై యున్నది. పైనఁ జెప్పిన జ్ఞానాదులు, వస్త్వర్థత్యాగము, బలము అనునవి సమస్తమును ఆచార్య యోగమునందే అనగా ఆచార్యుని చెంతనున్నపుడే ఫలించును, అని పెద్దలు చెప్పిరి.

"ఆచార్యాద్ధైవ విద్యావిదితా" "ఆచార్యవాన్ పురుషో వేద" అను సూక్తులనుబట్టి, ఆచార్యునివలననే బ్రహ్మవిద్య తెలియును. ఆచార్యుఁడు గల పురుషుఁడే బ్రహ్మవిద్య నెఱుంగును అని తెలియుచున్నది. తన యాత్మకుఁ జిత్సదానందాద్వితీయ బ్రహ్మతో నైక్యమును సంపాదించుటయే బ్రహ్మార్థయోగము. అట్టి బ్రహ్మార్థయోగము చేతనే బ్రహ్మచర్యము ఫలించును. అంతేకాదు. బ్రహ్మార్థ మనగా వేదార్థము. అది కర్మ, బ్రహ్మరూపమున నుండును. ఆ రెంటింటిని బాగుగా అధిగమించుటయే అనగాఁ బాగుగాఁ దెలిసికొని ఆచరించుటయే బ్రహ్మార్థయోగము. దానిచేఁ గూడ బ్రహ్మచర్యము ఫలించును.

శ్లో॥ ఏవం ప్రవృత్తో యదుపాలభేత వై
ధన మాచార్యాయ తదను ప్రయచ్ఛేత్ ।
సతాం వృత్తిం బహుగుణా మేవ మేతి
గురోః పుత్రే భవతి చ వృత్తి రేఖా ॥ ౧౮

తా॥ నీ. శా. :- పైనఁజెప్పినట్లు ప్రవర్తించిన శిష్యుఁడే బ్రహ్మవిద్యను బొందును. శిష్యుఁ డెప్పుడును నేనే గురుసేవఁ జేసితినని అహంకరించ రాదు. అహంకారమును సూచించు మాటనైనను బల్కరాదు. విద్యాభ్యాసమైన తర్వాత నాచార్యునకు జీవికకుఁ దగిన ధనము నొసఁగవలెను. ఇట్లాచరించిన వాఁడే బహుగుణమైన సద్వృత్తిని బొందును. నైష్ఠిక బ్రహ్మచారి యగును. నైష్ఠిక బ్రహ్మచారి గురువు నందువలె, గురుపుత్రునియందును సద్వృత్తిని జూపవలెను.

—: బ్రహ్మచర్యఫలము స్తుతి :—

శ్లో॥ ఏవం వసన్ సర్వతో వర్ధతీహ
బహూన్ పుత్రాన్ లభతే చ ప్రతిష్ఠాం ।
వర్షన్తి చాస్మై ప్రదిశో దిశశ్చ
వసన్త్యస్మిన్ బ్రహ్మచర్యే జనాశ్చ ॥ ౧౯.

తా॥ సర్వజ్ఞభాష్యము :- పైనఁ జెప్పినట్లు గురువు వద్ద మెలఁగు శిష్యుఁ డన్ని విధములైన ధనముతోడను, వృద్ధి పొందును. బహుపుత్రులను, గొప్పకీర్తిని బొందును. దిక్కులును, విదిక్కులును వానికై ధనరాసులను వర్షించును. అనగా అంతటను ధనసమృద్ధిని, కీర్తిప్రతిష్ఠలను అతఁడు పొందును. పిమ్మట సామాన్య జనులందఱును, వాని నాచార్యునిగా భావించి, వానిచెంత బ్రహ్మచర్యవ్రతమున నుందురు.

శ్లో॥ ఏతేన బ్రహ్మచర్యేణ దేవా దేవత్వ మాప్నువన్ ।
ఋషయ శ్చ మహాభాగా బ్రహ్మలోకం మనీషిణః ॥

శ్లో॥ గంధర్వాణా మనేనైవ రూప మప్సరసా మభూత్ ।
ఏతేన బ్రహ్మచర్యేణ సూర్యో ఉప్యహ్నాయ జాయతే ॥

తా॥ శం. భా. :— పై శ్లోకములందు వివరించిన బ్రహ్మచర్యముయొక్క స్తుతిని ఈ రెండు శ్లోకములందును జేయఁ దొడఁగెను.

బ్రహ్మచర్యముచేతనే దేవతలు దేవత్వమును బొందిరి. ఋషులు సైతము ఈ బ్రహ్మచర్యముచేతనే ఋషిత్వమును బొంది, మహాభాగులైరి. మనీషులు అనగా విజ్ఞానులును ఈ బ్రహ్మచర్యముచేతనే బ్రహ్మలోకమును బొందిరి. గంధర్వులు ఈ బ్రహ్మచర్యముచేతనే సగంధర్వులైరి. అప్సరసలు ఈ బ్రహ్మచర్యముచేతనే చక్కని రూపమును బొందిరి.

"అహ్నో దీప్తిశ్చ కథ్యతే" అను సూక్తిచే "అహ్న" మనగా, దీప్తి కాంతి యని తెలియుచున్నది. సూర్యుఁడు కూడ ఈ బ్రహ్మచర్యముచేతనే జగత్తులను ప్రకాశింపఁ జేయు కాంతిని బొంది సూర్యుఁ డాయెను.

—: బ్రహ్మచర్యమే అనేకవిధ ఫలసాధకము :—

శ్లో॥ ఆకాంక్ష్యా ర్థస్య సంయోగా ద్రసభేదార్థినా మివ ।
ఏవం హ్యేతే సమాజ్ఞాయ తాదృ గ్భావం గతా ఇమే ॥

తా॥ శం. భా. :- పరిశీలింపగా బ్రహ్మచర్యమే అనేక విధ ఫలసాధకము. ఎట్లన? చింతామణ్యాదులు రసభేదము నపేక్షించువారికిఁ జింతితవస్తువు నొసఁగును. అట్లే గురువు శిష్యులకుఁ జింతితవస్తువు నొసఁగును. అందుచే బ్రహ్మచర్యము నాశ్రయించినవారు తామాకాంక్షించు విషయమును, బొందుచున్నారు. ఇటులనే దేవాదులును బ్రహ్మచర్యము నాశ్రయించి, వారివారి కోరికలను బొందుచున్నారు. ఇతరులు కోరిన వస్తువుల నొసఁగుచున్నారు. కావున గురువు చెంతఁ జేరి, బ్రహ్మచర్యము నాచరించి, పరమపురుషార్థమును బొందవచ్చును. దీనివలన బ్రహ్మచర్యము అనేకవిధఫల సాధక మని తెలిసికొనవలసి యున్నది.

శ్లో॥ య ఆశ్రయే త్పావయే చ్చాపి రాజన్
సర్వం శరీరం తపసా తప్యమానః ।
ఏతే నైవ బాల్య మభ్యేతి విద్వాన్
మృత్యుం తథా సంజయ త్యన్తకాలే ॥ —౨౩

తా॥ రాజా! ప్రతిమానవుఁడు బ్రహ్మచర్యము నాశ్రయించవలెను. తాను బవిత్రుఁడై పరులను సైతము పవిత్రులుగాఁ జేయవలెను. బ్రహ్మచర్యమునఁ దపస్సు చేసి, సర్వశరీరమును దపింపఁ జేయవలెను. అట్లైనచో బాల్యమును అనగా అజ్ఞానమును వీడి విద్వాంసుఁడగును. అతఁడే అంతకాలమున మృత్యువును జయింపఁ గల్గును.

తా॥ శం. భా. :- పరికింపగా బ్రహ్మచర్యమే అనేక విధ ఫలసాధకము. ఎట్లన? చింతామణ్యాదులు రసభేదము నపేక్షించువారికిఁ జింతితవస్తువు నొసఁగును. అట్లే గురువు శిష్యులకుఁ జింతితవస్తువు నొసఁగును. అందుచే బ్రహ్మచర్యము నాశ్రయించినవారు తా మాకాంక్షించు విషయమును, బొందు చున్నారు. ఇటులనే దేవాదులును బ్రహ్మచర్యము నాశ్రయించి, వారి వారి కోరికలను బొందుచున్నారు. ఇతరులు కోరిన వస్తువుల నొసఁగు చున్నారు. కావున గురువు చెంతఁ జేరి, బ్రహ్మచర్యము నాచరించి, పరమపురుషార్థమును బొంద వచ్చును. దీనివలన బ్రహ్మచర్యము అనేకవిధఫల సాధక మని తెలిసికొనవలసి యున్నది.

శ్లో॥ య ఆశ్రయే త్పావయే చ్చాపి రాజన్
సర్వం శరీరం తపసా తప్యమానః ।
ఏతే నైన బాల్య మభ్యేతి విద్వాన్
మృత్యుం తథా సంజయ త్యన్తకాలే ॥ —౨౩

తా॥ రాజా! ప్రతిమానవుఁడు బ్రహ్మచర్యము నాశ్రయించవలెను. తాను బవిత్రుఁడై పరులను సైతము పవిత్రులుగాఁ జేయువలెను. బ్రహ్మచర్యమునఁ దపస్సు చేసి, సర్వ శరీరమును దపింపఁ జేయువలెను. అట్లైనచో బాల్యమును అనగా అజ్ఞానమును వీడి విద్వాంసుఁడగును. అతఁడే అంత కాలమున మృత్యువును జయింపఁ గల్గును.